# శ్రీమదాంధ్రభాగవతము.

రెండవ భాగము.

శ్రీకృష్ణాయపరబ్రహ్మణే నమః.

అఖిలకలికల్మషాపహంబగు

# శ్రీమద్భాగవతము

ఆంధ్రవచనము.

రెండవభాగము.



బ్రహ్మశ్రీ కేతవరపు-వేంకటశాస్త్రిగారిచేఁ

ప్రణీతము.

శ్రీదేవరాజసుధీపరిశోధితము.



ఆనంద ముద్రణాలయమున ముద్రితము.

ఆర్. వేంకటేశ్వర్ అండ్ కంపెనీవారిచేఁ

ప్రకటితము.

1924

# శ్రీమదాంధ్రభాగవతము.

## ద్వితీయభాగము.

### విషయసూచిక:

---

పుట.



చతుర్థస్కంధము.

# పటముల పట్టిక.





శుభమస్తు.

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీమదాంధ్ర భాగవతము.

## తృతీయస్కంధము.



ఓశౌనకమునీంద్రా! ప్రాయోపవిష్టుండయిన రాజునకు శుకయోగీంద్రుం డిట్లనియె. 'ఓరాజా ! మంత్రకర్తయు యమాంశసంభూతుండునగు విదురుండు సకలసంపదలతోఁ దులదూఁగుతన మందిరమును విడిచి వనమునుఁ బ్రవేశించి యొక్కచో మైత్రేయుం జూచి సద్భక్తితోఁ నతని పాదపద్మములకు నమస్కరించి యతని యనుమతిచొప్పునఁ గూర్చుండి యతని కిట్లనియె.' అని చెప్పుచున్నమునీంద్రుం జూచి, "అయ్యా! విదురుండు మైత్రేయమహాముని నెచ్చట గలిసికొనెను? మఱియు విదురమైత్రేయుల కెప్పుడు సంవాదముజరిగెను? ఇదియునుంగాక భగవదర్పితచిత్తుండయిన విదురుండు మైత్రేయునడిగినప్రశ్నములు సచ్చరిత్రముతోఁ దులదూఁగుచు నమితప్రయోజనదాయకములయి యుండును గాని సాధారణప్రయోజనము కలిగినవయి యుండవు. కావున వానిని నేను దప్పక వినవలసియున్నది. నాయం దనుగ్రహముంచి వచింపుమని యడిగెను. ఇట్లు నరేంద్రుఁ డడిగినప్రశ్నము విని సంతసించి మిగుల వివేకశాలియగు యోగీంద్రుఁ డిట్లు వక్కాణించె. పూర్వము

ధృతరాష్ట్రుఁడు దుర్మార్గు లయినతనతనయుల నెంతమాత్రము శిక్షింపక, తమతండ్రియగు పాండుమహారాజు మరణించుటచే దిక్కులేక తన్నుఁ జేరవచ్చిన ధర్మరాజాదులఁ గరుణించి చేరఁదీయక, తనకుమారుని యుపదేశంబున వారల లక్కయిండ్లం బ్రవేశింపఁజేసి యామందిరంబులఁ గాల్పించె. మఱియు నాఁడు పతివ్రతయగు ద్రౌపదీదేవి ధమ్మిల్లము చేతఁబట్టికొని దుర్మార్గుఁడయిన దుశ్శాసనుఁడు సభామధ్యమున కీడ్చి తెచ్చి కట్టువస్త్రంబుల నొలుచుచుంటచే నాపరమసాధ్వి కన్నీటిచేఁ గుచకుంకుమము తొలఁగునట్లు మిగుల దుఃఖించుచుండఁ జూచియు నాగుడ్డిరాజు తనకుమారుని వారించినాఁడు కాఁడు. తరువాతఁ గపటద్యూతంబునఁ బరాజితుండును, సత్యసంధుండు నగు ధర్మరాజు తనభార్యతోను, సోదరులతోను, వనవాసంబు చేసి, యజ్ఞాతవాసవత్సరంబు గడపి, వచ్చి "మాతండ్రిపాలిమ్ము"ని యాచింపఁ దమోగుణప్రధానుఁడగు నాధృతరాష్ట్రుం డిచ్చుటకిష్టపడ లేదు. అంతటఁ బాండుతనయులు చేయునది లేక తమహితుఁ డయిన శ్రీకృష్ణుని రాయబారిగ నంపిరి. భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు వారిమాట నతిక్రమింపలేక హస్తినాపురమునకు వచ్చి సభామధ్యమందుఁ దేనెలొలుకుఁబలుకులు పలుక వానికి భీష్మాదులు సంతసించిరి కాని దుష్టుఁడయినధృతరాష్ట్రుఁడు విని సంతసింపలేదు. మఱియు నతం డీకార్యమునిమిత్త మాలోచించుటకయి విదురునిఁ బిలిపించినందున నతండు ధృతరాష్ట్రుని మందిరమునకుఁ బోయెను. అంత నాగుడ్డిరాజు విదురునిఁ గూర్చుండు మని నియోగించి యతని కీకార్యసరణిని దెలియఁజేసి నీయభిప్రాయంబు తెలుపుమనుడు మంత్రివిదులలో నుత్తముఁడగు విదురుం డిట్లనియె. "ఓరాజా! నీయుపేక్షచే నీ

కుమారులు ధర్మరాజాదుల కొనరించినయపరాధములకు లెక్క లేదుగదా? అవియన్నియుఁ బ్రాణాపాయము గలిగించునవియె. అయినను ధర్మరాజు మిగుల శాంతుఁడు కనుక వాని నన్నింటిని సహించి యించుకంతయినకోపంబులేక మాతండ్రిపాలిమ్మనియాచించుచుండ నీయకుండుట యుక్తముకాదు. కావున నతనికి రాజ్యంబు పంచి యిమ్ము. నీవట్లు పంచిపెట్టనిచో నీతనయులపేరు విన్నంతమాత్రనే నడుమఁ ద్రొక్కఁబడిన నాగుఁబామువలెఁ గోపంబున రోజుచున్న భీమునివలన నీతనయులు చచ్చుట సిద్ధంబు. ఈవిషయముగూర్చి నేను వెనుకనే చెప్పియున్నాను. నీకొడుకులెంతబలవంతులయినను దైవబలంబు లేనిచో వీరందఱు గడ్డిపోఁచలవంటివారే యని నీ వెఱుఁగుదువు కదా? అట్టిదైవబలము మీకులేదు. కాని పాండవులకుఁ గలదు. భగవంతుఁడయిన శ్రీకృష్ణుఁడు పాండవులయందు దయగలవాఁడయి* "మమప్రాణాహి పాండవాః" అనిపలుకుచు వారల కెట్టియిడుములు పొడమనీయక వర్తించుచున్నాఁడు. ఆభగవంతు నవలంబించియుండఁ బాండవులకు జయము గలుగుటకు నేమి లోపమున్నది? మఱియు శ్రీకృష్ణుఁడు బలపరాక్రమశాలులయిన యాదవులకెల్లరకు నధిపతి. ఆ మహాత్ముఁడు దిగ్విజేత లని ప్రసిద్ధికెక్కిన రాజులందఱికిఁ బ్రభువయి తనయాజ్ఞలో మెలంగునట్లు చేయుచున్నాఁడు. అట్టి శ్రీకృష్ణుఁడు పాండవులకు బంధువై, హితుఁడై, సహాయుఁడై యున్నాఁడు. ఇట్లు పౌరుషబలము దైవబలము గలిగిన పాండవులు జయముపొందుట కెంతమాత్రము సందియము లేదు. నీకుమారు

---

* మమప్రాణాహి పాండవాః-అనఁగా పాండవాః=పాండవులు, మమ= నాయొక్క, ప్రాణాహి=ప్రాణములుగదా? అని యర్థము.

నకుఁ బౌరుషబలములేదు. దైవబలములేదు. దైవము దయకుఁ బాత్రుఁడుకాలేదు. గాని కోపమునకుఁ బాత్రుఁడయి యున్నాఁడు. భగవద్విరోధి యగుమానవుఁడు తాఁజచ్చుటయేకాక కులమునంతను నశింపఁజేయును. గాంధారీపుత్త్రుఁడను భ్రాంతిచే నీచేఁ బోషింపఁబడుచున్న దుర్యోధనుఁ డత్యుగ్రరూపమునొందిన నీపురాకృతపాపపుంజ మని యెఱుంగుము. వానివలనఁ గులంబునకుఁ దప్పక హానివచ్చును. కావునఁ దురాత్ముఁడయిన దుర్యోధనుని దూరముగాఁ దఱిమి నీకులమును రక్షించికొనుము. అయ్యో! కన్నకుమారు నెట్లు విడువఁగలనందువేమో? అట్లూహించుట పొరపాటు * "త్యజే దేకం కులస్యార్థే" అనిచెప్పుచున్న పండితులు బుద్ధిహీనులు కారు. తమవంశక్షేమముకొఱకు దురాత్ముఁడయిన యొక్కకుమారుని విడిచిపెట్టుట యొకలోపము కాదు." అనిపలుకుచున్న విదురునివాక్యములు విని దుర్యోధనుఁడు క్రోధంబునఁ బెదవు లదరుచుండఁ దనయొద్ద నున్నదుశ్శాసనకర్ణాదులు వినుచుండ సాధుశీలుఁడయినవిదురునిఁ దిరస్కరించుచు నిట్లు పలికెను. "ఓయీ! దాసీకుమారుఁడవయిన నిన్ను నిచ్చటి కెవ్వరు పిలిచినారు? నీవంటికుటిలాత్ముఁడు లోకమందుఁ బుట్టఁడు. మాయన్న మెల్లప్పుడు కడుపునిండ మెక్కుచుఁ దిరిగి మాకే ప్రతికూలముగా మాట్లాడుచు మాకపాయము గలుగుటకయి చూచుచుందువు. "తిన్నయింటికే కన్నములు త్రవ్వు" నన్నసామెత యిక్కడఁ బనికివచ్చినది. నీ వెప్పుడును మాశత్రువులకార్యములు నెఱవేర్చుటయందుఁ బరుఁడవయియుంటచే నీవును మాకు శత్రువ

* "త్యజేదేకం కులస్యార్థే" అనఁగా-కులస్యార్థే=కులమును రక్షించుట కొఱకు, ఏకం=ఒక్కని, త్యజేత్=తప్పక విడువవలెనని యర్థము.

వే. దాసీపుత్త్రుఁడ వయినను మాతండ్రి యేదో గౌరవించుచున్నాఁ డని యుపేక్షించుచుండగాఁ గన్నులు తలకెక్కినవి. అందుచే నీవు క్రిందుమీఁదును జూడక నోటికి వచ్చినట్లు ప్రేలుచున్నావు. నీవంటి వాఁడుండిన నూఱంతలకుఁ జేటుమూడుట సిద్ధంబు. కావున నిఁక మీఁద నీ విచ్చట నుండ వలనుపడదు. మాపురంబు విడిచి నీకిష్టము వచ్చినచోటికిఁ బొమ్ము" అని ఇట్లుపలికిన దుర్యోధనుని పలుకులు చెవులకు ములుకులవలె నాటినఁ గటకటంబడి, విదురుండు సజ్జనుండు కావున వచ్చిన కోపంబు నడఁచికొని, మాఱుపలుక నిష్టపడక తనచేత నున్న ధనుర్బాణంబుల విడిచి దుర్యోధనుని మాటలకు సుంతేనియు విచారము చెందక భగవన్మహిమసామర్థ్యము నెన్నికొనుచుఁ బురము వెడలి పోయెను. విదురుండు హస్తినాపురమునుండి తీర్థయాత్రలకై బయలు వెడలుట కిదియే కారణము. అట్లు విదురుండు హస్తినాపురమును విడిచి విష్ణుమూర్తికి నివాసభూతము లయినపుణ్యక్షేత్రములఁ ద్రొక్కి పుణ్య మార్జించుకొనవలెనను బుద్ధితో బయలు వెడలి, పరిశుద్ధమయిన చిత్తవృత్తి గలవాఁడయి, ప్రశస్తమయిన పూవుందోఁటల చేతను, క్రీడాపర్వతముల చేతను, బొదరిండ్ల చేతను, నొప్పుచున్న పురములను, నిర్మలోదక ప్రవాహములతో విలసిల్లు నదులను, భగవంతునిమూర్తుల చేఁ బ్రకాశించుచున్న పుణ్యక్షేత్రములను, జూచుచు నవ్యభిచరితమగు భగవద్భక్తియోగమందుఁ బరాయణుం డయి తిరుగుచుండెను. ఇట్లు విదురుండు భూమండలమునఁ దిరుగుచుఁ బవిత్రమయిన జీవనవృత్తి కలవాఁడయి, గానవచ్చు ప్రతితీర్థంబునందును దానమాడుచుఁ గటికినేలఁ బండుకొనుచు, వల్కలాజినములను, జటలను, ధరించి యెవ్వరికిని దెలి

యఁబడక వారికిఁ బ్రీతిగలుగు వ్రతముల నాచరించుచు నభ్యంజనాదిదేహసంస్కారముల విడిచి భరతవర్షమునం దంతటఁ గ్రుమ్మరెను. ఇట్లు గొంతకాలంబు సన్నపిమ్మట నతఁడు, కృష్ణునిదయారసమువలనఁ బొందఁబడిన భూమండలమును ధర్మరాజేకాతపత్రముగా నేలుచుండెననియు, రెండువెదుళ్లవలన జనించినయగ్గివలన వనమంతయు దహింపఁబడినచందంబునఁ గురుపాండవులకు జనించిన విరోధంబునం జేసి సమస్తరాజకులములతోఁ గూడఁ గురువంశము నాశనము చెందెననియు, నాలకించి మిగుల విచారించుచు నచ్చటనుండి పశ్చిమాభిముఖముగా సరస్వతీనదినిగుఱించి పోయి, యచ్చట నున్న పదునొకండుతీర్థములయందు భక్తితోఁ గ్రుంకులు వెట్టుచు నాయాస్థలంబులందున్న విష్ణువుమందిరంబులం బ్రవేశించెను. అవి ఋషినిర్మితములును, దేవనిర్మితములు, నయి యుండె. ఆయాలయముల యగ్రములయందు విష్ణువునకుఁ బ్రధానాయుధ మయినచక్రము ప్రకాశించుచుండెను. అందుచే వానిని జూచునప్పుడెల్ల నవి విష్ణువును స్మరింపఁ జేయుచుండెను. అట్టి దేవాలయములను బ్రవేశించి భక్తియుక్తుఁడయి నమస్కరించి విదురుం డాస్థలమును విడిచి, సకలసంపదలతోఁ దులదూఁగుచున్న సౌరాష్ట్రదేశము చొచ్చి, యచ్చటివిశేషము లరసి, యచ్చటనుండి మత్స్యదేశములకుఁ బోయి, వానిని వీక్షించుచు, నట గదలి కురుజాంగలాదిదేశములం జొరఁబడి పోవుచుఁ, గొంతకాలమునకు యమునానదీతీరమును జేరి, యచ్చట వాసుదేవునియనుచరుఁడును, బుద్ధిమంతుండును, బృహస్పతికి శిష్యుండును, బరమభాగవతోత్తముఁడు, నగు నుద్ధవునిఁజూచి సంతసముతో డాయంజని యతనిఁ గౌఁగిలించుకొని తనకు బంధువు

లగు కృష్ణాదుల క్షేమోదంతము గనుఁగొనఁ దలంపుగలవాఁడయి యతని కిట్లనియె.

విదురుఁ డుద్ధవునిఁ గృష్ణాదులవృత్తాంతము లడుగుట.

ఓమిత్రమా! చిరకాలంబునకు నిన్నుఁ జూడఁగంటిని. నీదర్శన లాభముచే నమితానందమును జెందుచున్నాను. మఱియు బల రామకృష్ణు లిరువురు పురాణపురుషులు కాని సామాన్యులు కారు. వారు బ్రహ్మప్రార్థనమంగీకరించి భూభారమును హరింపఁగా నిం దవతరించినమహాత్ములు. వారిరువురు కుశలముతోఁ బ్రవర్తిం చుచున్నారా? మఱియు వారలు చేయవలసినకార్యము లన్ని యు ముగించి యున్నారు. వారు చేయవలసినకార్యమేదియు లేదు. వారు సుఖముగా వసుదేవునిగృహమునఁ గుశలులై యున్నా రా? వసుదేవుఁడు కురువంశసంభూతులమగు మాకందఱికిఁ బ్రా ణస్నేహితుఁడు అతఁడు నాకు బావమఱఁది యని కూడఁ జెప్ప వచ్చును. అతఁడు తనతోఁబుట్టువడుచుల నధికగౌరవముతోఁ జూచుచు, వారికిని వారిపతులకు నభీష్టములగు వస్తువులనెల్ల ని చ్చుచుఁ గన్నతండ్రివలెనే యాదరించుచున్నాఁడు. అట్టిమహా నుభావుఁడగు వసుదేవునకు సేమమా? ప్రద్యుమ్నుఁడు పూ ర్వజన్మమందు మన్మథుఁడేకదా? రుక్మిణీదేవి బ్రాహ్మణుల నా రాధించి వారియనుగ్రహమునొంది యామన్మథుని భగవంతు నివలనఁ గుమారునిగాఁ బడసినది. యాదవసైన్యములనెల్ల యు ద్ధములందు నడపువాఁడా ప్రద్యుమ్నుఁడే. అతఁడు మహాపరాక్ర మశాలి యని చెప్పఁదగినవాఁడు. అట్టివీరుఁడయిన ప్రద్యుమ్నుఁడు క్షేమముతో నున్నాఁడా? మఱియు నుగ్రసేనుఁడు యాదవుల కును, వృష్ణులకును, భోజులకును, దాశార్హులకు, నధిపతి యయి

వారివారిని వారివారిధర్మములయందుఁ బ్రవర్తించునట్లు చేయుచుండును. అతనియందుఁ గృష్ణునికిఁ జెప్పలేనంత ప్రేమయున్నది. కావుననే శ్రీకృష్ణుండు దా నధికశక్తియుతుండయినను రాజ్యమేలుట కిష్టపడక యుగ్రసేనునకుఁ బట్టాభిషేకము చేసినాఁడు. ఉగ్రసేనుఁడుకూడ మహామహుఁడుకాని సాధారణుండు కాఁడు. అట్టియుగ్రసేనునకు సేమమా? ఓయుద్ధవా? సాంబుఁడు రథికులలోనెల్ల నగ్రేసరుఁడని చెప్పఁదగినవాఁడు. అతఁడించుమించుగా శ్రీకృష్ణుని కెనవచ్చునాఁడు. ఆజాంబవతీదేవి పెక్కువ్రతముల నాచరించి పూర్వము పార్వతీదేవికన్నపట్టియగు కుమారస్వామినిఁ గుమారునిగాఁ బడసినది. పెక్కేల? కుమారస్వామియవతారమే యీసాంబుఁడని చెప్పవచ్చును. అట్టిసాంబునకు సేమమా? శ్రీకృష్ణుని సహోదరుఁ డగుసాత్యకి యసామాన్యపురుషులలో నొకఁడని చెప్పవచ్చును. అతఁ డర్జునునివలన ధనుర్విద్యారహస్యములనెల్ల నేర్చినాఁడు. మఱియు నతఁ డెల్లకాలములందు భగవంతుఁడగు కృష్ణుని సేవచేయుచు నతనిదయకుఁ బాత్రుఁడయి యతీశ్వరులచేతనైనఁ బొందశక్యముకానియుత్తమగతిని సుఖముగానే పొందఁదగియున్నాఁడు. అట్టిసాత్యకి సేమముతో నున్నాఁడా? అక్రూరుఁడు భక్తాగ్రేసరులలో నొకఁడని చెప్పవచ్చును. అతఁడు మిగుల వివేకవంతుఁడు. అతఁడు పాపరహితుఁడని చెప్పుటకు సందియ మింతెమాత్రము లేదు. అతఁడు భగవంతునియందు మిగులఁ బ్రపత్తికలవాఁడు. అతఁడు విష్ణుపాదములచే నంకితమయిన మార్గమును జూచుటయం దధికప్రేమ కలవాఁడయి తాదృశప్రేమాతిశయముచే ధైర్యరహితుం డయి వర్తిలుచుండును. అట్టియక్రూరునకు సేమమా? దేవకీదేవి పరమపతివ్రతలలో నొ

కతి యని చెప్పవచ్చును. ఆమె శ్రుతి యాగరూపార్థమును దాల్చినట్లుగా భగవంతునిఁ దనగర్భమందు ధరించినది. అట్టిదేవకీదేవి యదితివలెనే కుశలముతో నున్నదా? ఓ మహాత్మా! అనిరుద్ధుఁడు మహానుభావుఁడనియు భగవంతుఁడనియుఁ జెప్పవచ్చును. అతఁడు మీవంటి భక్తులకోర్కెల నెఱవేర్చువాఁడు. అతఁడు శాస్త్రము ప్రమాణముగాఁ గలవాఁడు. అతని భగవంతునిచతుర్థాంశముగాఁ జెప్పుదురు. అతఁడు యోగపరిశుద్ధమయిన మనస్సునకేగాని లౌకికప్రమాణములకు గోచరుండు కాఁడు. అట్టియనిరుద్ధునకు సేమమా? శ్రీకృష్ణునె యెల్లప్పుడు దైవముగాను, నధిపతిగాను, దలంచుచు నితరుల నారాధింప నొల్లక ప్రవర్తించుచున్నహృదికుఁడు, గదుఁడు, మొదలగు యాదవకుమారులందఱు సేమముతో నున్నారా? ఓమహాత్మా! తనకు భుజములంతో సమానులైన కృష్ణార్జునులచే సంపాదింపఁబడిన రాజ్యంబునం దెట్టి దనయుఖేదంబు కావించుకొని ధర్మరాజు మోదముతోఁ బ్రజలను ధర్మముగ తప్పకుండఁ బరిపాలించుచున్నాఁడా? మఱియు దుర్యోధనుఁడు కిరీటిసామగ్రిమును జూచి యతనికే విజయము కలుగుననియు నందుచే సామ్రాజ్యలక్ష్మియు నతనినే పొందుననియు మిగుల విచారించుచుండువాఁడు. వాఁ డనుమానించుచున్నట్టుగానే యయినదిక దా? కృతాపరాధులయిన దుర్యోధనాదులపై రుచ్చరించినమాత్రముననే భీముఁడు నల్లఁద్రాచువలె మహాకోపముతోఁ బ్రవర్తించుచుండువాఁడు. యుద్ధరంగమునం దతివిచిత్రముగఁ దన గదాదండమును ద్రిప్పుచుఁ దనపాదఘాతములను భూమి సహింపలేక యుండునట్లు యుద్ధముచేసి కురుకుమారుల నందఱిం గడ

తేర్చినాఁడు. ఇప్పుఁడయిన నాభీముఁ డాక్రోధమును విడిచి సేమముతో నున్నాఁడా? తనశరసమూహముచే మాయాకిరాతవేషము ధరించినయీశ్వరుని సంతసింపఁజేసి యతనివలనఁ బాశుపతమును గొనియున్న యర్జునుండు తనశత్రువుల నందఱిను జయించి కీర్తులతోఁ బ్రవర్తించుచున్నాఁడా? నకుల సహదేవులు కుంతీదేవికి ముద్దుకుమారులు. వారు, నేత్రములు కనుఱెప్పలచే, రక్షింపఁబడుచున్నట్లు ధర్మజభీమార్జునులచే రక్షింపఁబడుచున్నారు. అట్టి మహానుభావులగు నకులసహదేవులు శత్రువులఁ జంపి గరుత్మంతుఁడు స్వర్గమునుండి యమృతమును గొనివచ్చినట్లు శత్రుధనములను గొనివచ్చుచు సేమముతోనున్నారా? పాండుమహారా జతిరథశ్రేష్ఠుఁ డని వాసిచెంది యసహాయుఁడయి చాపంబుఁబూని పోయి నలుదిక్కులను జయించి యమితంబగు ధనంబును యశంబును జెందెను. అట్టిమహానుభావుండును తనకువల్లభుండు నగు నతఁడు ప్రాణములు విడిచిపోవుచున్నప్పుడు కుంతీదేవియు సహగమనంబు చేయ నిశ్చయించుకొని తనపుత్త్రులు దిక్కులేనివా రగుదు రన్నతలంపుతో నా యుద్యమంబు మానివేసినది. అట్టి కుంతీదేవికి సేమమే కదా?

ఓయుద్ధవా! పరలోకమును బొందినపాండురాజుకుమారులను జక్కని ప్రేమతోఁ జేరఁదీసి పెంచుట ధృతరాష్ట్రుని కర్తవ్యకృత్యము. అట్లుండ నాగ్రుడ్డిరాజు న్యాయాన్యాయంబులు పరికింపక రాజ్యం బిచ్చుట కంగీకరింపక ధర్మరాజాదులకు ద్రోహముచేసి యున్నాఁడు. ఇట్టి భ్రాతృద్రోహి యధోగతిపాలు కాక మానునా? మఱియు నే నతనికి బాంధవుఁడను; మిత్త్రుఁడను. అయినను హితోపదేశము చేసితి నన్న హేతువుచేతఁ గోపించి పుత్త్రాను

సారియయి ధృతరాష్ట్రుండు నన్నుఁ బురంబునుండి వెడలఁగొట్టి నాఁడు. దుర్యోధనుఁడు దురాత్ముఁడు. అతనివలనఁ గులము నశించిపోవుచున్నదని యోజింపలేదు అతఁడు దుర్యోధనునిమాటలు విని వాని ననుసరించుచుండెను. అందుచేతనే యింతమట్టు వచ్చినది. అతనియుదంతమును గూర్చి మిగుల విచారించుచున్నాను. అట్లు ధృతరాష్ట్రునిచే వెడలఁగొట్టఁబడి నేను శ్రీకృష్ణుండు మానవరూపుఁడయి యుండుటచే సమస్తమానవులను భ్రమింపఁజేయుచు జగన్నియంతయై యున్నవాఁడని యెఱిఁగి యతనిదయకుఁ బాత్రుండనై యతనికి విభూతియయిన జగంబును వీక్షించుచు నాశ్చర్యములను దొలంగించుకొనుచుఁ బ్రచ్ఛన్నవేషధారినై భూమియందుఁ దిరుగుచున్నాను. నామనంబు హరియందుఁ గ్రీడించుచున్నది. దీనికేమి? ఇది యట్లుండనిమ్ము. లోకములో రాజులకు నాభిజాత్యమువలనను, ధనమువలనను, సైన్యంబువలనను, మదంబుద్భూతంబయి కన్నులఁగప్పి వేయుచుండును. అట్టి దురాత్ములయిన రాజులు తమసైన్యములతో భూమికి మిగుల బాధ గలిగించుచుండిరి. అదియంతయు జక్కఁగా విచారించి భగవంతుఁడయిన శ్రీకృష్ణుఁడు వారి నందఱిని జంపి భక్తులయినపాండవుల కష్టములఁ దొలఁగింప నిష్టము గలవాఁడై, నాఁడు సభలో దుర్యోధనుఁడు తన్నుఁ బరుసములాడినను సహించి యూరకున్నాఁడు. లేక యొక్కదుర్యోధనునె సంహరింపవలెనన్న నాదినముననే కడతేర్చియుండును. అంతియకాని యతఁ డుపేక్షించుట దుర్యోధనుని సంహరింపలేక కాదుసుమీ? అట్లె యింతవఱకు భగవంతుం డుపేక్షించియుండి దుర్యోధనాదులతోఁగూడఁ బెక్కండ్రు దుష్టక్షత్రియులం బరిమార్చి తనకోర్కె నెఱవేర్చుకొన్నాఁడు.

జగన్నియంతయగు భగవంతునికి మర్త్యుఁడయి పుట్టఁదగినంత యవసరమేమి? అని యందువేని చెప్పెదవినుము. అతనికి జన్మాదులు లేకపోవుట సత్యమే. అతఁడు దుర్మార్గుల సంహరించి సాధువుల రక్షించుటకయి జన్మమెత్తుచుండును. అతఁడు తనచే సృజింపఁబడినచరాచరప్రపంచమును గాపాడుటకయి కర్మములుచేయుచుండును. అంతియకాని భగవంతుఁడగు శ్రీకృష్ణునికిఁ గర్మాయత్తములగు జన్మకర్మములు లేవు. ఓమిత్రమా! భగవంతుం డట్టివాఁడయినను, లోకములో నున్నతనభక్తుల రక్షించుటకును, తనశాసనమందు సమస్తమును నిలుపుటకును, యదువంశమం దుద్భవించినశ్రీకృష్ణమూర్తి వృత్తాంతము తెలుపు" మని యడుగుచున్న విదురుని కాయుద్ధవుఁడు శ్రీకృష్ణుని స్మరించుకొనుచుఁ బ్రత్యుత్తరమిచ్చుటకు సమర్థుఁడు కాకపోయె నని చెప్పి శుకుండు పరీక్షిత్తునకు వెండియు నిట్లనియె. ఇది ప్రథమాధ్యాయము.



ఓ పరీక్షిన్మహారాజా! యుద్ధవుండు విష్ణుభక్తులలో నగ్రేసరుఁడని చెప్పవచ్చును. అతఁ డయిదేండ్లప్రాయముగలవాఁడయి యున్నప్పుడును పరమభక్తియుతుండయి శ్రీకృష్ణునికిఁ బూజలొనర్చుచుండెను. అప్పు డతనితల్లి చేరఁబోయి "నాయనా! నీవు మిక్కిలి యాఁకలిగొని యున్నావు. చలిది గుడువ రమ్ము. భుజింపుము." అని యెంత వేఁడిన నవ్వాక్యంబుల లక్ష్యముచేయక యుండె. అట్లు చిన్నతనంబునుండియు శ్రీకృష్ణుని నేమఱకయున్నవాఁడు. కావున నుద్ధవుఁ డాశ్రీకృష్ణుని వియోగభారంబు సహింపఁజాలక వివశుఁడయి యుండి కొంతవడికిఁ దెలివి తెచ్చుకొని

యెట్టు లా శ్రీకృష్ణ నిర్యాణము చెప్పుదు నని తలపోయుచు హృదయంబు పదిలపఱచుకొని తనయధిపతియగు శ్రీకృష్ణుని ధ్యానించుకొని శరీరంబునఁ బులకలు నిండ నేత్రముల ముకుళించి స్నేహాతిశయముచేఁ జిత్త మార్ద్రమగుచుండఁ గన్నులనుండి స్రవించుచున్న బాష్పజలధారలను దుడిచికొని యెలుంగురాల్పడ మెల్లమెల్లన **విదురున** కిట్లనియె. 'ఓవిదురా? మాకుశల **మే**ల

**ఉద్ధవుఁడు విదురునికిఁ గృష్ణనిర్యాణమును జెప్పుట.**

యడిగెదవు? మా కుశలమును నే నేమని చెప్పువాఁడను? కృష్ణుండనెడు సూర్యుం డస్తమించుటచేఁ గాలమనెడి మహాసర్పము మా గృహములయందు సంచరించుచు, సమస్తప్రాణి ప్రాణవాయువు లపహరించినది. మాకుశల మేమని చెప్పను. అకటకటా! ఈలోకము దురదృష్టమయినది. ఈలోకమంతటిలోను యాదవులు పరమ దౌర్భాగ్యులని చెప్పవచ్చును. యాదవులందఱు కృష్ణునితో వసించుచు నతనిఁ దమవలెనే సామాన్యమానవుఁడని తలంచుచుండిరి; కాని భగవంతుండని తెలియఁజాలరయిరి. అవును. అజ్ఞానాంధకారములో మునిఁగి యున్న యాదవులు కృష్ణుని భగవంతునిఁగా నెట్లు తెలిసికొనఁగలరు? చేఁపలు సముద్రమందుఁ దిరుగుచున్న నావను గని దానిని తమతో సమానమయిన జలజంతువుగానే తలంచుచుండును గాని జనులను దరింపఁజేసెడి యొకసాధనముగా నెఱుంగఁజాలవు. అట్లె యాదవులు కృష్ణుని సంసారసాగరతారకుఁడని తెలిసికొనలేరైరి. కాని యాదవులలోఁ గొందఱు బుద్ధిమంతులుమాత్రము శ్రీకృష్ణుఁడు పరమాత్మస్వరూపుఁడనియు, సామాన్యమానవుఁడు కాఁడనియుఁ, దెలిసికొని యట్టిబుద్ధితో సేవించిరి. భగవంతునిమాయచే మోహితులయిన శిశుపాలాదు

లగురాజులు కృష్ణు నొకజీవునిఁగానే తలంచుచుండిరి. పరమాత్ముఁడయిన శ్రీహరియందుఁ జిత్తమును సమర్పించినమావంటి వారలబుద్ధి భగవన్మాయచే నావృతముకాక కృష్ణుఁడు మానవుఁడని భ్రమము చెందకయున్నది. ఓవిదురా? కృష్ణునియుదంతము చెప్పుమంటివి. శ్రీకృష్ణమూర్తి తపశ్శాలు రయిన మహాత్ములకు లోకదర్శనీయము నతిసుందరము నయిన తనయాకారమును జూపి యట్టిస్వరూపముతోఁగూడ నంతర్ధానము చెందెను. వహ్వారే! ఆమహాత్మునిరూపము మఱచినను మఱపురాకున్నది. ఆశరీరము మనుష్యలీలలకుఁ దగినది. అది తనయోగబలమును లోకమునకు వెలువరించుచుండెడిది. అది మిగుల నాశ్చర్యముగొలుపుచుండెడిది. అది సౌందర్యసమృద్ధితోఁ గూడియుండెడిది. అతినిర్మలాకారము భూషణములయిన కౌస్తుభాదులకుఁగూడ భూషణమని చెప్పవచ్చునుగదా! అట్టియాకార మిప్పుడు కన్నులకుఁ గఱవయిపోయినదే! ఆమహనీయరూపము చూచుభాగ్యము మాకికలేదు. ధర్మరాజు రాజసూయయాగమున సభామధ్యమందుఁ గూర్చుండి మూఁడులోకములవారి నేత్రములకుఁ బరమానందకరమయిన శ్రీకృష్ణమూర్తి సుస్వరూపమును జక్కఁగా విమర్శించి చూచి యచ్చటివారందఱు "మనుష్యసృష్టిలో బ్రహ్మదేవునిచాతుర్యమంతయు నీతనిరూపమందుమాత్రమే యున్నద"ని యాశ్చర్యపడఁ జొచ్చిరికదా! అట్టిరూప మిప్పుడు నామమాత్రావశేషమైనది. ఆకృష్ణమూర్తి ప్రేమ కాస్పదమయిన మందహాసములను, విలాసములను, క్రీడలను, గరుణావలోకములను, గౌరవమునొందిన గోపస్త్రీలందఱు నాతనిరూపమునే చూడఁ గోర్కెకలవారయి గృహపతిపుత్త్రాదులను మఱచిపోయి కృత్యాకృత్యవివేకశూన్యల

యి యుండిరి. అట్టి జగన్మోహనమూర్తి నెచ్చటనైన నెక్కాల మందయినను లేదుగదా? సత్త్వగుణప్రధానులయిన సజ్జనులు రజోగుణప్రధానులయిన దుర్మార్గులచే బాధింపఁబడుచుండుట చూచి భగవంతుండు దయార్ద్రచిత్తము గలవాఁడయి, తాను జన్మకర్మాదిరహితుఁడయినను మహావంశసంభూతుఁడయి దారువులందగ్ని జనించునట్లు దేవమానవశరీరములయం దుత్పన్నుండగుచుండు. కావున భగవంతుండు దుష్టులయిన శిశుపాలాదుల జయించి భూభారము దింపఁ గోరి మహావంశయుక్తుఁడయిన బలరామునితోఁగూడ వసుదేవునింట శ్రీకృష్ణుఁడను పేర నవతరించెను. జన్మాదిరహితుఁడయిన భగవంతుఁడు వసుదేవుని గృహమున జన్మించుటయుఁ, దగువారి శత్రుఁడును దురాత్ముఁడునగు కంసుని భయమువలన వ్రేపల్లెయందు నివసించియుండుటయుఁ, బిమ్మట మధురాపురియందుఁ గొంతకాలముండి కాలయవనాది దురాత్ముల బాధపడఁజాలక యాపురమునుండి తప్పించుకొనిపోవుటయు, నీ మొదలగు చర్యలు నాకు మిక్కిలి దుఃఖమును గలిగించుచున్నవి. శ్రీకృష్ణుఁడు కంసుని వధించినతరువాతఁ దనతల్లిదండ్రులను సమీపించి వారలకు నమస్కరించి 'ఓతల్లీ! ఓ నాయనా! దురాత్ముఁడయిన కంసునిభయమువలన మీచెంతఁ జేరి మీకుఁ దగినశుశ్రూషలు చేయఁ జాలనైతిని. ఆనాయపరాధము సహింపక తీఱ'దని వారిద్దఱను గడుంగడుఁ బ్రార్థించెను. ఆమాటలను స్మరించుకొనుటచే నాహృదయము మిగులఁ బరితాపము చెందుచున్నది. తాను సర్వోత్కృష్టుఁడని తనకుఁ దెలిసినను వారల నంతగాఁ బ్రార్థింపవలసిన యవసరమేమి? వారల నజ్ఞానములో ముంచుటకే చుమీ! నిరతిశయమయిన వాత్సల్యాదిగుణములు గలయాపరమ

పురుషుని వియోగము మిగుల దుర్భర మయినది. అట్టివియోగభాగము నాకేకాదు. శ్రీకృష్ణుని పాదపద్మములం దున్నపరాగమును వాసన చూచినమాత్రముననె కెవనికిఁ గలుగక మానును? మఱియు నాకృష్ణమూర్తి భ్రూభంగము ననుసరించుచు యముఁ డెల్లదుర్మార్గులను సంహరించి భూభారమును దొలఁగించును. పెక్కేల? అతఁడు తలఁచుకొన్నంతమాత్రముననే యముఁడు శత్రువులఁ జంపి భూభారము దీర్చుచుండును. ఓమిత్రమా! ధర్మరాజు రాజసూయయాగమందు శిశుపాలుఁడు శ్రీకృష్ణుని నిందించుటయు, నా శ్రీకృష్ణునిచేఁ జంపఁబడి శిశుపాలుండు యోగీశ్వరుల కయినను బొందఁదరముగాని భగవత్ప్రాప్తిరూపఫలసిద్ధిని బొందుటయు, నీవు చూచియే యున్నావుగదా? కావున శ్రీకృష్ణుఁడు తనశత్రువులందు సైతము వాత్సల్యము కలిగి మోక్షము నొసంగుచుండఁగాఁ దనమిత్రులకు మోక్షమొసగూర్చుననుటకు సందియమున్నదా? ఇట్లందఱియందుఁ బరమప్రేమతో వర్తించుచున్న శ్రీకృష్ణుని వియోగము నెవ్వరు సహింపఁగలరు? మఱియు యుద్ధమందు సమస్తమైన రాజబృందము నేత్రానందకరుఁడయిన శ్రీకృష్ణునిఁ గన్నులారఁ గాంచుచు నర్జునుని శరములచేఁ బవిత్రత నొంది భగవంతుని పరమపదమును జెందెనుగదా! ఆమహానుభావుఁడు నిరుపమానమయిన యతిశయము కలవాఁడు. అతఁడు సమస్తసృష్టికిఁ గారణభూతముల యిన సత్వరజస్తమోగుణములకు నధిపతి. అతఁడు పరుల కధీనము కాని రాజ్యలక్ష్మిచే సమస్తకామములను నెఱవేర్చుకొనువాఁడు. అతఁడు తనకుఁ బూజలను గొనివచ్చుచున్న లోకపాలురచే సేవింపఁబడుచున్న పాదపీఠముకలవాఁడు. ఓవిదురా! శ్రీకృష్ణుఁ

డిట్టిమహానుభావుఁడయినను సార్వభౌమసింహాసనమందుఁ గూర్చుండిన యుగ్రసేనుని సేవ నొనర్చుచు నతనియాజ్ఞ శిరసావహించి "దేవా ! అవధరింపుము" అని విజ్ఞాపనవాక్యములును, ఆ భగవంతుఁ డొనర్చిన కైంకర్యమును, మాకాశ్చర్యము గొలుపుచున్నవి. శ్రీకృష్ణుఁడు శిశువయి యున్నప్పుడు కంసునిపంపును దలఁదాల్చి పూతన స్తనములకుఁ గాలకూటమును పూసికొని యా శ్రీకృష్ణునిఁ జంపునుద్దేశముతో వచ్చి యచ్చట నున్న స్త్రీలు వద్దు వద్దని యాటంకపఱచుచున్నను మానక కృష్ణు నెత్తుకొని స్తన్యమిచ్చుచుండెను. అంతఁ గృష్ణుఁడు భగవంతుఁడు గనుక స్తన్యమును ద్రావుచు దానిజీవనములు హరించెను. శిశుహత్య చేయఁబూనికొనివచ్చిన పూతన మిగుల దుర్మార్గురాలని చెప్పుటకు సందియము లేదుగదా? అట్టిదుర్మార్గురాలయినను బూతన కృష్ణునియనుగ్రహమువలన యశోదాదేవి పొందఁదగినపరమపదమును జెందినది. తన కపరాధము చేయువారలకుఁ గూడ మోక్షసుఖముల నిచ్చుచున్న శ్రీకృష్ణునిఁ దక్క నితరుని శరణొందుట కెవఁడు పాల్పడును? ఓయీ! ముక్తినిబొందుటకు భక్తియోగము తప్ప మఱియొక మార్గము లేదని వేదములే చెప్పుచున్నవి. ఇట్లుండ దుర్మార్గులైన శత్రువులుగూడ ముక్తిమార్గము చెందఁగనుట మిగుల నసంగతముగా నున్నది! అని యందువేమో చెప్పెద విను. భగవంతుండగు కృష్ణునియందుఁ గ్రోధయుక్తులయి యుద్ధములు చేసి ప్రాణములు విడుచుచు గరుడసంభాగము నధిష్ఠించు చక్రాయుధము ధరించియున్న భగవంతునిఁ జూచుచు, నున్న శత్రువులందఱును, భగవద్భక్తులే యని తెలిసికొనుము. విష్ణువుశత్రువులుగూడ భక్తులతో సమానులై యగుచున్నారు. కావున వెనుక నుదా

హరింపఁబడిన వేదార్థమునకు విరోధము లేదు. భగవంతుఁడగు నారాయణుండు బ్రహ్మాదుల ప్రార్థన నంగీకరించి భూభారమును హరింపఁగోరి దుష్టుఁడైన కంసుని కారాగృహములో నున్న దేవకీవసుదేవులకుఁ గుమారుండయి యవతరించెను. తరువాత దురాత్ముఁడగు కంసుఁడు చంపునేమో యన్న భీతిచేత వసుదేవుం డెవ్వరికిఁ దెలియకుండ నక్కుమారునిఁ గొనిపోయి నందునిగృహమున నుండుంచెను. అంత నబ్బాలకుండు పదునొకండువత్సరంబులవఱకుఁ గపటవేషధరుండై బలరామసమేతుండై వ్రేపల్లెయందు విహరించెను. సింహకిశోరమువంటి చూపులుగల కృష్ణుండు గోపబాలురతోఁగూడ గోవులను, వత్సలను, మేఁతకుఁ దోలుకొనిపోయి యమునానదీతీరములందు మేపుచు, బాల్యసంబంధమైన చేష్టలను జూపుచు, నొకమారు ఏడ్చుచు, నొక్కమాఱు నవ్వుచు, మఱియొకమాఱు నల్లివానివలెఁ దిరుగుచు, బ్రవర్తించుచుండెడివాఁడు. అట్లు శ్రీకృష్ణుండు విహరించుచున్న సమయంబున దురాత్ముఁడయిన కంసుండు తనినిఁ జంపుటకై కామరూపులగు పెక్కండ్రు రక్కసుల నంపెను. అయినను బాలభావము నొందిన శ్రీకృష్ణుండెంతమాత్రము భయము చెందక తన్నుఁ జంపవచ్చిన రక్కసుల నందఱను బాలుండు క్రీడార్థము కల్పింపఁబడిన లక్కబొమ్మలను జెక్కలుగాఁ జేయునట్లు చక్కాడివైచెను. మఱియొకప్పుడు కాళియహ్రదములోనున్న నీటిని ద్రావి గోగోపాలురందఱు విషవేగముచే మూర్ఛ చెందఁగాఁ గాంచి శ్రీకృష్ణుండు దయాస్వాంతుండై యామడుఁగునందున్న సర్పరాజును నిరోధించి యాహ్రదమునందలిజలమును విషరహితముగాఁ జేసి గోగోపాలురను రక్షించెను. గొల్లలందఱు వర్షము నపేక్షించి యింద్రయాగంబు

చేయుచుండెడివారు. అదిచూచి శ్రీకృష్ణుండాయాగమునుమాన్పి గోగోపాలురు సంతసం బందునట్లుగా, నాయింద్రయాగధనమును వ్యయము చేయించెను. అంతట నింద్రుండు కోపించి గోగోపాలురను బాధింప ఘోరంబగుశిలావర్షంబు గురియింప నారంభించెను. అదిచూచి శ్రీకృష్ణుండొక పర్వతము గొడుగుగాధరించి వారిలభయమును బోఁగొట్టి యింద్రునిగర్వమును సర్వముం దొలంగించెను. శరత్కాలమందు నిండుచందురుని కిరణములచే నత్యంతమనోహరమైన రాత్రియందు సవ్యక్తమధురముగా వేణుగానమును సలిపి గోప స్త్రీలను మోహింపఁజేసి వారలతోఁ గూడ విహరించెను. ఇట్టికృష్ణుని దివ్యచేష్టితంబుల నెట్లు మఱవఁగలను? ఇది ద్వితీయాధ్యాయము.



ఉద్ధవుఁడు మథురాపురియందుఁ గృష్ణుఁడొనర్చిన చర్యల నాడువుట.

"ఓవిదురా! శ్రీకృష్ణుండు వ్రేపల్లెయందుఁ జేసిన దివ్యచేష్టితంబులను సంగ్రహముగాఁ దెలిపితిని. ఇంక నతఁడు మథురాపురమునందును ద్వారకాపురమునందును నొనర్చిన దివ్యచేష్టితంబులను సంగ్రహముగా నుడివెద నాలకింపుము. ఇట్లు శ్రీకృష్ణుండు వ్రేపల్లెయందుఁ గొంతకాలమువఱకు విహరించి దుర్మార్గుఁడయిన కంసునిచేఁ బలువిధముల బాధలు పడుచున్న తనతల్లిదండ్రుల చెఱను వారించి సుఖముం గలిగింపఁ దలంపుగొని వ్రేపల్లెనుండి మథురాపురమునకుఁబోయి బలరాముండు తన్ననుసరించి వచ్చుచుండ రాజమందిరంబు సమీపించి సింహాసనముపై నున్నకంసునిఁ జంపి భూమికిఁ బడఁద్రోచెను. తరువాత శ్రీకృష్ణుండు బలరామసమేతుఁడయి కాశీపురంబునకుఁ బోయి యచ్చట సాందీపని

యనెడి యుపాధ్యాయునివలన షడంగములతోఁ గూడినవేదము నవలీలనె చదివి పంచజనునియుదరమును భేదించి చనిపోయిన గురుకుమారుని బ్రదికించి కొనివచ్చి యతని కర్పించి సంతసింపఁజేసెను. పిమ్మట నాకృష్ణుండు రుక్మిణీదేవిప్రార్థన మంగీకరించి రథంబుపైఁ గూర్చుండి చని రుక్మిచేత నాహూతులయి, గర్వాంధులయి, యున్న రాజులనందఱ నవలీలఁ దిరస్కరించి యామెను గాంధర్వవివాహముచేఁ జేపట్టి ద్వారకకుఁ గొనివచ్చినాఁడు. మఱియొకప్పుడు "మదమత్తములై భయంకరములై యున్న వృషభముల నేడింటిని నడంచినట్టివానికి నాకుమారిక నిచ్చెద" నని నగ్నజిత్తు ప్రతిన చేసియుండెను.అది విని కృష్ణుండు సంతసంబుతోఁ బోయి యా వృషభంబుల నేడింటి కానర మడంచి యా రాజకుమారిని వరించి తనబలాతిశయమును జూచి యోర్వలేక యుద్ధమునకువచ్చిన రాజాధముల నందఱును నిమేషమాత్రమున నస్త్రములవాలు గావించి జయముగొనెను. మఱియొకప్పుడు తన ప్రియురాలయిన సత్యభామకోర్కె నెఱవేర్పఁ దలంచి స్వర్గంబునకుఁ బోయి పారిజాతంబును భూలోకమునకుఁ గొనివచ్చుచు, నవివేకముచే మధ్యమార్గమునఁ దన్నుదాఁకినయింద్రుని, దేవసైన్యములను, జయించి తెచ్చి సత్యభామకోర్కె నెఱవేర్చెను.(శ్రీకృష్ణుండు యుద్ధంబున శరీరముచే నాకసమును మ్రింగుచున్నట్లు వర్తిలునరకాసురునిఁ జక్రముచే ఖండించి వాని తల్లియగు భూదేవిప్రార్థనచొప్పున నరకాసురుని కుమారుఁడగు రాజపుత్త్రునిఁ గొనిపోయి తండ్రిరాజ్యంబున కభిషిక్తునిఁజేసెను. తరువాత నరకాసురునిచేఁ దేఁబడిన నరదేవకన్యలందఱు కారాగృహము నుండి విడిపింపవచ్చిన యార్తబంధునిఁ గృష్ణునిఁజూచి హర్షముచే

తను, లజ్జానురాగములచేతను ప్రేరితములగు చూపులచే వరించిరి. అంతఁ గృష్ణుఁ డేకకాలమందే నానారూపియై వారల నందఱును దనభార్యలఁగా స్వీకరించి యాదరించెను. ఇట్లు వరింపఁబడినయాకన్యలకు సంతసము గలుగునట్లుగా విహరించి వారలలో నొక్కొక్కదానియందుఁ బదుగురేసి పుత్త్రులను బడసెను. తరువాతఁ గాలయవనుఁడు జరాసంధుఁడు మొదలగువారు పెక్కుసైన్యములతో వచ్చి పలుపర్యాయములు తనపురమును ముట్టడింప వారల నందఱ ననలీలగాఁ బాఱఁదోలి కాలాంతరమునందుఁ దనదివ్యతేజమును భీమాదుల కొసంగి వారలచే జరాసంధాదులను జంపించె. మఱియు శంబరాసురుఁడు ద్వివిదుఁడు మొదలగువారి బలరామాదులచేఁ జంపించి దంతవక్త్రుఁడు బాణుఁడు పల్వలుఁడు మురాసురుఁడు మొదలగువారినెల్ల స్వయముగానే సంహరించెను. తరువాత నమ్మహాత్ముఁడు నీసోదరుల పుత్త్రులైన కురుపాండవులు రాజ్యముకోసము పోరాడుచుండ వారలకు సహాయభూతులై వచ్చినరాజుల నందఱను సైన్యములతోఁగూడ నొకరిచేనొకరిని జంపించి, కర్ణదుశ్శాసనశకునివికర్ణాదులను, సంహరించి దుర్యోధనుండు తొడలు తెగి యుద్ధమందుఁ బడునట్లుచేసెను. ఇట్లు శ్రీకృష్ణుండు భీమార్జునాదులచేఁ బదునెనిమిదియక్షౌహిణుల సైన్యములను జంపించినను దుర్జయమయిన యాదవబలము మిగిలియున్నదనుహేతువుచేఁ దృప్తి చెందక యాదవులనుగూడ సంహరించినఁగాని భూభారము సంపూర్ణముగా నశింపదని తలంచి యాదులకుఁ దగినయుపాయము నాలోచించుచు మధుపానమత్తులైనయాదవుల నొకరిచేనొకరిఁజంపింప సమకట్టి యప్పటికి మిన్నకుండెను. పిమ్మట నిస్సపత్నంబగు రాజ్యం

బునకు ధర్మరాజు నభిషిక్తుం జేసి వర్ణాశ్రమధర్మముల నతనికిఁ దెలియఁజేసి సంతసింపఁ జేసెను. తరువాత నశ్వత్థామబాణఘూతంబుచేఁ జావ సిద్ధపడియున్న యుత్తరగర్భస్థుం డగుబాలుని సంరక్షించి పూరువంశము నశింపకుండఁ గాపాడెను. తరువాత ధర్మరాజుచే మూఁడశ్వమేధములఁ జేయింపఁగా ధర్మసుతుం డట్లు గావించి కృష్ణుని పదపద్మముల సేవించుచుఁ దనతమ్ములైన భీమాదులసాయమువలన భూమిని రక్షించుచు సుఖముగా నుండెను. విశ్వస్వరూపుఁడయిన శ్రీకృష్ణుఁడు శ్రౌతస్మార్తాదిధర్మముల నాచరించుచు ననంతకల్యాణగుణపూర్ణుండయి సమస్తసుఖముల ననుభవించుచు నుండెను. ఇట్లు శ్రీకృష్ణుండు కరుణావలోకనములచేతను, సుధాసదృశములయిన వాక్యములచేతను, అనిందితమయిన నడవడిచేతను, లక్ష్మికి నాశ్రయభూతమయిన శరీరముచేతను, నీలోకమును సంతసింపఁజేయుచు, యాదవుల నంతకంటె నెక్కుడుగా నానందింపఁజేయుచు, రాత్రులయందుఁ దనభార్యల కానందముగొలుపుచు, నిట్లు బెక్కుసంవత్సరంబులు కడపి గృహధర్మములయం దనాదరము కలవాఁడయి యుండెను. యోగఫలప్రదుఁడైన భగవంతుని సేవించుచున్నవారికే సంసారమునందు రోఁతపుట్టుచుండగా భగవంతునికి సంసారమునందు రోఁతపుట్టుట యొకయాశ్చర్యమా? ఇట్లుండఁగా భగవంతుండగు కృష్ణుని యభిప్రాయప్రకారమున యాదవకులనాశనకరమయిన యొకశాపముజనించినది. దానిఁ జెప్పెద వినుము. ఒకనాఁడు యాదవకుమారులందఱు ద్వారకయం దాడుకొనుచు నచ్చటి వచ్చిన మునీంద్రులను బరిహసింప నమ్మునిచంద్రములు కరమ్ము గోపించి యదువంశంబంతయు వేగముగానె క్షయమునొందుఁగాత మని శపించిరి.

ఇట్లు శాపంబు సంప్రాప్తంబయిన కొన్నిమాసములకు యాదవు
లందఱుంగూడి మహానందంబుతోఁ బ్రభాసతీర్థంబునకుఁజని యం
దుఁ గ్రుంకులిడి దేవతర్పణంబులును పితృతర్పణంబులును గావిం
చి సదాచారులయిన విప్రోత్తముల రప్పించి సువర్ణదానము గొంద
ఱకు,భూదానము గొందఱకు, సవత్సలతోఁ గూడియున్న గోవు
లను గొందఱకుఁ గన్యాదానంబులు గొందఱకు నిచ్చి యట్లు షోడ
శమహాదానముల చేతను వారలఁ దృప్తిఁ బొందించి యావచ్చిన
బ్రాహ్మణులందఱకు షడ్రసోపేతమయిన భోజనంబులిడి తామచ్చ
టఁ జేసిన దానభోజనాదులను భగవత్ప్రీతిగా ధారవోసి యాబ్రా
హ్మణోత్తములందఱకు సాష్టాంగదండప్రణామము లాచరించిరి.
ఇది మూఁడవయధ్యాయము.



ఇట్లు యాదవులందఱు స్నానదానాదుల నొనర్చి, యావిప్రు
ల ననుమతిఁ బొందిన భుజించి, తరువాత మద్యపానముచేసి, యం
దువలనఁ దా ముచితజ్ఞానశూన్యులై, యొకరినొక రధిక్షేపించు
కొనుచు, మద్యదోషమువలన విపరీతమయిన చిత్తములుగలవా
రయియుండ వేణుమర్దనమువలనఁ, గలిగిన యగ్నిహోత్రము వన
మంతటిని దహించినట్లు వారిలలో నిరువురికి జనించినవిరోధము
వారలనందఱ నుభయపక్షంబులుగా మార్చి యొకరిచే నొకరు
చచ్చునట్లు చేసి సూర్యాస్తమయ మగునప్పటికి యాదవుల నశిం
పఁ జేసినది. అంత శ్రీకృష్ణుండు తాను బూర్వమందు సంకల్పించు
కొనినసంకల్పమునకు ఫలరూపమయిన యాదవకులనాశనము
నవలోకించి భూభారమంతయు నాఁటితో సంపూర్ణముగాఁ దొలఁ
గిన దని భావించి సరస్వతీనదికిఁబోయి యందు మునుక లిడి తత్తీరం

బున నున్న యశ్వత్థపాదపము మొదటిభాగమునఁ గూర్చుండెను. శ్రీకృష్ణుఁడు మొదట నన్నుఁ దనతోఁ రావలదనియు,బదరికాశ్రమమునకుఁ బొమ్మనియు, నాజ్ఞాపించినను నాతని విడిచిపోవుట కసమర్థుండనై యిది యంతయు భగవద్లీలాస మని యెఱింగి యతని వెను వెంటనే పోయితిని. ఇట్లు భగవంతు ననుసరించి పోయి యశ్వత్థపాదపము మూలమునం దుపవేశించి యసహాయుఁడయి యుండ నత్యంతము ప్రియతముఁడయిన యా శ్రీకృష్ణునిఁ జూచితిని. ఆ శ్రీకృష్ణుఁడు నీలాంబుదమువంటి దేహముతోను, ప్రసన్నములయిన యెఱ్ఱని లోచనములతోను, బచ్చనిపట్టువస్త్రముతోను, నాలుభుజములతోను, బ్రకాశించుచు, నెడమతొడయందుఁ గుడిపాదము నుంచికొని కోమలమయిన యశ్వత్థవృక్షము నూఁతగాఁగొని యేదియో యాలోచించుచుఁ గర్మఫలము లేనివాఁడయి కావున నేకర్తాయత్తమగు కార్శ్యత్వము స్థూలత్వము మొదలగుదోషములు లేక యుండెను. ఇట్లుండఁగా నేను సమీపించి యతనిసన్నిధియందుఁ గూర్చుండియుంటిని. అప్పుడే వ్యాసమహర్షికి స్నేహితుఁడును, భాగవతాగ్రగణ్యుఁడును, కృతకృత్యుఁడు నగు మైత్రేయమహాముని లోకసంచారము చేయుచు దైవికముగా నచ్చటికి తెంచెను. ఇట్లు మైత్రేయుండు వచ్చి భగవద్దర్శనజనితమయిన సంతసము చేతను,భక్తి చేతను,నవనతిపదనుండయి భగవంతునియం దధికమయిన ప్రేమ కలవాఁడయి,వినుచుండఁగా శ్రీకృష్ణుం డనురాగార్ద్రమైన చూపులచే శ్రమము వాయునట్లుగాఁ జూచుచు నన్నుఁ జూచ్చి యిట్లు పలికెను. 'ఓ యుద్ధవా? నీవు పూర్వజన్మమునం దొకవసువవు.అప్పుడు వసువులు ప్రజాపతులు సత్రయాగము చేయ నారంభించిరి. ఆకాలమందు నీవు నాయం దధికమయినభక్తి గలవాఁడవయి నాయు

త్తమపదము నందుటకు మిగులఁ బ్రయత్నించి నన్ను నారాధించితివి. నీమనస్సులోనున్నకోర్కె నాకవగతమయినది. నీయిష్టమన్యులచేఁ బొంద నలవికానిదైనను నీయందు నాకు జనించిన యనుగ్రహమువలన నీకుఁదప్పక యొసంగెదను. ఓయీ! నాయనుగ్రహమునకుఁ బాత్రుఁడవగుటంబట్టియుఁ నీలోకమునువిడిచి వైకుంఠమునకుఁ బోవుచున్ననన్ను నుత్కృష్టమైన భక్తిచేతఁ బొడగాంచుటంబట్టియు, నీకర్మజాలమంతయు నశించినది. నీకీజన్మమే కడపటిజన్మమని తెలిసికొనుము. ఇఁక నీకుఁ బుట్టువుండదు. మఱియుఁ బద్మకల్పంబున నానాభీకమలమందు నిషణ్ణుఁడై యుండిన బ్రహ్మకు,జననమరణాదిపరిహారకంబును, బరమానందసుఖదాయకంబునై, మహాత్ములచే భాగవత మని పిలువఁబడుచున్న మన్మహాత్మ్యంబుఁ జెప్పితి;అది నీకుఁ దెలియఁజేయుదు'నని పలుకుచున్న కృష్ణుని సాదరవచనంబులనాలకించి పరమపురుషుఁడయిన యతని యనుగ్రహంబునకుఁ బాత్రుండ నయిన నేను బులకితాంగుండనై దుఃఖమునంతయుఁ బోఁద్రోఁచి బద్ధాంజలినై యిట్లంటిని. "ఓదేవా! నీపాదపద్మముల సేవించుచున్నవారికిఁ బురుషార్థముల నాల్గింటిలో దుర్లభమైనది యేది కలదు? ఓ మహాప్రభూ! అట్లయినను నేను బురుషార్థముల నెంతమాత్రము కోరను. నీపాదసేవయం దత్యంతకుతూహలుండనైన నాకవి యిష్టములయి దోఁపలేదు. ఓ మహాత్మా! జన్మరహితుఁడవయిన నీవు జన్మించుటయు, నిర్వ్యాపారుఁడవయిన నీవు పలుకర్మముల నాచరించుటయుఁ, గాలస్వరూపుఁడ వయినసీవు ద్వారకాపురము నాశ్రయించి యుండుటయు, భయరహితుఁడవయిన నీవు కాలయవనాదులకు భయపడి పాఱిపోవుటయు, నాత్మారాముఁడ వయిన

నీవు పెక్కండ్ర స్త్రీలతోఁగూడి విహరించుచు, గృహస్థాశ్రమ మవలంబించుటయు, నివి యన్నియుఁ బండితుల బుద్ధినైనను జలింపఁజేయక మానునా? మఱియు నీవు కార్యాలోచనము చేయునప్పుడు నన్నుఁ బిలిచి యడుగుచుండెడి వాఁడవు. ఆవరణరహితమును, యపరిచ్ఛిన్నమై యున్న యాత్మజ్ఞానమే రూపముగాఁ గలనీవు నన్నుఁ గార్యనిశ్చయమును గూర్చి యడుగవలసిన యవసరమేమి? నీవు మూఢునివలెఁ గార్యనిశ్చయమును గూర్చి నన్నడిగినమాటలు నాహృదయమును భ్రమింపఁజేయుచున్నవి. ఓ మహాత్మా! నాయం దనుగ్రహించి పూర్వము నీవు బ్రహ్మ కుపదేశించినయథార్థజ్ఞానమును గ్రహింప నర్హుండ నగుదునేని నాకుఁ దెలియఁజెప్పుము. ఆ పరమజ్ఞానము నవలంబించి సంసారపారావారమును గడచి ముక్తిఁ జెందఁగలను" అని యిట్లు పరమభక్తితో నడుగుచున్న నన్నుఁ గరుణించి నాయందుండెడిస్నేహభావముచే నందఱకుఁ దప్పక తెలియఁదగినయాదివ్యజ్ఞానమును నా కుపదేశించెను. ఇట్లు నేను భగవంతునివలన నాత్మతత్త్వము నధ్యయనముచేసి లోకములఁ బవిత్రముగాఁ జేయఁజాలిన యతనిపాదపద్మములకు నమస్కరించి సెలవుగైకొని తిరిగి ప్రదక్షిణనమస్కారము లాచరించి భగవద్విరహముచే ఖేదమునొందుచు నిచ్చటి కరుగుదెంచితిని. భగవంతునిఁ జూడఁ గలిగినందుల కానందము గలుగుచుండెను. అతని నెడఁబాసివచ్చుటచే దుఃఖము నొందుచున్నాను. ఇంక నేను భగవంతుని సెలవు ప్రకారమున నతనికిఁ బ్రియమయినబదరికావనముం గూర్చిపోయెదను. ఆబదరీవనమందే పూర్వము నరనారాయణులు తీవ్రమయిన తపం బాచరించి యావనమును బవిత్రితముగాఁ

జేసినారు. అట్టితీర్థమును జేరినచోఁ దప్పక చిత్తము పరిశుద్ధిని జెందును. కావున నేనచ్చటికిఁ బోయెద నని పలుకుచున్నయుద్ధవుని వాక్యముల నాలకించి బంధువులయు, స్నేహితులయు, మరణము నాలకించి యాదుఃఖము దుస్సహమైనను విదురుండు జ్ఞానాతిశయముచే నాదుఃఖమును దొలఁగించుకొనెను. ఇట్లు దుఃఖమును దొలంగించుకొని విదురుండు బదరికాశ్రమమును గూర్చి పోవుచున్నయుద్ధవునిఁ జూచి భగవదనుగ్రహము కలవారిలో నుద్ధవుండు ముఖ్యుండని నిశ్చయించి యతనిం జూచి మహాత్మా! భగవంతుఁడగు కృష్ణుండు కృపారసంబుచే నీకుఁ జెప్పిన తత్త్వజ్ఞానంబు నాకుపదేశింపఁ దగియుండునుగాన దయయుంచి యెఱింగింపుము. అందువలన నేను దప్పక కృతకృత్యుండ నగుదును. లోకములో విష్ణుభక్తు లెల్లప్పుడు తమసేవకులకుఁ బ్రయోజనమును గలిగించుచుఁ జరింతురుగదా? అని యడిగినవిదురుని వాక్యంబులు విని యుద్ధవుం డతని కిట్లనియె. "ఓవిదురా? నేను దత్త్వజ్ఞానముపదేశించునంతటివాఁడనుగాను. భగవంతుఁడును, దత్త్వదర్శియునగు మైత్రేయమహాముని తత్త్వముపదేశింపఁదగినవాఁడు, మఱియు మానవలోకమును విడిచిపెట్టుచున్న భగవంతుఁడు మైత్రేయునిఁజూచి, తీర్థసంచారము చేయుచు నిన్నడిగినవారలకుఁ దత్త్వముపదేశింపుమని యాజ్ఞాపించి యున్నాఁడు. కావున నీ వతనివద్దకేఁగి తత్త్వజ్ఞానము పడయుము' అనిచెప్పి యుద్ధవుండు విదురున కావృత్తాంతమంతయుఁ దెలియఁజేసి విదురునితోఁగూడ విశ్వశరీరకుండయిన భగవంతుని కథాసుధారసమునందు మునిఁగి కావుననే తాపములఁదొలఁగించుకొని యారాత్రి నొక్కక్షణము గాఁ గడపి యుదయంబుననే లేచి యమునం దానమాడి బదరి

కాశ్రమముం గూర్చిపోయెను" అని పలుకుచున్న శుకమునీంద్రుం జూచి రా జిట్లనియె. ఓమునీంద్రా ! భగవంతుండగు కృష్ణుండు నిర్యాణముచెందెను. మహాబలవంతు లని ప్రసిద్ధికెక్కినయాదవు లందఱు నాశనము చెందిరిగదా? వారిలో ముఖ్యుఁడగు శ్రీకృష్ణుఁడు సైతము తనమానవశరీరమును దిరోహితముగాఁ జేసెను. ఇట్లు తనవారందఱు మృతినొందుటఁజూచియు నుద్ధవుం డెట్లు బ్రదికి యున్నాఁడు? బ్రాహ్మణశాపమున కితఁ డెందుచే లోఁబడి యుండలేదు? ఇతఁడును యాదవుఁడేకదా?" అని యడిగినరాజుం జూచి శుకుం డిట్లనియె. "ఓయీ ! నీ వడిగిన ప్రశ్నము సముచితముగా నున్నది. ఆవిప్రశాపము భగవత్సంకల్పరూపమే కాని వేఱుకాదు. సత్యసంకల్పుఁడగు కృష్ణుండు యాదవకులమును నశింపఁజేసి తాను శరీరమును దిరోభావమునుబొందించుచుఁ దనలో దానిట్లు చింతించెను. 'అకటా? ఈలోకమును నేను విడిచిపోయినచో మదాశ్రయ మయినజ్ఞానముగూడ నశింపక మానదు. అట్టిజ్ఞాన మీలోకమం దంత మొందకుండఁగానుద్ధవున కుపదేశించినచో నతని నూనుకొని జ్ఞానము నిలిచియుండఁగలదు. అట్టిజ్ఞానమును గ్రహించుట కుద్ధవుఁడే యర్హుఁడు. అతఁడుతత్త్వజ్ఞానవంతులలోఁ బ్రధానుఁ డని చెప్పవచ్చును. అతఁడు నిర్జితేంద్రియుఁడు. అతఁడు నాతోసమానుఁడే కాని లేశమయిన నాకంటెఁ దక్కువవాఁడు కాఁడు. అతఁడు సత్త్వాదిగుణములచేఁ బీడింపఁబడఁడు. అతనికిఁ దత్త్వజ్ఞానముపదేశించినచో మద్విషయకమయిన జ్ఞానమును లోకమున కుపదేశించుచుండు నని తలంచి యతనిని జావునుండి తప్పించినాఁడు. లేనిచో నతఁడును యాదవులతోఁగూడఁ జావవలసినదే" అని చెప్పి శుకుండు వెండియు ని ట్లనియె. "ఓరాజేంద్రా!

పుణ్యాత్ముఁడయిన యుద్ధవుండు బదరికావనమునకుఁ బోయి జ్ఞాన యోగముచే భగవంతునిఁ జేరెను. పిమ్మట విదురుండు భగవంతుఁ డయిన కృష్ణుండు లీలామాత్రమునకయి దేహము ధరించుటయు, నతం డద్భుతచర్యల నొనర్చుటయు, యోగివరులకు ధైర్యవర్ధకమై, యధీరచిత్తు లగునవివేకులకు దుష్కరతరమై యున్న దేహత్యాగప్రకారమును, సవిస్తరముగా నుద్ధవునివలన విని నిరతిశయమయిన భగవత్ప్రేమవలన మయిమఱచినవాఁడయి మిగుల రోదనముచేసి యుపశాంతిఁజెంది యమునానదీతీరమునుండి బయలుదేఱి కొన్నిదినంబులకు గంగానదినిఁ జేరి క్రమక్రమముగా హరిద్వారముచేరి యచ్చటఁ బరమభాగవతోత్తముఁడయిన మైత్రేయునిఁ గలిసికొనెను. ఇది నాల్గవయధ్యాయము.

---

విదురమైత్రేయ సంవాదము.

ఇట్లు విదురుండు పరమాత్మభక్తిచే నిర్మలమయిన మనస్సు గలవాఁడై యాత్మజ్ఞానమునకు నిధియగుమైత్రేయుని హరిద్వారమునొద్దఁ గలిసికొని యతనికి నమస్కరించి యతనిసౌశీల్యాది మహాగుణంబులచేఁ దృప్తుండై యతని కిట్లనియె. 'ఓమహాత్మా? జనులందఱు సుఖము నపేక్షించి శ్రౌతస్మార్తాదికర్మముల నాచరించుచున్నారు. కాని యాసత్కార్యములవలన సుఖమునుగాని దుఃఖశాంతినిగాని పొందుచున్నట్లు గానరాదు. మాటిమాటికి దుఃఖమునే పొందుచున్నారు. భగవంతుఁడ వయిననీకుఁ దెలియనిసంగతు లుండవు గనుక నాచరింపవలసినకర్మము లేవో తెలియఁజెప్పుము. ఇదియునుంగాక దుఃఖసాగరం బనఁదగు సంసారమునందుఁ బడి మానవుండు భగవద్భక్తివిదూరుండయి యధర్మపరుండై కర్మానుగతములయిన శరీరంబులఁదాల్చుచు నతి

దుఃఖంబుల ననుభవించుచుఁ బుట్టుచుఁ జచ్చుచు నెంతకాలమున కయినను ముక్తిగానక పశుప్రాయుఁడై యున్నవానిని రక్షించు కొఱకే కదా తమవంటిమహాత్ములీలోకంబునఁ జరించుచున్నారు! ఓసాధువర్యా! భగవంతుఁ డెట్లారాధించిన సంతోషించును? ఎట్లు పూజించిన భగవంతుండు భక్తిచే నిర్మలమైనహృదయమందు వసించియుండును? ఏమిచేసినచో భగవంతుండు తత్త్వజ్ఞానము నిచ్చును? అట్టియుపాయ మేదయిన యున్నయెడల నాయందు దయయుంచి చెప్పుము. లోకాధిపతియయిన భగవంతుఁడు కర్మాధీనుండు కాక బ్రహ్మాదిరూపముల నొంది యీప్రపంచము నేరీతి సృజించె? ఎట్లు పరిపాలించె? తిరుగ నీవిశ్వమంతను దనయందే లీనమగునట్లు చేసి జగద్వ్యాపారములను మాని వైకుంఠమునం దెట్లుగా శయనించె? యోగీశ్వరాధిపతియగు భగవంతుఁ డొక్కఁడయ్యుఁ దాను జగదాధారకుఁడై యుండియుఁ బెక్కురూపంబుల నెట్లు దాల్చుచున్నాఁడు? గోబ్రాహ్మణాదిసంరక్షణమునకై మత్స్యాద్యవతారము లెత్తి క్రీడించుచు నేయే ప్రకారంబులఁ బ్రయోజనంబుల నెఱవేర్చె? పవిత్రకీర్తియయిన భగవంతుని జరిత్రము లెంతవిన్నను నామనంబు తనివి సనదు. కావున నాయందు దయయుంచి యీచరిత్రలను దెలియఁజేయుము. ఓమహాత్మా! మఱియు లోకాధినాథుఁడయిన భగవంతుఁడు లోకపాలురతోఁ గూడి యున్నలోకములను లోకబహిర్భాగములను మహదాదితత్త్వములతోఁ గల్పించియుండుటయు, నాయాలోకములందుఁ బ్రవర్తించుచున్నసమస్తజీవకోటులభేదంబులను, దెలియఁజేయుము? కారణాంతరరహితుఁడును, విశ్వకర్తయు, నగు భగవంతుఁడు జ్ఞానేంద్రియగణమును, కర్మేంద్రియస

మూహమును, దేవమనుష్యాదిరూపంబులును, నానానామం బులును, ననెడి నీనిభేదము నేప్రకారముగా జేసె? ఇది యంత యుఁ దెలియఁజేయుము. ఇంక నే నడుగనివి శేషంబులుగూడ నున్న యెడలవర్ణింపుము. ఓయీ! సమస్తము తెలిసిననీకుఁ దిరిగివినుట తో నేమి ప్రయోజనము? అని యందు వేని చెప్పెదవినుము. బ్రాహ్మ ణక్షత్రియవైశ్యు లనుమూఁడుజాతులవారికిఁ దదితరులగు స్త్రీ శూద్రాదులకును,విహితములయిన వ్రతముల నన్నింటిని వ్యాసమ హామునికృత మయినభారతమువలనఁ దెలిసికొంటిని. విష్ణుకథా మృతము లేనివియు, స్వల్పసుఖసంపాదకములు, నగు వ్రతములు వి నుటయందుఁ దృప్తిచెందితిని. ఇఁక వానిని విన నవసరము లేదు. కాని భగవత్కథామృతమువలనఁ దృప్తి నొందలేకున్నాను. మఱియు విష్ణుకథలను దఱుచుగా వినినచో నాభగవంతుఁడు వా రికర్ణబిలమువలనఁ బ్రవేశించి హృదయకమలము నధివసించి సం సారసంపాదకమయిన కోర్కులను ఛేదించు నఁట! ఇట్లు మీసత్ర ములందలిపండితులచే నుతింపఁబడుచున్నవిష్ణునికథలవలన నింత లాభము కలుగుచుండఁగా వాని నెట్టివాఁడయిన వినకయుం డునా? వినినను దృప్తిచెందునా? ఓయీ! హరికథాశ్రవణమే తాపత్రయరూపకమయిన సంసారమును ఛేదింపఁజాలియున్న చో భగవంతుఁ డయినవ్యాసమహాముని మహాభారతమందుఁ గేవలము హరిచరిత్రము నే వర్ణింపక వ్రతములనుగూర్చియు నే లచెప్పె? దీనింబట్టి యోజింప వ్రతములవలనఁగూడ నట్టిఫల ము గలుగునని యభిప్రాయమేమో? యనినచోఁ జెప్పెదవినుము. నారాయణాపరావతారుండయిన వ్యాసమహాముని భగవంతుని గుణముల వర్ణింపఁ దలంచి వర్ణాశ్రమధర్మములు, గ్రామ్యకథా

నువాదములు మొదలగునవి ముక్తిసాధనములు కావని తెలిసియున్నను సామాన్యజనుల మనస్సులు భక్తిమార్గములోఁ బ్రవేశించునిమిత్తము చెప్పె. మఱియు సామాన్యజనులమనస్సు వేదాంతార్థమును గ్రహింపఁజాలదు. అందుచే నిట్టివ్రతధర్మాదుల నాచరించినచోఁ గ్రమక్రమముగా హృదయము నిర్మలత్వమంది జ్ఞానంబున కాకరంబగుచు వేదాంతార్థమును గ్రహింపఁగలదను నట్టియభిప్రాయముతోఁ జెప్పియున్నాఁడు. అట్లు హరికథలాదుఁ జిత్తము ప్రవేశించినతోడనే వానిని వినుటయం దాసక్తి గలిగియుందురు. అట్టివారికిఁ బ్రతిదినము హరికథాశ్రవణము చేయుటవలనఁ గ్రమక్రమముగా విరక్తి బొడముచుండును ఇట్లు సంసారమందు విరక్తి పొడమినతోడనే మానవులు శ్రీహరిపాదపద్మములను సర్వదా ధ్యానింపుచుఁ బరమసుఖముల నొందుచుందురు. హరికథాశ్రవణము సంసారమందు విరక్తి పొడమించి హరిపాదభక్తిని గలిగించి తాపత్రయమును హరించును. ఓమునీంద్రా! హరికథవలన నిట్టిలాభము కలుగుచుండఁగా నవివేకులయిన మానవు లది తెలిసికొనలేక పాపముచే హరికథావిముఖులయియుందురు. అట్టివారల యాయుర్దాయమును సూర్యుఁడు మిక్కిలి క్షయింపఁ జేయుచుండును. ఆ తెల్వితక్కువవారలను గూర్చి మిగుల వగచుచున్నాను. మఱియుఁ దనవాక్కులను, క్రియలను, మనోవ్యాపారమును, హరివిషయముగాఁ జేసినప్పుడే యవియన్నియు సఫలములగును. లేనిచో నవియన్నియు వ్యర్థములే. తనమనోవాక్కాయకృతము లగువ్యాపారములను హరియందుఁ జేర్చువారియాయువు మిగుల నభివృద్ధి చెందుచుండును. తదితరుల యాయువు తఱుఁగుచుండును. ఓమైత్రేయమునీం

ద్రా! ఓయార్తబంధూ! ఆకారణము చేత సమస్తదుఃఖములను దొలఁగించి సుఖములు గలుగఁజేయు విష్ణుమూర్తికథలను దుమ్మెదలు పుష్పములవలన మధువును దీసినట్లు సంగ్రహించి నాకుఁదెలియఁజేయుము. మఱియు భగవంతుఁడు ప్రపంచసృష్టిస్థితిలయములను జేయునిమిత్తము లోకమున నవతరించి చేసినయమానుష కృత్యములను వివరించి వర్ణించి నన్ను సంతసింపఁజేయుము' అని యిట్లు పురుషుల మోక్షోదయముకొఱకు కడుగుచున్న విదురుని పలుకులు విని మైత్రేయుండు మిగుల నంతసించి యావిదురుని నెంతయు గౌరవించి యిట్లు చెప్పెనని శ్రీశుకుండు రాజునకుఁజెప్పి వెండియు నిట్లనియె. 'ఓవిదురా! లోకహితమునుగూర్చి యడిగితివిఁ కాన నీప్రశ్నము మిగుల బాగుగనున్నది. మఱియు నీవు హరికథాశ్రవణతత్పరుండవయి యడిగియున్నావు; కనుక నది నాకు మిగుల నానందము కలుగఁజేసినది. ఇదియునుంగాక వ్యాసునివీర్యంబున జనించి భగవద్భక్తుండవయి యున్న నీవు హరికథ చెప్పుమని యడుగుట యొకవింత కాదు. నాయనా! అన్యసక్తముకాని మానసము చే హరిని జేపట్టిననీవు సాధారణపురుషుఁడవా? మాండవ్యుని శాపమునం జేసి వ్యాసమహామునికి నతనిభ్రాతృక్షేత్రమయిన శూద్రస్త్రీయందు జన్మించితివి. యోజింప నీవు సామాన్యముండవు కావే? మఱియు నీవు పరమజ్ఞానసంపన్నుఁడవు. భగవంతుండగు శ్రీకృష్ణునికిం బ్రియతముండవు. విష్ణుభక్తులలో నగ్రేసరుఁడవు. ఓపుణ్యాత్మా! నేను దైవికంబుగాఁ గృష్ణనిర్యాణకాలమునకు సరిగా నతనిచెంతకుఁ బోయితిని. అప్పు డతఁడు నన్నుఁజేరఁబిలిచి జ్ఞానోపదేశంబు చేసి, విదురున కుపదేశింపవలయు నని నా కానతిచ్చియున్నాఁడు. దీనింబట్టి యోజింప భగవంతునికి నీ

యందున్నదయారస మింతంతయని చెప్పవశమా? కావున నతని యానతిచొప్పున నీకు విజ్ఞానం బుపదేశింతు నాలింపుము. మఱియు భగవంతుండు యోగమాయాబలమువలనఁ బ్రవర్తింపఁ జేయుచున్నసృష్టిస్థితిలయములను గూర్చి చెప్పెదను. విష్ణుని మహాత్త్వముగూడ వర్ణింతును. సావధానచిత్తుండవు గమ్ము. ఓయీ! చిదచిత్తులు భగవంతునికి శరీరభూతమై యుండు. ఆచిదచిత్తులకు స్థూలసూక్ష్మములను రెండవస్థలు కలవు. చిదచిత్తులు నామరూపవిభాగమునకుఁ దగనంతిస్థితిలో నున్నప్పుడు సూక్ష్మావస్థయనియు, అవియే నామరూపముల విభజింపఁదగినంతస్థితిలో నున్నప్పుడు స్థూలావస్థయనియుఁ జెప్పుదురు. ఇందు సూక్ష్మావస్థయే కారణావస్థయనియు, స్థూలావస్థయే కార్యావస్థయనియు నెఱుంగుము. భగవంతునికి శరీరభూతము లగుచిదచిత్తులు కార్యావస్థను బొందినపుడు నామరూపవిభాగార్హమయి యాకనఁబడుచున్న ప్రపంచమగును. ఇట్లు గానవచ్చుప్రపంచమంతయు, సృష్టికిఁ బూర్వము జీవులకంతరాత్మయై ప్రవేశించి వారలకు ధారకుఁడై శాసకుఁడయి నామరూపవిభాగానర్హము లగుసూక్ష్మచిదచిత్తులు శరీరముగాఁ గలభగవంతుఁడే యని తెలిసికొనుము. * ఆభగవంతుఁడే తనకు సృష్ట్యుపయుక్తసంకల్పము ప్రభవించినప్పుడు

* ఇట 'భగవా నేక ఆసేద మగ్ర ఆత్మాఽఽత్మనాం విభుః । ఆత్మేచ్ఛానుగతావాత్మా నానా మత్యుపలక్షితః ॥' అని మూలము. ఇట్లు భగవంతుఁడు తనసంకల్పము ననుసరించి మార్పుచెందుచుండుటచే నతఁడు వికారములు కలవాఁడని యోజింపరాదు; ఆవికారములు శరీరసంబంధులుగాని యతనిసంబంధించినవికావు. మఱియు మూలమునందున్న "ఇదమ్" శబ్దముచే స్థూలచిదచిచ్ఛరీరకుఁడయిన భగవంతుఁడే చెప్పఁబడును. ఆభగవంతునికి స్థూలావస్థలేనప్పుడు సూక్ష్మచిదచిచ్ఛరీరకుండయి యుండు. ఆతనికే కారణత్వ మంగీకరింపవల

దేవాదినానావిధనామరూపములచే శోభితమగుచున్న ప్రపంచక మగుచున్నాఁడు. మఱియు నతఁడు సంహారోపయుక్త మగు సంకల్పము గలిగియున్నప్పుడు దేవాదినానావిధనామరూపములు లేక, కావుననే సూక్ష్మావస్థగలిగినచిదచిత్తులు శరీరము గాఁగల వాఁడయి యుండును. ఆభగవంతుఁడు జీవునివలెఁ గర్మాధీన మగు సంకోచవికాసములు గలజ్ఞానముచే వెలయువాఁడు కాఁడు. కావుననే యతఁడు ప్రళయదశయందును సమస్తపదార్థములం జూడఁగలఁడు. అతఁడు సూక్ష్మావస్థను బొందినచిదచిత్తులు శరీరము గాఁగలవాఁడై, కార్యజాతమును జూడక తన్ను వ్యవహారార్హనామరూపములు లేనివానినిగాఁ దలంచుకొనె. సత్తావంతమగు ప్రతిపదార్థము జూడఁగలభగవంతుని కపృథక్సిద్ధవిశేషణభూతమగు మాయయే చేతనాచేతనాత్మకమగు నుభయవిధప్రకృతి యనఁబడుచున్నది. భగవంతుఁడు సదసదాత్మకమగు మాయచేతనే తా వ్యాప్యగతదోషములు పొందకుండఁ గార్యావస్థరూపమును

యును. ఓయీ! అట్లు చెప్పినచో సృష్టికిఁ బూర్వము చిదచిత్తులుగూడఁ బ్రతీయమానము లగుచున్నవి కాన "ఏక" అనుపదముచే సజాతీయవిజాతీయస్వగతభేదశూన్యమగు బ్రహ్మమే జగత్కారణమని యేల చెప్పరాదు? అనియడుగ వలనుపడదు. "అగ్రే" అనుపదముచేఁ గాలము నిర్దేశింపఁబడినదికాన విజాతీయభేదమును, "ఆత్మా నామాత్మా" అని చెప్పుటచే సజాతీయభేదమును, "భగవాన్" అనుపదముచేఁ గారణత్వమున కుపయుక్తములగు సర్వజ్ఞత్వసర్వశక్తిత్వాదు లగుగుణములు గలవాఁడని చెప్పుటచేఁ దాదృశగుణములనుబట్టి స్వగతభేదమును, సంభవించుచున్నవి. కావున వెనుకఁజూపఁబడినయర్థమును జెప్పరాదు "ఏక"అనుపదమున కర్థ మేమనఁగా నామరూపవిభాగానర్హమగు దశను బొందినవాఁ డనునర్థము చెప్పవలెను. ఈయభిప్రాయముతోనే "ఏక" అనుపదము ప్రయోగింపఁబడినది.

బొందిన ప్రపంచకమును నిర్మించెను. మహదాదిక్రమముగా వృ
ష్టిని దెలిపెద విను. భగవంతుఁడు, కాలానుగుణ మగు[illegible]త్తి
గలిగి, కావుననే వైషమ్యమును బొందినసత్వాదిగుణములచే
నొప్పుచున్నమాయయందు స్వశరీరభూతమగు జీవునిఁ బ్రవేశిం
పఁజేసి తాను వికారములను బొందక యే సృష్టిసామర్థ్యమును సం
పాదించెను. ఇట్లుసృష్టిసామర్థ్యముకలదయి కాలప్రేరితమయియు
న్నయావ్యక్తమువలనఁ దనకు శరీరభూతమగుప్రకృతి నొందియు
న్నకార్యజాతమును జీవాంతరాత్మయై వెలువరించుచు, భగవం
తుఁడు మహత్తత్త్వమాయెను.(అనఁగాఁ బ్రకృతిపురుషశరీరకుఁ
డయినభగవంతుఁడే మహచ్ఛరీరకుఁడాయెనని తెలియునది). ఆమ
హత్తత్త్వము జీవాంశముతోను, సత్వాదిగుణములతోను, గా
లములోను, గూడి, భగవత్సంకల్పరూపమగు జ్ఞానమునకు గోచ
రమై, పరమాత్మస్వరూపకమయి, ప్రపంచమును సృజించు త
లంపుచే రూపాంతరము నొందెను. అట్లు రూపాంతగము నొం
దిన మహత్తత్త్వంబువలన శరీరేంద్రియములకుఁ గర్తృరూ
పమగుచు, భూతేంద్రియాదిరూపముగాఁ బరిణమించుస్వభావ
ముగల యహంకార ముదయించెను. ఆయహంకారము సాత్విక
మనియు, రాజసమనియుఁ, దామసమనియు మూఁడువిధంబుల
య్యె. వికారము నొందినసాత్వికాహంకారమువలన మనం బుద
యించె. మఱియు దానివలననే శబ్దాదులకు నభివ్యంజకములయి
దిగాదిదేవతల కధిష్ఠేయము లయినజ్ఞానేంద్రియంబులును, క
ర్మేంద్రియంబులును, జన్మించినవి. ఈయుభయవిధములగు నింద్రి
యంబులును రాజసాహంకారసహకృతమయిన సాత్వికాహం
కారకార్యములే. మఱియు రాజసాహంకారము సాత్వికతామ

సముల కనుగ్రాహకమువత్రాత్ర మేయగుటంబట్టి యనుగ్రాహక త్వమే రాజసకార్యము కాని యితరకార్యములు లేవు. తామసము భూతములకును శబ్దాదులకును గారణము. ఆతామసమువలన బ్రహ్మప్రమాపకమగుశబ్దమును, ఆశబ్దమే లక్షణముగాఁ గలయా కాశమును బుట్టినవి.అది కాలమాయాంశయోగముచే భగవత్సం కల్పరూపమగు జ్ఞానమునకు విషయభూత మయినది. ఆయాకా శంబున నుదయించిన స్పర్శతన్మాత్రవలన వాయు వుదయించె. ఆ వాయువు వికారము నొందుచు నాకాశగుణమగు శబ్దముచే సంయుతమయి, యధికబలయుతమయి, రూపతన్మాత్రను బుట్టించె. ఆరూపతన్మాత్రమే లోకలోచన మయి విలసిల్లు తేజస్సును గలిగించెను. వాయుగుణములగు శబ్దస్పర్శములతోఁ గూడినయా తేజస్సు భగవత్సంకల్పవిషయమై కాలమాయాంశసంబంధమునం జేసి రసతన్మాత్రను బుట్టించె. అందువలన నుదకంబు సముద్భూతం బయ్యె. శబ్దస్పర్శరూపరసగుణములతోఁ గూడినయుదకము భగ వత్సంకల్పవిషయమై కాలమాయాంశసంబంధమునం జేసి వికార ము నొందుచు గంధతన్మాత్రను బుట్టించె. ఆగంధతన్మాత్రవలన భూమి యుదయించె. ఓమహాత్మా! ఆకాశాదిభూతములందు శబ్దా దిగుణము లేకోత్తరవృద్ధిగా నుండు నని తెలిసికొనుము. అందా కాశమునందు శబ్దమువూత్రమేయుండును. వాయువునందు శబ్ద స్పర్శగుణము లుండును. అగ్నియందు శబ్దస్పర్శరూపగుణంబులు మూఁడుండును. జలమందు శబ్దస్పర్శరూపరసము లనునాలుగు గుణము లుండును. భూమియందు శబ్దస్పర్శరూపరసగంధము లను నైదుగుణంబు లుండును. ఓవిదురా! కాలమాయాజీవాంశములు చిహ్నములుగాఁగలిగిన విష్ణునిశరీరభూతు లయినమహదాది దేవతలు

పరస్పరసంబంధము లేనివా రగుటంబట్టి బ్రహ్మాండమును సృజింప నసమర్థులయి చేతులు జోడించి భగవంతునికి నమస్కరించి యిట్లు స్తోత్రముచేయనారంభించిరి. *ఓభగవంతుఁడా! నీపాదపద్మములకు నమస్కారము చేయుచున్నారము. ఓదేవా! నీపాదపద్మములు తమ్ము సేవించుచున్నవారితాపముల నపహరింప గొడుగులవంటి వికదా! మఱియు నీపాదపద్మముల నాశ్రయించియే కదా యతీశ్వరులందఱు భయంకర మయినసంసారదుఃఖమును దొలంగించుకొనుచున్నారు! ఓదేవదేవా! నీపాదపద్మములసేవ సేయనిచోఁ దాపత్రయబాధితు లగుజీవులు కొంచెమైనను సుఖముపొందలేరు. మఱియు నీపాదపంకజసేవ చేయనివారికిఁ దాపత్రయనివృత్తి కలుగనే కలుగదు. కావున నీపాదభజనము చేసి మే మందఱము తాపత్రయమును దొలంగించుకొని ముక్తినిబొందెదము. ఓయీశ్వరా! నీపాదములు నదులలో నెల్ల నుత్తమమయిన గంగానదికి నుత్పత్తిస్థానములు కదా! ఓదేవా! నీపాదములయందుఁ బుట్టిన గంగానదియె లోకులపాపములఁ దొలఁగించుచున్నప్పుడు గంగానదికిఁ గారణభూతము లయిననీపాదపద్మములు

* ఓయీ! మహదాదులకుఁ దత్త్వములనియే నామములుగలవు. కాని దేవతలని వాడుకలేదు. కాన దేవతలని వాడుట యెట్లు ? అనినచోఁ జెప్పెద వినుము. మహదాదులు భగవంతుని శరీరభూతములు కాన దేవతలని పిలువవచ్చును. ఇందులకు శ్రుతిప్రమాణమున్నది. శ్రు = హంతాహ మిమా స్తిస్రోదేవతాః.— (అనఁగా, ఇమాః = ఈ, తిస్రః = మూడయిన, దేవతాః = కాలమాయాజీవాంశలు) అనియర్థము. కావున వెనుకటిదోషము నిరస్తమగుచున్నది. మహదాదులు అచేతనములుగదా. భగవంతు నెట్లుస్తోత్రము చేయఁగలవు.? అని శంకింపఁబనిలేదు. పరమాకాశవర్తులైన తత్త్వాభిమానిదేవతలే తత్త్వముల నధిష్ఠించి భగవంతుని స్తోత్రము చేయుచున్నవని చెప్పుటకు వలనుపడుచున్నది.

పాపములఁ దొలంగింపఁగలవని వేఱ చెప్పవలయునా? ఓ మహానుభావా! పక్షులు గూండ్లలో జన్మించి ఱెక్కలు కలవయి యచ్చటనుండి పై కెగిరి తిరిగివచ్చి గూండ్లలోనే ప్రవేశించుచున్నట్లు నీ ముఖకమలమందుఁ బుట్టి, వేదములు లోకమందు వ్యాపించి, తిరుగ నీయందే పర్యవసన్నములగుచున్నవి! భవత్కారణములయిన వేదముల నవలంబనముగాఁ జేసికొని యతీశ్వరు లందఱు నిర్మలముగు చిత్తముతో నెవనిపాదములఁ బరిశీలించుచున్నారో, యట్టినీ సామర్థ్యము నెవ్వరు గొనియాడఁగలరు? ఇదిగో నీపాదముల శరణుచొచ్చుచున్నాము. మమ్ముల రక్షింపుము. మఱియు, ఓ యీశ్వరా! ఆస్తిక్యబుద్ధిచేతను, శ్రుతివిహితయజ్ఞాదికర్మయోగముచేతను, జ్ఞానయోగముచేతను, సనుగృహీతమగు భక్తిచేతను, వైరాగ్యబలముచేతను. సంస్కృతమయిన మనస్సునం దెవరిపదపద్మములఁ జేర్చి పండితు లందఱు పూజించుచున్నారో అట్టి నీపాదపద్మముల శరణొందినమమ్మును జేకొనియుము. ఓభగవంతా! నీపాదపద్మములు నీభక్తులకు సంసారభయము లేకుండఁ జేసి రక్షించుచున్నవి. అట్టి నీపాదములకు నమస్కరించి ప్రపంచము సృష్టిస్థితిలయములు గావింపఁ బెక్కవతారములు ధరించియున్న నిన్ను శరణుచొచ్చుచున్నాము. కావున మమ్ముఁ గాపాడుము. ఓదేవదేవా! సంసారకూపంబునం బడి దారపుత్త్రాదిసంబంధము లనుపాశములచే బద్ధులై యీసర్వము నాదే యనెడిమమకారంబునకును, సమస్తము నేనే చేయుచున్నా ననెడి యహంకారమునకును, లోఁబడినవారయి, యున్నమానవులహృదయసీమలయం దంతరాత్మవయి యుండినను వారి కేవి యతిదూరములగుచున్నవో, వారెన్ని ప్రయత్నములు చేసినను వేనిని గన లేరో, యట్టినీపాదపద్మము

లను శరణుచొచ్చుచున్నాము. మఱియు వానిని బూజించుచు న్నాము. ఓ యీశ్వరా! బాహ్యేంద్రియవ్యాపారములచే నప హృతచిత్తులై మూఢాత్ములై యున్నమానవులు మీపాదపద్మ ములను జూడఁజాలరుగాని నీపాదారవిందములం దాత్మసమర్ప ణము చేయుటచే నొప్పారుశమదమాదిగుణసంపద గలవార యి సంతతము సేవించుచున్నయుత్తమశ్లోకులు వానిఁ జూడఁగ లరు. ఓదేవదేవా! మీ కథామృతరసమును దమకంబునఁ ద్రా విత్రావి సాఖ్యోన్నతి నొంది తాపంబులను బాఱఁదోలియున్న పుణ్యాత్ములు పరమపూజ్యమయి, కాలాదులకు యినయప్రతిహత మయియున్న వైకుంఠలోకమును జెందుదురు. ఓమహాత్మా! మఱి కొందఱు మహాత్ములు వైరాగ్యబలము చేతను, జ్ఞానాతిశయము చేతను,నంతరింద్రియబహిరింద్రియములవ్యాపారములఁ బాలించి చిత్తంబులను నిర్మలంబు గావించుకొని హృత్పద్మనివాసుండ వయి చిన్మయాకారత్వమును బొంది యున్ననీదివ్యమూర్తిని తమచిత్తములందుఁ జేర్చి బలిష్ఠమయిన మాయను జయించి నిన్నుఁ జెందుదురు. భవత్సేవాతిశయముచే వారల కెంతమాత్ర ము ప్రయాసము కలుగ నేరదు.ఓదేవా! నీపదవినొందుటకు యో గీశ్వరులకు యోగాభ్యాసములవలనఁ బ్రయాసము లుండు నేమో కాని నీ సేవ సేయువారు నుంతేనియు నాయాసము లేకయే నీ పదమును జెందుదురు. ఓ పరమాత్మా! నీవు లోకములను సృ జింపఁదలంచి సత్వాదిగుణములచేత మమ్ము ముందుగాఁ బుట్టిం చుటంజేసి పుట్టితిమి. కాని పరస్పరము గలియనిమే మందఱ ము నెంతమాత్రము బ్రహ్మాండరచనయందు సమర్థులము గా కున్నారము. మాకుఁ గారణభూతుఁడవయిన నీకు బ్రహ్మాండ

రచనారూపమయిన ప్రత్యుపకారము చేయవలసినది కాని యం తటిశక్తి మాకు లేదు. ఓదేవా! ఆయాకాలములయందు నీకు బలులను దెచ్చి యెట్లు పూజింతుమో; నీకుఁ గ్రీడాసాధనముల వంటివార మగుమేము నన్నాదిభోగ్యవస్తువుల నెట్లనుభవింతుమో; ముందుగా సృజింపఁబడినదేవాదిలోకము జ్ఞానకర్మేంద్రియములకు విషయములయినపదార్థములను దెచ్చి యెట్టులర్పించునో; యట్లు చేయుటకు మాకెంతమాత్రము శక్తి చాలకున్నది. ఓదేవా! నీవు పురాణపురుషుఁడవు, స్వకార్యముల మయిన దేవతల మగుమాకందఱకుఁ గారణభూతుఁడవు నీవే! మఱియుఁ గూటస్థుఁడవు నీవే! మఱియు నాయాదేవతలయం దంతరాత్ముఁడవయి యున్నవాఁడవునీవే! నీవు శబ్దాదిగుణగ్రాహకము లయిన జ్ఞానకర్మేంద్రియములకుఁ గారణభూతమయిన మా*యయం దు సృష్టిసామర్థ్యముగల వీర్యము నుంచి యున్నాఁడవు. అందువలననే మేమందఱము జన్మించినవారము మేమందఱము నీ శరీరభూతుల మయి యున్నారము. కావున మాయందు దయ యుంచి జగత్కల్పనాశక్తి చాలనిమాకు మీశక్తిని దోడ్పాటుగాఁజేసి విజ్ఞానము గలిగించి రక్షింపుము. అట్లయిన మే మేకార్యముకై పుట్టితిమో యకార్యమును నెఱవేర్పఁగలము.' అనెను. * ఇదిఅయిదవ యధ్యాయము.



అది విని త్రివిక్రముఁడగు భగవంతుండు మిళితములుగామి స్వశరీరభూతములై యున్నతత్త్వములకు లోకరచనాసామర్థ్య

---

* ఇట ముఖ్యముగాఁ దెలియఁదగినయంశ మేమనఁగా, "శ్లో॥ పురుషేణాత్మభూతేన వీర్యమాధత్త వీర్యవాన్। రేత స్త్వజాయాం కవిమాదధేఽజః॥" అని

ము లేక యుండుటచూచి వాని కట్టిసామర్థ్యము కలుగుటకయి కాల మను పేరుగలస్వీయశక్తియందుఁ బ్రవేశించి ధారకుఁడై

---

చెప్పుటచేఁ బరమాత్మాత్మకుఁ డగుసమష్టిపురుషునిచే సృజింపఁబడినమాయయే మహదాదుల కారంభ మగుచున్నట్లు తెలియుచున్నది. మఱియు మహత్తత్త్వము మొదలు పృథివీతత్త్వము తుదగాఁగల వన్నియు నచేతనముయొక్క యవస్థావిశేషములే. అందు మాయ ఖండితము కాకయే ప్రదేశభేదమునుబట్టి మహద్రూపముగాఁ బరిణమించును. అట్లె మహత్తత్త్వముగూడ ఖండితము కాకయే ప్రదేశభేదమునుబట్టి యహంకారరూపముగాఁ బరిణమించు. అట్లె యహంకారాదులందుఁగూడఁ జూచుకొనవలెను. మహత్తత్త్వ ముత్తరకార్యముగాఁ బరిణమించునప్పుడు మహత్తత్త్వమంతయు నహంకారముగాఁ బరిణమింపక, యేకదేశముచేతనే యహంకారమును బుట్టించును. ఇట్లు మహదాదు లేకదేశముచేతనే కార్యంబులం బుట్టించుచున్నవని గ్రహింపవలెను. ఇట్లు చెప్పక సమస్తమహదాదులు నుత్తరోత్తరకార్యములుగాఁ బరిణమించు నని చెప్పినచో మహదాదులు ప్రత్యేకముగా లేకపోవుటచే "పృథివ్యప్సు ప్రలీయతే" ఇది మొదలుకొని "మహానవ్యక్తేలీయతే" అనువాక్యంబులయందుఁ జెప్పిన ప్రళయక్రమము పొసఁగదు. మఱియు లయమనఁగా బూర్వావస్థయందున్న ద్రవ్యమునందుఁ బ్రదేశ దేశముచే నుత్తరావస్థను బొందినద్రవ్యము స్వీయావస్థను విడిచి లీన మగుటయే. ఎట్లనఁగా మహత్తును నహంకారమును దీసికొనుము. మహత్తత్త్వముయొక్క యేకదేశముచేతనే యహంకారముపుట్టినట్లు తెలియును గదా? ఇప్పుడు పూర్వావస్థను బొందినద్రవ్యమనఁగా, మహత్తత్త్వము. తదేకదేశముచే నుత్తరకార్యమయిన యహంకారమే యుత్తరావస్థను బొందిన ద్రవ్యము. ఈయహంకారముస్వీయావస్థను విడిచి మహత్తత్త్వమునఁగలియుటయే లయమనఁబడును. మహదాదు లేకదేశముచేతనే యుత్తరకార్యములుగాఁ బరిణమించునని చెప్పనిచోఁ బూర్వోక్తలయము కుదరదు. మఱియుఁ బ్రత్యేకముగా మహదాదులస్థితి యసంభవమగుటచేఁ బంచీకరణముగూడ నుపపన్నము

మహదహంకారములు, పంచభూతములు, పంచతన్మాత్రలు, మనంబుతోఁగూడిన యింద్రియదశకము నాఁబడు తత్త్వసమూహమును బ్రవేశించెను. భగవంతుఁ డట్లు తత్త్వగణమును బ్రవేశించి ప్రేరణాత్మక మయినచేష్టచే విడివిడిగా నున్నయాతత్త్వగణము నేకముగాఁ జేసి వానివానివ్యాపారమును దెలిపెను. అంత నీతత్త్వగణము భగవత్సంకల్పముచేఁ దమతమవ్యాపారములను దెలిసికొని భగవంతునిచే నాజ్ఞాపింపఁబడినవయి తమతమయంశములచేఁ జతుర్ముఖుని సృజించినవి. భగవంతుఁడు సంకల్పజ్ఞానరూపముగా దమయందుఁ బ్రవేశించి యుండుటంబట్టి స్థావరజంగమములు కార్యరూపముగాఁ దమయందుఁగల తత్త్వస

---

కాదు. ఇట్లుమహత్త్వము మొదలుకొని పృథివీత్వము వఱకుఁగల యవస్థలను బొందయున్న యవ్యక్తమునందుఁ బరమాత్మస్వరూపుఁ డగుసమష్టిపురుషుఁడు ప్రవేశించియుండుటచే నది పరమాత్మశరీరముగాఁ జెప్పనొప్పును. ఇట్లుపరమాత్మ కారణద్రవ్యమగు నవ్యక్తమును బ్రవేశించినను, గారణావస్థద్రవ్యము, కార్యావస్థద్రవ్యము, ఒక్కటియే యగుటచే "యస్యపృథివీశరీరమ్" ఇత్యాదిశ్రుతు లుపపన్నము లగుచున్నవి. ఓయీ! నీవు చెప్పినది యంగీకరించినచో "యస్యావ్యక్తంశరీరమ్" అనెడివాక్యముచేతనే యవ్యక్తమునకంటె భిన్నముకానిపృథివ్యాదులుగూడ భగవచ్ఛరీరమగుట సిద్ధించుచుండఁగాఁ బ్రత్యేకముగా "యస్య పృథివీశరీరమ్"-"యస్యాపశ్శరీరమ్" ఇత్యాదిశ్రుతులతో నేమిప్రయోజనము? అన్నచోఁ జెప్పెద.విను. అవస్థకును, నవస్థావత్తునకును భేదము కలదు. ఎట్లనఁ బృథివికిని బృథివీత్వావస్థకును భేదముగలదనుట సర్వసమ్మతము. అవస్థావత్తులగు నవ్యక్తమహత్తత్త్వపృథివ్యాదు లొక్కటియే కాన నవ్యక్తమందు భగవదనుప్రవేశము చెప్పుటచేఁ దక్కినమహత్తత్త్వాదులు గతార్థములైనను మహత్త్వపృథివీత్వాద్యవస్థలు భగవచ్ఛరీర మనిచెప్పుటకు వెనుకటిశ్రుతులు కావలసియున్నవి.

మూహము పరస్పరము సంక్షోభవించి సమష్టిపురుషునకు గర్భరూపమయిన బ్రహ్మాండరూపముగాఁ బరిణమించినవి. సువర్ణవికారమయిన యాయండమున దేవాదిసత్త్వములతోఁగూడియున్న సమష్టిపురుషుఁ డాయండమును పరిపాకముఁ జెందునంతకాలము నివసించియుండెను. మహదాదుల కపత్యరూపుఁడయి, భగవత్సంకల్పమును, జీవాత్మలను, తదీయకర్మములను, జీవసంఘములకు శరీరాదులను గల్పించుచిచ్ఛక్తిని, బొంది యున్నసమష్టిపురుషుండు తన్నును, భోక్త, విషయము, కరణము, నా మూఁడువిధములుగా విభజించెను. ఆమూఁడింటిలో నొకటియగు కరణమును, జ్ఞానేంద్రియపంచకము, కర్మేంద్రియపంచకము, మనస్సు నాఁ బదునొకొండువిధములుగా విభజించెను. ఆసమష్టిపురుషునికి నీప్రకారముగా విభజించుటకుఁ దగినశక్తి యెట్లు కలిగినదో చెప్పెదను. వినుము. ఈబ్రహ్మ సమస్తవ్యష్టిపదార్థములకుఁ గారణభూతమయిన పరమాత్మాంశమువలనఁ బుట్టెను. మఱియుఁ బరమాత్మ యావేశావతారమని చెప్పఁదగినవాఁడు. పరమాత్మాంశావతారమనఁదగిన యాసమష్టిపురుషునినుండియే సమస్తమయిన వ్యష్టిపదార్థజాతము పుట్టినది. మఱియు నాబ్రహ్మ స్వశరీరాంతర్గతు లగుభోక్తలతోఁ గూడినవాఁడు. అతఁడే భూతములందు వర్తించుశబ్దాదివిషయములతోఁ గూడినవాఁడు. అతఁడే యింద్రియసమష్టితోఁ గూడినవాఁడు. అతఁడే జ్ఞానకర్మేంద్రియదశకము, మనస్సు, నాఁబడు నేకాదశవిధేంద్రియములు గలవాఁ'డని చెప్పి మైత్రేయుండు విదురున కిట్లనియె. 'ఓవిదురా! జగన్నియంతయగు భగవంతుండు మహదాదితత్త్వము లొనరించిన విన్నపముల నాలించినవాఁడయి యింద్రియాదుల

వ్యష్టిరూపముగా విస్తరింపఁజేయుటకుఁ దనదివ్యజ్ఞానము చే "బ్రహ్మ వ్యష్టిశరీరముల వ్యష్టీంద్రియముల విభజింపఁదగిన సామర్థ్యముగలవాఁడయి యుండుఁగాక" యని సంకల్పించెను. అతఁ డట్లు సంకల్పించినతోడనే సంకల్పవిషయుఁడయిన బ్రహ్మావలన వ్యష్టీంద్రియములకుఁ గొన్నిస్థానము లుత్పన్నంబులయ్యె. వానిని జెప్పెద నాలకింపుము. సమష్టిపురుషుఁడయిన చతుర్ముఖునివలన విభక్తమయినవ్యష్టిజీవుని యాస్యరూపమయినస్థాన మేర్పడ స్వాంశమయిన వాగింద్రియముతోఁగూడ నగ్నిహోత్రుఁ డందుఁ బ్రవేశించెను. ఆవాగింద్రియముచేతనే వ్యష్టిజీవుఁడు సమస్తశబ్దజాలను నుచ్చరించుచున్నాఁడు. ఆచతుర్ముఖునివలన విభక్తమయిన వ్యష్టిజీవునితాలుస్థానమును వరుణదేవుఁడు స్వాంశభూతమయినరసనేంద్రియముతోఁగూడఁ బ్రవేశించెను. వ్యష్టిజీవుఁ డారసనేంద్రియమువలననే యామ్లతిక్తమాధుర్యాది రసములను గ్రహించుచున్నాఁడు ఆ సమష్టిపురుషునివలన విభక్తములయిన వ్యష్టిజీవుని నాసికాస్థానములను నశ్వినీసుతులు నిజాంగభూతమయిన ఘ్రాణేంద్రియముతోఁ గూడఁ బ్రవేశించిరి. వ్యష్టిజీవుఁ డాఘ్రాణేంద్రియముచేతనే సుగంధదుర్గంధాదులను గ్రహించుచున్నాఁడు. ఆ చతుర్ముఖునివలన విభక్తములయిన నేత్రస్థానముల నాదిత్యుఁడు స్వాధిష్ఠేయభూతమయిన చక్షురింద్రియముతోఁగూడఁ బ్రవేశించెను. వ్యష్టిజీవుఁ డానేత్రేంద్రియముచేతనే నీలపీతాదిరూపములను జూచుచున్నాఁడు. ఆచతుర్ముఖునివలన విభక్తమయిన చర్మస్థానములను స్వాంశమయినత్వగింద్రియముతోఁగూడ వాయువు ప్రవేశించెను. వ్యష్టిజీవుఁ డాత్వగింద్రియముచేతనే మృదుత్వకఠిన

త్వాదులను గ్రహించుచున్నాఁడు. చతుర్ముఖునివలన విభక్తములయిన కర్ణస్థానములను స్వాంశమయిన కర్ణేంద్రియముతోఁగూడ దిగ్దేవతలు ప్రవేశించిరి. వ్యష్టిజీవుఁ డాశ్రోత్రేంద్రియముచేతనే శబ్దములను వినుచున్నాఁడు. చతుర్ముఖునివలన విభక్తమయినత్వక్స్థానమును నోషధ్యభిమానదేవతలు స్వాంశభూతము లయినరోమములతోఁగూడఁ బ్రవేశించిరి. వ్యష్టిజీవుఁ డారోమములచేతనే కండూతిని బొందుచున్నాఁడు. ఒక్కత్వగింద్రియమునకే స్థానభేదముచేఁ గండూతియు స్పర్శమునుఁ గలుగుచున్నవి. ఆ చతుర్ముఖునివలన విభక్తమయినయుపస్థేంద్రియస్థానమును బ్రజాపతి స్వాంశభూతమయి రేతోరూపమయియున్నయింద్రియముతోఁగూడఁ బ్రవేశించెను. వ్యష్టిజీవుఁ డారేతస్సుచేతనే రతిసుఖమును బొందుచున్నాఁడు సమష్టిపురుషునివలన నేర్పడిన గుదస్థానమును మిత్రుఁడు పాయ్వింద్రియముతోఁగూడఁ బ్రవేశించెను. వ్యష్టిజీవుఁడు పాయ్వింద్రియముచేతనే పురీషమును విడుచుచున్నాఁడు. చతుర్ముఖునివలన విభక్తములయిన చేతులను గుంచనాకుంచనాకర్షణాదులకు సాధన మయినపాణీంద్రియముతోఁగూడ నింద్రుఁడు ప్రవేశించెను. వ్యష్టిజీవుఁ డాపాణీంద్రియముచేతనే జీవనమును సంపాదించుకొనుచున్నాఁడు. సమష్టిపురుషునివలన విభక్తమయినపాదములను విష్ణువు గమనమునకు సాధన మయినపాదేంద్రియముతోఁగూడఁ బ్రవేశించెను. వ్యష్టిజీవుఁ డాపాదేంద్రియముచేతనే గమనాదికార్యములను జేయుచున్నాఁడు. చతుర్ముఖునివలన విభక్తమయిన వ్యష్టిజీవునిహృదయమును జంద్రుఁడు స్వాంశ మయిన మనస్సుతోఁగూడఁ బ్రవేశించెను. వ్యష్టిజీవుఁ డామనస్సుచేతనే సంక

ల్పవికల్పరూపము లైన క్రియలను బొందుచున్నాఁడు. మఱియు, నొక్కటియగు నంతఃకరణము వ్యాపారభేదముచేత మనస్సనియు బుద్ధియనియుఁ,జిత్తమనియు,నహంకారమనియు, నాలుగువిధంబు లయ్యెఁ. వానిలో మనస్సునకుఁ జంద్రుఁ డధిదేవత. బుద్ధికి బృహస్పతి యధిదేవత. అహంకారమునకు రుద్రుఁ డధిదేవత. చిత్తమునకుఁ బ్రజాపతి యధిదేవత. మఱియుఁ జతుర్ముఖునివలన విభిన్నమైన బుద్ధిస్థానమును బ్రహ్మ, నిశ్చయాత్మకజ్ఞానము కలిగించెడి సామర్థ్యముతోఁ గూడఁ బ్రవేశించెను. జీవుఁ డాబోధనాంశముచేఁ దెలియఁదగినసమస్తమును దెలిసికొనుచున్నాఁడు. చతుర్ముఖునివలన విభక్త మయినయహంకారస్థానమును నభిమానకృద్దేవతయగు రుద్రుండు దేహాభిమానాంశముచేఁ బ్రవేశించెను. జంతు వాయభిమానముచేతనే కర్తవ్యమును జేయుచున్నాఁడు. చతుర్ముఖునివలన విభిన్నమైన యంతఃకరణస్థానమును బ్రజాపతి సమ్యగర్థమును జింతించుటయే రూపముగాఁ గల మనస్సు ప్రవేశించెను. జీవుఁ డాచిత్తాంశముచే నాలోచింపఁదగిన యర్థజాలమును, లెస్సగా నాలోచనీయమగు సర్వవిషయజ్ఞానమును, జెందుచున్నాఁడు. మఱియు నావిరాట్పురుషుని శిరస్సువలన స్వర్గలోకము నాభివలన నాకాశము పాదములవలన భూలోకంబును బుట్టినవి. అందు స్వర్గలోకమును సత్త్వగుణప్రధాను లగుదేవతలు పొందిరి. మఱియు రజోగుణప్రధాను లయినమనుష్యాదులు రాజసకర్మములకుఁ దగినఫలము ననుభవింప ననుకూలమై యున్న భూతలమును బొందిరి. తమోగుణస్వభావముగలవయి, రుద్రునకుఁ బారిషదగణము లైన భూతప్రేతపిశాచాదులు గగనము నాశ్రయించినవి. పిమ్మట నమ

ష్టిపురుషుని ముఖమువలన వేదములును బ్రాహ్మణులు నుదయ మందిరి. శరీరమున నుత్తమభాగమయిన ముఖమందు జన్మించిన కారణముననే బ్రాహ్మణులు తక్కినవారికంటె నుత్తములును, గురువులును, నై ముఖమువలెఁ బ్రధానులు నయిరి. తరువాత నా విరాట్పురుషుని బాహువులవలనఁ గొందఱుదయించిరి. వారు భగవంతుని పౌరుషాంశమువలనఁ బుట్టినవారయి తక్కినవర్ణముల వారిని జోరాదులవలనఁ గలుగునుపద్రవములనుండి (క్షతములనుండి) రక్షించుచున్నారు. కావున వారికి క్షత్రియులను పేరువచ్చినది. పిమ్మట నావిరాట్పురుషునియూరువులవలనఁ గొందఱు జన్మించిరి. వారలకే వైశ్యులని పేరు. వారు లోకములో నున్నవారి కందఱికిఁ గ్రయవిక్రయకృషివ్యవహారములవలన జీవనోపాధిని సంపాదించుచున్నారు. భగవంతునిపాదములవలన శుశ్రూషావృత్తిగల శూద్రులు జనించిరి. వారు తమజాతివారికి నుచితమయిన ద్విజశుశ్రూషచేయుచు దానిచేత భగవంతుని సంతసింపఁ జేయుచున్నారు. ఈనాలుగుజాతులవారును స్వకులవిహితము లయినధర్మముల నవలంబించి శ్రద్ధచేతఁ దమచిత్తము పరిశుద్ధిపొందుకొఱకు నేవానివలనఁ దాము వృత్తులతోఁ గూడ జన్మించిరో యాశ్రీహరిని సర్వకాలములయందుఁ బూజించుచుందురు. ఓవిదురా ! కాలకర్మస్వభావ మయినశక్తితోఁ గూడికొని యున్నభగవంతునిమాయావిజృంభణము మహిమను వర్ణింప నెవ్వఁడు సమర్థుఁడు. ఓయీ ! ఎవ్వనికిఁ దరముకానిచో నీవెట్లు వర్ణించుచున్నావని యందువేని చెప్పెద. వినుము. నాకుమాత్రము హరిమహిమను వర్ణింపను శక్తిగలదా ? హరిశక్తిని సంపూర్ణముగా వర్ణింపలేను. అయినను మాగురువువలన

విన్నంతవఱకు నీకుఁ జెప్పుచున్నాను. మఱియు నాబుద్ధికి గోచర మగునంతవఱకుఁ జెప్పఁగలను. భగవంతునిమహిమను గొంతవ ర్ణించుటవలనఁ గలిగెడిలాభము హరికంటె నన్యులనామములఁ బలుకుటచే దుష్టములయినవాక్యములను బవిత్రముచేయుటె. భగవన్మహిమ తనకుఁ దెలిసినంతవఱకు వర్ణించుకొనిన నంతేచాలును. అంతియేకాని భగవన్మహిమఁ బూర్తిగాఁ దెలిసికొనినంగాని ఫలములేదని తలంపకుము. ప్రశస్తకీర్తిగల భగవంతునిగుణవర్ణనమే ముఖ్యఫల మని యెఱుంగుము. మఱియు విద్వాంసులు విష్ణుకథలను వర్ణించుచుండఁగా నాకథాసుధారసమును నాఁకొనియున్నకర్ణేంద్రియములు తృప్తిచెందునట్లుగా ద్రావుటయే ముఖ్యఫల మని యెఱుంగుము. ఓవిదురా! భగవన్మహిమను దెలియఁజాలనివారము మేమేకాదు. విష్ణుమూర్తి నాభికమలమందుదయించి యతనిదయకుఁ బాత్రుఁడై సమస్త ప్రపంచము సృజింప శక్తిగలిగినబ్రహ్మ బహువత్సరంబు లొనర్చినయోగముచేఁ బరిపక్వమగు బుద్ధిచేతనైనను భగవన్మహిమ పూర్తిగఁ దెలియలేఁడు దీనికేమి? తన్నుఁ బొందించుటకు మార్గభూతంబగు వేదము లేయాత్మగాఁగల హరియే యాశ్చర్యశక్తిగలవారికినయితె మాశ్చర్యము గొలుపు మాయను గనుఁగొనలేనప్పుడు బ్రహ్మాదులసంగతి చెప్పనేల? వేదములుగూడ భగవన్మహిమను దెలిసికొనలేక మనస్సుతోఁగూడ మఱలిపోవుచున్నవని వేదములు పలుకుచున్నవి. అట్టి భగవన్మహిమను మన మెట్లు తెలిసికొనఁగల ము? మహాదాదులును, దిక్పతులును, చతుర్ముఖుండును, నీశ్వరుఁడు మొదలగువారేమహాత్మునిపాదపద్మములఁ గనుఁగొనలేరో, యట్టి

భగవంతునికి దండప్రణామము లాచరించుచున్నాను. ఇది యాఱవ యధ్యాయము.



అని యిటుపలుకుచున్న మైత్రేయువచనంబు లాలకించి వ్యాసపుత్త్రుఁడును, దత్త్వదర్శియునగు విదురుండు తనవాక్కులచేఁ బ్రీతిగొలుపునట్లు భగవల్లీలల వినిపించుమైత్రేయుం గాంచి యిట్లనియె. * ఓమైత్రేయా! జ్ఞానాదిషడ్గుణ పరిపూర్ణుఁడును. జిన్మా

---

* ఇచ్చట విదురునివచనమువలన నీయభిప్రాయము తెల్లమగుచున్నది. భగవంతుఁడు సృష్ట్యాదికార్యములకుఁ గర్తయయ్యు జగద్రూపముగాఁ బరిణమించియున్నాఁడు. అట్లు కర్తృత్వపరిణామాదులు భగవంతునకు లీలచేఁ గలుగుచున్నవా? లేక కర్మములవలనఁ గలుగుచున్నవా? కర్మములవలనఁ గలుగుచున్న వనిచెప్ప వలనుపడదు. ఒకవేళ చెప్పినచో "అపహతపాప్మా" ఇత్యాదికమగు శ్రుతికి విరోధము కలుగుచున్నది. కావున లీలచేతనే కర్తృత్వపరిణామాదులు కలుగుచున్నవని చెప్పవలయును. ఇట్లు నిర్వికారుఁడును నిర్గుణుండు నగుభగవంతుని జగత్కర్తృత్వము, జగదుపాదానత్వము, లీలామాత్రప్రయోజనము లని యంగీకరించినను, బరిణామాదులగు క్రియలును, గుణకార్యములగు గర్భ, జన్మ, జరా మరణాదిక్లేశములును, భగవంతు నేలపొందవు? అట్లు జీవునివలెఁ బరిణామములను బొందుచున్నభగవంతునికి జగత్కారణత్వ మెట్లు చెప్పవచ్చును? మఱియు జగత్కారణత్వకర్తృత్వములు కలుగుట లీలకోసముమాత్రమే యని పలుకుచు నందుల కొకదృష్టాంతముగా సమస్తభూవలయాధిపతియై కందుకక్రీడాదిలీలల ననుభవించుచున్నమహారాజును జెప్పుచున్నారు. కాని యీదృష్టాంతము యుక్తముకాదు. మహారాజు జ్ఞానాదిషడ్గుణముల పూర్తిలేనివాఁడు. అతఁడు సమస్తకామములను బొందనివాఁడు. సత్త్వాదిగుణంబుల కధీనుఁడు, మఱియు వికారములుగలవాఁడు. ఇఁక భగవంతుఁడో షడ్గుణపరిపూర్ణుఁడై, యవాప్తసమస్తకాముఁడయి, సత్త్వాదిప్రాకృతగుణములు లేనివాఁడయి, వికారాదులులేనివాఁడయి, యున్నాఁడు.

త్రుఁడును, గావుననే పరిణామాదులు లేనివాఁడును,మఱియు సత్త్వాదిప్రాకృతగుణరహితుఁడును, నయియున్న భగవంతునికి గుణకార్యభూతము లగు క్లేశాదులును, బరిణామాదులును, లీలచేతనైనను నెట్లుగా సంభవించెడిని? ఒకవేళ సంభవించినను దత్ప్రయుక్తములగు దోషములు రాకుండుటెట్లు? ఇట్లు గుణములును, బరిణామాదిక్రియలును, లేనివాఁడై యున్న భగవంతునికి జగత్కారణత్వకర్తృత్వము లెట్లు పొసఁగును ? మఱియు భగవంతునికిఁ గర్తృత్వాదులు బాలురకుఁ గ్రీడావిశేషములవలె లీలామాత్రము లని దృష్టాంతముగాఁ జెప్పుదురు. ఈదృష్టాంత మయుక్తము. బాలునకుఁ గ్రీడింపవలయు నన్నయుద్యమమునుఁ దత్కారణమగు క్రీడేచ్ఛయుఁ, గ్రీడోపకరణములుగాని, క్రీడాప్రవర్తకుఁడగు తనవంటియితరబాలుఁడుగాని, సంభవించినప్పుడు కదా కలుగుచుండు? బాలునివలెఁగాక భగవంతుఁ డవాప్తసమస్తకాముఁ డగుటంబట్టి యతనికిఁ గామమే లేదు. ఒకవేళఁ గామ మున్నదనుకొందము. అట్లయినను దనకంటె వ్యతిరిక్తమగు క్రీడాసాధనముగాని, క్రీడాప్రవర్తకుఁ డగుమఱియొకపురుషుఁడుగాని లేనప్పు డట్టికోర్కె యెట్లు జనించును? కాన నీదృష్టాంతము పొసఁగదని చెప్పవలసియున్నది. ఓయీ ? ప్రకృతిపురుషవిశిష్టుఁడయిన భగవంతునికే జగత్కర్తృత్వాదికము నంగీకరించెదము. ఆభగవంతుఁడు గుణప్రచుర మగుమాయచేత నుపలక్షితుండై యీవిశ్వమును సృజించుచున్నాఁడు. ఆ మాయచేతనే ప్రపంచమును బాగుగాఁ బరిపాలించుచున్నాఁడు. మఱల నామాయ

---

ఇట్లు దృష్టాంతమునకును, దార్ష్టాంతికమునకు నింత వైషమ్యముండ నదియెట్లు సరిపడును ? అని విదురుని ప్రశ్నాభిప్రాయము.

చేతనే యీవిశ్వమును దిరోహితముగాఁ జేయుచున్నాఁడు. స్వాధిష్ఠేయమగు మాయవలననే యీ సృష్ట్యాదికార్యము లొనరించుచున్నాఁడు. కావునఁ బరిణామాదిదోషములు స్వాధిష్ఠేయమగు మాయను బొందునుగాని పరబ్రహ్మమును బొందవు. అందువలన భగవంతునికి జగత్కారణత్వాదు లంగీకరించినను దోషము లేదే?యన్నచోఁ జెప్పెదవినుఁడు. సృష్ట్యాదులకుఁ గారణభూతమగు నవిద్యకు భగవంతునితో సంబంధము కలిగియుండుటయే యసంభవము. భగవంతుఁడు సర్వగతుఁడై యుండుటం బట్టి దీపప్రభవలెనే దేశమునలన జ్ఞానహీనుండుకాఁడు. అతఁడు శాశ్వతుఁడు. కావున నతనిజ్ఞానము మెఱుపువలెనే కాలమువలన నాశనము నొందదు. అతఁడు వికారములు లేనివాఁడు. కావున నతనిజ్ఞానము స్మృతివలెనే యవస్థావిశేషములవలన నాశనమొందదు. అతఁ డితరుల కనుభవింపఁదగినవాఁడు. మఱియుఁ దత్కాలమందుమాత్రమే పర్యవసాయికాఁడు. కావున నతనిజ్ఞానము స్వప్నమువలె స్వయముగా నంతమొందదు. భగవంతుఁడు కర్తవశ్యుండుకాఁడు. కావున జీవునిజ్ఞానమువలె నతనిజ్ఞానము ప్రకృత్యాదులచే నాశనము చెందదు. ఏకాలమందైన, ఏప్రదేశమందైన,ఏయవస్థయందైన,దేనిచేతనైన,భగవంతునిజ్ఞానము నాశనముచెందినచో నట్టిపరమాత్మకవిద్యాసంబంధము కలదని చెప్పవచ్చు. కాని తాదృశజ్ఞానలోపము భగవంతునికి లేనప్పుడవిద్యాసంబంధ మెట్లు కలుగును? భగవంతునికవిద్యాసంబంధమే లభింపనప్పుడు పరిణామాదు లవిద్యాగతములని చెప్పుట యెట్లు? 'ఓయీ! భగవంతుఁడు జీవులందంతరాత్మయై ప్రవేశించి శాసించుచుండును. అట్లు భగవంతుఁ డంతర్యామియై యుండుటం

బట్టి దుఃఖిత్వసంసారిత్వాదులు జీవులకే కాని పరమాత్మకు లేవు' అన్నచోఁ జెప్పెద వినుము. భగవంతుఁడు సమస్తమందు వ్యాపించి యుండుట నిశ్చయము. కాన జాగరస్వప్నాద్యవస్థలందు జీవులు చెందుచున్న దోషములు తదంతర్యామియై యున్న పరమాత్మకుఁగూడ సంభవింపక మానవు. భగవంతుఁడు కర్మవశ్యుఁడు కాఁడు. కాన తాదృశదోషములు సంభవింపవని చెప్పవలను పడదు. కర్మములు దేహసంపాదనమూలకములుగాఁ గ్లేశాదులను గలిగించునా? లేక స్వతంత్రములై క్లేశాదులను గలిగించునా? అవి దేహసంపాదనమూలకములుగానే క్లేశాదుల నిచ్చుచున్నవనియె చెప్పవలయును. అట్లు చెప్పక స్వతంత్రముగానే క్లేశాదులను గలిగించునని చెప్పినచో దేహసంబంధమే నిష్ప్రయోజనము కావలసివచ్చును. కావున భగవంతుఁడు కర్మవశ్యుఁడు కాకపోయినను సర్వక్షేత్రములందు నున్నాఁడనియు, జీవశరీరుఁడనియుఁ జెప్పుటచే దేహసంబంధము కలవాఁడగుట నిశ్చయము. అట్లైనను స్వేచ్ఛచేతనే దేహసంబంధము కలిగించుకొన్నను, తదీయదోషములు కలుగకమానవు. పూయశోణితములలో స్వేచ్ఛచేఁ జొచ్చినను నవి యంటుకొనక మానునా? అట్లే భగవంతుఁడు స్వేచ్ఛచేతనే జీవశరీరములందుఁ జొచ్చినను తదీయదోషములు సంభవించుట నిశ్చయము. అతఁడు కల్యాణగుణములు కలవాఁడయినను దేహసంబంధముండుటంబట్టి దోషములు కలుగకమానవు. జీవుఁడు దేహసంబంధ ముండుటవలననే కదా క్లేశాదులను జెందుచున్నాఁడు? అట్లె జీవశరీరసంబంధ మున్నచోఁ దదీయక్లేశాదులు భగవంతునేల చెందవు? ఓ మైత్రేయా? ఇట్లు నామానస మజ్ఞానసంకటముచే మిగుల బాధింపఁబడుచు

న్నది. కావున నాప్రశ్నముల కుత్తరము లిచ్చి నామానసమును సంబంధించిన దుఃఖంబును దొలంగింపుము' అనియిట్లు విదురుం డడుగ భగవదధీనమగు చిత్తముకలవాఁడయి, తత్త్వదర్శియగుక తంబునస్మయాదులను విడిచి,యున్నమైత్రేయుం డావాక్యంబుల నాకర్ణించి విదురప్రశ్నములు సుపరిహారములగుటంబట్టి మంద హాసము చేయుచు నిట్లనియె. 'ఓయీ! చిన్మాత్రుఁడును నిర్వికా రుఁడును, నిర్గుణుఁడు నగుభగవంతునికి లీలచేతనైనను గుణసం బంధమును, బరిణామాదులును నెట్లుసంభవించుననియు, లీలచే నొకవేళఁగలిగినను, గుణపరిణామ ప్రయుక్తములగు దోషములు భగవంతుని నేల పొందవనియు నడిగితివి. సత్యమే. భగవంతుఁడు వివిధవిచిత్రానంతశక్తులు కలవాఁడు. కావున నతఁడు నిర్గుణుఁడు ను, నిర్వికారుఁడునైనను లీలచేతను చేతనాచేతనసంబంధము కలు గవచ్చును. అట్లు కలిగినను నాచేతనాచేతనప్రయుక్తము లగు దో షములు భగవంతునిఁ జెందవు. ఈశ్వరునికిఁ గృపణత్వము, ము క్తునికి బంధనము విరోధించి దోషము గలిగించునా? అట్లె భగ వంతునియాశ్చర్యశక్తి చిజ్జడసంబంధ మతనికిఁ గలిగించియుఁ జిజ్జడములందున్నదోషము లతనిఁ బొరయకుండునట్లు చేయఁగల దు. కాన విరోధము లేదు. కావున నతనికి జగత్కర్తృత్వాదు లంగీకరించుటవలన దోషము లేదు. మఱియుఁ బ్రకృతిపురుషవిశి ష్టుఁడయినభగవంతునే కారణముగా నంగీకరించుటవలన,నల్లని తంతువులచేతను, దెల్లనితంతువులచేతను, రక్తతంతువులచేతను, నేసినవస్త్రమునం దాకృష్ణత్వ, శ్వేతత్వ,రక్తత్వము లాయాతంతు వులసంయోగ మున్నచోటనే కానవచ్చుచున్నట్లును, శరీరధర్మము

లగుబాల్యయౌవనాదు లాత్మనుబొందక శరీరమునుమాత్రమే చెందుచున్నట్లును, ప్రకృతిపురుషధర్మములు ప్రకృతిపురుషులను మాత్రమే చెందునుగాని పరమాత్మను జెందవు. కావున సర్వక్షేత్రములం దంతర్యామియై యున్నను భగవంతునికి క్షేత్రగత దోషములు కలుగవు. 'ఓయీ! అపురుషార్థముల కాశ్రయమయిన దేహాదిసంబంధము భగవంతునికిఁ గలిగినను,తత్ప్రయుక్తము లగుదోషములు పొందవని చెప్పితివి. అట్లె జీవునికిఁగూడ నపురుషార్థముల కాశ్రయమయిన దేహాదిసంబంధమున్నను దత్ప్రయుక్తదోషము లతనిఁజెందవని యేలచెప్పఁగూడదు?' అన్నచో చెప్పెద. విను. జీవుఁడు భగవంతునివలె నపహతపాప్మత్వాదులు గలవాఁడయినను దత్స్వరూప మవిద్యాదులచేఁ దిరోహిత మగుచుండును. అందువలన స్వస్వరూపజ్ఞానములేక దేహమును దన్నుఁగాఁ దలంచుకొనుచుండును. మఱియుఁ గర్మవశ్యుఁడయిన జీవునికి నాత్మస్వరూపనుమాత్రమే పురుషార్థభూతముకాని యీ యాత్మయం దారోపించుకొనుచున్న దేవమనుష్యత్వాదులును, దత్ప్రయుక్తములగు శిరశ్ఛేదనాదికమును, బురుషార్థములుకాక వ్యర్థాభూతము లగును. అట్లు స్వశరీరభూతులగు దేవమనుష్యాదులశిరంబు ఛిన్నంబగుచున్నను, నాశిరంబు ఛిన్నంబయినదనెడిశోకమును జీవుఁడు దేహమేయాత్మస్వరూపమనెడి భ్రాంతిచేఁ దా ననుభవించుచున్నాఁడు. జీవునికి నట్టిభ్రాంతి కలిగించెడిదియు నా భగవన్మాయయే యని నమ్ముము. ఇందుల కొకదృష్టాంతమును జెప్పెద.విను.చంద్రుండు జలంబులం బ్రతిఫలించును గాని వాస్తవముగా నచ్చట లేఁడు. అట్లయినను జలోపాధియందుండుకంపాదికము నిజచంద్రునందున్నట్లు ప్రతీయమాన

మగును. చంద్రునందు లేనికంపాదికమును జలోపాధిని బట్టి చంద్రున కున్నట్లు తెలియవచ్చుచున్నవిధముగానె *దేహసంబంధములగు శిరశ్ఛేదనాదిక మాత్మకు లేకపోయినను దేహోపాధినిబట్టి యతనికున్నట్లు తోఁచుచుండును. కాని వాస్తవముగా నాత్మకట్టి దోషములు లేవు. ప్రాకృతదేహముతో వర్తించుచున్న జీవునికి దేహగతధర్మము లున్న వనుట భ్రాంతిమూలక మగునట్లె, ప్రకృతిపురుషశరీరుఁడగు భగవంతునికి నాప్రకృతిపురుషగతధర్మములు సంభవించుననుటయు భ్రాంతిమూలకమె. ఇట్లు భగవంతుఁడు జీవాంతరాత్మయై యున్నను

---

* ఇచ్చటియభిప్రాయ మే మనఁగా? జీవుఁడు కర్మవశ్యుఁడు. అతనికి ననాదియగు నవిద్యతో సంబంధముకలదు. అందువలన స్వస్వరూపాప్రతీతిరూపమగు దేహాత్మభ్రాంతి గలుగుచుండు. ఆభ్రాంతిచేత నే శోకమోహాదులఁ జెందుచుండును. కాని వాస్తవముగా నతనికట్టివి లేవు. భగవంతుఁ డవిద్యచేఁ విమోహితుండు కాఁడు. కాన నతనికి స్వస్వరూపజ్ఞానము కలదు. తాదృశజ్ఞానము గలవాఁ డగుటచేఁ బ్రకృతిపురుషులను దన కధీనులఁగాఁ జేసికొని వర్తించుచు, నవిద్యాసంబంధమునుగాని తత్కార్యసంబంధమునుగాని పొందక వర్తించుచుండును. ఇందులకుఁ బ్రమాణము. "భుక్తభోగా పరిత్యక్తా దృష్టదోషాచ నిత్యశః । నేశ్వరస్యా శుభంధత్తే స్వమహిమ్నిస్థితస్యచ" అని తెలియఁదగినది. ఇట ముఖ్యాంశమేమన జీవేశ్వరు లుభయులకుఁ బ్రకృతిసంబంధముకలదు. కాని ప్రకృతి జీవునిఁ దనవశము కావించుకొని యశుభము నొసంగుచుండును. ఈశ్వరునికి దాను వశమయి యతనికి లీలాసాధన మగుచున్నది. ఇందులకు శ్రు॥ "అస్మాన్మాయీసృజతే విశ్వమేతత్తస్మింశ్చాన్యో మాయయా సన్నిరుద్ధః" అనెడి శ్రుతిప్రమాణము. భగవంతుఁడు మాయేశ్వరుఁడయినట్లు "మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరమ్" అను శాస్త్రమువలనను దెలియవచ్చుచున్నది.

జీవగతధర్మములఁ బొరయకుండుట యనెడి కల్యాణగుణము గలిగియుండుటయే కాక జీవగతములగు దోషములను సైతము ని వర్తింపఁజేయఁగలఁడు. అదియెట్లో చెప్పెద. వినుము. హేయగుణములుగల జీవుఁడు కర్మయోగానుగృహీతమగు భక్తివలన వాసుదేవకృపను సంపాదించి తత్సామర్థ్యంబున హేయగుణంబులనుండి తొలంగుచున్నాఁడు. ఎంతటిభక్తి గలిగియుండినచో హేయగుణనివృత్తి కలుగుననఁగా? ఎప్పుడు శబ్దాదివిషయముల నుండి యింద్రియంబులు మరలి యాశ్రితబంధహారియగు పరమాత్మను బ్రత్యక్షము చేసికోఁగలఁడో యప్పుడే జీవుని హేయగుణములన్నియు నిద్రించినవానికష్టములవలె నశించును. యోజింప నిద్రించినవానికి సుషుప్త్యవస్థయందుఁ గష్టములు నశించినను జాగ్రదవస్థయందు మగుడఁ గష్టముసంప్రాప్తముకావచ్చును. కాని భగవద్దర్శనము చేసికోఁగలిగినంత భక్తిగలవాఁడయి దర్శన మాచరించుకొనినచో నేకాలములందును, నేయవస్థలందును గూడఁ గష్టములఁ బొందఁడు. మహాత్మా! భగవంతునిగుణముల వర్ణించినను, అతనిసత్కథలను వినినను సమస్తకష్టములును నశించునని చెప్పుటకు సుంతేనియు సందియము లేదు. భగవద్గుణముల వర్ణించి సత్కథల విన్నంతమాత్రముననే సమస్తదుఃఖములు నశించుచుండఁగా, నెల్లకాలము భగవంతునిపాదపద్మపరాగము నత్యంతభక్తితో సేవించుచున్న భక్తునికష్టజాలము నశించునని వేఱచెప్పవలయునా?' అని చెప్పుచున్న విదురునిపలుకు లాకర్ణించి మిగుల సంతసించి యతని కిట్లనియె. 'ఓ మహాత్మా! మైత్రేయా! భగవంతుఁ డెట్లు జగత్కారణుఁ డగుచున్నాఁ డనుసందియ మిదివఱకు నను బాధించుచుండె

డిది. కాని యిప్పుడు నీయుచితవాక్కనెడి ఖడ్గముచే నాసందేహవృక్షము సమూలముగా ఖండింపఁబడినది. నీదయవలన నాసందియము నివారించినది.ఇప్పుడు నామనస్సు భగవత్కథాశ్రవణము, దదీయపాదపద్మసేవ యనెడి రెండింటియందు మిగుల నాసక్తమగుచున్నది. "ఓమైత్రేయా! శ్రీహరికి జీవాత్మలును,మాయయును, నివాసభూతమై యుండు నని నీవు చెప్పినవాక్యంబు మిగుల బాగుగనున్నది. దీనివలన భగవంతునికిఁ జిజ్జడవ్యాప్తి కలవని తెలియవచ్చుచున్నది. కాని మొదట శరీరగతములగు ఛేదనాదులాత్మను బొందవని చెప్పుటలో జలచంద్రుని దృష్టాంతముగాఁ జేకొంటివి ఆదృష్టాంతమునందు జలంబుల వాస్తవముగాఁ జంద్రుఁడు లేకపోవుటచే జలగతదోషములు చంద్రుని పొందనట్లు చిజ్జడములందు భగవంతుఁడు వాస్తవముగా లేఁడు కావునఁ జిదచిద్గతములగు దోషములు పొరయవని చెప్పవలయును. ఇట్లు చెప్పినచోఁ జిజ్జడము లతనికి నివాస మగుటెట్లు? మఱియు నీజగంబు తదాత్మకమయి ప్రతీయమానము కాలేదే; కావున నాభగవంతునికిఁ జేతనాచేతనములు వాసస్థానమగుటెట్లు? అని సంశయింపఁ బనిలేదు. జగత్కారణ మయినపరబ్రహ్మము జగదంతర్బహిర్భాగంబుల వెలయుచున్నది. ఇట్లుండ నీ ప్రపంచకము తన్మయత్వము కాదని యూహించుట భ్రాంతిమూలకమని చెప్పవచ్చును. మఱియుఁ జిజ్జడాత్మకమయిన ప్రపంచకమునందు భగవంతుండు విలసిల్లుచుండఁగాఁ జేతనాచేతనము లతనికి వాసస్థానమని చెప్పుటకు సందియ మేమున్నది? జలచంద్రదృష్టాంతమునుబట్టి భగవంతుఁడు చిజ్జడములందు

లేకపోవుటచేఁ దద్గతదోషము కలుగలేదని చెప్పరాదు. దృష్టాంతమందు చంద్రుఁడు వాస్తవముగా లేకపోవుటచేత దోషభాక్కు కాఁడని చెప్పుచున్నను, దార్ష్టాంతికమందట్లు కాక భగవంతుఁడు వాస్తవముగాఁ జిజ్జడములనుండియే తనమహిమచే దోషములఁ దొలఁగించుకొనుచున్నాఁడు. కావున భగవంతునికి నివాసభూతమయిన చిజ్జడరూపప్రపంచకము బ్రహ్మమయము కాదనుట భ్రాంతిరూపమే? మఱియు దేహాదులందాత్మప్రతీతి గూడ భ్రాంతిమూలకమనియే చెప్పవచ్చును. లోకమునందు మూఢతముఁడయిన మానవుఁడును, దనయాత్మను బరమాత్మగాఁ దెలిసికొనినవాఁడును, నీయిరువురు సుఖము ననుభవింతురు. కాని యాత్మస్వరూపము తెలియక, మూఢత్వము లేక, సంశయాస్పదుఁడయిన మానవుఁడు మిగులఁ గ్లేశముల చెందుచుండును. ఓ మునీంద్రా! ఈశరీర మాత్మస్వరూపమయినట్లు ప్రతీయమానమగుచున్నను, నే నిప్పుడు మీపాద సేవవలన దేహ మాత్మస్వరూపముకాదని నిశ్చయించి యీ దేహాత్మప్రతీతిని దొలంగించుకొంటిని. సజ్జనులరయిన మీవంటివారిసేవప్రభావ మేమని చెప్పుదును? అట్టి సజ్జనసేవ చేసినంతమాత్రముననే నిర్వికారుఁడయిన పరమాత్మపాదభక్తి జనించును. తాపత్రయము నివర్తించును. ఎచ్చట బ్రహ్మాదులచే నారాయణుండు గానము చేయఁబడుచున్నాఁడో యావైకుంఠమునకుఁ దపోహీనులయిన మానవులను జేర్చుచున్న సజ్జనసేవ మిగుల దుర్లభమయినదిగదా! సజ్జనసేవవలన నెట్టిహీనునికయిన భగవద్భక్తి జనింపకమానదు. ఓ మునీంద్రా! భగ

వంతుఁడు వ్యష్టిసృష్టికిఁ బూర్వ మింద్రియాదియుతము లగుమహ
దాదులను సృజించి యామహదాదులనుండి జలాండసృష్టిమూ
లకముగా విరాట్పురుషుని సృజించి ప్రవేశించెననియు, నావిరా
ట్పురుషుఁడు సహస్రపాదుఁడై, సహస్రనేత్రుఁడై, సహస్రోరు
వై, సహస్రబాహువై వర్తించుచుండుననియు, నతనియందు
సమస్తలోకములు స్పష్టముగా వెలయుచున్నవనియు, బ్రాణా
పానాదు లనునామములచేఁ బదివిధములై శబ్దాదివిషయముల
తోను, జ్ఞానకర్మేంద్రియములతోను, గూడినదై, త్రిగుణాత్మక
మగు ప్రాణమాయై రాజపురుషునియందు వెలయుచున్నదనియు,
నాతనివలననే నీవు చెప్పిన బ్రహ్మాదివర్ణము లుత్పన్నము
లైనవనియు, బ్రహ్మాండమందుఁ బ్రజలు నానావిధదేహులై
పుత్రపౌత్రాది సంయుతులై యంతట వ్యాపించి వెలయుచు

విదురుఁడు మైత్రేయుని నానావిధప్రశ్నము లడుగుట.

న్నారనియుఁ, జెప్పితివి. ఇప్పుడా వైరాజునివిభూతులను, బ్ర
హ్మాండ మెట్లు ప్రజలచే వ్యాప్తమయినదో యదియుఁ, జక్కఁగ
వివరించి చెప్పుము. మరీచ్యాదుల కధిపతియైన పరబ్రహ్మము
ప్రజాపతులనెట్లు సృజించెను? మఱియు ననేకప్రపంచము నెట్లు
సృజించెను? చతుర్ముఖసృష్టితరువాత సృష్టి యెట్లు వ్యాపించినది?
ఆప్రకారమంతయుఁ జక్కఁగ వర్ణింపుము. మఱియు స్వాయం
భువాదిమనువులను గుఱించియు, మన్వంతరములను గుఱించి
యు, మనుమన్వంతరాధిపతుల వంశములను గుఱించియు, వం
శానుచరితములను గుఱించియు, భూమికి నుపరిభాగమందు
నధోభాగమునందు వెలయుచున్నలోకములను గుఱించియు, ఆ
యాలోకముల స్థితినిగుఱించియు, వానిపరిమాణములను భు

లోకపరిణామమును,వివరించి చెప్పుము. మఱియు, పశుపక్ష్యాదుల యు, జీవమనుష్యాదులయు,జరాయుజములయు, స్వేదజాండజము లయు, నుద్భిజ్జములయు, సృష్టివికల్పమునుగుఱించి వర్ణింపుము. రజస్తమోగుణప్రధానము లయి భగవంతుని యంశావతార ము లనఁదగు బ్రహ్మాదులచే లోకవ్యాపారములను జేయించు చున్న సృష్టిస్థితిలయముల కాధారము గు విష్ణుమూర్తి యుదార విక్రమమును వర్ణించి చెప్పుము. మఱియు బ్రాహ్మణాదివర్ణముల యు బ్రహ్మచర్యాద్యాశ్రమములయు విభాగములను, వాని వానిలింగములను, నాచారములను, స్వభావములను, మహాము నుల వ్యాపారములను, జన్మములను, వేదముల విభాగమును, జక్కఁగ వర్ణించిచెప్పుము. మఱియు యాగాదులమార్గములను, యోగముల మహిమలను, ప్రవృత్తిధర్మములను విడిపించు సాం ఖ్యయోగమార్గములను, విస్తరించి చెప్పుము. వేదబాహ్యులైన పాషండుల ప్రవృత్తులను, జీవులకు సత్త్వాదిగుణాతిశయమువలనఁ గలిగెడి గతులను, ఫలములను, వర్ణింపుము. మఱియుఁ బరస్పర విరోధము లేకుండ ధర్మార్థకామమోక్షముల సాధింపఁదగిన యుపా యము లెయ్యవి?భూపాలకులనీతివార్త లెట్టివి?దండనీతివిధ మెట్టిది? శ్రుతివిహితము లయినసంధ్యావందనాది నిత్యకర్మముల విధా నము లెట్టివి ? శ్రాద్ధాదికర్మములవిధానము లెట్టివి ? మఱియు సూర్యాదిగ్రహములయు, నశ్విన్యాది నక్షత్రములయుఁ, దదితర నక్షత్రములయు గతు లెట్టివి ? ఆగ్రహనక్షత్రాదుల కాలనియ మ మెంత? తపోదానాదులు, వాని నాచరించుటవలనఁ గలిగినఫ లములునెట్టివి? శ్రౌతస్మార్తాది కర్మములఫలము లెట్టివి? పరదేశ ములయందున్న వాఁ డవశ్యముచేయవలసినధర్మ మేమి ? ఆపద

లందుఁ బురుషు లాచరింపవలసినధర్మ మెట్టిది? ధర్మప్రవర్తకుఁ డయినజనార్దనుఁ డెటువంటి ధర్మముచేత సంతోషించును? ఎట్టికర్మము లాచరించినచో భగవంతుం డనుగ్రహించును? దీని నిశ్చార్చి సవిస్తరముగాఁ దెలియఁజేయుము. మఱియు దీనవత్సలులైన గురువులు తమ్ము సేవించుచున్న శిష్యులకుఁ దమపుత్త్రులకుం బోలె నడుగనిరహస్యములనుగూడఁ జెప్పుదు రని వినియున్నాను. కాన నాకుఁ జెప్పుము. పృథివ్యాదితత్త్వముల ప్రళయ మెన్నివిధములు? అట్టి ప్రళయకాలములయందుఁ బరమాత్మ నెవ్వ రుపాసింతురు? ఆప్రళయములయం దెవ్వ రుపసంహరింపఁబడుదురు? జీవస్వరూపమును బ్రహ్మస్వరూపమును దెలియఁజేసెడిదియు, శాస్త్రజన్యమయినదియు, నగుజ్ఞాన మెట్టిది? గురుశిష్యులకుఁ బ్రయోజనభూతమయిన జ్ఞానమెట్టిది? అట్టి జ్ఞానమును సంపాదించుటకుఁ బండితులు నుడివినసాధనము లెయ్యవి? గురూపదేశము లేకుండఁ బురుషునకు జ్ఞాన మెట్లు సంభవించును? అందువలన భక్తి యెట్లుకలుగును? ఆభక్తివలన వైరాగ్య మెట్లుకలుగును? ఓ మైత్రేయా! భగవంతుని విచేష్టితములను లీలలను దెలిసికొనఁ దలంపు గొనియున్న నాప్రశ్నముల కన్నింటికిఁ దగినట్లు ప్రత్యుత్తరము లొసంగి నన్ను సంతోషపెట్టుము. ఓమహాత్మా! నే నొకగ్రుడ్డివానివలె వర్తించుచున్నాను. నాకు వాని నన్నిటిని దెలియఁజేసి జ్ఞానము కలిగించి మాయాతిశయముచేత నష్టమయిన నాకన్నులఁ దెఱవుము. సర్వవేదములు, యాగములు, తపోదానములు, నీ మొదలగునవి యన్నియు, జీవాత్మలకు సంసారనివృత్తి కలిగించుధర్మమును సుంతేనియుఁ జేయఁజాలవు' అని యిట్లు పలుకుచున్నవిదురునిఁ జూచి మైత్రేయుండు మిగుల సంత

సించి భగవత్కథలయందుఁ బ్రేరితుఁడయి యున్నందులకు మఱిం
త సంతసము కలవాఁడయి యతని కిట్లు చెప్పెనని చెప్పి శుకుం
డు వెండియుఁ బరీక్షిత్తున కిట్లనియె. ఇది యేడవయధ్యాయము.



ఓ మహారాజా! మైత్రేయుండు విదురునిఁజూచి యిట్లనియె.
ఓ విదురా! మహనీయా! పూరువంశము లోకములోనిమాన
వుల కెల్లరకు నుతింపఁదగినది కదా? లోకపాలాంశసంభూతుఁడ
వయిన నీవు పూరువంశమునందు జన్మించినవాఁడవయి కులమున
కు వన్నె దెచ్చితివి. నీవు భగవద్భక్తియే ప్రధానముగాఁ గలవాఁ
డవు. నీవంటియోగ్యుఁడు మఱియొకఁ డుండఁడు. ఆపరమపురు
షునికీర్తిని నీవు మాటిమాటికి నూత్నమయినదానిఁగాఁ జేయు
చున్నావు. నీప్రశ్నములకు మిగుల సంతసించితిని. లోకమందలి
మానవులు స్వల్పమయిన సంసారసుఖము ననుభవించుటకుఁ
బూనికొని సంసారకూపమునఁబడి గొప్పదుఃఖములను సంపా
దించుకొనుచుందురు. అట్టిదుఃఖములను దొలంగించుటకు భాగవ
తముకంటె మించినసాధనము మఱియొకటిలేదు. ఆభాగవతము
భగవద్గుణకథల కాకరము. సమస్తవేదార్థము లందు నిమిడియున్న
వి. అట్టిభాగవతమును నీకుఁ దెలియఁజెప్పెద వినుము.*ఆభాగవత
మును బూర్వము వాసుదేవాఖ్యచే నొప్పునసంకర్షణుండు సనకాది

* భాగవతము రెండువిధములని భాగవతసంప్రదాయవేత్తలు చెప్పుచున్నా
రు. వానిలో నొకదాని భగవంతుఁడు బ్రహ్మకు, బ్రహ్మ నారదునకు, నారదుఁడు
వ్యాసునికిఁ జెప్పెను. అంతే వ్యాసుఁడు దానిని విస్తరించి తనకుమారుఁడగు శు
కునిచేఁ జదివించెను. ఆశుకుఁడు పరీక్షిన్మహారాజునకుఁ దెలిపెననియు నది పదు
నెనిమిదివేలశ్లోకముల పరిమాణము కలదనియుఁ జెప్పుచున్నారు. ఇది మొదటి

మహర్షులకుఁ జెప్పెను. కావున దీనికి సాంకర్షణభాగవతమని పేరు కలిగినది. పూర్వము పాతాళలోకమునం దుపవిష్టుఁడును, భగవంతుఁడును, నాదిపురుషుఁడును, రజస్తమోపహ్రుతముకాని సత్వముకలవాఁడు, నగుసంకర్షణుని సనకసనందనాదిమునులు నల్వురును సమీపించి చేతనాచేతనాత్మకమయిన ప్రపంచకమునకు విలక్షణుఁడయినపరమాత్మతత్త్వమును దెలిసికొనఁ దలంపు కలవారలయి నమస్కరించిరి.ఆసంకర్షణుండు వాసుదేవుఁడని చెప్పుదురు. అతఁడు స్వావాసమునకుఁ గారణభూతుఁ డగుభగవంతుని సర్వోత్కర్షము చేఁ బూజించుచుండె.అతఁ డాత్మాభిముఖ్యమునిమిత్తము నేత్రముల నిమీలించియుఁ బండితులయభ్యుదయమునిమిత్తము కొంచెమునీలనము చేయుచుండెను.ఆమహాత్మునికుమారికలు తమ కనురూపులగు భర్తలను గోరుచు నతని నానావిధోపహారముల చేతఁ బ్రేమసహితలై పూజించుచుండిరి. అప్పుడు భాగవతశ్రవణార్థము సత్యలోకమునుండి సదా గంగామధ్యమువలననే పాతాళమున కవతరించుటం జేసి తదీయజలంబులచే నార్ద్రములగు జటాకలాపములుగల సనకాదిమునీంద్రులు భగవచ్చేష్టాభిజ్ఞులై ప్రేమాతిశయముచేఁ దొట్రుపడుచున్నమాటలచే మాటిమాటికి గానముచేయుచు, సహస్రకిరీటములందు విలసిల్లురత్నశ్రేష్ఠముల

---

విధము. రెండవవిధ మెట్లనఁగా సంకర్షణుఁడు సనకాదులకు,సనకాదులు సాంఖ్యాయనునకు, నతఁడు పరాశరునకుఁ, బరాశరుఁడు మైత్రేయునకుఁ గ్రమంబునఁ జెప్పిరనియు దానిని మైత్రేయుండు విస్తరించి విదురున కుపదేశించెననియు నది రెండుస్కంధము లాయెననియుఁ జెప్పుదురు. ఆరెంఁడింటిని దనగ్రంథమందుఁ గలిపి వ్యాసుఁడు ద్వాదశస్కంధాత్మకమగు పురాణమును రచించె నని చెప్పుదురు.

చేఁ బ్రకాశించుచున్న సహస్రఫణములుగల సంకర్షణుని పాదపీఠము నకు నమస్కరించుచు భాగవత ముపదేశింపఁ బ్రార్థించిరి. అంత భగవత్తముఁడగు సంకర్షణుఁడు మోక్షధర్మములం దాసక్తిగల సనకాదులకుఁ దెలియఁజేసెను. అంత సనత్కుమారుఁడు శుశ్రూషారతుఁడై తన్నడుగుచున్న సాంఖ్యాయనున కుపదేశించెను. ఆ సాంఖ్యాయనుఁడు భగవద్విభూతులను జెప్పఁదలఁచి యందులకై తనయొద్దికే తెంచినపరాశరున కెఱిఁగించెను. ఆపరాశరుఁడు బూర్వము పులస్త్యునివలనఁ బురాణసంహితాకర్త యగునట్లు వర ముపడసె. అట్టిపరాశరుండు దయాళుఁడై నాకుఁజెప్పె. ఓవిదురా! ఆభాగవతమును శ్రద్ధాళుఁడవగు నీకుఁజెప్పెదను వినుము. ఎప్పుడు భగవంతుఁడు తాత్కాలికజగద్వ్యాపారమునుండి విరమించి యోగనిద్ర నవలంబింపఁ దలంపుగొన్నవాఁడయి, శేషశయ్యపయి శయనించి యసహాయుఁడయి, స్వానుభవసుఖమునందుఁ బూర్ణుండయి, నిష్క్రియుండయి, కన్నుల మొగిడ్చి యుండునో యప్పుడు చేతనాచేతనరూపమయిన యీ ప్రపంచమంతయు జలావరణ చేఁ గప్పఁబడియున్నది. దారువులయం దగ్ని, రుద్ధవీర్యుండయి విలీనమయియున్నమాడ్కి భగవంతుండు బహిర్వ్యాపారశూన్యుఁడయి యుదకమందు నివసించియున్నవాఁడయి తనయందుంచిన సమస్త చరాచరములను సృజింపఁదలంపుగలవాఁడయి, కాలశక్తిని బ్రేరణచేయుచు సలిలమందు నివసించె ఇట్లు సహస్రయుగములకాలము నిద్రించుచుఁ, గావుననే యసంపాదితలోకరచనగలవాఁడై కాలశక్తిచే, భగవంతుఁడు పూర్వము తనయందుంచినలోకకారణభూతములయిన భూతసూక్ష్మముల నవలోకించెను. ఇట్లు నారాయణుండు తనయం దున్నసూక్ష్మములయందుఁ దనదృ

ష్టి నిగిడించినప్పుడా సూక్ష్మవర్గము కాలానుగతమయి వికసించిన రజోగుణముచేత స్పృశింపఁబడినదయి పద్మరూపముగాఁ బరిణతమై భగవంతుని నాభీకుహరమువలన నిర్గమించెను. ఇట్లు పరమాత్మసృష్టమయి, లోకరూపమయిన యప్పద్మకోశము తన కాంతులచే విశాలమయినజలావరణమును సూర్యునివలెఁ బ్రకాశింపఁజేయుచు, జీవాదృష్టబోధకమయినకాలముచే ద్వారగా నుద్గమింప నాలోకపద్మమును నాభిసరసిజమందు స్థాపించెను. అంతనప్పద్మమునుండి వేదమయుఁడు స్వయంభువునైన బ్రహ్మ యుద్భవించెను. ఇట్లు బ్రహ్మ యుదయించి యాపద్మకర్ణికయందున్నవాఁడై ప్రపంచమును గానక యాకసముదిక్కు తననేత్రములనుఁ బ్రసరింపఁజేసి యేమియుఁగానలేక యాకమలమధ్యమందు నాల్గుదిక్కులం బరిభ్రమించుచుండ నతనికి నాల్గుముఖములుకలిగెను. పిమ్మటఁ జతుర్ముఖుండు ప్రళయాంతమందలివాయువుచే ఘూర్ణిలుచున్న యుదకమం దావిర్భవించినకమలము నాశ్రయించి యాపద్మ మేమియో, తా నెవఁడో నిశ్చయముగాఁ దెలిసికోలేక యిట్లు చింతింప నారంభించె. "అయారే! ఈకమలకర్ణికయందు వర్తించుచున్న నే నెవండను? ఈయుదకములం దీయబ్జ ముత్పన్నమగుటకుఁ గారణంబేమి? ఈపద్మ మధిష్ఠానమం దధిష్ఠితమైయున్నది ఆయధిష్ఠాన మేదియో తెలియరాదు. అధిష్ఠానము లేకుండ నధిష్ఠేయ ముండదు. కావున నధిష్ఠానభూతమగు వస్తువేదియయి నఁ గ్రిందిభాగంబున నుండవచ్చు." అనియిట్లు బ్రహ్మ యూహించి యాలోకపద్మనాళరంధ్రములలో నుండిపోయి యంతర్గతజలములఁ బ్రవేశించెను. అట్లు ప్రవేశించి బ్రహ్మ యాపద్మమున కధిష్ఠానమగు వస్తువును వెదకియుఁ దదధిష్ఠానమును బొందలేక పోయెను.

ఓవిదురా! తమంబువలెనే దర్శనప్రతిబంధకమగు నాజలమం దుఁ దనకుఁ గారణభూతమగు వస్తువును వెదకుచున్న బ్రహ్మకు న్యూనదివసము, అధికదివసము, సమదివసము నాఁబడు నేమిత్రయముతోఁగూడినదీర్ఘ కాలము (శతసంవత్సరములు) తిక్రమించెను, ఆత్రినేమియే, భగవంతునికి సుదర్శనరూపమయి దేహధారులకుఁ భయము గలిగించుచు నాయువును క్షీణింపఁజేయుచున్నది. ఓయీ! బ్రహ్మ యాపద్మనాళమును గానలేక విసివి యచ్చటినుండి బయలువెడలి వచ్చి కర్ణికను బొంది మెల్లగా వాయువులను బంధించి, చిత్తమును విషయములనుండి మఱలించి సమాధియోగము నవలంబించి యుండెను. ఇట్లు బ్రహ్మ శతవత్సరంబులకాలము సమాధియం దుండునప్పటి కతనికి దివ్యజ్ఞానము పొడమెను. అంతట బ్రహ్మ పూర్వము జలంబుల వెదకియు నెవ్వనిఁ జూడలేకపోయెనో వాని నాజ్ఞానాతిశయముచేతఁ దనహృదయమందే కనుఁగొనెను. ఆపరమపురుషుఁడు మృణాళమువలె ధవళకాంతులనీనుచు, ఫణము లనునాతపత్రములచే నాయతములగు మూర్ధములందు వెలయుకిరీటరత్నముల కాంతిసంతానములచే నంధకారముల నడఁగించుచు యుగాంతజలమందున్న యనంతశయ్యపై శయనించి యుండెను. మఱియు నప్పురుషుండు తాఁ దాల్చియున్న పీతాంబరము సాయంకాలాంబుదంబు చందంబున వెలయుచుండ, నతనికనకకిరీటంబు కాంచనశిఖరంబు కరణి విలసిల్ల, నతఁడు దాల్చిన ముక్తాహారంబులు కొండకాల్వలై వఱల,నురంబునఁ బ్రకాశించుతులసీమాలలు దివ్యౌషధంబులగతిఁ దనరార, భుజములు బొంగు వెదుళ్లను విడంబింపఁ,బాదములు పాదపములవడువునఁ జెలంగ, మరకతాచలంబువలె రంగారు

చుండెను. మఱియు నమ్మహాత్ముండు దీర్ఘమై, విరివిగలిగి, కావున నే లోకత్రయసంగ్రాహకమై, చిత్రములు దివ్యములు నగునలంకారాంబరంబులచే శోభను సంపాదించి,యున్న దివ్య దేహముతో వెలయుచుండెను. ఆపుణ్యపురుషుండు వివిధములగు తమమనోరథంబులఁ దీర్చికొన వర్ణాశ్రమాదిధర్మములచే భజించుచున్న భక్తులకుఁ, గామధేనువువంటి దని చెప్పుటకుఁ దగిన పాదపద్మములతో వెలయుచుండెను. ఆపాదపద్మములు నఖచంద్రులకాంతిసంతానములచే వ్యాప్తములైన వ్రేళ్లనెడిపత్రములచే నొప్పుచుండెను. అమ్మహానుభావునిముఖపద్మము, భక్తజనులయార్తి దొలఁగించుమందహాసముచే సుందరమై, ప్రకాశించుచుపసిండికుండలములచే నలంకృతమై, యధరబింబకాంతులచే శోణాయితమై, సుందర మగునాసిక చేతను, భ్రూయుగ్మము చేతను, బ్రేక్షణీయంబై, యుపాసకుల సన్మానించుచున్నట్లుండెను. కదంబపుష్పకింజల్కములవంటిపచ్చనిపట్టువస్త్రము మేఖలయు నితంబమందు సొంపారుచుండెను. అమూల్యములగు సుందరభూషణములచేతను, శ్రీవత్సముచేతను, వక్షస్థలము ప్రకాశించుచుండెను. ఆపురుషుండు, విలువలేని భుజకీర్తులచేతను, రత్నశ్రేష్ఠములచేతను వ్యాప్తములగు బాహాదండములు, పన్నగరాజములచేఁ బరివేష్టితములగు స్కంధములవలెఁ దనరార, నవ్యక్తమగు మొదటిభాగము గలచందనవృక్షము చందంబున వెలయుచుండెను. మఱియు నాభగవంతుఁడు చరాచరములకు నిలయమై, సర్వశ్రేష్ఠమునకు బంధువై, జలముచే నావరింపఁబడి, సహస్రకిరీటములు హిరణ్యశృంగములవలె నొప్పారుచుండఁ,బర్వత శ్రేష్ఠమువలెఁ బ్రకాశించుచుండెను. ఆతనికంఠభాగము, వేదము లనెడిమధుకరములచే

వ్యాప్తమయి, స్వకీర్తిప్రచురమై, విలసిల్లువనమాలచే నలంకృతమైయుండెను. మఱియు నతఁడు సూర్యచంద్రాదులవ్యాపారములచేఁ దెలియఁబడకయుండెను. అతఁడు, ముల్లోకములందు స్ఫూర్తిగలవై, తద్రక్షణార్థము పరిక్రమించుచున్న చక్రాదిసాధనములచే దుష్ప్రాపుఁడై యుండెను. అట్టిభగవంతునిఁ జూచినప్పుడే లోకముల సృజింపఁ దగినజ్ఞానము గలిగియు, సృష్టిప్రపంచమునకుఁ గర్తయగుబ్రహ్మ, భగవంతుని నాభిసరోజమును, ప్రళయకాలవాయువును, ప్రళయకాలజలమును, దన్ను, నాకాశమునుదప్పఁ, దక్కినసృష్టిప్రకారాదికమును జూడలేదు. ఇట్లుబ్రహ్మ రజోగుణయుక్తుఁడై, కావుననే ప్రజలసృజింపఁ దలంపుగొని నాభిసరోజాదిపంచకముమాత్రమునే చూచినందున సృష్టిప్రకారమును దెలిసికోలేక, తాదృశసృష్టిప్రకారమును జూచి సృష్టిచేయఁ బ్రయత్నించి దానిం గనుఁగొనుటకై పరమపురుషునియందు మనంబుఁ జేర్చి జగత్కారణుఁడైన భగవంతుని స్తోత్రముచేయ నారంభించెను. ఇది యెనిమిదవయధ్యాయము.

---

## బ్రహ్మ భగవంతుని నుతించుట.

ఓ భగవంతా! మిక్కిలి చిరకాలమునుండి సంపాదించుచున్నతపంబులపెంపుగల నాచేత నిప్పుడు తెలియఁబడితివి. షడ్గుణపరిపూర్ణుఁడ వగునీస్వరూపమును దెలియకుండుట దేహభాక్కుల పెద్దదోషమై యున్నది. ఓదేవా! నీకంటె వ్యతిరిక్తమగు పదార్థము లేదు. కాన నీస్వరూపజ్ఞానంబు గలిగినచో సమస్తము తెలియఁబడును. నీస్వరూపజ్ఞానం బున్నవానికి జ్ఞాతవ్యమగు వస్తువే లేదు. అందువలన నన్నివిధములచేతను నీస్వరూపజ్ఞాన

మే సంపాదింపవలసినది. అజ్ఞానమే మృత్యువును దరించువానికి సాధన మగుచున్నది. ఓయీ! దేవమనుష్యాదులు స్వతంత్రులై యుండఁగా నీకంటె వ్యతిరిక్తమగు స్వతంత్రవస్తువు లేదని యెట్లు చెప్పఁగలవు? అందువేని చెప్పెద విను. దేవాదులు స్వతంత్రులై యున్నారనుట భ్రాంతియేకాని వేఱుకాదు. అట్లయిన నానాత్వ మెట్లు కలుగుచున్నదని యడుగవచ్చు. *మాయాగుణములగు సత్వరజస్తమోగుణముల వైషమ్యమువలన నీవొక్కడవే బహుప్రకారంబులఁ బ్రకాశించుచున్నావు. ఇట్టి నీస్వరూపము గనుఁగొనుట ముక్తిసాధన మగుచున్నది. ఇట్లె నీయవతార రహస్యజ్ఞానముకూడ మోక్షసాధనమనుటకు సందియము లేదు. దేవా! † నీవు, నిరుపాధికమై, నిత్యావిర్భావము గలిగి, యపరిచ్ఛిన్నానందరూపమై యున్న జ్ఞానము కలవాఁడవు. నీయజ్ఞాన

---

* భగవంతునికిఁ జిదచిత్తులు శరీరభూతమై యుండును గాన నతఁడు స్వశరీర ప్రకృతిపురుషమూలకముగాఁ, దన కనేకక్రీడాసాధనంబుల సంపాదింపఁదలంచి ప్రకృతిపురుషసమష్టిపరంపరచే మహాభూతములపర్యంతము గలయాయా శరీరములుగాఁ దానే పరిణమించి తన్మయుఁడై పిమ్మటఁ జిదచిన్మిశ్రమై దేవాది స్థావరాంతమగు జగంబుగా నగుచున్నాఁడు. ఇట్లు పరబ్రహ్మము జగన్మూర్తిగముగాఁ బరిణమించినను, దత్ప్రకారభూతమగు ప్రకృతియందున్న వికారములన్నియుఁ క్షేత్రజ్ఞునికిఁ గలుగుచున్న క్లేశాదులన్నియు భగవంతునిఁ జెందవు. ఆభగవంతుఁడు నిరస్తసకలదోషుఁడై యపరిచ్ఛిన్న జ్ఞానానందస్వరూపుఁడయి యుండునని తెలియఁదగినది.

† ఇందులకు మూలము "అవబోధరసోదయస్య" శశ్వన్నివృత్తతమసః" అనియున్నది. ఈవిశేషణద్వయమువలనఁ ద్రివిధము లగుచేతనములకు నచేతనములకు వ్యావృత్తి గలిగినది. ఎట్లన "అవబోధరసోదయస్య" జ్ఞానరసావిర్భావముగలవాఁడు భగవంతుఁ డనుటచే జ్ఞానరసములేనియచిత్తునకు వ్యావృత్తి

మెప్పుడును నివృత్తమె యే యుండును.ఏతాదృశస్వరూపము గల నీదివ్యమంగళవిగ్రహము, నూఱులసంఖ్యగల యవతారంబులకు మూలభూతము. సకలావతారబీజము వగునీనాభీకమలమునుండి భవదావేశావతారము నగునే నుదయించితి. ఈ నా రూపము సర్గాదియందు సాధుపరిత్రాణమునిమిత్తము చేకొనఁబడినది.అంతియకాని జీవునివలెఁ గర్మాధీనుఁడవయి సుఖదుఃఖంబుల ననుభవింపఁగాదు. సర్వోత్కృష్టుఁడవగు నోభగవంతా! ఆనందమాత్రమై, జాతిగుణరహితమై, యప్రతిహతమగు సంకల్పరూపజ్ఞానము గలిగి, ప్రపంచకముకంటె విలక్షణమై, విశ్వకారణమై, యప్రాకృతభూతేంద్రియాత్మకమైన రూపముగలిగియున్న నీస్వరూపముకంటె విలక్షణమగు దానిఁ గానను. ఓపరమాత్మా! అట్టి నీస్వరూపమునే శరణుచొచ్చుచున్నాను. ఓవిశ్వమంగళప్రదా! భవదుపాసకులమగు మావంటివారికి ధ్యానగమ్యుండవగుదువుగాని యసత్ప్రసంగములఁ జేయుచుఁ, గావున నే నరకభాక్కులగు దేహులకు దర్శన మొసంగవు. అట్టి స్వరూపస్వభావములు గలిగి పూర్ణషాడ్గుణ్యమూర్తివయి యొప్పునీకు వందనంబు లాచరించుచున్నాను. మఱియు నెవరు వేదంబు లను మహావాయువుచేఁ దేఁబడిన నీపాదపద్మగంధము ననుభవింతురో

---

కలిగినది.“శశ్వన్నివృత్తతమసః” సర్వదా యజ్ఞాననివృత్తి గలవాఁడనుట చే సర్వదా యజ్ఞాననివృత్తి లేదుగాన చేతనములకు వ్యావృత్తి గలిగినది.బద్ధజీవులకజ్ఞాననివృత్తియే కలుగమిచేతను,ముక్తజీవులకు సంసారదశయం దజ్ఞానముండుటంజేసియు, నిత్యజీవులకు నజ్ఞాననివృత్తిగలుగుట భగవత్సంకల్పాధీన మగుటంజేసి సోపాధికమగుటచేతను, “శశ్వన్నివృత్తతమసః” అనువిశేషణముచేఁ ద్రివిధజీవులకును వ్యావృత్తి గలిగినది.

యట్టిభక్తులహృదయాంబుజంబులనుండి, యవ్యభిచారిణి యగు భక్తిచేఁ బ్రాప్యుండవగు నీవు తొలఁగి చనక వారలకు నిత్యసన్నిహితుఁడవై మెలంగుచుందువు. ఓ దేవ దేవా! లోకంబునందలిమానవులందఱు సంసార మనుకూపంబునఁబడి యత్యంతావివేకులయి ప్రపంచంబునంతను శాశ్వతమయిన దని తలంచుకొని ధనములను, గృహములను, మిత్రులను, దారపుత్రాదులను, నిట్టిమఱికొన్ని సుందరవస్తువులను సంపాదించుచు, వానిలోనొకటి నశించినచో మిగుల దుఃఖంబు నొందుటయు, మఱియు నట్టివస్తువుల సంపాదింప నత్యాశ కలవారగుటయుఁ బలువురచేఁ దిరస్కారంబు నొందుటయుఁ బేరాశయు, దేహాత్మాభిమానము, మొదలగునవన్నియు నీ పాదపద్మసేవ లభించునంతవఱకే చుమీ? అటుపిమ్మట నుంతేనియుఁ గష్టముగలుగ నేరదు. ఒక్కకష్టములే యన నేల? భయంబులు గూడ నివృత్తం బగుచుండును. నిన్నాశ్రయించినవారికి భయంబులన్నియు నశించినతోడనే మోక్షంబుగూడ సంప్రాప్తమగుచుండును. ఓ దేవా! నీభజనంబు సకలపాపనివర్తకము. సకలభయసంహారంబు. మఱియు నీనామస్మరణంబు మోక్షదాయకంబు కదా! ఇట్లమితఫలదాయకంబులయినను నీదర్శనశ్రవణంబులకు విముఖులయి కొందఱు మందభాగ్యులు కామ్యకర్మంబులఁ బెక్కుల నాచరించుచు జ్ఞానహీనులయి యింద్రియములకుఁ బట్టువడి యమంగళంబులకుఁ దావులయి యుందురు. అందువలన వారు వాతపిత్తశ్లేష్మంబు లనెడిధాతువులమూలంబునం జేసి యాకలియు దప్పియుఁ బొరయుచుందురు. పిమ్మట వా రాఁకలిచేతను, దప్పిచేతను, శీతోష్ణములచేతను, వర్షవాతాదిదుఃఖంబులచేతను, తీవ్రంబగు కామాగ్నిచేతను, నెడతెగనిక్రోధంబుచేతను, బా

ధింపఁబడుచుందురు. అట్టిబుద్ధిహీనులను జూచుటచే నాచిత్తంబు కలంగిపోవుచున్నది. ఇట్లు భవదీయంబగు మాయచే మోహితులయి మాయాబలమువలన బాహ్యేంద్రియములకుఁ దోఁచు దేవమనుష్యాదిభేదమును జూచుచున్నంతకాలము దుస్తరమయిన సంసారసముద్రంబును దరింపఁజాలరు. కాని నీ స్వరూపంబు దెలిసికొనినతరువాతఁ గష్టములన్నింటిని బాయుదురు. సంసారసముద్రంబునుగూడ నవలీలఁ దరింపఁ జాలుదురు. ఓ దేవా! నన్నునీంద్రులయినను నీసేవాస్మరణాంబులకు విదూరులయి యితరవిషయములయం దాసక్తులగుదురేని వారు పగటియందు వృథాప్రయత్నులై తిరుగుచు రాత్రియందు నిద్రాసక్తులై కలలయందుఁ గానవచ్చుచున్నబహువిధములగు సంపదల కానందించుచు నెడనెడ సంభవించుచున్నయాపదలకు దుఃఖించుచు విఫలప్రయత్నులగుచుఁ గాలమంతయు వ్యర్థముగాఁ బుచ్చుచు భయంకరమయిన సంసారసాగరంబున నీదులాడుచుందురు. ఓయీశ్వరా! శాస్త్రజ్ఞానోపాసనాత్మకజ్ఞానములె మార్గముగాఁ గలనీవు నిష్కాములయి సర్వకాలములయందు నిన్ను భజించుచున్నభక్తులయోగపరిపూతమయిన హృదయకమలకర్ణికయం దాసీనుండవయి యుందువు ఇదియునుం గాక యోగీశ్వరులు యోగమార్గముల నవలంబించి తమమనంబులందు నీరూపంబు నెట్లుగా భావింతురో వారియందు దయగలవాఁడవయి వారి కట్టిరూపముతోనే గానవచ్చుచుందువు. ఓ దేవా! నీవు సమస్తభూతములందు నంతరాత్మవై యుండి, యాయాభూతములకు శాసకుఁడవై, ధారకుఁడవై, వెలయుచుఁ గావున వానికి సుహృత్తముఁడవై యుండి, యేభూతమునకు ద్రోహము చేసినను దదంతరా

త్మయగు భగవంతునందే పర్యవసన్నమగు నని తలంచి, దేహాదు
నాత్మగా భావించుచున్నవారికి దుర్లభమగు సర్వభూతదయచేత
వర్తించువారికిఁ బ్రసన్నుఁడ వగునట్లు నానావిధోపచారంబులచే
నారాధితుండవయినను బద్ధకాములగు ననుకూలజనులకు మిగులఁ
బ్రసన్నుండవు కావు. కావునఁ బురుషులు యాగాదులగు నానావిధ
శ్రౌతస్మార్తాదికర్మముల చేతను, దానముల చేతను, కృచ్ఛ్రాదితపంబు
లచేతను, వ్రతానుష్ఠానముల చేతను, నిన్నే యారాధింపవలయును.
అట్లు చేసిననే యాసత్క్రియలకుఁ దగిన ప్రయోజనము కలదు. స్వ
ర్గాదిఫలాపేక్షచేఁ గాకుండ నీయం దర్పితమగు యజ్ఞాదిధర్మము
స్వల్పమైనను నది భగవదుపాసనమూలకముగా నిత్యపురుషార్థ
ములకు హేతువై యెప్పటికి నాశనము చెందదు. ఓదేవా! నీ
వెల్లప్పుడు ప్రకృతివివిక్తాత్మకమగు తత్త్వజ్ఞానముచే దేవమను
ష్యాదిభేదమును, దేహాత్మభ్రమరూపమైన మోహమును, దొ
లంగించికొనినయోగివరుల జ్ఞానమునకును, భగవదుపాసనాత్మ
కమగు బుద్ధికిని, విషయభూతుఁడవై, ప్రకృతిపురుషవిలక్షణుండవై,
ప్రపంచకసృష్టిస్థితిలయము లనెడి లీలలందుఁ బ్రీతిగలిగివర్తించు
చు, సర్వనియంతవై యున్ననీకు నమస్కారముం గావించెదను.
ఓదేవా! నీ వవాప్తసమస్తకాముండవు. కాన లీలార్థమైనను జగ
ద్వ్యాపారము సంభవింపకపోయినను, సంసారభయంబునఁ గంపి
తులగువారినను గ్రహింపఁ దలంపుచేతనే జగద్వ్యాపారము స్వీ
కరించుచున్నావు. నీ వవలంబించినయవతారంబులందలి గుణముల
ను, గర్మములను ననుకరించుచున్న నామములగు, ఓదేవకీనందన!
ఓదాశరథీ! ఓసర్వజ్ఞా! ఓభక్తవత్సలా! గోవర్ధనధరా! ఓకంసారా
తీ! ఓరావణాంతకా! యనెడిపదములను బ్రాణావసానసమ

యమందుఁ బరవశులై యుండియు నెవ్వరు పఠించుచున్నారో వా రనేకజన్మములచే సంపాదించినపుణ్యపాపములను బిరానఁ దొలఁగించుకొని యావరణరహితుఁడ వగునిన్నుఁ బొందుచున్నారు. అట్లుండుటకిఁ బ్రాప్యుఁడవయి, కర్మాయత్తము లగునుత్పత్త్యాదులు లేక వర్తించునిన్ను శరణు పొందుచున్నాను. దేవా! మొదట నీ వొక్కఁడవయ్యుఁ, బ్రపంచకసృష్టిలయములకుఁ గర్తలగు బ్రహ్మరుద్రులుగాను, దన్మధ్యవర్తియై స్థితికిఁ గర్తయగు స్వావతారముగాను, మఱి, యాముమ్వురును మూడుస్కంధములయి ప్రకాశింపఁ, బ్రకృతినుండి పరిణమించినదేవతిర్యఙ్మనుష్యాదులు, శాఖలును, నుపశాఖలును, బత్రములును, బుష్పములును, ఫలములును నై విలసిల్లఁ జక్కఁగ వర్ధిల్లి జగద్వృక్షమని యెన్నఁబడు నీకు నమస్కారంబు లొనర్తు. ఓభగవంతా! వేదాదిమూలమున నీ వుపదేశించినట్లు భవదారాధనరూపమును, దమవర్ణాశ్రమములకుఁ దగినదియు, క్షేమంకరంబు నగుకర్మమునందు శ్రద్ధాళువులై యున్నవారిసంసారబాధలను వెంటనే తొలంగించి వైరాగ్యంబును గలిగించుచున్ననీపాదములకు వందనంబు లర్పించుచున్నాను. ఓదేవా! నీవు కాలశరీరకుండవై, యహంకారమమకారాదులచే విషయసుఖసాధనంబులందు నిరతులై భవదారాధనరూపకర్మములందు విముఖులై వర్తించుమానవాధములజీవితాశను ఛేదించుచున్నావు. అట్టి నీకు వందనమ్ము లర్పింతును. మఱియు, సకలలోకులకు వందనీయమై, రెండుపరార్ధములకాలముదనుక నిలిచియుండు సత్యలోకము నధిష్ఠించియున్నను, నేను దన్నియమితకాలానంతరము నాలోకము నశింపక మానదని నిశ్చయించి కాలస్వరూపుఁడ వగునీవలన

భయపడుచుందును. అట్లు భయమునుచెందుచు నిన్నె పొందఁ దలంచుకొని భవదారాధనరూపము లగుయాగంబులఁ బెక్కింటి నొనరించి తపంబు చేయుచున్నాను. అట్లు సమస్తయాగంబులందు నారాధ్యుండ వగునీకు నమస్కార మొనరించుచున్నాను. దేవా! నీవు లోకోపద్రవముల వారించి లోకమర్యాదల నిలుపుటకుఁ బూనికొని, కర్మరహితుఁడవయినను, నాత్మసంకల్పముచే దేవయోనియందు వామనాదిరూపంబున నవతరించి, మానవులయందు రామకృష్ణాదిరూపంబులను దాలిచి, తిర్యక్కులయందు మత్స్యకూర్మవరాహాదిరూపంబుల నొంది, ధర్మసంస్థాపనము చేయుచు నీవు విషయసుఖాభిలాష లేనివాఁడవయినను నాయాయవతారములకుఁ దగినకర్మముల నాచరించి సంతసించుచు వర్తించుచున్నావు. అట్టినీకొఱకు నమస్కారంబులు కావింతును. నీపాదంబులాశ్రయింతును. ప్రళయమునందు మాయాగుణంబునకుఁ జిక్కువడక లోకంబుల నన్నింటిని నీయుదరమందు నిల్పికొనినవాఁడవయి మిగులభయంకరంబుగా నున్నసముద్రమధ్యంబున సర్పరాజతల్పమందు యోగనిద్రను బొందియుండి కొంతకాలంబు చన్నపిమ్మట మేల్కానియుండఁగా నీనాభికమలమువలన లోకత్రయాధిపతి నగునే నుద్భవించితిని. అట్టి పరమకారణుఁడవై, నిద్రాంతమున వికసించుచున్నపద్మంబులఁబోని నేత్రములుగల నీకు వందనంబు లర్పించెదను. ఓదేవా! నీవు సమస్తచరాచరములయందు నంతర్యామివయి, కావుననే హితుండవై, విలసిల్లుచు, భవదీయమహామహిమచే సృష్టంబయినసమస్తప్రపంచమును సుఖింపఁ జేయుచున్నావు. ఓ నారాయణా! నీ విలోకంబుల నెల్ల నెట్టి విజ్ఞానమహిమచేఁ గల్పించి సుఖింపఁజేయుచున్నా

ప్రా, యట్టివిజ్ఞానమహిమము చే సృష్టిఁజేయ సమర్థమయినప్రజ్ఞను నా కొసంగుము. నీవు ప్రణతప్రియుండవు. కావునఁ బ్రణతుఁడ నగునా ప్రార్థనము నెఱవేర్పక మానవు. ఓయీ! విశ్వసృష్టినిమిత్తము సృజింపఁబడిననీవు విశ్వసృష్టికిఁ దగిన ప్రజ్ఞ నీవలయు నని ప్రార్థించుట తగ దనియందు వేని చెప్పెద విను. ప్రసన్నవదనుఁడ వగునీవు నీకు శక్తిభూత యగులక్ష్మితోఁగూడ జ్ఞానశక్త్యాదిగుణములఁ బరిత్యజింపక, యవి గల్గిన యవతారములఁ దాలిచి దేవతిర్యఙ్మనుష్యాదులందు నీచే నొనర్పఁబడిన కర్మములను నాచిత్త మాసక్తమగునట్లు చేయుము. నీ విక్రమాతిశయము చే నొప్పి త్వద్విభూతిరూపమగు ప్రపంచమును నీయాజ్ఞచే సృజించునాచిత్త మొకవేళఁ దద్గుణాసక్తము కాదేమో, అందుచే నామానసంబును భవదాయత్తమగునట్లు చేయుము. మఱియుఁ బాపనివర్తకము లగునీగుణములం దాసక్తి గలిగి సంసారహేతుభూతము లగుపుణ్యపాపముల నెట్లు విడువఁగలనో యట్టిమార్గమాలోచింపుము. నన్నుఁ గృతార్థునిఁ జేయుము. నీయనుగ్రహము చే నీయవతారములను గుణములను ననుభవించుచు నీకుఁ గింకరుఁడనయి నీవిభూతియైయున్న ప్రపంచకమును సృజించు నేను నిన్నుఁ బ్రార్థించుట యుక్తమే. ఓ మహాత్మా! నీ యుదరమున జనించినపద్మమునందు భవదీయాంశంబున జన్మించిన నేను నీకటాక్షంబుచేఁ జిదచిదాత్మకమగులోకంబుల సృజింతు. అట్టి నాకు వేదవాక్కులయుచ్చారణమందు శక్తిలోపము లేకుండునట్టు లనుగ్రహింపుము. నాయందుఁ గృపాశీలుండవయి నాకు దర్శనమిచ్చినపురాణపురుషుఁడవును, భగవంతుండవు నగు నీవు మధురవాక్కులచే నాదుఃఖములం దొ

లఁగింపు'మని యిట్లు బ్రహ్మ నారాయణునకు నమస్కరించి, బద్ధాంజలియై యుండె నని మైత్రేయుండు విదురునకుఁ దెలియఁ జేసి వెండియు నిట్లనియె.'ఓవిదురా! ఇట్లు బ్రహ్మ పరమభక్తిసమేతుండయి యథాశక్తి వినుతించి మిన్నకుండె. అంత నాబ్రహ్మస్తోత్రంబులకు మిగుల నానందించి యాతనికోర్కులను దీర్పఁ దలంచి కల్పాంతమందలిభయంకరజలముచే విషణ్ణహృదయుఁ డగుట గనుంగొని తనలోకసంస్థానమువిషయమై, ఖిన్నుఁడగుటఁ దలపోసి యతనివిషాదము దొలఁగించునట్లు గంభీరవాక్కులతో

### నారాయణుండు బ్రహ్మకు వరంబులిచ్చి యంతర్ధానము చెందుట.

నిట్లనియె. 'నీవు సృష్టిజేయువిధమును దెలుపు మని యడిగితివి. నీ వడిగినసృష్టివిధము నిదివఱకే సంపాదించి యున్నాను. ఆసృష్టివిధము నా కెట్లు దెలియు ననినచో నందులకుపాయంబు చెప్పెద. నీవు మగుడఁ గర్మయోగమును, మద్విషయక మగునుపాసనను ననుష్ఠింపుము. ఓబ్రహ్మ! ఆతపోవిద్యలచే, నింతకుఁ బూర్వము మత్కల్పితంబు లగు లోకములను నీహృదయకమలమందుఁ జూడఁగలవు. పిమ్మట భక్తిశ్రద్ధలతోఁ గూడికొని సమస్తచరాచరములం దంతర్యామినై యున్ననన్నును, నాకు వ్యాప్యములై మఱియు శరీరభూతములై యున్నలోకములను జక్కఁగఁ జూడఁగలవు. అట్లు సర్వాత్మకుఁడును, బరబ్రహ్మము నగు నాసాక్షాత్కారమువలన నీవు మోహ మెడఁబాయఁగలవు. మఱియు * దారువులం దగ్నివలె సమస్తభూతములం దంతరాత్మనై ప్ర

---

* దారువహ్నిదృష్టాంతముచేత, దారువులందున్న యగ్ని కాదారుగతము లగుకౌటిల్యదీర్ఘత్వాదు లెట్లుగా సంభవింపవో, యట్లె సమస్తచిదచిత్తులయం దంతరాత్మనైయున్నను నాచిదచిద్గములయిన కర్మవశ్యత్వము,సృజ్యత్వము, సా

వేశించి ధారకుఁడనై యున్న నన్ను జూచినప్పుడే జనులు దుఃఖం బులవిడువఁగలరు. పృథివ్యాదిభూతములచేతను, జ్ఞానకర్మేంద్రియం బులచేతను, నంతఃకరణముచేతను, రహితమైనజీవాత్మను, సత్య జ్ఞానస్వరూపుఁడ నయిననాచే ధార్యునిగా నెప్పుడు తలంతురో యప్పుడే యకర్మవశ్యత్వమును బొందుదురు. ఓయీ? నీ వనాది గా వచ్చుచుండిననానావిధకర్మముల ననుసరించి పెక్కండ్రఁ బ్రజలను సృజించుచున్నను నీచిత్తము నాయనుగ్రహంబువలనఁ గల్మషత్వము నొందకుండుఁగాక. మఱియు నీవు సంతతము రజో గుణప్రయుక్తుండవయి లోకసృష్టిని జేయుచుందువు. అయినను బాపీయ మయినయారజోగుణము నాయనుగ్రహంబువలన నిన్నుఁ బాపాత్మునిగాఁ జేయనేరదు. నీమనంబు నాయందు లగ్న మయి యున్నది. కనుక నీ కట్టిదురితము లంటవు. సందియము చెందకుము. నన్ను నీవు భూతేంద్రియగుణములకు వ్యతిరిక్తుని గాఁ దెలిసికొంటివి. కావున మానవులకుఁ దెలియఁబడని నన్నుఁ దెలిసికొని యున్నావు. మఱియు నీవు పద్మనాళమును బ్రవేశించి నన్నుఁ జూడ నెంతయుఁ బ్రయత్నించి యేరూపము నుగుఱించి నీవు వెదకితివో యారూపమిప్పుడు నీకుఁగానఁబడియె. ఈరూపమును జూడ మఱెవ్వరును శక్తులుకారు. ఓయీ! నాచ రిత్రముచే నంకిత మగునట్లు నీ వొనరించినస్తోత్రమునకును, నీవు చేసినతపంబునకును, మిగుల సంతసించితిని. అందువలననే నీయం దు నా కనుగ్రహము కలిగినది. మఱియు లోకముల సృజింపఁ దలంపుగొని నన్నుఁ గల్యాణగుణప్రచురునిగాను, హేయ

---

ల్యత్వము, నిస్సామ్యత్వము, శేషత్వము, శరీరత్వము మొదలగు ధర్మములు భగవంతునికిఁ జెంద నేరవు.

గుణరహితునిఁగాను, స్తోత్రము చేసితివి. అందువలన మిక్కిలి సంతసంబు చెందియున్నాను. నీకు మంగళములు కలుగుఁగాత. ఓకమలాసనా! నీ వొనరించిన స్తోత్రరాజముచే నన్ను స్తుతించుచుఁ బ్రత్యహము నన్ను భజించుచున్న మానవులకు నేను బ్రసన్నుఁడనై యుందును. మఱియు వారలకోరికల నెఱవేర్చుచుందును. అట్టి వారలకు నిఖిలయాగములచేతను, దానములచేతను, యోగాదులచేతను, సంపాదింపఁబడుచుండు ఫలమెల్ల నొసంగుచుందును. కావున నోవిధాతా ! జీవాత్మలకు సంతరాత్మనై ప్రియమయిన వస్తువులలోనెల్లఁ బ్రియతముండనయి యున్న నన్ను ననిశము స్మరించుచుండుము.ఇంతకుఁబూర్వము నాలోపల నడఁగియున్న లోకములనెల్ల యథాపూర్వముగా సృజింపు' మని ప్రకృతిపురుషనియంత యగుభగవంతుఁడు జగన్నిర్మాణప్రకారమును బ్రహ్మకుఁజెప్పి యంతర్ధానము చెందెను. ఇది తొమ్మిదవయధ్యాయము.



ఇట్లు చెప్పినవిని విదురుండు మైత్రేయుం జూచి 'మునీంద్రా ! నారాయణుఁ డిట్లు తిరోహితుం డయినపిమ్మట లోకపితామహుఁడయిన బ్రహ్మ దేహసంబంధమయినసృష్టిని, మనస్సంబంధమయిన సృష్టిని, నెన్నెన్నివిధములుగాఁ జేసెను? ఓమునీంద్రా ! నే నింతకుముందు పలువిధములయినప్రశ్నముల నడిగి యున్నాను. దయయుంచి యాయాప్రశ్నముల కన్నింటికిఁ గ్రమముగాఁ దగినట్లు ప్రత్యుత్తరము లిచ్చి నాసందియముల నివారింపుము.'' అని యిట్లడుగఁగా విని మైత్రేయుండు మిగుల సంతసించి తన హృదయమునందున్న విదురప్రశ్నముల కన్నింటికిఁ బ్రత్యుత్తరము లిచ్చి యుండె నని శుకుండు రాజునకుఁజెప్పి వెండియు నిట్లని

మై. ఓరాజా! మైత్రేయుండు విదురున కిట్లు చెప్పె "ఓవిదురా! భగవంతుం డగునారాయణుం డిచ్చినవరము ప్రభావంబుచే బ్రహ్మ తనమనస్సును బరమాత్మయందు స్థిరముగా నుంచి నూఱు దివ్యసంవత్సరములు భగవంతు నుద్దేశించి ఘోరం బగుతపంబు గావించెను. తరువాత నాకమలాసనుండు ప్రళయకాలమందలి వాయువుచేఁ గంపితమయి,నిజనివాసభూతమయియున్న పద్మమును జలమునుఁ బొడఁగాంచినవాఁడయి, పరమాత్మవిషయకమయిన యుపాసనచేతను, దినదినము వృద్ధిపొందుచున్నతపస్సుచేతను, విశేష మయినవిజ్ఞానబలముగలవాఁడయి యాయుదకముతోఁ గూడ వాయువును ద్రావెను. ఇట్లొనరించినతోడనే యతఁ డధిష్ఠించియున్న పద్మ మాకాశము నంటి యుండెను. అట్లాకాశము నంటియున్నపద్మముచేతఁ బూర్వకల్పముం దాపద్మమందు లీన మయియున్నలోకముల సృజించెదనని చింతించి భగవంతునిచేఁ దనకార్యమందు నియుక్తుండై, యాపద్మముఁ బ్రవేశించి చతుర్దశభువనంబులు కాఁదగినంత వైశాల్యము గలయాపద్మమును, దేవమనుష్యాదిభోక్తృరూపముగాను, శబ్దాదిభోగ్యవస్తురూపముగాను, జ్ఞానకర్మేంద్రియకరణరూపముగాను, విభజించెను. మఱియు జీవలోకసన్నివేశవిశేషము, భోక్త, భోగ్యము, భోగోపకరణము నా విభక్తమగుపద్మమే యని తెలిసికొనుము. ఓయూ! పరమేష్ఠియుఁ, దదీయస్థానంబును, గార్యవర్గమున కంతర్గతములై యున్నవి. కాన నాబ్రహ్మయు, బ్రహ్మలోకమును, బ్రతిదినమునొనర్చుతై ౧లోక్యసృష్టివంటిది యెందుకుఁగాదు? అన్నచోఁ జెప్పెద.విను. నిష్కామముగా ధర్మానుష్ఠాన మొనరించినవారికి నీపరమేష్ఠిలోకము ఫలభూతమగుచున్నది.నిష్కామధర్మ లగు

వారికి ముక్తియే ఫలముగాని పరమేష్ఠిగాని పరమేష్ఠిలోకముగాని ఫలము గాదనరాదు. నిష్కాములు మొదట బ్రహ్మలోకమున కేఁగి యనంతరము బ్రహ్మతోఁగూడ ముక్తిని బొందుదురు; త్రైలోక్యము కామ్యకర్మములకు ఫలరూపమగుటచే దానికిఁ బ్రతికల్పమందును సృష్టిలయములుగలవు. కాని నిష్కాములకుఁ బ్రాప్యమయిన బ్రహ్మలోకాదులకుఁ బ్రతికల్పమందును సృష్టిలయములు లేవు. మఱియు బ్రహ్మలోకాదులు ద్విపరార్ధకాలమువఱకు నుండును. త్రైలోక్యమ ట్లుండదు. కావున బ్రహ్మలోకాదులసృష్టి త్రైలోక్యసృష్టివంటిది కాదని చెప్పియున్నా"రని మైత్రేయుండు చెప్పిన విని విదురుం డిట్లనియె". ఓయీ! ప్రళయమందుఁ గాలము న్నట్లు దెలియవచ్చుటచే నది నిత్యమని తోఁచుచున్నది. చిద చిదాత్మక ప్రపంచరూపుఁడును, నచింత్యవ్యాపారుఁడు, నగుశ్రీహరి కాలాఖ్యరూప మగుశరీరమునుగుఱించి వివరించిచెప్పుము" నావుడు మైత్రేయుం డి ట్లనియె. "ఓవిదురా! గుణపరిణామమగు ప్రధానమే స్వరూపముగాఁగలిగి, పృథివ్యాదిరహితుఁడై, కారణాంతరరహితుఁడై, యున్న పరమపురుషుఁ డుపాదానభూత మగు ప్రధానముతోఁ గూడినతన్నును జగద్రూపముగా లీలచే సృజించెను. ఒక్కఁడగుభగవంతునికిఁ గార్యకారణభావ మెట్లు కలుగుచున్నది? అందు వేని చెప్పెద విను. చిదచిద్విశిష్టుఁ డగుభగవంతుఁ డొక్కఁడైనను, దశాభేదమునుబట్టి కార్యకారణములుగా నుండవచ్చును. మృద్ద్రవ్యమునకుఁ గాలభేదమునుబట్టి పిండత్వావస్థయు, ఘటత్వావస్థయు సమకూడి, కారణభావమును, గార్యభావమును, బొందుచుండుట చూచుచున్నారము. అట్లె చిదచిద్విశిష్టుఁ డగుభగవంతునికి స్థూలావస్థయు, సూక్ష్మా

వస్థయుఁ గలిగియుండుటచేఁ గార్యకారణభావ ముపపన్న మగు చున్నది. ప్రకృతికార్యరూపమై కావుననే విశ్వాకారముగాఁ బరిణ మించి కంటికి గోచరమై యున్న యీ బ్రహ్మస్వరూపము సృష్టికిఁ బూర్వము, భగవత్సంకల్పముచేఁ బ్రకృత్యవస్థామాత్ర మేయై యుం డున ట్లుపసంహృతమైనది. అప్పుడు సమస్త ప్రపంచకరూపమగు బ్రహ్మస్వరూపము, భగవంతునికి శరీరభూత మగుటచే నీశ్వరుఁడ నఁదగి యవ్యక్తరూపముగలిగినకాలముచేఁ బరిచ్ఛిన్న మగుచు న్నది. కావున సృష్టికిఁ బూర్వము సూక్ష్మచిదచిద్విశిష్ట మగుకాల ముచేఁ బరిచ్ఛిన్నమగు సత్పదార్థము మాత్రమే కలదని యె ఱుంగుము. మఱియు సృష్టిసంహారదశలందుఁ గాలానుగమ న మావశ్యకమయినది. సృష్టిదశయం దీజగం బెట్లు కాలపరి చ్ఛిన్న మగుచున్నదో యట్లె కార్యదశయందును జగంబు కాల పరిచ్ఛిన్న మగుచున్నది. ఇంతవఱకుఁ గాలకాల్యవస్తు సృష్టి నిగుఱించి చెప్పియున్నాను. ఇంకఁ గాలకాల్యవస్తుసృష్టిభేద ములను, బ్రళయభేదములను, జెప్పెదవినుము. సృష్టి తొమ్మిదివి ధంబులయి తనరారును. అందుఁ గొన్ని ప్రాకృతంబులనియుఁ గొన్ని వైకృతంబులనియుఁ జెప్పఁబడును. ఈతొమ్మిదివిధంబులగు సృష్టికిఁ బ్రళయంబు మూఁడువిధంబులై యుండును. ఆ ప్రళయము కాలద్రవ్యగుణములచే మూఁడువిధము లయి, కాలప్రళయము ద్రవ్యప్రళయము, గుణప్రళయము నాఁబడు నామంబులచేఁ దనరారుచుండును. అందు నీజంతువున కీకాలమందు మృతి ని యత మనునిర్ణయప్రకారమున జంతువులు పొలిసినచో దానికిఁ గాలప్రళయ మనిపేరు. ప్రళయము తఱిసినతఱి సంకర్షణముఖాగ్ని చే సమస్తజంతువులు నశించును. దానికి ద్రవ్యప్రళయమని

పేరు. సత్వరజస్తమోగుణములు సామ్యావస్థ నొందియుండు టకే గుణప్రళయమని పేరు. ఆనవవిధసృష్టిలో మొదటిది మహత్తత్త్వసృష్టి. ఆమహత్తత్త్వము కార్యోన్ముఖుఁడయి ప్రకృతిపురుషశరీరుఁడయి యున్న పరమాత్మవలనఁ జెందిన గుణవైషమ్యమువలన జనించినది. ద్రవ్యజ్ఞానక్రియారూపంబయిన యహంకారము రెండవసృష్టి యనఁబడును. శబ్దస్పర్శరూపరసగంధములయుఁ బంచతన్మాత్రలయుఁ, బృథివ్యాదిపంచభూతములయు సృష్టి, భూతసృష్టి యనఁబడును. అది మూఁడవసృష్టి. త్వక్, చక్షు, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణంబు లనెడిజ్ఞానేంద్రియపంచకము, వాక్, పాణి, పాద, పా, యూపస్థ లనెడి కర్మేంద్రియపంచకము నాఁబడు నీ దశవిధేంద్రియములసృష్టి కింద్రియసృష్టి యని పేరు. అది నాల్గవసృష్టి. ఏవైకారికాహంకారమువలన మనస్సు జనించెనో యాయహంకారమువలన నయినది, యింద్రియాభిమానదేవతలసృష్టి. అది యయిదవది. ప్రభునయినచతుర్ముఖున కంతరాత్మయై యున్నభగవంతునిసంకల్పమువలనఁ గలిగినతామససృష్టి యాఱవది. ఈచెప్పినయాఱువిధములయిన సృష్టులు చతుర్ముఖశరీరకుఁ డగుటవలన రజోగుణభాక్కయినభగవంతునికి లీలార్థములయి ప్రాకృతసృష్టులని చెప్పఁబడును. ఇంక వైకృతసర్గంబులఁ జెప్పెద నాలింపుము. పుష్పోత్పత్తి లేకుండ ఫలించుచున్నయశ్వత్థపనసముఖాది వనస్పతులును, ఋష్పితంబులయి పండునంతవఱకుఁ బ్రదికియుండెడి వ్రీహియవాదు లయినయోషధులు, నాగోహణాపేక్షితంబులయిన మాలతీమల్లికాదిలతలును, త్వక్కుమాత్రమే సారముగాఁ గలరంభావేణుకాదులును, గఠినభూతములయిన మొదళ్లు కలవై శిఖావిస్తృతంబులై విలసిల్లెడిలతావిశేషము

లయినవీరుధంబులును, బుష్పవంతంబులయి పండుచుఁ జిరకాలం బువఱకు జీవించుచున్న రసాలాదివృక్షంబులును, నీచెప్పిన యా ఱును, నవ్యక్తచైతన్యంబులయి యంతస్స్పర్శంబులయి స్థావరం బులని పిలువఁబడుచుఁ దనరారుచున్నవి. వీని సృష్టియేడవది. తిర్యక్కులసృష్టి యెనిమిదవది. అది యిరువదియెనిమిదివిధము లయి యుండును. వానిని వివరించి చెప్పెద వినుము. స్వప్నాది జ్ఞానశూన్యములయి కేవలాహారాదిజ్ఞాననిష్ఠంబులయి ఘ్రాణేం ద్రియమువలన సమస్తము తెలిసికొనునవయి, చీల్పఁబడిన డె క్కలుకలవై యున్నవి తొమ్మిదివిధములు. అవి క్రమముగా గో వులు, మేఁకలు, మహిషములు, కృష్ణసారములు, సూకరములు, గవయమృగములు, నల్లచాఱలదుప్పులు, గొఱ్ఱెలు, లొట్టియలు నై యున్నయవి. చీల్పఁబడని డెక్కలుగలమృగము లాఱువిధంబు లు. అవి క్రమముగా గార్దభములు, తురంగములు. వేసడములు, గౌ రమృగములు, శరభములు, చమరీమృగములు నై యున్నవి. ఇం క నైదేసినఖంబులుగల పశువులనుగూర్చి చెప్పెద విను. అవి పం డ్రెండువిధంబులు. అవి వరుసగా, శునకములు, జంబుకములు, తోఁ డేళ్లు, శార్దూలములు, మార్జాలములు, శశములు, నేదుఁబందు లు, సింహంబులు, వానరములు, గజములు, కూర్మములు, నుడు ములు నై యున్నవి. మకరాదిజలచరములును, రాఁబులుఁగులు ను, గృధ్రములును, బకములును, డేగలును, బాలపిట్టలు, భ ల్లూకములును, మయూరములును, హంసములును, సారసప క్షులును, జక్రవాకములును, గాకములును, గుడ్లగూబలును, నీమొదలగు పక్షులునుగలిసి యేకవిధమయ్యె. ఇట్లు తిర్యక్సృష్టి యిరువది యెనిమిదివిధములు. అర్వాగ్గాములయిన మానవులసృష్టి

తిర్యక్కులవలె నానావిధంబులు కాక యేకవిధంబయియుండు. అది తొమ్మిదవసృష్టి. మానవులందఱు రజోగుణప్రధానులయి సుఖాభిలాషులయి నానావిధకర్మకారులయి యుందురు. ఈచెప్పినవి నవవిధ సర్గంబు లయి యుండును. ఇందుఁ గడపటిమూడును వైకృతసర్గంబు లనంబడు. ఇంక దేవసర్గంబు చెప్పెద వినుము. అది యెనిమిది తెఱంగులై యుండును. విబుధపితృదేవతాసమూహ మొకవిధము. రాక్షసులు రెండవవిధము వారు. గంధర్వాప్సరసలు మూడవవిధము వారు. సిద్ధులు నాల్గవ విధము వారు. యక్షరక్షస్సు లైదవవిధము వారు. చారణు లాఱవవిధము వారు. భూతప్రేతపిశాచాదులు లేడవవిధము వారు. కిన్నరకింపురుషవిద్యాధరు లెనిమిదవవిధము వారు. ఇదియే దేవసర్గం బనంబడు. ఓ విదురా! నీకు దేవసర్గసహితమై పదివిధములయిన సృష్టుల తెఱంగులెఱింగించితిని. ఈ చెప్పినదానిలో నొక్క విశేషంబు కలదు చెప్పెద వినుము. సనత్కుమారాదులసృష్టి మొదట వైకృతంబయ్యెను దేవత్వంబు కల్పించినకారణంబునం జేసి ప్రాకృతసర్గాంతర్గతంబయ్యె. నీలలోహితుండు సనకాదులం దంతర్భూతుఁడయినను బ్రతికల్పమందును సృజింపఁబడుటం జేసి యతఁడు వైకృతసర్గంబులోఁ జేరినవాఁడేయని యెఱుంగుము. ఓవిదురా! సకలవస్తుపరిచ్ఛేదకమగు కాలస్వరూపమును జెప్పి యనంతరము, మనువులను గుఱించియు, మన్వంతరములను గుఱించియుఁ, జెప్పెద. ఓయీ! కల్పాదియందు స్వాయంభువును, సృష్టికర్తయు నగుపరమాత్మ చతుర్ముఖశరీరకుఁ డగుటవలన రజోగుణసమేతుఁడై యమోఘసంకల్పము గలవాఁడై తానే తన్నును, సృజించుచున్నాఁడు. మఱియు గుణవ్యతికరాత్మక మగుబ్రహ్మాండసృష్టి

యుగపత్కాలమందె ప్రవర్తిల్లె. అది యెట్లని శంకింపఁబని లేదు. భగవంతుఁ డాశ్చర్యశక్తిసమేతుఁడై యున్నప్పుడు బ్రహ్మాండ సృష్టి యేకకాలమందే ప్రవర్తిల్లుట కేమిఁగొదవ? నదియందు భ్రమించుచున్న యావర్తబుద్బుదములు యుగపత్కాలమందె యుత్పన్న మ్రగుచున్నట్లు ప్రత్యక్షముగాఁ జూచుచుండలేదా? కావున నండసృష్టివిషయమై పౌర్వాపర్య మెన్నరాదు. ఓయీ! ప్రతికల్పమందు వర్తించు నింద్రాదిదేవతలు భిన్నులా? లేక యొకకల్పమందుండువారలే మగుడఁ గల్పాంతమందు నింద్రాదులగుచున్నారా? అందువేని వినుము. ఈకల్పమందుండు నింద్రాదిదేవతలే మఱియొక కల్పమందు నామాంతరములచేతను, రూపాంతరములచేతను వెలయుచు, నుందురు. ఇది పదియవయధ్యాయము.



ఓయీ! ఇఁకఁ గాలస్వరూపము నెఱింగించెద. సావధానుండవు కమ్ము. ఓ విదురా! సమస్తమయిన కార్యజాతము పరమాణుపుంజమువలననే పుట్టినది. ఘటపటాదులయిన కార్యములఁ బరమాణువులవఱకు విభజింపవచ్చును. దేనికంటెఁ జిన్నవస్తు వుండదో దానికిఁ బరమాణు వనిపేరు. కార్యజాతమంతయు మొదట తా మెట్టిపరమాణుసంయోగమువలన నుద్భవించినవో ప్రళయమం దట్టిపరమాణువులలోనికి మాఱును. అవి యోగీశ్వరులకు దృశ్యంబులై గానవచ్చును. గాని సాధారణులకుఁ గానరావు. పరమాణువుకంటెఁ జిన్నవస్తు వేదియు నుండదు. విరాట్టుకంటె నధికపరిమాణముగల వస్తు వుండదు. అట్టిపరమాణువు లొకదాని కొకటిచొప్పునఁ బెక్కులు కలియుటచేతనే ఘట

## మైత్రేయుండు విదురునకుఁ గాలపరిమాణమును జెప్పుట.

పటాదు లేర్పడుచున్నవి. అట్టిపరమాణువులవలననే కాలము గూడ నేర్పడినది. కాలము సూర్యగమనముచే విభజింపఁబడు చున్నది. సూర్యుఁడు పరమాణు వుండినప్రదేశము నెంతకాల ములో నతిక్రమించునో యక్కాలంబు పరమాణు వని చెప్పఁబ డును. కాలపరిమాణములలో స్వల్పతమ మయినది పరమా ణుకాలమే. అట్లె సూర్యుఁడు ద్వాదశరాశిరూపకమయిన భువన ము నతిక్రమించుట కెంతకాలముపట్టునో దానికి సంవత్సరంబని పేరు. అట్టిసంవత్సరమును మహాకాలపరిమాణమని చెప్పుదురు. మన్వంతరాదులు సంవత్సరముకంటె నెక్కువకాలమును దీసికొ నుచున్నను, నామన్వంతరాదులన్నియు సంవత్సరము లావృత్తి యగుటవలనఁ గలుగుచున్నవి. కాని మఱియొకవిధముగాఁ గలుగ లేదు. కావున సంవత్సరమునకే మహాకాలపరిమాణ మనఁదగు. రెండు పరమాణువు లొక్కయణు వగు. మూడణువులకాలము త్రసరేణు వగును. గవాక్షములరంధ్రములనుండి వచ్చు సూర్య కిరణములందుఁ జూడఁబడుచు నాకసమునకుఁ బోవు పరాగకణ మే త్రసరేణు వని చెప్పఁబడు. సూర్యుఁ డా త్రసరేణు వున్నంత ప్రదేశము నెంతలో నతిక్రమించునో యది త్రసరేణుకాల మనఁ బడు. మూడుత్రసరేణువులకాల మొక్కత్రుటి యనఁబడును మూ ఁడుత్రుటులకాలం బొకవేధ యనఁబడును. మూఁడువేధలకాల మొక లవమని చెప్పఁబడును. మూఁడులవములకాల మొకనిమేష మని చెప్పఁబడును. నిమేషత్రయం బొక్కక్షణంబగు. ఐదుక్షణము లొక కాష్ఠ యనంబడు. అట్టికాష్ఠలు పదియేనయినచో నొకలఘు వగు. అట్టిలఘువులు పదునేనైనచో నొకనాడిక యగు. రెండు

నాడిక లోకముహూర్తమయ్యె. మఱియు నట్టినాడిక లాఱైన చో మానవుల కొక ప్రహరంబగు. దానికే యామమనియుఁ బేరుగలదు. మఱియు దివసపరిమాణంబు తెలిసికొనుట కొకసాధన మున్నది చెప్పెద వినుము. పండ్రెండునఱపలములతామ్రముచే నొకపాత్రమును రచింపవలయును. నాలుగుమినుపగింజలయెత్తుగల బంగారముచే నాలుగంగుళములనిడుపుగల యొకకణిక చేయవలయును. ఆకణికతో నప్పాత్రంబున నొక ఛిద్రంబు గల్పింపవలయు. ఆరంధ్రమునంబడి నీ రెంతకాలములో నప్పాత్రమును నించునో, యాకాలం బొకనాడికయగు. నాలుగేసియామము లయినచో మానవులకు రాత్రిందివంబు లగును. అట్టియహర్నిశంబులు పదునేను చన్నచో నొకపక్షం బగు. పక్షంబు శుక్లపక్షమనియుఁ గృష్ణపక్షమనియు రెండువిధములు. అప్పక్షంబులు రెండును జన్నచో నొక్కమాసం బగు. అట్టిమాసము పితృదేవతల కొకదినం బగు. అట్టిమాసంబులు రెండయిన మానవుల కొకఋతు వగు. అట్టిఋతువులు మూడయినచో నొక్కయయనం బగు. అది దక్షిణాయనంబనియు నుత్తరాయణంబనియుం బరఁగు. అట్టియయనంబులు రెండయినచో మానవుల కొక్కసంవత్సరంబగు. అట్టినూఱుసంవత్సరంబులు మానవులకుఁ బరమాయువయియుండును. కాలాత్మకుండయిన సూర్యుండు గ్రహతారానక్షత్రచక్రమధ్యగతుండై పరమాణువాదిగాఁగల సంవత్సరాత్మకం బయినకాలంబుచేత ద్వాదశరాశ్యాత్మకమయిన భువనకోశము నతిక్రమించుచుండును. ఈసంవత్సరము సూర్యాదులగతిభేదములచే సంవత్సరము, పరివత్సరము, ఇలావత్సరము, ఇద్వత్సరము, వత్సరము అని యయిదు విధంబు

లయ్యె. సూర్యుని గమనమునుబట్టి సంవత్సరమనియు, బృహస్పతి గతినిబట్టి పరివత్సరమనియు. సూర్యగతివిశేషమువలన నిలావత్సరమనియుఁ, జంద్రగమనంబుబట్టి యిద్వత్సరమనియు, నక్షత్రగతినిబట్టి వత్సరమనియు నామంబులు గలిగినవి. ఇట్టి కాలపరిమాణంబునకుఁ గారణుం డయినసూర్యుండు శరీరముగాఁ గల భగవంతుఁడు మానవునియాయువును వ్యయము నొందించుచుఁ గోరికలు గోరువారికి యజ్ఞాదులచే స్వర్గాదిఫలంబులఁ గల్పించుచు, నాకాశంబున ననవరతంబు సంచరించుచుండును. పంచవిధవత్సరాత్మకుఁడయిన యా మహాత్మునికిఁ బూజ లొనరింపు" మని మైత్రేయుండు పలికిన విని విదురుం డిట్లనియె. "ఓ మునీంద్రా! నరపితృదేవతాదుల కాలపరిమాణమును దెలిపితివి. మూఁడులోకములకు మీఁదుగానున్న లోకములందలి వారి

**మైత్రేయుండు విదురునకుఁ గృతయుగాదుల పరిమాణంబును జెప్పుట.**

యాయుఃపరిమాణంబులను దెలియఁజేయుము. కాలగతి సమస్తము నీకుఁ దెలియును. నీవంటిమహాత్ములకు యోగసాధనంబుచే సమస్తప్రపంచము కరతలామలకం బయి యుండును. నీకుఁ దెలియనిసంగతియే లోకములో నుండదు. కావున నాకుఁ దెలియఁజేయుము" నిపలికినమైత్రేయుండిట్లనియె. "ఓవిదురా! నీయభీష్టంబు నెఱవేర్చెదనాలింపుము. కృతయుగమనియుఁ, త్రేతాయుగమనియు, ద్వాపరమనియుఁ, గలియుగమనియు నాలుగుయుగంబులుగలవు. అందు సంధ్యాంశంబుతోఁ గూడిన కృతయుగంబు పరిమాణంబు పదాఱువేల యెనిమిదివందలదివ్యవత్సరంబులు. సంధ్యాంశముతోఁ గూడిన త్రేతాయుగంబుపరిమాణము, పదునేనువేల యాఱువందలవత్సరంబులు, సంధ్యాంశముతోఁ గూడిన ద్వాపర యుగ

పరిమాణంబు, పదునాలుగువేల నాలుగువందలవత్సరంబులు.సంధ్యాంశసహితమయిన కలియుగపరిమాణము, పదుమూడువేల రెండువందలవత్సరంబులు.ఒకయుగమునకును రెండవయుగమునకుమధ్యముననుండుభాగముసంధ్యాంశ మనఁబడును.అట్టిసంధ్యాంశములకు నడుమనుండుకాలము యుగమనఁబడు.అప్పుడు త్రివిధమయిన ధర్మము విస్తరిల్లుచు సంధ్యాంశములందుఁ దఱిగిపోవుచుండును. మఱియు ధర్మము కృతయుగమునందు నాలుగు పాదము గలదయి మనుజుల ననువర్తించుచుండును. త్రేతాయుగమందు ధర్మము మూడు పాదంబు లుండును. ద్వాపరయుగంబున రెండు పాదములు మాత్రమే ధర్మముండును. కలియుగంబున నేకపాదం బయి యుండును. ముల్లోకంబులకు మీఁదిభాగంబున విలసిల్లు సత్యలోకమందు బ్రహ్మ నివసించుచుండును. ఆ బ్రహ్మకు నాలుగుయుగంబులు వేయి పర్యాయంబులు దిరిగినచో నొక్కపవలగు. రాత్రియు నట్లె యగు. ఆబ్రహ్మ జాగ్రదవస్థలోనున్నప్పుడు లోకములు ప్రకాశించుచుండును. లేక నిద్రవోవుచుండిన సమస్తలోకంబులు విలయంబు చెందుచుండును. బ్రహ్మకు నొక్కదినంబని పరఁగుకాలములోఁ బదునల్గురుమనువులు చనుచుందురు. ఒక్కొక్కమనువు నాయుఃపరిమాణంబు డెబ్బదియొక్క మహాయుగంబులకాలము. అట్టిమనువులకు మధ్యమున నుండుభాగములకు మన్వంతరము లనిపేరు. ఆమన్వంతరములయందు, మనువంశసంభూతులైనరాజులు, సురలు, మహామునులు, భగవదంశంబునఁ బుట్టి పాలించుచుందురు. ఇట్లు చతుర్ముఖుండు దినదినము చేయు సృష్టియే దైనందినసృష్టి యనఁబడు. అది త్రిజగంబులను వర్ధించు

నది. ఆదైనందిన సృష్టియందుఁ దిర్యక్కులు, నరులు, దేవతలు, పితృదేవతలు, తమతమకర్మంబులఁ బురస్కరించుకొని పుట్టుచుందురు. నశించుచుందురు. మఱియు భగవంతుండు మన్వంతరములందుఁ బెక్కురూపంబులతో నవతరించుచుఁ బరాక్రమ మొప్పునట్లు జగంబులఁ బరిపాలించుచుండు. సరోజగర్భుండు పవలెల్ల జగంబుల సృజించుచు రాత్రియందుఁ దమోగుణాతిశయము నొంది విముక్తవ్యాపారుండయి నిద్ర చెందుచుండును. ఇట్లు బ్రహ్మ నిద్దురచెందినంతనే మూఁడులోకములు సూర్యుఁడు చంద్రుఁడు, సమస్తము నశించును. ఎట్లనఁ గల్పాంతమునందు సంకర్షణముఖాగ్నిజ్వాలలచే మూఁడులోకములు దహింపఁబడును. ఆయగ్నిసంతాపమును సహింపలేక మహర్లోకమం దుండెడిభృగ్వాదిమునీశ్వరు లందఱు జనలోకమునకుఁ బోవుచుందురు. ఇట్లు సంకర్షణాగ్నిచే దహింపఁబడిన మూఁడులోకములను గల్పాంతమందు వివృద్ధ మయినప్రళయకాలవాయువువలన నుద్భూతంబు లైనకల్లోలంబులచే వర్ధిల్లినసముద్రంబులు ముంచి యేకార్ణవముగాఁ జేయును. అట్టి భయంకరమయిన సముద్రమధ్యమందు సర్పరాజతల్పమున శయనించి యోగనిద్ర నవలంబించి నిమీలితాక్షుం డయి యున్న శ్రీనారాయణుండు జనలోకనివాసులయిన భృగ్వాదిమునీంద్రులచే నుతింపఁబడుచుఁ బ్రకాశించుచుండును. ఇట్లహోరాత్రములచే నుపలక్షితమయినకాలము గతించుచుండఁగా స్వమానముచే నూఱువత్సరంబుల పరిమితిగలబ్రహ్మాయువు క్షయించును. బ్రహ్మాయుష్కాలములో సగము పరార్థ మనఁబడును. అందుఁ బూర్వపరార్థ మతిక్రమించినది. రెండవపరార్థ మిప్పుడు

ప్రవర్తించుచున్నది. ఆ పూర్వపరార్ధము మొదటిభాగమందు వేదమయుం డగు బ్రహ్మ యుద్భవించుటంబట్టి యాభాగము బ్రహ్మకల్పమని వాడఁబడుచున్నది. సాగరమధ్యమున ననంతశయనంబుపయి శయనించినభగవంతుని నాభికమలమునుండి పద్మముద్భవించినకాలము పద్మకల్పమని చెప్పఁబడును. కావునఁ బూర్వపరార్ధమందుఁ బద్మకల్పము బ్రహ్మకల్పమును గతించినవి. ద్వితీయపరార్ధంబు మొదటిభాగమున హరి వరాహావతారంబు దాల్చెను. ఆకాలము వారాహకల్ప మనంబడు. ఆవరాహకల్పమే యిప్పుడు వర్తించుచున్నది. ఓవిదురా! కాలస్వరూపుఁడును, విశ్వాత్మకుఁడు నగు పరబ్రహ్మకుఁ బరమాణువు మొదలు పరార్ధము తుదవఱకుఁ గలకాల మింతేనియుఁ బ్రతిబంధింపఁజాలదు. పరమాణ్వాది పరార్ధాంత మయినట్టికాల మాయీశ్వరుని లోఁబఱచుకొనఁజాలదు. శబ్దాదివిషయములు వాగాదివ్యాపారములు ప్రాణాదివాయువులు, మనంబు నను పదునాఱువికారంబులతోఁ గూడికొని యొక దానికంటె నొకటి పదిరెట్లధిక ప్రమాణముగల భూజలతేజోవాయుగగనాహంకారమహత్తత్త్వప్రకృతులచే నావృతమయి యేఁబదికోట్లయోజనముల విస్తృతిగలిగి బ్రహ్మాండకోశంబు పొలుచుచుండు. ఇట్టి విస్తీర్ణమయిన బ్రహ్మాండము మఱియు, నట్టివయగుమఱి కొన్నియండరాసులును నేమూలప్రకృతియందుఁ బ్రవేశించి పరమాణువులవలెఁ జూడఁబడుచున్నవో, ఆమూలప్రకృతి పరాత్పరుండు మహాత్ముఁడు నగునీశ్వరునిశరీరంబయి యొప్పుచుండు. అట్టి పరమపురుషుని వర్ణింప నెవ్వరికయినం దరమగునే. ఇట్లచింత్యములు, నానావిధములు నగు వైభవంబులతో నొప్పుమూలప్రకృతి శరీరముగాఁ గలిగియున్న పరమాత్మకుఁ

గాల మెట్లు ప్రభువుగాఁగలదు.'' అని చెప్పి వెండియు మైత్రేయుం
డు విదురున కిట్లనియె. ఇది పదునొకండవయధ్యాయము.



"ఓవిదురా! కాలాహ్వయుఁ డయిన నారాయణుని మహిమల
వర్ణించి చెప్పితిని. ఇంక చతుర్ముఖసృష్టిమహిమల వర్ణించెద వి
నుము. పద్మాసనుండే సృష్టిప్రారంభమందు ముందుగా స్వరూ
పాప్రకాశంబగు తమంబు, "అహ" మ్మను దేహాభిమానబుద్ధిగలి
గిన మోహంబు, విషయసుఖాభిలాషరూపమయిన మహామోహ
ము, విషయసుఖంబుల కంతరాయము కలుగుటవలనఁ గ్రోధంబు
జనించుచుండు. తాదృశక్రోధరూపమయిన తామిస్రము, తాదృ
శసుఖంబులకు నాశము కలుగగా నేనేమృతినొందితి ననెడిబుద్ధి
పొడముచుండు. తాదృశబుద్ధిరూపమయిన యంధతామిస్రమున

❧ మైత్రేయుండు విదురునకుఁ జతుర్ముఖసృష్టులను దెలుపుట. ☙

ను నజ్ఞానపంచకమును సృజించెను. ఇట్లు చతుర్ముఖుండు ముందు
గా నవిద్యాపంచకంబు సృజించి, యట్టిపాపసృష్టి గావించినందు
లకుఁ బశ్చాత్తాపము చెందుచుఁ బిమ్మట భగవంతుని స్మరించుట
వలనఁ జిత్తంబును బూతంబు గావించుకొని యూర్ధ్వరేతస్కు
లును, బరమపవిత్రులును, సనకసనందనసనత్కుమారసన
త్సుజాతు లనుమునీంద్రుల సృజించి వారలం గాంచి "ఓయీ!
మీమీయంశంబులతోఁ బ్రజలఁబుట్టించి ప్రపంచంబును వృద్ధిగా
వింపుఁడు'' అని శాసింప వార లాబ్రహ్మవాక్యంబుల నెగతాళిచే
యుచు బ్రహ్మనుజూచి "మోక్షబుద్ధులము, నారాయణపరాయణు
లము, నగుమమ్ము పాపమయిన ప్రపంచసృష్టి చేయుఁ డందువా''
యని తూలఁబలికిన నమ్మాటలకు బ్రహ్మ దుస్సహాకోపంబు నొంది

డాని నుపశమింపఁ జేయుసమయంబున నాక్రోధ మతని భ్రూమ ధ్యంబుననుండి నీలలోహితుండై యుదయించి రోదనంబు చేయు చుండె. ఇట్లు రోదనంబు చేయుచున్న యాబాలకునియభిప్రాయం బు తెలిసికొన నతఁడు తనకు నామములను స్థానములను గల్పిం పుమనియె. అంత బ్రహ్మ మంచిమాటలతో వాని కిట్లనియె. "ఓకు మారా! భయసహితుండ వయి బాలకునివలె రోదనంబు చేయు చున్నకతంబున నిన్ను రుద్రుం డని పిలుచుచుందురు. మఱియు నీవు చంద్ర, సూర్య, వహ్ని, వాయు, సలిల, గగన, పృథివీ, ప్రాణ, తపో, హృదయేంద్రియముల నెడి యేకాదశస్థానముల వాసస్థానం బులఁగాఁ జేసికొని, మన్యుఁడు, మనువు, మహాకాలుఁడు, మహాం తుఁడు, శివుఁడు, ఋషధ్వజుఁడు, నురురేతుఁడు, నభవుఁడు, గాలుఁ డు, వామదేవుఁడు, ధృతవ్రతుఁడు నను నామంబులచేఁ, బిలువఁబ డుచు, ధీయు, వృత్తియు, నశనయు, ఉమయు, నియుత్తును, సర్పియు, నిలయు, నంబికయు, నిరావతియు, సుధయు, దక్షయు, న నెడి భార్యల తోఁ గూడికొని విహరించుచుఁ బ్రజల సృజింపుము. అందువలన నీవు ను బ్రజాపతి యని పిలువఁబడుదువ''ని నియమించిన భగవంతుఁ డైన నీలలోహితుండు విశ్వకర్త యగుపితామహుని శాసనంబు దల ధరించి సాత్త్విక స్వభావము చేఁ దనతో సమానులయిన ప్రజలను సృ జించెను. ఇట్లు రుద్రునిచే సృజింపఁబడిన రుద్రగణంబులు లెక్కకు మించినవయి లోకమును భక్షింప సమకట్టుచుండ వాని నవలో కించి 'లోకముల కుపద్రవము కలుగుచున్నద'ని నిశ్చయించి బ్ర హ్మ రుద్రున కిట్లనియె. "ఓయీ! నీవు చేయుచున్న సృష్టి నిఁక చా లింపుము. నీచే సృజింపఁబడినవారందఱు నుగ్రలోచనములచే నాతోఁ గూడియున్న ప్రపంచమును దహించుచున్నారు. అందు

వలనఁ జాల నష్టము కలుగుచున్నది. కావున నిఁక నీవుపోయి సమస్తభూతములకు **సుఖము** నిచ్చుతప మాచరింపుము. అందువలన నీవు యథాపూర్వకముగా సృజింపఁగలవు. లోకమున మహాత్ములు ఘోరమయినతపం బాచరించి పరంజ్యోతియు.బరాత్పరుండు, నచ్యుతుండు,నఖిలేశ్వరుండు నగువిష్ణువును గనుఁగొనుచున్నారు. కావున నీవు మహాఫలదాయకమయినతపం బాచరింపు'' మని నియమించిన నంత రుద్రుండు రుద్రగణంబులవలనఁ గలిగెడి లోకోపద్రవం బడంగించుటకయి తపంబు సేయఁ బోయెను అనంతరము కమలాసనుండు భగవంతుని లోకరచనాసామర్థ్యముగలవాఁడయి, సృష్టిని ధ్యానించుచు సంతానవృద్ధికారులును, బుద్ధిమంతులును,దనతో సమానులు నయినకుమారులఁ బదుగురి సృజించెను.ఆ పదుగురిలో దక్షుండు బ్రహ్మాయంగుష్ఠంబువలన జన్మించెను. నారదుండతనియూరువువలనఁ బొడమెను. ఆకమలాసను నాభికుహరంబు వలనఁ బులహుం డుద్భవించెను. అతనికర్ణమునుండి పులస్త్యుండు సంభవించెను. అతనిచర్మమువలన భృగుమహాముని పొడమెను. అతనిహస్తమువలనఁ గ్రతువు పుట్టె. అమ్మహాత్ముమోమువలన నంగిరసుండు జన్మించె అతనిప్రాణమువలన వసిష్ఠమహాముని యుత్పన్నుండయ్యె. అతనిహృదయమునుండి మరీచి యుదయమందె. అతనినయనంబులనుండి యత్రిముని సంభవించె. మఱియు నళినగర్భునిదక్షిణ స్తనమువలన దేవియందు నారాయణుం డుండునో యట్టిధర్మ ముదయించె. అతని వెన్నునుండి లోకభీకరమయి నమృత్యువు నధర్మమును జనించినవి. మఱియు నతనిహృదయమువలనఁ గాముండును, కనుబొమ్మలవలనఁ గ్రోధంబును, పెదవినుండి లోభమును, నోటినుండి వాణియు, గుహ్యంబు

వలన సముద్రంబులును, పాయువువలనఁ బాపాధిష్ఠానదేవత
యగు నిర్‌ఋతియు, నతనినీడవలనఁ గర్దమప్రజాపతియు నుద్భ
వించిరి. ఆకర్దముఁడే దేవహూతికి భర్తయయ్యె. ఇట్లు కమలాస
నుని దేహమునుండి కొందఱును మానసంబువలనఁ గొందఱు ను
ద్భవించిరి ఇట్లు తనవలన నుదయమందినవారిలోనున్న సరస్వతిని
జూచి మోహవివశుఁడయి కుమారిక యగు ననియైన నాలోచిం
పక యామెను గవయఁదలంచె నట. ఆసమయంబునఁ బాపనిశ్చ
యుఁ డయియున్నతండ్రిని బొడగాంచి మరీచి మొదలగుసుతు
లందఱుఁ బిత్రృభక్తి కలవారై యతని కిట్లు బోధ కలిగించిరి. "ఓజ
నకా! మహానుభావుఁడవగు నీవిట్లాచరించుట యుక్తముకాదు.
ఇట్లు పూర్వులు చేసియుండలేదు. ఇప్పటివారు చేయుచుండ లేదు.
భావికాలపువారయిన నిట్టు లాచరింపరు నీవు కామమును నిగ్ర
హింపక నీ కుదయించిన పిల్లను గోరి వరించుటకెంత వేఱుపాప
మున్నదయా? తేజశ్శాలురైనను నిట్టిచేష్టపని మాని యశంబుకా
పాడుకొనవలయు లేనిచో మహానుభావుఁడయిన పతికానసుఁడు
యుక్తాయుక్తము లరయక తాఁగన్నకూఁతును వరించెను? అట్టివాని
కి లేనిపాపము మనకా సంభవించుననుచు నింకమీఁదఁ బుట్టువార
లందఱు నీని నిదర్శనముగాఁ జేసికొని తమకుమారికలను దామే
వరింపఁ బాటుపడుచుందురు. కావున నీదుష్టకార్యమువిడువు" మని
పలికి తమజనకునిఁ దాదృశాధర్మమువలన మఱలింపఁదగినవాఁడు
భగవంతుండుదక్క మఱొక్కఁడు లేఁడని తలంచి భగవంతునుద్దే
శించి, "దేవా! నామరూపముల విభజింపఁదగనంత సూక్ష్మదశ
గలిగి నీయందు వర్తించుచున్న చేతనాచేతనాత్మకమయిన జగం
బును సంకల్పరూపజ్ఞానంబుచే విభక్తనామరూపములు కలదాని

గాఁ జేయుచున్నావు. నీవు జగంబులకెల్లఁ గారణభూతుండవు. ధర్మపరిపాలకుండవు. కావున మాజనకుని నీయధర్మమునుండి మఱలింపుము. నీకొఱకు నమస్కారము"ని భగవంతునిఁ బ్రార్థింపఁ దొడంగిరి. అంత బ్రహ్మ, కుమారులపలుకు లాలకించి లోలోన సిగ్గుచెందుచుఁ దనతుచ్ఛకాముకభావమును విడిచిపెట్టెను. ఆకాముకత్త్వమును దిక్కులన్నియు స్వీకరించుచు హిమరూపంబయిన తమంబును గలవయి ప్రవర్తించుచున్నవి. ఇట్లు బ్రహ్మ కాముకత్వవర్జనంబుచే నాపాపంబును దొలంగఁజేసికొని మఱియొకప్పుడు పూర్వకల్పమందలిసృష్టిప్రకారమును మనంబులోఁ దలపోయుచుండునవసరంబున నతనినాల్గుమొగంబులనుండి ఋగ్యజుస్సామాథర్వంబు లనెడినాలుగువేదములు బయలువెడలెను. మఱియు నావేదములతోఁగూడఁ జతుర్హోతృమంత్రవేద్యములైన యాగంబులు, న్యాయములు, నుపవేదములు, ధర్మమునకు నాల్గు పాదములయినతపంబు సత్యము,దయాశౌచములు, బ్రహ్మచర్యాద్యాశ్రమములయాచారములు, జనించిన వ"ని చెప్పినమైత్రేయునిఁజూచి విదురుం డిట్లనియె. "ఓమునీంద్రా! బ్రహ్మతనముఖములలో నేయేముఖమువలన నేయేసృష్టిచేసినాఁడో నవిస్తరముగాఁ దెలుపవలయు" నని ప్రార్థించిన విని మైత్రేయుండు విదురునకిట్లనియె. "ఓయీ! విదురా! తూర్పుననున్నముఖంబువలన ఋగ్వేదము, దక్షిణముఖంబువలన యజుర్వేదము, పశ్చిమముఖంబువలన సామవేదము, ఉత్తరముఖంబువలన నథర్వవేదము నుద్భవించినవి. గీతమంత్రస్తోత్రంబు లగుశస్త్రములును, నధ్వర్యుకర్మమయిన స్తోత్రములు, నుద్గాతృప్రయోజ్యంబులయిన సంగీతరూపమయిన స్తుతియు, బ్రహ్మకర్మమయిన ప్రాయశ్చిత్తము

ననునట్టి నాల్గును క్రమముగా బ్రహ్మ ప్రాగాదిముఖములవలన నుద్భవించినవి. మఱియు, నాయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము, శిల్పశాస్త్రం బనఁబడుస్థాపత్యము ననునీనాలుగు క్రమముగా బ్రహ్మ ప్రాగాదిముఖంబులవలనఁ బుట్టినవి. మఱియు సర్వజ్ఞుఁ డయినబ్రహ్మ ముఖములవలనఁ బంచమవేదము లనఁబడెడి యితిహాసములు పురాణంబులు బయలువెడలె. మఱియుఁ గమలాసనుండు కర్మతంత్రములను గలిగింపఁదలంచి, షోడశ్యుక్థ్యు లనెడిసంస్థావిశిష్టకర్మములను, జయనాగ్నిష్టోమములను,నప్తోర్యామాతిరాత్రములను,గోసవవాజపేయములను,సీనాల్గింటినిఁ బూర్వాదిముఖములనుండి క్రమంబుగాఁ గలిగించెను. మఱియు విద్యాదానతపస్సత్యంబు లనెడి ధర్మము పాదములను, బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసము లనెడియాశ్రమంబులను, వానివృత్తులతోఁగూడఁ గ్రమముగాఁ బూర్వాదిముఖంబులనుండి యుత్పాదించె. ఆయావృత్తులభేదములఁ దెల్పెద నాలింపుము. బ్రహ్మచర్యాశ్రమవృత్తులు సావిత్రమనియుఁ, బ్రాజాపత్యమనియు, బ్రాహ్మమనియు మూఁడు విధంబులు. అందు స్త్రీసంగవిరహాదిరూపమయినవృత్తి సావిత్రం బని చెప్పఁబడును. ఉపనయనము మొదలు దివసత్రయంబు గాయత్రీమంత్రమును జపించుచు నడుపునట్టివృత్తి ప్రాజాపత్య మనఁబడును. వేదగ్రహణానంతరమువఱకు వ్రతంబుల నాచరించుచు నియమ మవలంబించియుండుట బ్రాహ్మమనంబడు. ఇంక గృహస్థాశ్రమవృత్తులఁ జెప్పెద విను. అవివార్త, సంచయము, శాలీనము, ఉంఛము నను నలుతెఱంగులై యుండు. అందు నిషిద్ధముకాని కృష్యాదికము వార్త యనంబడు. యజనాదికర్మంబుల నొనరింప

యాచించి యార్జించుట సంచయ మనఁబడు. పరులయాచింపకుం
డఁ జేయువృత్తి శాలీన మనఁబడును. క్షేత్రపతితములయిన ధాన్యా
దుల నేఱితెచ్చికొని జీవించుట యుంఛ మనంబడు. వానప్రస్థాశ్రి
మవృత్తులు నాల్గువిధంబు లయియుండు. ఆయావృత్తిభేదముల
చే వనస్థితులలో నాల్గుతెఱఁగులవారలయిరి. వారిలోఁ గొం
దఱు దున్నకుండఁ బండినధాన్యాదికముచే జీవనంబుచేయుదురు.
వారు వైఖానసు లనంబడుదురు. కొందఱు నూతనంబు లగుఫలా
దులు లబ్ధంబులయినవోఁ బూర్వపుం దున్నవానిని విసర్జించు
చుందురు. వారలు వాలఖిల్యు లనంబడుదురు. తమంత ఫలించి
తరుపతితంబు లగుఫలంబులఁ దినుచు జీవనంబులు సలుపుచుఁ
గొందఱు వర్తింతురు. వారలు ఫేనపు లనఁబడుదురు. వారిలో
మఱికొందఱు ప్రొద్దున నేలేచి ముందుగా నేదిక్కును వీక్షింతురో
యాదిక్కునకేపోయి ఫలాదులను గొనివచ్చి జీవించుచుందురు.
వార లౌదుంబరు లనఁబడుదురు. ఇఁకఁ దుర్యాశ్రమవృత్తులఁ
దెల్పెద నాలింపుము. సన్న్యాసులలో నాలుగువిధములవా రుం
దురు. ఆయావృత్తులవలననే వారిలోఁ గుటీచకులనియు, బహూ
దకులనియు, హంసులనియు, నిష్క్రియులనియు నాలుగువిధము
లవారయిరి. అందుఁ గొందఱు స్వాశ్రమధర్మములఁ దప్పక యా
చరింతురు. వారలు కుటీచకు లనఁబడుదురు. మఱికొందఱు కర్మ
ముల నుపసర్జనముగాఁ జేసికొని జ్ఞానమును బ్రధానముగాఁ జేసి
కొని వర్తింతురు. వారు బహూదకు లనఁబడుదురు. మఱికొందఱు
కేవలము జ్ఞానమునే యభ్యసించుచుందురు. వారు హంసలనఁబడు
దురు. మఱికొందఱు ప్రవృత్తిధర్మముల విడిచి పరబ్రహ్మతత్వంబు
గలిగియుందురు. వారు నిష్క్రియు లనఁబడుదురు. మఱియు నా

త్మానాత్మవివేకమును గలిగించెడి యాన్వీక్షికియు, స్వర్గాదిఫలంబుల నొసంగుకర్మములఁ దెలియఁజేయు త్రయియును, జీవనఫలంబుల నిచ్చుచుంటకుఁ బ్రధానంబయిన కృష్యాదిరూపం బగు వార్తయు, ద్రవ్యమును సంపాదింప సాధనభూతం బగుదండనీతియు ననునవి పూర్వాదిముఖంబులఁ గ్రమంబుగా నుద్భవించె. మఱియు, ఓమ్, భూర్, భువ, స్సువ యనునట్టివ్యాహృతులు యథాక్రమముగా నుద్భవించినవి. మఱియు బ్రహ్మవలననే ఛందస్సు లుదయించినవి. వానిని వివరించెద వినుము. రోమములవలన నుష్ణిక్ఛందంబును, చర్మమువలన గాయత్రీఛందంబును, మాంసమువలనఁ ద్రిష్టుప్ఛందంబును, స్నాయువువలన ననుష్టుప్ఛందమును, నస్థులవలన జగతీఛందంబు, మజ్జవలనఁ బంక్తిచ్ఛందంబు, ప్రాణంబువలన బృహతీఛందంబు నుదయించెను. మఱియు బ్రహ్మజీవమువలన కకారాదిమావసానంబులగుస్పర్శములయ్యె. దేహంబువలన నకారాదిస్వరంబు లుద్భూతంబులయ్యె. అతనియింద్రియమువలన నూష్మములనిపిలువఁబడు శషసహాక్షరంబు లుద్భవించె బ్రహ్మబలమువలన నంతస్థము లనఁబడు యరలవాక్షరంబులు జననమందె. మఱియుఁ బ్రజాపతివిహారమువలన సరిగమపధనిరూపములయిన సప్తస్వరంబులుపుట్టె. ఓవిదురా! శబ్దబ్రహ్మమే శరీరముగాఁగలవాఁడును, వ్యక్తావ్యక్తస్వరూపముగలవాఁడు నగుచతుర్ముఖునివలన నర్థాత్మకబ్రహ్మముకంటె నన్యమయినదియుఁ బ్రకృతిప్రత్యయపదవాక్యాది రూపముగా విస్తృతమయినదియు,నానావిధములయిన యభిధాదిశక్తులతోఁ గూడికొనియున్న శబ్దబ్రహ్మ మిట్లుత్పన్నమయినది. తరువాత బ్రహ్మ శబ్దాత్మకమయిన శరీరముకంటె నితరమయిన శరీరమును దాల్చి

తిరిగి సృజింపఁ బూనికొని సంతానవృద్ధిచేయ శక్తిగల ఋషీశ్వరులు పెక్కురున్నను సృష్టి వృద్ధి పొందలే దని తలంచి తనలో ని ట్లనుకొనియె. "అక్కటా! నేను బ్రతిదిన మత్యంత శ్రమమూని సృజించుచున్నను బ్రజావృద్ధి కాకున్నది. ఇదెంతయు నద్భుతముగా నున్నది. నే నిట్లు ప్రయత్నించుచున్నను బ్రజావృద్ధి కాకపోవుటంబట్టి యాలోచింప దైవ మిందుల కంతరాయము కల్పించి యుండవచ్చును. లేనిచో నేలవృద్ధిపొందదు?" అని యిట్లాలోచించుచున్నసమయమున నతనిశరీరము రెండువిధములుగా విభిన్నంబయి యొకమిథునం బేర్పడియె. వారు స్వాయంభువమనువనియు, శతరూపయనియు వాసికెక్కిరి. ఆమిథునంబువలనఁ బ్రియవ్రతుఁడు, నుత్తానపాదుఁడు ననుపుత్త్రు లిర్వురు జనించిరి. మఱియు నాకూతియు దేవహూతియుఁ బ్రసూతియు నను మువ్వురుకుమారికలుగూడ నుద్భవించిరి. అంత స్వాయంభువుండు తనకూఁతులలో నాకూతిని రుచికునకును, దేవహూతిని గర్దమునకును, బ్రసూతిని దక్షునకు, నిచ్చి పెండ్లిగావించె. పిమ్మట వీరలసంతతివలన జగంబంతయుఁ బరిపూర్ణంబయ్యె". అని చెప్పినమైత్త్రేయునిఁ జూచి విదురుండు సంతసించి భగవత్కథాశ్రవణకుతూహలుఁడై ముని నిట్లడిగె నని చెప్పి శుకుండు వెండియు రాజునకిట్లనియె. ఇది పండ్రెండవయధ్యాయము.



"ఓమునీంద్రా! స్వాయంభువమను వుద్భవించి పత్నీసమేతుండై తరువాత నేమిచేసెను? ఆతఁడు మొదటిరాజసత్తముఁడు కావున నతనివృత్తాంతంబు వినఁ గుతూహల మగుచున్నది. మఱియు నతండు విష్ణువాశ్రయము గాఁగలవాఁడని విందుము.

అట్టి మహానుభావులచరిత్రములు విన్నచోఁ బుట్టువు సఫలము కాకుండునా? వేదశాస్త్రము లధ్యయనము చేసినవారికిసైత ము భాగవతులగుణంబులు వినఁ దగినవియే కదా!" అని యిట్లు వినయాదిగుణసంపన్నుఁడును, భగవత్పదముల కుపధానభూతమైన యుత్తమాంగంబు గలవాఁడు నగువిదురుం డడుగ విని మైత్రేయుండు భగవత్కథయందుఁ బ్రేరితుం డగుటకుఁ బులకి

స్వాయంభువుండు ప్రజావృద్ధి చేయుట.

తశరీరుండై యతని కిట్లనియె. స్వాయంభువమనువు భార్యతోఁ గూడ నుదయమందినపిమ్మట సపత్నీకుండయి బద్ధాంజలియయి బ్రహ్మను డాయంజని యిట్లనియె. "ఓజనకా! సమస్తభూతములకు జనకుఁడవయి, యాయావృత్తులకల్పించి పోషకుఁడవయి యున్నావు. నీవు మమ్ముఁ బుట్టించితివి. మే మాచరింపవలసినపని యేమి? దాని నాలోచించి చెప్పుము. కుమారుండు తండ్రికిఁ బ్రియంబు లయినకార్యములాచరించి యతనికి సంతసము గలిగించుచు,నతనికి సేవ లొనర్చుచు వాసికెక్కుట యుచితంబు. కావున నీయభీష్టంబు దెలియఁ జేసిన నే నట్లాచరించి యుభయలోకములందును గీర్తిచెంది నీకు సంతసము కలిగించెదను." అని యిట్లు పలుకుచున్న స్వాయంభువమనువును జూచి యిట్లనియె. "ఓరాజా! నిష్కపట మగు హృదయముతో 'జనకా! నన్నుఁ జక్కఁగ శిక్షించి యుక్తకర్మములందు నియోగింపు'మని స్వయముగానే పలికితివి. ఆవాక్యములకు నేను మిగుల సంతసించితిని. మీ కిరువురకు నమితంబగు శుభంబులు గలుగుఁగాక. ఓయీపుత్రకా! కుమారుఁడు తండ్రికిఁ బరిచర్య సేయుట యన నతివినయముతో తండ్రియానతిని దలయందు ధరించి యతండు చెప్పినపనిని శక్తివంచన

లేకుండఁ జేయుచుండుటయె. అట్లయిన నీయానతి యేమనియందు వేని చెప్పెద విను. నీవు నీభార్యయందు గుణములచే నీసమానుల గు పుత్త్రులను బుట్టించి ధర్మయుక్తముగా భూమండలమును బరిపాలింపుము. మఱియు యాగము లొనరించి యాగస్వరూపుఁడయిన పరమపురుషు నారాధింపుము. నీ వట్లు చేయుటయే పరమశుశ్రూషయని తెలంచెదను. నీ వట్లు చేయుటవలనఁ బరమపురుషుండు సంతసించును. అతఁడు సంతసించినచో సమస్తము లభించును. గాన యతఁడు లేనిచో శ్రమములన్నియు వ్యర్థములే. కుమారా! నన్నును లోకములను సంతసింపఁ జేయ దలంపున్నచో యాగముల నాచరింపుము." అని చెప్పుచున్న కమలాసనుపలుకులు విని మను విట్లనియె "ఓజనకా! నీవు చెప్పినట్లు చేసెదను. నే యాగములుచేసి భగవంతుని సంతసింపఁ జేసెదను. కాని నాకును నాతనయులకు నివసింపఁదగియుండు స్థలమును జూపుము. సమస్తజంతువులకు నివాసయోగ్యమగునభూమి జలమందు మునిఁగియున్నది. ఆభూమి నెట్లయిన నుద్ధరించెడియుపాయ మాలోచింపు"మని మనువుపలికినవాక్యము లాలకించి బ్రహ్మ జలమందు మునిఁగియున్న భూమి నుపలక్షించి "యీభూమిని నే నెట్లుద్ధరింతును? మొదటఁ బ్రళయకాలజలంబునంతను ద్రావితిని. పిదప భూమియుఁ జక్కఁగ స్థాపింపఁబడినది. అనంతరము ప్రజలను, దేవతలను, రాక్షసులను, పితృదేవతలను, పశులను, పక్షులను, సరీసృపములను, పర్వతములను, గజములను, పెద్దవియుఁ జిన్నవియు నగుభూతంబులను సృజించుచుంటిని. ఇట్లు నే సృజించుచుండ భూమి జలంబుల మునింగి రసాతల మంటినది. సృష్టిప్రవర్తకుఁడ నగునేను జేసెడిదేమి? ఎవనిసంకల్పమునుండి నేను

త్పన్నుండ నైతినో యాభగవంతుండు నే నాచరింపవలసిన కా
ర్యమును సంపాదించుఁగాక" అని చెప్పి భగవంతుండగు నారాయ
ణుని హృదయకమలంబునఁ జేర్చి తలంచుచున్న సమయంబున




నాసాపివరములవలన నంగుష్ఠమాత్రప్రమాణంబు గలవరా
హంబు జన్మించి యాకసమునం దున్నదయి, చూచువారలాశ్చ
ర్యమునొందునట్లు క్షణములోనే యేనుఁగంత ప్రమాణముగల
దాయెను. ఇట్లందఱకు నాశ్చర్యముఁ గలుపుచున్న వరాహమును
బ్రహ్మ మరీచి మొదలగువారందఱు చూచి యచ్చెరువొందుచు
"నిట్టిసృష్టి నిదివఱ కెన్నఁడును జూచి యుండలేదు. నాసావివరము
లనుండి యంగుష్ఠమాత్రప్రమాణంబు గలదయి క్షణమాత్ర
ములోపలనే గజప్రమాణమైనది. మఱియు నొకగండశిలవ
లె విలసిల్లుచున్నది. యజ్ఞస్వరూపుఁడయిన భగవంతుఁడే యి
ట్లుదయించినాఁడేమో" యని యాలోచించుచున్న సమ
యమున భగవంతుం డగు వరాహమూర్తి వర్షకాలమేఘ
మువలె గర్జించుచు బ్రహ్మాదుల సంతసింపఁజేయుచు నాధ్వను
లచే దిక్కుల నింపించెను. ఇట్టియజ్ఞవరాహము నినాదంబు
లను విని జనలోకవాసులు తపస్సత్యలోకములం దున్నవారలు
నగు మహామునులు వేదసూక్తులచే స్తోత్రము చేసిరి. ఇట్లు వరా
హమూర్తి సమస్తమునీంద్రులు నొనరించుచున్న యాత్మగు
ణానువాదరూపమయిన స్తోత్రమును విని యానందించి మఱల
వారికి సంతోషము కలుగునట్లు ఘుర్ఘురధ్వానంబు గావించి
బుధుల యభ్యుదయముకొఱకు మదపుటేనుఁగువలె జలము
ను బ్రవేశించెను. ఇట్లు జలమును బ్రవేశించి తనవాలమును

గిరగిరఁద్రిప్పుచు నాకొక్కమా టాకసమున సంచరించుచుఁ దన మెడయందున్న కర్కశరోమములను గదల్చుచుఁ, గర్కశమయిన రోమములతోఁ గూడినచర్మము కలవాఁడయి, ప్రకాశించు నేత్రములు కలవాఁడయి, వాఁడియయిన డెక్కలచే మేఘకదంబంబులఁ దూలఁజేయుచుఁ, దన తెల్లనిదంష్ట్రాకాంతిసంతానముచే దిక్కులఁ బ్రకాశింపఁజేయుచుఁ, దాను యజ్ఞస్వరూపుఁ డగుభగవంతుఁడయినను గార్యనిర్వాహపరుండై వరాహాకృతి దాల్చియున్నవాఁడు. కావునఁ బశువువలె భూమియందున్నగంధంబు నాఘ్రాణించుచుఁ, దాను భయంకరమయిన దంష్ట్రలు గలవాఁడయినను గృపాపూరితములయిన చూపులచే మునీంద్రుల వీక్షించుచు, జలముల విహరించె. వరాహమూర్తి సముద్రంబులో సంచరించుటంజేసి యది రెట్టించినధ్వని కలదయియుండెను. మఱియు నాసముద్రము వజ్రపర్వతశరీరుఁడయిన వరాహమూర్తి విహారవేగములను సైరింపఁజాలక భయకంపితమయి తరంగములను జేతులఁ జోడించి తరంగభంగములవలన జనించినసినాదమనెడి మధురవాక్యములతో "ఓవరాహమూర్తీ! నను రక్షింపుము, రక్షింపుమ"ని ప్రార్థించుచున్నట్టు లుండెను. పిమ్మట వరాహమూర్తి ఖరతరములయిన ఖురపుటము[illegible]పారమయిన సముద్రజల మవసానము చెందునట్లు చిమ్మివేయుచుఁ జనిచని రసాతలంబు ప్రవేశించి యందు ప్రళయజలంబుల శయనించినదియు, సమస్తజీవకోటికి నాధారభూతయు, నగుభూమిని బొడఁగాంచి

వరాహమూర్తి భూమిని దనదంష్ట్రాగ్రముతో నుద్ధరించుట.

తనదంష్ట్రాగ్రంబుచేఁ బైకెత్తుచు మిగులఁ బ్రకాశించుచుచుండెను. ఆసమయమునఁ బరాక్రమసమగ్రుఁడును దేవకంటకుండు

నగు హిరణ్యాక్షుఁ డను రాక్షసుండు గదాపాణియయి ఘోరం బగు సింహనాదంబు చేయుచు వరాహమూర్తిని సంహరింప వచ్చుచుండ నావరాహమూర్తి భయంకరముగా ధ్వనిచేయుచు నాతోలిరక్కసుని డాసి మదపుటేనుంగును బీనుంగును జేయు సింహంబుపగిది వాని సంహరించెను. ఇట్లు సంహరించి యారక్కసుని శరీరమునందలి శోణితంబుచే నెఱ్ఱనైన చెక్కిళ్లుగలదయి యాదివరాహము వప్రాదిక్రీడలచే భూమిని విదారించుటం జేసి భూసంబంధము లగుగైరికాదులవలన నరుణిత మగుగండతుండాగ్రములు గలగజంబుచందంబునఁ దనరారుచుండెను. ఇట్లు మహనీయుండు తమాలమువలె నీలవర్ణముగలిగి మదగజేంద్రంబు చందంబున తెల్లనిదంష్ట్రాగ్రముచే భూమి నుద్ధరించుచు వెలయు భగవంతుని సందర్శించి బ్రహ్మాదిసురలు బద్ధాంజలులై యనువాక

బ్రహ్మాదులు వరాహుని నుతించుట.

సదృశము లగువాక్కులచే స్తోత్రముచేయ నారంభించిరి. "ఓదేవా! నీ వారాక్షసుని జయించితివి. అందువలన మే మందఱము బ్రదికితిమి. వేదరూపమయిన శరీరమును ధరించియున్న నీకు నమస్కారంబు గావించెదము. సమస్తసముద్రము లెవరిరోమకూపములం దిమిడియున్నవో, సమస్తజగంబునకుఁ గారణభూతుండ వగునట్టినీపాదంబులకు వందనంబు లర్పించుచున్నారము. యజ్ఞస్వరూపుఁడవయిన నీరూపంబు దుర్మార్గుల కెంతమాత్రము గానరాదు. సజ్జనులకుమాత్రము గోచరం బగుచుండును. అట్టి పరమపవిత్రమయిన యాకారంబు గలనీకు నభివందనంబులు గావింతుము. నీవు యజ్ఞస్వరూపుఁడవు. నీచర్మమునందు సర్వవేదంబులు విలసిల్లు. రోమములందు బర్హిస్సులు, నేత్రములందు నా

జ్యంబు, పాదములందుఁ జాతుర్హోత్రవిలసితములగు యాగకర్మం బులు, స్రుక్కు తుండంబునందును, స్రువంబు నాసికయందును, నిడ యనుహవిర్భక్షణపాత్రం బుదరకోటరంబందు విలసిల్లుచుం డును. మఱియుఁ జమసలు కర్ణంబులయందు, ప్రాశిత్రం బను బ్రహ్మభాగపాత్రంబు ముఖమందును, గ్రహములను పాత్రవిశే షంబులు నోటియందు వెలయుచుండును. మఱియు నగ్నిహోత్ర మనుకర్మమే భక్షణ మగుచున్నది. దీక్షణీయ మనునిష్టియే నీకు జన్మము. ఉపసత్తులను నిష్టులు గ్రీవము. ప్రాయణీయము, ఉద యనీయ మను నామములతో నాద్యంతములయందుఁ జేయుని ష్టులు నీదంష్ట్రలు. ప్రవర్గ్యము నీనాలుక. సభ్య మనుహోమర హితమగునగ్నియు, ననసభ్య మను నౌపాసనాగ్నియు నీరెండు ను నీశిరంబు. ఇష్టకాబంధనవిశేషములు నీప్రాణంబులు. సో మము నీరేతస్సు. ప్రాతస్సవనాదులు నీబాల్యాదదశలు. అగ్ని ష్టోమమును, సత్యాగ్నిష్టోమమును, నుక్థ్యము, షోడశి వాజపేయ మును, అతిరాత్రమును, నప్తోర్యామమును నను నేడువిధముల యిన సంస్థలు నీ సప్తధాతువులు. బహుయజమానకములయిన సత్రయాగములు నీ యవయవసంధులు. ససోమములు, నసోమ ములు నయినయజ్ఞక్రతువులు నీవే ఓదేవా! నీవు యజ్ఞస్వరూ పుఁడవు. నీవే యజ్ఞాధిపతివి. ఓ దేవా! నీ వఖిలమంత్రశరీరుండవు. మఱియు నీవాజ్యదధిద్రవ్యాధిరూపుండవు. యజ్ఞస్వరూపుండవు. భక్తివైరాగ్యములవలనను, నంతఃకరణనిగ్రహంబువలనను, నిష్పా దితమగు ధ్రువానుస్మృతిరూపజ్ఞానము కలవాఁడవు. మఱియు న్యాసవిద్యాగురుండవు. అట్టినీకు నమస్కారంబు లొనరింతుము. ఓకమలనాభా ! అతిధవళమయిన నీదంష్ట్రాగ్రమునందుఁ బ్రకా

శించుచు సమస్తచరాచరములతో నొప్పుచున్నభూమి తటా కోదరసలిలమునుండి బయలువెడలి వచ్చుచున్నమదపుటేనుఁ గుతుండాగ్రమునందు వెలయుచుఁ బద్మసహితమై యొప్పు పద్మి నివలెఁ బ్రకాశించుచున్నది. దంష్ట్రాగ్రమందుఁ బ్రకాశించుచు న్న భూమండలముచే నీరూపము, మేఘయుతశృంగములతో వెలయు కులపర్వతరాజమువలెఁ దనరారుచున్నది. ఓదేవా! సమస్తచరాచరంబులను నివసింపఁజేయుటకయి పాతాళముఁ బం టియున్న భూమిని నుద్ధరించితివి. అట్టిభూమిని జక్కఁగఁ బ్రతిష్ఠ చేయుము. నీ వీలోకంబులకెల్ల జనకుండవు. నీకుఁ బత్నియయిన యీభూదేవియే మాకుఁ దల్లి. కావున భూదేవీయుతుండవయిన నీకు వందనంబు లాచరించుచున్నాము. కైకొనుము. యాజ్ఞికుఁ డరణియం దగ్నిని నుంచునట్లు భూమియందు నీతేజంబు నుంచితి వి. గాన యిది మిగులఁ బవిత్రయయి వఱలుచుండును. ఓజగదీశా! పాతాళము నంటియున్నభూమండలమును దంష్ట్రాగ్రముచేఁ బై కుద్ధరించుట యొకయద్భుతకార్యము కాదు. సమస్తలోకముల నవలీల సృజింపఁజాలిననీ కిది గొప్పకార్య మెట్లగును? నీవు నీ మహాశక్తిచేతఁ జేయుచున్నలోకసర్గంబు నెన్నుట కెవ్వరు శక్తు లు? వేదస్వరూపుఁడవయిననీవు సముద్రమునుండి వెడలివచ్చి నీశ రీరమును విదుర్చుటచే నీశరీరమునందున్న యుదకబిందువులు దప స్సత్యజనలోకంబులం బడినవి. ఆయుదకబిందువుల మేము దాన మాడి యుండుటంబట్టి పవిత్రుల మయినారము. ఓభగ వంతా! ప్రపంచకముసృష్టిస్థితిలయముల నొసరించుచున్ననీ యద్భుతచర్యల నెవ్వఁడు గనంగలఁడు? అట్టిచర్యలను నుతిం ప మాకుఁ దరంబగునే? నీమాయాసముద్రమునం దీవిశ్వమం

తయు మునింగియున్నది. కావున మహాజ్ఞానవంతులే యందుఁ బడియున్నారు. అట్లుండ మే మేరీతి నీమాయాసముద్రమును లంఘించి నీచర్యలను జక్కఁగాఁ దెలిసికోఁగలము? మాతరము కాదు. కావున దీనుల మయినమాయందు నీకరుణాకటాక్షవీక్షణములఁ బఱపి మమ్మును శోకములను సుఖవంతులనుగాఁ జేయుము." అనియిట్లు బ్రహ్మాదులందఱు భక్తియుక్తచిత్తులై మోదంబులు చెలంగ నయ్యజ్ఞవరాహమూర్తిని స్తోత్రముచేయుచుండ నమ్మహాత్ముఁడు తనఖురపుటంబులచే సముద్రజలమును జిమ్మివేసి యందు భూమిని నిలిపి విశ్రాంతిఁ బొందించెను. ఇట్లుచేసి సమస్తమునీంద్రులు చూచుచుండఁగనే యావరాహమూర్తి యంతర్ధానము నొందెను. ఓవిదురా! వరాహమూర్తి భూమి నుద్ధరించిన యీ పావనకథను సద్భక్తితో నెవ్వరు విందురో, యెవ్వరుచెప్పుదురో, వారివారి హృదయములయందు నారాయణుఁడు ప్రసన్నుఁడయి యుండును. సకలపురుషార్థముల నొసంగెడి ప్రభువయిన భగవంతుండు ప్రసన్నుండయినచో దుర్లభంబయినవస్తు వేదియుండును? ఇట్లు సమస్తవస్తువులు ప్రాప్తించుచుండఁగా మన కోరులిచ్చెడియాశీర్వాదములతో నేమిప్రయోజనము? మఱియు నిరంతరము తన్ను సేవించుచున్నభక్తుల హృదయకమలములయందు భగవంతుండు ప్రవేశించి పాపముల నన్నింటిని దొలంగించి నిరతిశయానందదాయక మగుతనలోకమునకుఁ గొనిపోయి సుఖింపఁజేయును. ఇట్టిలాభమును గలిగించుచున్నభగవత్కథాసుధారసము కర్ణము లనెడిదోసిళ్లతోఁ ద్రావుటకు బుద్ధిమంతుండయినవాఁ డెవ్వఁడు పూనుకొనఁడు? బుద్ధిమంతులు పురుషార్థములసారమును బాగుగఁ దెలిసికొని వస

లక హరికథామృతమును పానము చేయుచుందురు. అట్టి హరి కథలందుఁ బశువులు దక్క నుతెవ్వరు విరక్తి చెందుదురు?" అని యిట్లు మైత్రేయుండు చెప్పిన విని విదురుండు మిగుల సంత సించి యతని కిట్లనియె నని శుకుండు రాజున కెఱింగించి వెండి యు నిట్లనియె. ఇది పదుమూఁడవయధ్యాయము.

---

## మైత్రేయముని విదురునకు హిరణ్యాక్షహిరణ్యకశిపుల జననం బెఱింగించుట.

"ఓ మహారాజా! మైత్రేయుండు వర్ణించిన వరాహావతార కథను వినియుఁ దృప్తిఁ జెందఁజాలక సంతతము భగవత్కథా శ్రవణమందు నిరతుండగు విదురుండు లేచి నిలువఁబడి చేతులు జోడించి మైత్రేయుంజూచి 'మైత్రేయమునీంద్రా! భూమి నుద్ధ రించుచున్న యజ్ఞవరాహమూర్తితో వరాహకల్పమందు మొద టివాఁడగు హిరణ్యాక్షుం డను ముష్కరుండు ఘోర ముగాఁబోరి నిహతుఁడయ్యె నని వినియున్నాను. నిజదంష్ట్రాం కురముచే భూమి నుద్ధరించుచున్న వరాహమూర్తికిని నాహిరణ్యా క్షునకును, యుద్ధము సంభవించుటకుఁ గతమేమి? ఆ వృత్తాంత మంతయు సాంతముగా వినిపింపు" మని ప్రార్థింప విదురునకు మైత్రేయుం డిట్లనియె. "ఓ వీరా! విదురా! నీవు మానవులను మృత్యుపాశమునుండి తప్పింపఁ జాలినహరి యవతారకథను జెప్పు మని యడిగితివి. ఆకారణమున నీ ప్రశ్న మెంతయు నాదరణీయము యియున్నది. లోకమున హరికథాశ్రవణము మిగుల నుత్తమము. ఆ హరికథాశ్రవణమువలన నేకదా యుత్తానపాదునికుమారుం డగుధ్రువుండు మృత్యువునెత్తిపైఁ గాలిడి నశ్వరము కాని యత్యు

న్నతపదము చెందెను! ఇట్టి హరికథనుగూర్చి నీవడిగిన ప్రశ్నము సాధుతమ మయిన దని చెప్పవచ్చును. ఓవిదురా! ఈయర్థముంగూర్చి యొక యితిహాసము కలదు. అది పూర్వము దేవదేవుఁ డయిన బ్రహ్మ దేవతలకుఁ జెప్పెను. దాని నేను మాగురువులవలన విని యున్నాను. దాని నీకుఁ దెలియఁజెప్పెద వినుము. దక్షునికూఁతురయిన దితి కశ్యపప్రజాపతిని బెండ్లియాడినది. ఆమె సంతానాభిలాషకలదయి యొకనాఁడు మన్మథపీడితహృదయయయి యసురసంధ్యావేళఁ గశ్యపునిఁ గామించెను. ఆమె యతనియొద్దకుఁ బోవునప్పటికి నాకశ్యపుఁడు నియమముతోను శ్రద్ధతోను యజ్ఞపతియు నగ్నిశరీరకుఁడు నగుపరమపురుషునిఁ బూజించి తనహృదయమందు స్మరించుకొనుచు నగ్నిశాలయం దుపవిష్టుండయియుం

దితి సంతానాభిలాషతోఁ గశ్యపుని జేరఁబోయి ప్రార్థించుట.

డెను. అంత దితి కశ్యపునిఁ జేరఁబోయి 'మనోవల్లభా! దుర్మార్గుఁడయిన మన్మథుండు కోపారుణితలోచనుండయి విలునమ్ములుధరించి మదపుటేనుఁ గనంటికంబమును హింసించునట్లు నీతోసంగమింప నన్ను బాధపెట్టుచున్నాఁడు.ఆబాధను నేను సహింపఁజాలక నీసన్నిధికి వచ్చితిని. నన్ను దయఁజూచి యీబాధనుండి తొలఁగింపుము. అదియునుంగాక నాసవతులందఱు భవదీయానుగ్రహంబుచే గర్భిణులై యుండఁగా నే నదిచూచుచు నెట్లు సహించియుండఁగలను? నీకు మంగళమగుఁగాక. ధర్మవేదివయిన నీవు నన్ను రక్షించుట పరమకర్తవ్యము. నీవు విద్వాంసుఁడవు. నీకుఁ దెలియనియర్థంబు లోకములో నుండునా? మహానుభావుండ వయిన నీవంటివానికి సత్పురుషు లార్తులగుచున్నయెడ రక్షించుటయె పరమకర్తవ్యము. మఱియు భర్తచే గౌరవింపఁబడుచున్నస్త్రీలు లోకములో

ష్టపదార్థప్రాప్తి కలవారయి నిర్మలమయినయశంబును సంపాదించుకొందురుకదా? భవాదృశుం డగుభర్త పుత్త్రరూపముగా జన్మించుటవలన మాకుఁ గలుగుసన్మానమునకు మితియుండునా? ఇది యంతయు నీకుఁ దెలియని యర్థముకాదు. మఱియు నీయందు మాకు నెంతోయనురాగంబు గలదు. మాచిన్నతనములో మాతండ్రియగు దక్షుండు మస్సుందఱను బిలిచి 'మీ కనుకూలుం డగుభర్త యెవ్వఁడో చెప్పితిరేని నే నాతని కిచ్చి పెండ్లి చేయుదు'నని పలికి మే మందఱము నిన్నే వరించియున్నట్లు తెలిసికొని మాపదుమువుర నీ కొసంగెను. కావున నీయం దవ్యాజానురాగంబుతో మెలఁగుచున్న నాకోర్కె నెఱవేర్పకుంట నీకెంతేనియు ధర్మముకాదు. మఱియు నోమహాత్మా! భవాదృశు లగువారిని గూర్చిన యభిలషితం బెప్పుడును వ్యర్థము కాఁగూడదు. కావున నన్ను రక్షింపు, మని దీనయయి కామపీడితయయి వేఁడుకొను దితిని జూచి కశ్యపుఁ డిట్లనియె. "ఓసుందరీ! నీవు చెప్పిన దంతయు సత్యమే. నీవు కోరినకార్యమును

కశ్యపుఁడు భార్యకు హితోపదేశము చేయుట.

నెఱవేర్చెదను. అవ్యాజప్రేమతోఁ దన్నుఁ జేరవచ్చుచుఁ ద్రివర్గమును లభింపఁజేసెడిభార్యకోర్కె నెవ్వఁడు దీర్పకుండఁగలఁడు? పురుషుండు ధర్మార్థకామము లనుపురుషార్థముల భార్యవలననుండియే పొందుచున్నాఁడు. పురుషుఁడు సపత్నీకుఁడయి యున్నయెడల సర్వాశ్రమవాసులను బోషింపఁగలఁడు. మఱియు నౌక సముద్రమును దరింపఁజేయునట్లు భార్య తనభర్తను నింద్రియవ్యసనమనెడి సముద్రమును దరింపఁజేయఁగలదు. ఇంద్రియముల జయించుటలో భార్య తోడుపడుచున్నది. కావునఁ

బురుషునకు భార్య యింద్రియజయమూలమున మోక్షసాధ నిగూడ నగుచున్నది. శ్రేయస్కాముఁడయినభర్తకు భార్య యర్ధ శరీరము. కావుననే భర్త గృహకృత్యభాగంబునంతను భార్యయం దుంచి తాను నిశ్చింతతోఁ బఱలుచున్నాఁడు. ఓసుందరీ! దుర్గాధినా థుఁడగు రాజు దుర్గాగ్రలగుచోరులను లీలగా జయించినట్లు మే ము నీవంటిధర్మపత్ని నాశ్రయించి, బ్రహ్మచర్యాద్యాశ్రమములకు దుర్జయములగు నింద్రియంబులను లీలగా జయించుచున్నాము. భర్త కిన్నివిధములఁ దోడుపడుచున్న భార్యకుఁ దిరిగి యుపకార ము చేసి యామెఋణంబుదీర్ప నీపురుషాయువు చాలదు. జన్మాం తరములుగూడఁ జాల నని తలంచెద. మఱియు భార్యఋణంబు దీర్ప భర్త సమర్థుండు కానేరఁడు. కావున నీవు నాకు సర్వవిధంబుల నుపకారము చేయుచున్నావు. నీఋణంబును దీర్ప నేను సమర్థుం డనుగాను. అయినను నాచేనగు నుపకారంబు చేయుచు నిన్ను సంతసిపఁ జేయుట కెంతమాత్రము సందియంబు లేదు. నీవు సంతా నము నభిలషించి వచ్చినదానవు. కావున నీకోర్కెతప్పక నెఱవే ర్చెదను. ఇందుల కెంతమాత్రము సందియము లేదు. కాని యొ క్కముహూర్తకాలము ప్రతీక్షించి యుండుము. ఈసమయము మిగుల భయంకరమయినది. ఇది భయంకరులకుఁగూడ భయం కరమయినది. ఇట్టికాలములయందు సంగమించుట కడు నిషిద్ధ కర్మము. ఇది సంధ్యాసమయము. ఈ సమయమునందు రుద్రుం డు భూతగణంబులతోఁగూడఁ జరించుచుండును. మఱియు భూ తేశ్వరుఁ డయినరుద్రుం డీసమయమందు సమస్తభూతములకు సుఖముగలిగించుచుఁ బ్రమథగణంబులచే సేవింపఁబడుచు వృష భవాహనాధిరూఢుం డయి ప్రవర్తించుచుండును. మఱియు

### కశ్యపుఁడు దితికి రుద్రప్రభావమును దెలుపుట.

నీమఱఁదియగు నీశ్వరుండు శ్మశానభూమియందుఁగూర్చుండి సుడిగాడ్పులవలనఁ గలిగిన ధూళులచే ధూమ్రములయి విక్షిప్తములయి యున్న జటాభరములుగలవాఁడయి భస్మావలిప్తశరీరుండయి మూఁడునేత్రములతో సర్వము నీక్షించుచుండును. అతనికిఁ గనఁబడనిస్థలము లోకంబున లేదు. బంధుత్వమాలోచింపుము. బంధువులు చూచుచుండ సంగమించుట యుచితముకాదు. మనకు నతనికి బంధుత్వ ముండుటంబట్టి యేమియుఁ జేయఁడని యోజింపకుము. అతనికిఁ దనవారనియుఁ బెఱవారనియు లేరు. అతనికి నిందనీయులుగాని, యాదరణీయులుగాని లేరు. తత్త్వదర్శులమయినను సంసారులమగు మేమునందఱమును రుద్రశరీరకుఁడగు నీశ్వరుని పాదములచే నిర్మాల్యమువలె దూరముగాఁ బరిత్యజింపఁబడినదై తదనుభూతమగుచుఁ దన్మయమయి యున్న యావిభూతిని నైశ్వర్యసాధనములగు వ్రతములచేఁ బ్రార్థించుచున్నాము. శ్మశానమందుఁ బిశాచమువలె సంచరించు నశుచియగు రుద్రునికి జంక నేల? అని యనరాదు. అతనిచరిత్రము నిగూఢమైనది. బుద్ధిమంతు లాతనిచరిత్ర యవిద్య నావరింపఁ గలదని చెప్పుదురు. “శంకరాజ్ఞానమన్విచ్ఛే”త్తనియుండుటంబట్టి జ్ఞానార్థులుగొందఱు నాతనిచరిత్రమును గీర్తించుచుందురు. తాను జ్ఞానప్రదానమున సామర్థ్యాతిశయములు లేనివాఁడయినను, జ్ఞానోపాయుఁడై పిశాచమువలె సంచరించుచుండును. తన్నుపాసించువారందఱు నట్లు వర్తింపవలయు నని బోధింపఁ దానుం బిశాచచర్య నవలంబించియుండెను గాన నంతమాత్రమున నతఁడపవిత్రుఁడనుటకు వలనుపడదు. జ్ఞానార్థులకు నాతనిచరిత్ర ముపాదేయ మగుటచే వందనీయ మయినది

కాని నిందనీయము కాదు. స్వాత్మానుభవమందే నిరతి గలయతని చేష్టితమును దెలియనివారు దాని నిందించి యపహసించుచుందురు. వారందఱు వస్త్రమాల్యాద్యలంకారాదులచే శునకభోజ్యమగుశరీరము నలంకరించుచు దానినే యాత్మగాఁ దలపోయునట్టి యవివేకు లని యెఱుంగుము. పులస్త్యపులహాదులందఱాతఁడేర్పఱిచిన మర్యాదలను బాలించుచున్నారు. ఈవిశ్వమునకు సంహర్తయగుటం జేసి యతఁడు విశ్వకారణుఁడగుచున్నాఁడు. అధిష్ఠాతయగుటంబట్టి యహంకార మతనియాజ్ఞ ననుసరించి వర్తించును. పిశాచచర్య యున్నట్లు నటించునేకాని నిజముగ నతని కది లేదు సుమీ? అతఁ డెంత ఘోరదండనమయినఁ గావింపఁగలఁడు. అతని పాదపద్మములను సేవించుచు జ్ఞానవంతులమయి మే మందఱము మాయామయమగు విభూతిని వాడినపూలదండవలె దూరముగాఁ దొలఁగించుచున్నాము. మఱియు నమ్మహాత్ముని చరిత్రము లవిద్యను భేదింపఁజాలిన వని పెద్ద లందురు. అతఁడు నిరస్తమయిన యతిశయముగలవాఁడయి వర్తించుచున్నాఁడు. అతని దయవలననే బ్రహ్మకంటె నర్వాచీనులగు సురలందఱు నున్నతపదవులఁ బొందియున్నారు. మాయాకార్యమయిన యహంకృతి యతనియాజ్ఞను శిరంబునఁదాల్చి వర్తించుచుండును. ఆమహాత్ముని లోకములోనివా రందఱు సేవిచుచుందురు. అట్టిమహానుభావునిఁ గొందఱు హీనమతులు శ్మశానవాసుఁడనియు, బిచ్చమెత్తుకొనువాఁడనియు నిట్లు హాస్యము చేయుదురు.'' అని యిట్లు బోధించుచున్న పతివాక్యముల సరకుగొనక మన్మథోద్దీపితములగు నింద్రియములుగలదితి మన్మథబాధను సహింపఁజాలక వారకామినివలె గతత్రపయయి భర్తపయింబడి యాతనికట్టుపు

ట్టము నాకర్షించెను. ఇట్లు నిషిద్ధకర్మమందు నిర్బంధము చేయు చున్న భార్య నేమియు ననఁజాలక దైవమునకు మ్రొక్కి రహస్య ప్రదేశంబు చేరి దానియభీష్టంబు నెఱవేర్చెను. పిమ్మట నమ్మహాముని చయ్యన నదికిఁబోయి స్నానము చేసి, ప్రాణాయామము గావించి మౌన మవలంబించి నిర్వికారుఁడును, జ్ఞానస్వరూపుఁడును, సనాతనుఁ డునగు బ్రహ్మమును ధ్యానంబు చేయుచు, బ్రహ్మప్రతిపాదకమయిన ప్రణవమును జపింప నారంభించెను. తరువాత దితియుఁ దాను జేసి న దుష్టకార్యమునకు సిగ్గు చెందుచు మనంబులోఁ గుందుచు నాక శ్యపునిఁ జేరఁబోయి యవనతాననయయి యిట్లు పలికెను. "ఓప్రి యవల్లభా ! నేను జేసిన కార్యము మిగుల దుష్టమయినది. నీహి తోపదేశము విననందులకు నాపయిఁ గినియకుము. దయార్ద్రదృ ష్టిం బ్రసరింపఁ జేయుము. మఱియు భూతపతియయిన శంకరునకు నే నపరాధము చేసియున్నాను. అందుల కతఁడు కోపించి నాగర్భ స్థజంతువును హింసించునేమో! అట్టితంపు చేయకుండునట్టు లేదయిననుపాయ మాలోచింపుము. మఱియు నింద్రాదిదేవ తల కధిపతియు భూతపతియు శాంతస్వరూపుఁడును దుర్జనసంహా రుండును శ్రితజనార్తిహరుండునగు హరునకు నమస్కారంబు గా వించుచున్నాను. సతీభర్తయగు నీశ్వరుండు కటికివానికిఁ గూడ దయనీయలగు స్త్రీలమయినమాయెడ దయగలిగి వర్తించుఁగాక. మాకుఁ బ్రసన్నుండగుఁగాక". అని యిట్లు తనగర్భమందున్న పిండ మున కపాయము కలుగకుండుటకయి దేవతలకు మ్రొక్కుచు మిగులఁ బరితపించుచున్న భార్యను జూచి సంధ్యావందనాదికృత్యం బులు నెఱవేర్చుకొనినవాఁడయి కశ్యపుఁ డిట్లనియె. "ఓదురదృష్ట వంతురాలా ! నీ విట్లు పరితపించుటవలన నేమి ప్రయోజనము ?

ఓసుందరీ! నీచిత్తము పరిశుద్ధిని బొంది యుండకపోవుటచేతను సంధ్యాకాలసంజనితమయినదోషముచేతను, నాహితోపదేశము నతిక్రమించిన దానవగుటచేతను, భూతపతియయిన యీశ్వరుని దిరస్కరించుటచేతను, నీకుఁగలిగెడికుమారులు లోకములకమంగళకరులయి యుందురు. ఆపుత్త్రాధములు లోకములను స్త్రీలను దేవతలను మానవులను మునీంద్రులను మాటిమాటికి దుఃఖింపఁజేయుచు ముల్లోకముల నాక్రమించుకొందురు. ఇట్లు వారు లోకకంటకులయి మహాత్ములకోపమునకుఁ బాత్రులయి దీను లయినమానవుల సంహరించుచుఁ బతివ్రతాస్త్రీలను బలాత్కరించుచు విహరించుచుండ లోకపాలకుఁడయిన భగవంతుండు కోపించి వరాహనరసింహావతారములను దాలిచి దేవేంద్రుఁడు పర్వతముల ఛేదించినట్లు నీసుతుల నిద్దఱను సంహరింపఁగలండు. ఇంతకు నీయుపచారమే కారణమయియున్న"దని పలుకుచున్నకశ్యపమహామునిని జూచి దితి యిట్లనియె. "ఓవల్లభా! నాకుమారులకు భగవంతునివలన మరణముసంభవించునని వినుట కెంతేయు నంతసించుచున్నాను. అతనివలననుండియే మరణము కలుగునట్లనుగ్రహింతువుగాక. బ్రాహ్మణులశాపముచేఁ జచ్చుటకంటె భగవంతునిచేఁ జచ్చుట మిగులమంచిది. బ్రాహ్మణహతులగువారతిపాపులయి నరకలోకవాసులయినను బాత్రులు కానేరరు. మఱియు నట్టిపాపాత్ములఁ గన్నవారికిఁగూడ నరకంబులు ప్రాప్తించుట ధ్రువము" అనిపలుకుచున్నప్రియురాలిం జూచి కశ్యపుఁడిట్లనియె. 'ఓసుందరీ! నీవు తొలుదొలుతఁ బాపకార్యముచేసినను దరువాతఁ బశ్చాత్తాపము నొందుచున్నావు. మఱియు విష్ణునియందు మిగుల గౌరవము గలిగి యున్నదానవు. నాయందు నీశ్వరుని

యందు సమాదరము గలిగియున్న దానవు. దురాత్ములయిన నీకు మూరు లిరువురిలో నొకఁడయిన హిరణ్యకశిపునకు గౌరవనీయుఁడును హరిభక్తాగ్రేసరుండును, నగుపుత్త్రుండు పుట్టఁగలఁడు. అతని కీర్తిని భగవంతునికీర్తితో సమముగా గానము చేయుదురు. సాధువులతనిశీలము ననుసరింప తాపరాదిసంయోగము చేఁ జెడ్డబంగారమునునలెఁ దమయాత్మలనుగుణములచే శుభ్రపఱుచుకొందురు. ఎవని యనుగ్రహమువలన లోకములు ప్రసన్నములగుచున్నవో, యీవిశ్వమంతయు నెవనిశరీరమయి విలసిల్లుచున్నదో, యట్టిభగవంతుని నీమనుమఁడు భక్తివిశేషముచే సంతోషపెట్టఁగలండు. ఆపిల్లవాఁడు సుగుణములు గలవాఁడయి యుండును. పరమభాగవతోత్తముఁడని యతఁడు ఖ్యాతిఁ గాంచఁగలఁడు. అతఁడు సాధుజనులకుఁ బూజనీయుఁడు. అతఁడు నిర్మలమయిన యంతఃకరణముగలవాఁడు; హరిభక్తి పెంపుచే నతఁడు చిత్తమును బవిత్రముగాఁ జేసికొని హరిని మనంబున నిడికొని తక్కిన రాజ్యసంపదల నన్నింటిని విడిచిపెట్టును. మఱియు నతఁడు సంసారాసక్తుఁడయి యుండఁడు. అతఁడు సచ్చరిత్రగలవాఁడు. అతఁడు పరులు దుఃఖించుటచూచి తాను దుఃఖించునంతటి కరుణాసక్తచిత్తముకలవాఁడు. అతఁడు తండ్రివలెనే లోకకంటకుఁ డయియుండఁడు. మఱియు నతఁడు గ్రీష్మకాలసంతాపమును జంద్రుండు తనచల్లనికిరణములచే హరించి లోకమును సంతసింపఁ జేసినట్లు తనతండ్రిచే మిగులఁ బరితపించియున్నలోకమును తనసుగుణసముదాయముచే సంతసింపఁ జేయఁగలఁడు. మఱియు నతఁడు తన హృదయకమలమందును బహిర్భాగములయందును విలసితకుండలాలంకృతమయిన హరిసుందరవదనమును జూడఁగలఁ' డని పలు

కుచున్నకశ్యపునివచనంబులు విని దితి తనకుమారులకు బ్రాహ్మ
ణశాపమువలనఁగాక హరివలన మరణము కలుగుటకును, బర
మభాగవతోత్తముఁడయినమనుమండు గలుగు నని వినుటకును
మిగుల సంతుష్టయయి కాలము గడపుచుండెను. ఇది పదునాల్గవ
యధ్యాయము.



ఓవిదురా! ఇట్లు దితి సంతసముతోఁ గాలంబు గడపుచుఁ
గశ్యపుని సంబంధించినట్టి వీర్యంబును ధరించి తనసవతికుమారుఁ
డయినయింద్రుఁ డేమయినను దనగర్భమునకు నపాయము కలి
గించునేమో యని శంకించుచుండ నూఱుసంవత్సరంబులు గతిం
చినవి. ఆసమయంబున దితి గర్భమం దున్నతేజంబు దిక్కులం
గప్పి సూర్యచంద్రకాంతులం దిరస్కారంబు గావించెను. అంత
దేవతలు సూర్యకాంతి లేకపోవుటంబట్టి యహర్నిశావిభాగంబు
దెలియనేరనివారయి బ్రహ్మయొద్దకుఁబోయి యిట్లు విన్నవించికొ

**సురలు బ్రహ్మతో మొఱపెట్టుకొనుట.**

నిరి. 'ఓచతుర్ముఖా! నీకు వందనంబు లాచరించుచున్నాము. నీవు
త్రికాలవేదివి. కాన మాకు సంప్రాప్త మయినభయకారణంబు
నీకుఁ దెలియకపోదు. మఱియు నీవు భగవంతుని యావేశావతా
రమయియున్నావు. కావున నీవు సర్వజ్ఞుండవనుటకు సందియము
లేదు. ఓదేవా! నీవు వేల్పులకెల్ల వేల్పవు. లోకనాథుల కెల్ల
రకు శిరోమణివంటివాఁడవు. నీవు మాయభిప్రాయములను మా
కంటెఁ బూర్వులయభిప్రాయములను జక్కఁగ దెలిసినవాఁడవు.
నీవు జగత్కారణుఁడవు; జగన్నిర్మాణముకొఱకు రజోగుణ
ము నవలంబించిన భగవంతుండవు.నీవు మాయను బురస్కరించు
కొని సమస్తమును సృజించుచున్నావు. అట్టి మహానుభావుఁడ

వయిన నీకు వందనంబు లాచరించుచున్నాము. ఓ కమలాసనా! నీవు సమస్తజీవులను దేవమనుష్యాదిరూపములగా భావించి నిర్మించుచున్నావు. సమస్తచరాచర ప్రపంచమును నీయందుంచుకొనుచున్నావు. నీవు సమస్తకార్యకారణరూపుఁడవు. ఇట్టి నిన్నుఁ బరిపక్వములయిన యోగంబులచే నెవ్వరు భావించుచున్నారో యట్టివారలు నిర్జితపవనులై జితేంద్రియులై నీదయకుఁ బాత్రులై లోకమునఁ బరాభవము పొందకుండ వర్తించుచుందురు. ఎవని వేదాత్మకవాక్కులకు సకలజంతువులు బద్ధులై పాశబద్ధములయిన పశువులచందంబున స్వాధీనులై నీకుఁ బూజలనొసర్చుచున్నారో యట్టినీకు నమస్కారంబు కావించుచున్నారము. ఓ దేవా. అహోరాత్రవిభాగంబు లేకపోవుటచేఁ గర్మకలాపమంతయు నశించుచున్నది. అందుచే మేము మిగుల నాపన్నుల మగుచున్నారము. మమ్ము దయతోఁజూచి మాకు సుఖంబు గలిగింప సమర్థుండవునీవే. ఓవిధాతా! కశ్యపుని తేజంబు దితిగర్భంబునంబడి వర్ధిల్లుచు సమస్తదిశలను నంధకారబంధురంబు గావించుచు దారువునందున్న యగ్నివలెనే నిగూఢముగా నుండి పెంపు చెందుచున్నది. కావున మమ్మావిపదంబుధినుండి తరింపఁజేయుము” అని ప్రార్థించుచున్న దేవతలపలుకు లాకర్ణించి నవ్వి వేదవేద్యుఁడయిన కమలాసనుండు మధురవాక్యంబులచే వారిని సంతసింపఁజేయుచు నిట్లుపలికెను. ‘ఓగీర్వాణులారా! మీ రెంతమాత్రము దుఃఖింపఁబనిలేదు. నే నొకటి చెప్పుచున్నాను. సావధానులరయి వినుండు. మీపూర్వజులును నాతనూభవులునగు సనకాదిమునీంద్రులు నల్వురు గతస్పృహులై గగనగమనముచే లోకములఁ గ్రుమ్మరుచు నొకనాఁడు సర్వలోకములకును వందనీయమగు వై

బ్రహ్మ సురలతో వైకుంఠభువనప్రభావమును జెప్పుట.

కుంఠంబునకుఁ బోయిరి. ఆవైకుంఠమునందు వసించుచున్నవారందఱు విష్ణువుతో సమానములయిన యాకారములు గలవారయి నిష్కాములయి హరిని సర్వకాలములయందుఁ బూజించుచుందురు. అచ్చట వేదవేద్యుఁడును బరమపురుషుండును, బరమకారణభూతుఁడును, షాడ్గుణ్యపరిపూర్ణుఁడును నగు పరమపురుషుండు రజోగుణవిరహితమై, శుద్ధసత్త్వమయమై, యున్న దేహమును దాల్చి తనభక్తులను సుఖింపఁ జేయుచుండును. అచ్చట నిశ్రేయస మనునట్టివన మొకటి కలదు. ఆవనము షడృతుజన్యములగు ఫలపుష్పసంపదలతోఁ జెన్నారుచుండును. అయ్యది సమస్తవాంఛలను సమకూర్చుకల్పతరువులచే మిగులఁ బ్రకాశించుచుండును. అది మూర్తిమంతమయిన మోక్షసుఖమువలె నుండును. అచ్చటివారు భార్యలతోఁగూడ విమానముల నధివసించి లోకపాపహరము లయినహరిసచ్చరిత్రములను గానము చేయుచు, మకరందసందోహమును స్రవించుపుష్పసంపదలతోఁ దుల దూఁగుచున్నమాధవీలతలవికసితకుసుమముల పరిమళంబుచే హృదయంబులు సంతసింప విషయసుఖంబులకుఁ గారణభూతమయిన వాయువును దిరస్కరించుచు విహరించుచుందురు. భోగ్యవస్తువులును, భోగోపకరణములును, భోగస్థానములును దమ కలవడుచున్నను వాని నాదరింపక భగవద్గుణానుభవమందే నిరతిశయాభిలాష కలిగియుందురు. ఆ నిశ్రేయసవనమందుండు పక్షివిశేషములే భగవద్గుణాసక్తి కలవయి యుండ నందలిపురుషులు భగవద్గుణాసక్తి కలవా రయి యుందు రని వేఱ చెప్పవలయునా? మఱియు నచ్చటఁ బావురములు, రాజహంసములు, శుకపికాదు

లు, సారసములు, మయూరములు, తిత్తిరిపక్షులు, చక్రవాకములు, మొదలగు పక్షిజాలము, లతమధురముగా భృంగము ఝుంకారము చేయుచుండ విని, తామన్నియు, "అదిగో భృంగము హరికథాగానము చేయుచున్నది. మీనినాదంబులు మాని చక్కగావినుండ" ని పల్కుచుఁ దమతెమధ్వనులను విడిచిపెట్టి భృంగఝుంకారములనే వినుచుండును. ఆవనమందు మందారపుష్పములును, మల్లికాసుమములును, గోరంట పూవులును, నుత్పలములును, జంపకములును, బద్మములును, నాగ కేసరములును, బొన్నలును, వకుళములును, బారిజాతములును, మనోహరములయి సుగంధభరితములయి విలసిల్లుచున్నను భగవంతుండు వాని విడనాడి తులసిని భూషణముగాఁ జేకొనెను. ఆపుష్పములట్లు హరిచే నిరాకృతంబులయినను నపి మాత్సర్యమును విడిచి యావనంబులోనితులసిని జేరఁబోయి "సీతపంబు నిరుపమానమయినది. మేముమిగుల మనోహరులమైయున్నను భగవంతుని కలంకారమ్ములమై యుండలేకపోతిమి. జన్మమున్న నీదేజన్మ"ని గౌరవించుచుండును. ఇందువలన స్థావరములునైతము భగవద్గుణాసక్తి గలిగి మచ్చరంబును విడిచియున్నవని తెలియవచ్చుచున్నదికదా! ఆవైకుంఠము, భగవత్పాదభక్తివలన లబ్ధములైన వైడూర్యముల చేతను, మరకతమణులచేతను, గాంచనముచేతను, నిర్మితములై యున్నభక్తవర్యుల విమానములచే నిండియుండును. ఆభక్తవర్యులు భార్యాసహితులైవర్తించుచున్నను, కేవలముహరియందు దృఢమనస్కులైయుందురుకాన యాపురుషులకు వారిభార్యలు విశాలకటితటములు కలవారైనను మందహాససుందరవదనములు కలవారైనను, బరిహాసాదులచేఁ గామమును గలిగింపలేరు. ఆవై

కుంఠమునం దెవరియనుగ్రహముకై యితరులు ప్రయత్నించు చున్నారో యట్టిలక్ష్మీదేవి నిజరూపధారిణియయి నూపురధ్వనుల నల్గడల నించుచు రాగాదిదోషములు లేనిదయి విలాసపద్మమును ధరించి తనరూపము స్ఫటికమయములయిన కుడ్యములందు బ్రతిఫలించి ప్రకాశించుచుండ విహరించుచు మాధవుని మందిరంబుల స్వయముగానే తుడిచి శుభ్రపఱుచుచుండును. విద్రుమరత్నరచితములగు తటములు ప్రకాశింప నిర్మలవారిపూరముచే నొప్పు దిగుడుబావులందును, క్రీడావనములందును,నామె పరిచారికాబృందముతోఁ గూడ విహరించుచుఁ,దులసీదళములచే భగవంతుని పదకమలములఁ బూజించుచు,నిర్మలమయిన నీరపరిసరమున నిలువఁబడినప్పుడు తనమొగంబు జలంబులఁ బ్రతిబింబింప నాప్రతిబింబమును జూచి తనభర్త సుందరకుంతలములు గలిగి యున్న తనాసికతో నలరుచున్నతనముఖపద్మమును ముద్దుపెట్టుకొనుచున్నాడేమోయని భ్రమచెంది సిగ్గుపడుచుఁ బ్రవర్తించుచుండును. ఆవైకుంఠపురము కేవలము పుణ్యాత్ములకే సులభమయినదికాని పాపాత్ములు పొందలేరు. అర్థకామాదివిషయాసక్తచిత్తులయి కావుననే, మహనీయములయిన హరిచరిత్రములవిడిచి కుత్సితకథలను వినువార లాపురమును జేరలేరు. ఆకుత్సితకథలు నిర్భాగ్యులయిన మానవులచే శ్రుతములై, యాశ్రోతల పుణ్యముల నపహరించి వారల నిరాలంబములగు నరకములందుఁ బడవేయును. లోకములో నీచులు తమయదృష్టంబువలన మానవజన్మమును బొందినను నివృత్తిధర్మసహితమగు తత్వజ్ఞానమును, సంపాదించుకొనలేక భగవన్మాయచే మోహితులయి భక్తిహీనులయి మానవజన్మసాధ్యమయినభగవదారాధనమును జేయక ప్రవ

ర్తించుచుందురు. అట్టియవివేకులఁ జూచుటచే నాకు మిగుల విచారము కలుగుచున్నది. అట్టివార లాలోకమును స్వప్నమందయినను జూడలేరు. కాని యేమహాత్ము లనవరతము హరిపాదకమలంబుల మనఃకమలములందుఁ జేర్చి శమదమాదిగుణములు కలవారలయి సర్వదా హరిసచ్చరిత్రములనే పరస్పరము చెప్పుకొనుచు, భక్తి పారవశ్యముచే నానందబాష్పముల రాల్చుచు, నందువలననే పులకితసర్వాంగులయి ప్రవర్తించుచున్నారో యట్టివార లవశ్యముగా వైకుంఠమునకుఁ బోవుదురు. ఓ దేవతలారా! భువనైకసుందరంబును, నపూర్వదృష్టంబును భగవంతునికి నివాసభూతంబును నయి, దేవతాశ్రేష్ఠుల విమానకాంతులచే నలరారుచు, నాశ్చర్యముగొలుపుచు నున్నవైకుంఠపురమును సనకా

సనకాదుదులు వైకుంఠమునకు బ్రవేశించుట

దిమునీంద్రులు తమయోగబలముచేఁ జేరఁబోయి మిగుల నానందించిరి. అనంతర మాసనకసనందనాదు లప్పురంబుచొచ్చి యుభయపార్శ్వంబులు మనోహరము లయినసౌధరాజంబులచేఁ బ్రకాశించుచున్నను నారాయణదర్శనకుతూహలు లైనవారవుటంబట్టి చూడనొల్లక నవరత్నఖచితము లయి యున్నకక్ష్యల నాఱింటిని దాఁటి పోయిపోయి యేడవకక్ష్యఁ బ్రవేశించిరి. అట్లు వారలు ప్రవేశించుడు వారికచ్చట నిరువురు ద్వారపాలురు దృష్టిపథంబునం బడిరి. వారు కనకమయములు మణిమయములు నగు హారకేయూరాంగుళీయకాదిభూషణంబుల ధరించియుండిరి. వారలు నూతనపరిమళంబునందలిలోలత్వముచే వచ్చిన మధుకరనికరంబుచే వెలయువనమాలికల ధరించియుండిరి. వారలహస్తంబులఁ జూపఱకు భయంబుగొలుపుగదాదండంబు లొప్పుచుం

డెను. వారలు గజతుండాదండంబుల నీసడించుబాహాచతుష్క
ముతో నొప్పుచుండిరి. వారలనేత్రములు కినుకచే నరుణితంబు
లయియుండెను. వారలముఖములు కుటిలభ్రుకుటులచే భయంకర
ముగా నుండెను. వారిద్దఱు నారాయణుని కేళీమందిర ద్వారంబు
చెంత వర్తించుచుండిరి.అంత నాద్వారపాలురు తమ్ముఁ బొడగాం
చుచుండ సనకాదులు నేమియు మాటలాడక సుంతేనియుఁ జంకక
భగవద్దర్శనకుతూహాలులయి, పంచవర్షప్రాయులవలెఁ గనఁబడు
చు నమ్మందిరద్వారంబునఁ బడిపోవుచుండిరి. అట్లు సనకాదులు
వారినడుగకుండ లోనికిఁజొచ్చుట బుద్ధిహీనతను వ్యక్తపఱచుచు
న్నదని యందురేమో?అట్లనుటకు వీలులేదు. ఆమునులు సమస్త
మందును సమదృష్టికలవారు. కావుననే వారు శంకారహితులై,
యనివారితులై లోకంబులనెల్లఁ గ్రుమ్మరుచున్నారు. నిరంకు
శు లగునట్టివారికి నితరుల నడుగవలసినయవసరమేమి? అంత భ
గవంతునికిఁ బ్రతికూలముగుశీలము కలయాద్వారపాలురు, దిగం
బరులై, వృద్ధులైనను, నైదువత్సరముల ప్రాయముగలబాలుర
వలెఁ జూపట్టుచుఁ, బరమాత్మయాథాత్మ్యమును దెలిసియున్న
యామునులంగాంచి వారలప్రభావము నెఱుంగక పరిహాసించుచు,

**{ జయవిజయులు సనకాదుల నడ్డగించుట, సనకాదులు వారికి శాపమిచ్చుట. }**

నివారణానర్హులయినను నేత్రములచేతను వాక్కులచేతను నివా
రించిరి. అంత సనకాదులు భగవంతునిద్వారపాలురచే నిరోధింపఁ
బడి, దేవతలువీక్షించుచుండఁ,దాము పూజ్యతములయినను నివా
రించుటవలనఁ బరిభవమునొంది, భగవద్దర్శనమునకు భంగము
గలుగుటవలన నల్పక్రోధముపూని యాకినుకచే నేత్రములు

వ్యాకులత్వంబునొందుచుండ నిట్లనిరి. ‘ మేము పరమభక్తితో నారాయణుపాదపద్మముల భజింప వచ్చుచుండ దురాత్ములగుమీర లెవ్వరో నిర్బంధించుచున్నారు. పెక్కుపున్నెంబుల నొనరించి మహత్తరమగు హరిభక్తికలవారయి భగవదనుగ్రహంబు వడసిన వారుకదా యీలోకంబులో నుందురు! ఇచ్చట నున్నవారందఱు హరిసదృశధర్మములు గలవారయి యుండవలయును. తాదృశ ధర్మములు లేనివారిం దుండఁదగరు. శ్రీహరి కిట్టివిషమస్వభావము లేదు. ఇట్లుండఁ దాదృశవిషమస్వభావము గలమీర లీ లోకంబున నుండఁదగుదురా? ప్రభుశాసనంబున మిమ్ము నిరోధించితిమి. మావలన నేరము లేదని యందు రేని చెప్పెదవి నుఁడు. ఈలోకమున నున్నవారు శాంతపురుషులు. మఱియు నిట కలహములు లేవు. వాక్పారుష్యాదిదోషరహితమగు నీ లోకమున మీవంటికుటిలస్వభావులు మఱికొందఱున్నచో వీఁడు ప్రవేశింపఁదగినవాఁడా, తగనివాఁడా? యన్నసందియ ముద యింపవచ్చును. అట్టికుటిలులను బ్రవేశింపనీవల దనెడు ప్రభుశాసనమును మన్నింపవచ్చును. కాని యీలోకము వాక్పారుష్యాది దోషములు లేనిది. ఆదోషములే లేనప్పుడు తాదృశదోషములు గలవా రెట్లు సంప్రాప్తులగుదురు ? అట్టివారే లేనప్పు డీశంకతో నేమి ప్రయోజనము? ఓమునులారా! మీమాటసత్యము. ఈలోక మట్టిదే. ఇందుఁ గుటిలు లెవ్వరును లేరు. కాని మిమ్ములఁ బ్రవేశింపఁ జేయుట భగవంతుని కిష్టము లేదని తలంచి వారించితిమని యందు రేని యట్లు శంకింపఁబని లేదు. సమస్తమును గుక్షియందు ధరించినభగవంతునియందు వీఁడు ప్రవేశింపఁదగినవాఁడనియు, వీఁడు ప్రవేశింపఁదగనివాఁడనియు, ననెడివైషమ్య మెట్లుసంభవించును?

భగవద్వ్యతిరిక్తమగువస్తు వెచ్చట నున్నది? *కావుననే యోగి

---

*ఇందుకు మూలము–'ఆత్మాన మాత్మని నభో నభసీవ ధీరాః' ఇచ్చటఁ దెలియఁదగినయంశ మేమనఁగా; ఘటపటాద్యాకాశములు మహాకాశమందుఁ గలిసి యొక్కటియైయున్నట్లు జీవాత్మలు పరమాత్మతో నైక్యము చెందుచున్నా రను నర్థము స్వీకరింపరాదు ఘటపటాద్యాకాశము లుపాధివిధూనానంతరమందు మహాకాశముతోఁ గలిసియున్నను, ప్రదేశభేదముచే ఘటపటాద్యాకాశము లామహాకాశమునఁ బ్రత్యేకముగా నుండక తీఱమిచే ఘటాకాశమహాకాశములకుఁ దాదాత్మ్యము సంభవింపదు. అట్లె యుపాధివిధూనన మయినపిమ్మట జీవాత్మలు పరమాత్మకు శరీరభూతులై ప్రత్యేకముగా నున్నవారగుటచే జీవాత్మపరమాత్మలకుఁ దాదాత్మ్యము సంభవింప నేరదు. మఱియు నిట నీయాకాశదృష్టాంతము విభాగము చేయలేకపోవువిషయమునే తీసికొనవలయును. ఎట్లనఁగా నుపాధివిధూననమయినపిమ్మట వాస్తవముగా మహాకాశమందు ఘటాకాశము ప్రత్యేకముగా నున్నను మహాకాశమునుండి ఘటాకాశమును వేఱుచేయలేనట్లు, జీవాత్మలు పరమాత్మకు శరీరభూతులై వాస్తవముగా భిన్నులై యుండినను బరమాత్మనుండి వేఱుచేయలే మనువిషయముననే దృష్టాంతమును స్వీకరింపవలసియున్నది. మఱియు వాస్తవముగా మనదేహము లాత్మలకంటెఁ బ్రత్యేకముగా నుండినను, దేహాత్మలను విభాగము చేయఁగలమా? చేయలేము. అట్లె శరీరశరీరిభావ మందియున్న జీవపరమాత్మలను వేఱుచేయుట కష్టము. ఓయీ! ఘటాకాశము మహాకాశముతోఁ గలిసినప్పు డొక్కటిగానే తెలియవచ్చుచున్నది కాని భేదమున్న ట్లనుభవసిద్ధము కాదే? కావున నీచెప్పిన దెట్లు సరిపడును? అందు రేని జెప్పెద వినుఁడు. ఘటాద్యాకాశములు కృత్స్నాకాశముతోను సంబంధము గలిగియుండునా? లేక ప్రదేశభేదముతో సంబంధము గలిగియుండునా? కృత్స్నాకాశముతో సంబంధము గలదన్నచో ఘటాద్యాకాశములకుఁగూడ విభుత్వ మంగీకరింపవలసివచ్చును. మహాకాశమున కల్పత్వము గూడ సంభవించును. కావునఁ బ్రదేశభేదముతోనే సంబంధము గలదని చెప్ప

వర్యులందఱును మహాకాశమునందు ఘటపటాద్యాకాశమును న
పృథక్సిద్ధముగా ననుసంధానము చేయుచున్నట్లు పరమాత్మయందు
జీవాత్మలనపృథక్సిద్ధముగాఁ జూచుచున్నారు. జీవాత్మలు పరమాత్మకు

---

వలయును. వేదాంతులాకాశము నిరవయవమని వాదించుచుందురు కాని వారి సిద్ధాంతము యుక్తమైనది కాదు. వేదాంతములందుఁగూడఁ బ్రదేశభేద మంగీకరించి పంచీకరణ ముపదేశింపఁబడుచున్నది. మఱియుఁ బ్రదేశభేద మంగీకరించుటం జేసియే యేకదేశమగు నాకాశమె వాయువుగాఁ బరిణమించుచున్నదని చెప్ప వలనుపడుచున్నది. అట్లేకదేశమగు నాకాశమె వాయువుగాఁ బరిణమింపక కృత్స్నాకాశమే వాయువుగాఁ బరిణమించినచో శ్రు. "పృథివ్యప్సు ప్రలీయతే" అను శ్రుతి మొదలుకొని శ్రు. "మహానవ్యక్తే లీయతే" అనునంతదాఁకఁ జెప్పిన ప్రలయక్రమమును కుదురదు. ఏమనఁగాఁ, గృత్స్నాకాశము వాయువుగాఁ బరిణమించుటచేఁ బ్రత్యేకముగా నాకాశములేదు గనుక వాయు వాకాశమందు లీనమగునని చెప్ప వలనుపడదు. అట్టి శ్రుతులకు విరోధము సంభవించుచున్నది గనుక మహాకాశము ప్రదేశభేదముచేతనే వాయువుగాఁ బరిణమించుచున్నదని చెప్పవలయును. మఱియు "ఘటధ్వంసే ఘటాకాశో నభిన్నో నభసా యథా। బ్రహ్మణా హేయ విధ్వంసే విష్ణ్వాఖ్యేన తథా పుమాన్" అని శౌనకుండు చెప్పినవాక్యముఁగూడ ఘటవిధూననానంతరమున మహాకాశమునందుఁ బ్రదేశభేదముచేతనున్న ఘటాకాశమునకు ఘటప్రయుక్తములగు నల్పత్వాది వైషమ్యములేనట్లు యుపాధివిధూనన మయిన పిమ్మట గుణాష్టకావిర్భావమునొందు పరమాత్మకంటెఁ బ్రత్యేకముగా నున్న జీవునకు నుపాధినిమిత్తముచేఁ గల్గిన సుఖిత్వదుఃఖిత్వాది వైషమ్యములు లేవనుటలో సామ్యము చెప్పు నిమిత్తమేయని స్వీకరింపవలయును. కావున జీవాత్మలు పరమాత్మకు శరీరభూతులనియు, నాశరీరమునకుఁ బృథక్సిద్ధమై యుండకపోవుట స్వభావ మనియు, జీవపరమాత్మల కవాంతరభేదమున్నను జ్ఞానైకాకారత్వమును బట్టి సామ్యమున్నదనియు, నభోదృష్టాంతము పరమాత్మనుండి జీవులను విభాగము చేయలేకపోవు విషయముననే యనియు గ్రహింపవలయును.

శరీరభూతులయి యపృథక్సిద్ధులగుటం జేసి,జీవపరమాత్మల కవాంతరభేదమున్నను జ్ఞానైకాకారతనుబట్టి భేదము లేదు. భగవంతుఁ డిట్లు సర్వాత్మకుఁడై యుండఁగా నిట్టి వైషమ్యముండుట యసంభవము. రాగద్వేషాదిరహితమయిన యిట్టిప్రదేశమందు ననుకూలవేషధారులయిన మీరల్పవైషమ్యమును బురస్కరించుకొని యన్యనివారణ మేలచేసితిరి. కావున సమాభ్యధికరహితుఁడైన విష్ణుమూర్తి సేవకులయ్యు మందబుద్ధులైన మీ రాచరించిన దుశ్చేష్టకుఁ దగిన ప్రతిక్రియ నాలోచించితిమి.*మీ రీలోకమును

---

* ఓయీ! నిత్యసిద్ధులైన జయవిజయులకు శాపానుభవ మెట్లు? అనిత్యముక్తులు హేయగుణరహితులై యెల్లప్పుడును సంకోచమునొందని జ్ఞానైశ్వర్యాది గుణములు గలవారు కావుననే, శ్లో॥ "సత్యజ్ఞానక్రియైశ్వర్యభోగోపకరణాన్వితా" అని చెప్పఁబడియున్నది. నీవు చెప్పిన దెట్లు సరిపడునని యందువేని జెప్పెద వినుఁడు. ఈజయవిజయులు ద్వారపాలురుగాని నీ వన్నట్లు నిత్యముక్తులుగారు. ఈజయవిజయులు సుకృతపరిపాకమువలనఁ బరమాకాశనిలయులయిన నిత్యసిద్ధులతోఁ దుల్యమైన యాకారము గలవారయి ద్వారాధికారమును బొందియున్నారు. "భూమాప్రస్తరశాయీచ విష్ణోరనుచరోభవ" అనుటంబట్టి భగవదనుచరత్వ మనుష్ఠానవిశేషమువలన లభింపవచ్చు. మఱియు వీరు నిత్యసిద్ధులే యైనచో, శ్లో॥ "నిత్యజ్ఞానక్రియైశ్వర్య" ఇత్యాదికముచేఁ జెప్పఁబడినట్లు నిత్యము నసంకుచితజ్ఞానాదులు గలవా రగుటచే భగవదభిప్రాయమును దెలిసికొని సనకాదుల నిర్బంధింపకయే యుందురు. వీర లట్టి భగవదభిప్రాయము నెఱుంగరు కావున వీరు నిత్యసిద్ధులుకారు. నిత్యముక్తత్వమును బొందకుండ భగవదనుచరులై యున్నవారు శేషసుపర్ణజాతీయులు పెక్కురు కలరు. ఓయీ ! నీ వన్నట్లు జయవిజయులు నిత్యముక్తులే కానిచో శ్లో॥ "నందస్సునందోథజయో విజయః ప్రబలోబలః । కుముదః కుముదాక్షశ్చ విష్వక్సేనః పతత్రిరాట్ ॥ జయశ్చ శ్రుతదేవశ్చ పుష్పదంతోథ సాత్వతః । సర్వే నాగాయుతప్రాణా శ్చమూ

విడిచిపోయి వైషమ్యబుద్ధిచే మిగులఁ బాపీయములై కామక్రోధలోభములనెడు నంతశ్శత్రువులతో వ్యాపించియున్న లోకములంగూర్చి పొందు. మీవంటివిషమబుద్ధుల కాలోకములే నివసింపఁదగియున్నవి. కాని యిది కాదు.'' అని పలికిన సనకాదులవాక్యము బ్రహ్మశాపరూపమై, యస్త్రసమూహములచే ననివారితమయి తమ్ముఁదాఁకఁగా దాని నాలకించి హరియనుచరులగు జయవిజయులు భయాతిశయముచే మిగులఁ గంపితులై మునీంద్రుల పాదములపైఁబడి దండప్రణామము లాచరించి యిట్లు విన్నవించుకొనిరి. ''ఓమునీంద్రులారా! మీమనంబులు నొచ్చునట్లు కారుకూఁతలుపలికి మహాపరాధంబుచేసిన మాకుఁ దగినశిక్ష కావించినారు. మీవలన సుంతేనియు నేరములేదు. ఆతప్పిదమంతయు మా

---

స్తే జఘ్నురాసురీః'' అని త్రివిక్రమణకాలమునఁ జెప్పఁబడినయీవాక్య మెట్లు సరిపడును? జయవిజయులను నిత్యముక్తులలో నేల పఠింపవలెను? కావున వీరు నిత్యముక్తులే కాని వేఱయినవారు కారు. నిత్యముక్తులకు శాపానుభవ మెట్లనియందురేని జెప్పెదను. నిత్యముక్తులయిన జయవిజయులు ద్వారపాలకులయిన జయవిజయులు కారు. అట్లే కాక యీద్వారపాలురయిన జయవిజయులే నిత్యముక్తులన్నచో, సృష్ట్యాదియందే సనకాదులచే శప్తులయి భూలోకమున హిరణ్యాక్షహిరణ్యకశిపులై పుట్టి వరాహనరసింహావతారములచే వధింపఁబడి పిమ్మట రావణకుంభకర్ణులై, రామునిచే నిహతులై తరువాత శిశుపాలదంతవక్త్రులై కృష్ణునిచే నిహతులై శాపముక్తులై వైకుంఠమునకుఁ బోయి స్వస్వరూపధారులయి యుందురని చెప్పవలయును కావునఁ గృష్ణావతారమున శాపముక్తులయిన జయవిజయులు వామనావతారమందు విష్ణువునకుఁ బారిషదులై యుండుట యెట్లు సరిపడును. కావున ద్వారపాలురయిన జయవిజయులు త్రిపాద్విభూతివర్తులై భగవత్పరిచారులై యున్న జయవిజయులకంటె వేఱయినవారని చెప్పుట నిర్వివాదాంశమగుటచే వారికి శాపానుభవము యుక్తమే.

దే! మాపూర్వజన్మకృతమయినపాపమే మ మ్మింతవఱకుఁ దెచ్చినది. కాని మీఁద మాకు శుభంబుగలుగునట్లు చేయ వేఁడుకొనుచున్నాము. మేము నీచమయినకులమం దుదయించి కామాదిగ్రస్తులమయి మత్తులమయి సంచరించుచున్నను భవత్కృపారసంబువలన భగవన్నామస్మరణమును విడిపింపఁజేసెడి మోహము లేకుండునట్టు లనుగ్రహింపుఁడు. ఇదియే మాకోరెడివరము'. అని యాద్వారపాలురు సనకాదులను బ్రార్థించుచున్న యవసరంబున వీరలకుఁ బ్రవర్తిల్లిన కలహమ్మును నంతఃపురంబులో రమాదేవి

—●●◆ సనకాదు లున్నద్వారముచెంతకు విష్ణు వరుదెంచుట. ◆●●—

తో విహరించుచున్నహరి యాలకించి యాద్వారప్రదేశంబుదరికి చయ్యన నరుదెంచె. అమ్మహనీయుఁడు యోగీశ్వరులచే నన్వేషింపఁదగినపాదపద్మములు గలవాఁడును స్వభక్తులచేఁ బట్టఁబడిన ఛత్రచామరాదిరాజచిహ్నములచే నొప్పుచుండెను. అతఁడు తనభక్తుల సమాధియోగమునకు ఫలమువంటివాఁడు. మఱియు నతఁడు రాజహంసములతో సదృశములగు చామరముల మందమారుతముచేఁ జలించుచు నిండుచందురునిచందంబున నొప్పుచున్న దగు శ్వేతాతపత్రమునందు వ్రేలాడుచున్న మంచిముత్యములవలనఁ గలిగినయుదకబిందుసందోహము చే నలంకృతుఁడయి తనభక్తులకుఁ బ్రసన్నముగానుండెడి ముఖపద్మముకలవాఁడై దయాసౌకుమార్యాదిగుణంబుల కాకరం బయినయవలోకనములచే భక్తజనులహృదయంబుల హరించుచున్నవాఁడయి యుండెను. మఱియు నతఁడు తనవెడందయొమ్మునందు వెలయుచున్న శ్రీదేవికాంతులచే స్వర్గలోకమునకుఁ జూడామణివలె నున్నతనలోకమునంతను బ్రకాశింపఁజేయుచుండె

ను. అతనికటియందున్న పీతాంబరంబుపయి వెలయు కనకమయమయినకాంచి కనువారికిఁ గనులపండువు లొనరించుచుండెను. వక్షస్థలంబున రమణీయమయి మత్తమధుకరఝంకారములు కలదై యున్న వనమాల గ్రాలుచుండెను. ముంజేతులయం దున్నకనకవలయములు చూపఱ కానందము గొలుపుచుండెను. అతఁడు తనవామహస్తమును గరుత్మంతునిస్కంధంబున నుంచి దక్షిణహస్తంబుచే సనాళమయిన పద్మమును విలాసముకై త్రిప్పుచుండెను. అతనిముఖపద్మము కర్ణంబులఁ దుఱంగలించెడు మకరకుండలముల కాంతులచేఁ బ్రకాశించు గండస్థలంబులచేతను, నుదగ్రమగు నాసికచేతను వెలయుచుండెను. శిరంబున మణిమయంబగు కిరీటంబు కోటిచంద్రప్రకాశమయి విలసిల్లుచుండెను. అతనిభుజాంతరంబు మనోహరములగు ప్రశస్తముక్తాహారములచేతను, కౌస్తుభమాణిక్యంబుచేతను వెలయుచుండెను. అతఁడు నిరతిశయసౌందర్యము గలదాన నని గర్వించెడిలక్ష్మికంటె సుందరతరుఁడయి ప్రకాశించుచుండెను. మఱియు నతఁడు నాచేతను, శివునిచేతను, సమస్తదేవతాసమూహముచేతను, యోగిబృందముచేతను వందనీయమయినపాదారవిందములు గలవాఁడు. ఓదేవతలారా! ఆమును లిట్టిభగవంతుఁడు వచ్చుచుండఁగాంచి యుఁ డనియలేక సంతసముచే నతనిపాదంబులకు నమస్కరించిరి. అంత నాకృష్ణమూర్తిపాదారవిందములకుఁ గింజల్కభూతములగు నంగుళులపరాగముతో నెనసి తులసీమకరందము నొంది యొప్పుచున్నమందగంధవహంబు లేతెంచి నాసారంధ్రములమూలముగా లోపలికిఁ బోయి యాత్మానుసంధానముచే నవికృతచిత్తులై యున్నను నాసనకాదులచిత్తము నానందపరవశముగాఁ జేసి శరీరము

లఁ బులకితములుగా నొనరించెను. పిమ్మట నామునులు సుందరమగు నధరబింబము చేతను, గుందపుష్పములవంటి మందహాసము చేతను, సొంపారు నతనివదనారవిందంబును వీక్షించి లబ్ధమనోరథులై, నఖరంబుల నెడిపద్మరాగంబులకు నిక్కయగుపాదపద్మంబుల మాటిమాటికి వీక్షించుచు ధ్యానించిరి. అట్లు ధ్యానించి కర్మజ్ఞానయోగంబులచే సాధితమగుభక్తియోగముచే స్వస్వరూపమును ధ్యానించుపురుషుల ధ్యానమునకు విషయభూతుఁడై, నిరతిశయప్రేమకాస్పదుఁడై, నయనాభిరామమగుశరీరమును జూపించుచు, నణిమాద్యష్టసిద్ధులతో నొప్పుచున్న భగవంతు నిట్లు నుతింప

సనకాదులు విష్ణువును నుతించుట.

నారంభించిరి. 'ఓ దేవా! దురాత్ములహృదయంబుల నొకవేళఁ బొందినను వారలకు దర్శనం బొసఁగక యంతర్ధానంబు చెందుదువు. అటువంటినీరూపము మాకిప్పుడు కన్నులపండువు లొనరించుచున్నది. మఱియు నీకుమారుఁడగు చతుర్ముఖుండు వర్ణించిన స్వరూపగుణ విభూతులుగలనీ వప్పటినుండియు మాచే ధ్యానింపఁబడుచు నిప్పుడు భక్తులమయిన మాయుల్లంబులయందుఁ గర్ణద్వారమునఁ బ్రవేశించినావు. ఓభగవంతా! మహామునులు సంసారనిర్వేదమువలన నిశ్చలభక్తియోగముల నవలంబించిన విరాగులయి నిరహంకారులయి శుద్ధసత్త్వదేహము దాల్చి భక్తులకుఁ బ్రతిక్షణము ననురాగము కల్పించుచున్నయే నీయాత్మతత్త్వమును దమహృదయములయందే తెలిసికొనుచున్నారో యట్టి నీరూపము మాకిప్పుడు ప్రత్యక్షముగా నయనంబుల కపూర్వపర్వంబు లొనర్చెను. అహా! మాయదృష్టమేమని పేర్కొనువారము! మేము కృతార్థులమయితిమి. భగవం

తుండ వగునీసచ్చరిత్రముల విని తమ్ముఁ గృతార్థులుగా భావించుకొనుచు నన్యము నొల్లక భవన్నామస్మరణంబు చేయుచు నీపాదంబులకు శరణంబు చొచ్చి కొందఱు మహాత్ములు పరమపురుషార్థమయిన మోక్షమునుగూడ నాదరింపకున్నారు. అట్లుండ దుర్లభమయిన నీలోకమును బొంది యవాఙ్మానసగోచరమయిన నీరూపంబును గన్నులారఁ గాంచిన మేము కృతార్థుల మయితిమని వేఱ చెప్పవలయునా? ఓదేవా! మాంచిత్తంబులు తుమ్మెదలచందంబున భవత్పాదారవిందంబులందు సదా విహరించునేని, మావాక్యంబు లనవరతంబు నీచరిత్రంబుల నుగ్గడించువవి యగునేని, మాకర్ణరంధ్రంబులు నీసుగుణగణంబులచే సంతతము నింపఁబడునేని, మాకుఁ బూర్వార్జితపాపంబులఁ బురస్కరించుకొని యయినను నీచజన్మము సంభవింప దనుట నిక్కంబు. ఓదేవా! వేదంబులకుఁగూడ నగోచరంబగు నీమహనీయరూపంబు కనుటవలన మానేత్రము లత్యంతసుఖము నొందుచున్నవి. కుయోగులకు దురవగాహుండ వయిననీ కనేకవందనంబులు కావించుచున్నా'మని నమస్కరించిరి. ఇది పదునేనవయధ్యాయము.



అంత యోగమే ధర్మముగాఁగల సనకాదిమునులకుఁ బ్రత్యభివందనము కావించి కరుణించి నారాయణుండు వారల కిట్లనియె. 'ఓమునీంద్రులారా! నాద్వారపాలకులయిన జయవిజయులు మీమార్గమును నిరోధించి యవమానంబు కావించినారు. అందులకు మీరు కోపంబువహించి వారలను శపించినారు. నాపాదభక్తులయినను వారికి మీర లొనరించినశిక్ష మిగుల యుక్తముగా నున్నది. వారలు దురాత్ములై తాము, మహానుభావులరయి మద్భక్త

లరై యున్నమిమ్ముల నవమానించినారు. కావున మీ రిచ్చినశాపమే యుక్తమని నాకుఁ దట్టినది. బ్రాహ్మణులు నాకు దైవము వంటివారు. నాభటులు మిమ్ము నవమానించినారు. భటులుచేసి నయపరాధము లన్నియు భర్తకుఁ జెందుచుండును. కావున వార లొనరించినయపరాధము నాదె. ఇట్లు మీయెడల నాపరాధినయిననన్ను మన్నింప వేఁడుచున్నాను. భృత్యులు తెల్వితక్కువవారలై నేరము చేసినచో నదియెట్లు ప్రభువును జెందును? అని యడుగుదురేని చెప్పెదవినుఁడు. లోకములో రాజభటుఁడు పరుల కపరాధము చేసినచో నందువలన జనించినయపకీర్తి కుష్ఠాదిరోగములు చర్మమును బాడుచేయుచున్నట్లు రాజు సత్కీర్తిని బాడుచేయుచుండును. కావున నా నేరము నాయందుఁ బర్యవసన్నమగుచున్నది. ఆనా నేరమును మీరు మన్నింపవలసి యున్నది. మఱియు నిర్మలమయిన నా సత్కీర్తి విన్నవాఁడు చండాలుఁడయినను దప్పక పూతుండగుటకు సందియము లేదు. చండాలురనుగూడఁ బవిత్రులనుగాఁ జేయు సమర్థమయిన కీర్తి గలవాఁడ నయిననేను బ్రాహ్మణోత్తములయిన మీవంటి మహానుభావులకుఁ బ్రతికూలవృత్తి యగుచో నాబాహువుననయినను ఖండించి తీఱుదునని నమ్ముఁడు. అట్లుండ దురాత్ములయిన నాభటులు మీ కపరాధము చేసినపుడు వారిని శిక్షింతు నని వేఱ చెప్పవలయునా? మీవంటి బ్రాహ్మణుల సంతతము నేను సే

—◆ విష్ణువు బ్రాహ్మణ ప్రశంస చేయుట. ◆—

వించుచుండుటం బట్టియే లోకములఁ బవిత్రము చేయునంతటి సామర్థ్యము నాపాదపరాగమునకుఁ గలిగినది. బ్రాహ్మణసేవం జేసియె సమస్తలోకములపాపములం దొలఁగించునట్టిశీలము నా

కలనడినది. బ్రాహ్మణసేవంబట్టియే యెప్పుడును బ్రహ్మాదిసుర లుపాసనచేసియు నేమె కరుణాలవమును బొందలేరో యట్టిశ్రీమహాదేవి నే నామెయందు విరక్తుండ నయినను నన్ను విడిచియుండదు. ఓ మునీంద్రులారా! యాగసమయములయందు మహీయము లయిన యగ్నిజ్వాలలయందు యజమానునిచే వేల్వఁబడిన ఘృతప్లుతమయిన హవిస్సువలన నేను దృప్తినొందఁజాలను. కాని మదర్పితములగు స్వవర్ణాశ్రమోచితకర్మఫలంబులుగలవాఁడగుటచే దుష్టుండయిన బ్రాహ్మణునిముఖముచే భుజింపఁబడిన యొక్కొక్కకబళము చేతనయినను దనివి పొందుదును. మఱియు నే నెల్లప్పుడు ప్రతిహతముకాని యోగమాయావిభూతిచే నొప్పుచుందును. అయినను బ్రాహ్మణోత్తములపాదపద్మములం దున్నపరాగము నామణికిరీటమునగ్రమునందుఁ దాల్తును. నాపాదపద్మములయందుఁ బుట్టినగంగానదిని బరమపావనిగా నెంచి తనచంద్రభూషణముతోఁ బాటుగా శిరంబునఁ దాల్చి శివుండు లోకంబులఁ బూతములఁగాఁ జేయుచున్నాఁడు. నాపాదములం బొడమిన గంగయే పరమపవిత్రమయిన దని చెప్పవలసివచ్చినపుడు నేను బరమపవిత్రుఁడ నని వేఱచెప్పవలెనా? నే నిట్లు లోకపావనుండ నయిన ననవరతము విప్రులపాదపద్మములయందలి నీరు పావనమయినదని భావించి తలయం దిడుకొనుచుందును. నేనే యిట్లు బ్రాహ్మణుల గారవించుచున్నప్పుడు లోకములో నెవఁడు గారవింపకుండఁగలఁడు? విప్రులను నన్నుగా భావించునట్టిమానవుఁ డొక్కఁడే నాకుఁ బ్రియతముఁడు. నాకు శరీరభూతులయిన గోవిప్రులను రక్షకహీనములగు నితరభూతములను బాపాత్ముఁడై సర్పసదృశకోపముగలవాఁడయి నాశరీరముకంటె భిన్నులయినట్టు

లెవఁడుచూచునో వాఁడు మరణమునొంది యమలోకమునకుఁ బోయినప్పు డయోముఖములగు గృధ్రములు వాని నేత్రములను బొడిచి నాశనముచేయును. బ్రాహ్మణుఁ డేదేని కారణముచే నపకారముచేసినను సంతసమునొందుచు ననురాగాస్పదమయిన వాక్యములచే నాతని సంబోధించుచుఁ బలువిధంబులఁ బూజించుచుఁ దండ్రి కుమారునిఁ జూచునంతటిప్రేమతోఁ జూచుచుఁ బ్రవర్తించువారలు మదనుగ్రహపాత్రులని భావించుచుందును. కావున నామానసంబున నున్నభావంబు తెలియఁజాలక యవివేకులయి నా యానతి దూరముగాఁ ద్రోచి మీ కపరాధముచేసిన యీభటులకుఁ దగినశిక్ష చేసినా రని నే మిగుల సంతసించుచున్నాను. మీయానతిచొప్పున వీరుపోయి భూమిలో జన్మింతురు కాని వీరు శీఘ్రకాలములోనే నాలోకమునకు మఱలివచ్చున ట్లను గ్రహింపవలయును." అని యిట్లు పలుకఁగా వేదతుల్యమయి, మనోహరమై, యమానుషమై యున్న విష్ణువాక్యములను విని యాతనివాక్యములకుఁ దగినయర్థమును దెలిసికొనలేకపోవుటచేతను, దామువిషసదృశమగు మన్యువుచే దష్టులై యపరాధముచేసి యున్నవార లగుటచేతను మనంబులయందుఁ బరితృప్తి చెందకపోయిరి. మఱియు వారు దుర్బోధములు నర్థగంభీరములు నగునతనివాక్యములఁబట్టి నారాయణునియభిప్రాయంబు గనుఁగొనలేక మిన్నకుండి కొంతవడికి భగవంతునికిఁ దమయం దనుగ్రహమే గలదని భావించి సందేహజనకములగు వాక్యములు విన్నందులకుఁ గ్రుద్ధులై భగవంతుని దర్శించి సంభాషించి యతనికృపావలోకనములను బొందుటంజేసి పులకితాంగులయి సంతుష్టాంతరంగులయి కేల్దోయి నొసట

ఘటించి ప్రకృతిచే నారబ్ధమగు సమస్తప్రపంచకంబును బాలిం చుటయం దధికారమును బ్రహ్మాదుల కొసంగినహరిని గాంచి యి ట్లనిరి. "ఓ దేవా! సర్వలోకాధిపతివియు, సర్వజ్ఞుఁడవునగు నీవు మమ్ముం జూచి "నన్ను ననుగ్రహింపుఁడు" అని పలుకుచున్న వాక్యమున కర్థమేమియో తెలియఁజాలకున్నాము. ఓదేవా! బ్రా హ్మణులు నాకు దైవమువంటివారని పలుకుచున్నావు. లోకులం దఱు బ్రాహ్మణుల గౌరవించునిమిత్తము నీవట్లు పలికిన పలుకవ చ్చునుగాని సమస్తలోకముల కధిపతివయిననీకు బ్రాహ్మణులు దేవతలని చెప్పుట యెంతయు నాశ్చర్యకరముగా నున్నది. సమ స్తమునకు నీవేదైవమువు. ఆత్మదైవమగు నీకు దేవత లెవరున్నా రు? దేవదేవా! లోకములో సనాతనములగు వర్ణాశ్రమధర్మములు నీవలననే కలిగినవి. ఆధర్మములను నీవే యాయాయవతారముల ను ధరించి రక్షించుచున్నావు. అట్టిధర్మమునకు ఫలమవు నీవే. ని న్నుఁ బొందుటకే సమస్తధర్మముల నాచరించుటకాని మఱియొ కఫల మపేక్షించి కాదు. లోకములో యోగీశ్వరులందఱు నీయ నుగ్రహమును సంపాదించి మహాత్ములయి మృత్యుభయమును దొలఁగించుకొనుచున్నారు.ఇట్లుండ నీ కొకరియనుగ్రహము గోరు టయేల? చతుర్విధములగు పురుషార్థముల వాంఛించుమానవు లయుత్తమాంగములకు నలంకారభూత మయినపాదపరాగము గల యేలక్ష్మీదేవి, పుణ్యాత్ములచే నర్పింపఁబడినతులసీదామము నందుఁ జరించుచున్నతుమ్మెదకు నిజనివాసమయి వఱలునీపాద పద్మములను గోరుచు వక్షఃస్థలస్థితిని విడిచి,యోగిజనాదిసేవక సమ ర్థనమునకైన నంగీకరించి, సవతియగు తులసితోఁగూడ నివసిం చుటకైన నిష్టపడి సర్వదా సేవించుచున్నదో; యాలక్ష్మీదేవిని నీవు

పరమభాగవతులయినవారిప్రసంగమం దాసక్తి గలవాఁడ వగు
టచేత నాదరింపఁజాలకున్నావు. ఓభగవంతా! నీవు బ్రాహ్మణుల
పాదపద్మములందలిపరాగమే నా కాభరణ మని పలికితివి లోక
ములో నున్నవారికందఱకు బ్రాహ్మణమాహాత్మ్యము తెలియఁ జే
యుటకు నిట్లు పలికితివి కాని, పరమపావనుఁడవయిన నీవెక్కడ?
బ్రాహ్మణు లెక్కడ? వారిపాదపరాగము నిన్నుఁ బవిత్రునిగాఁ జే
యు టెక్కడ! ఇదియంతయుఁ జక్కఁగ నాలోచించిన వింతగా
నుండక మానదు. జ్ఞానాదిగుణషట్కవిభాసితుఁడవగునో దేవా!
ధర్మస్వరూపుఁడవగు నీకుఁ దపోదానదయలు పాదత్రయమని చె
ప్పుదురు. ఆపాదత్రయముచేతను భూదేవతలను దేవతలను రక్షిం
పఁబూనికొని యందులకు విరుద్ధముగాఁ బ్రవర్తించుచు నాతపో
దానాదులను నశింపఁ జేయఁబూనుచున్నదుర్మార్గుల నవతారము
లనెత్తి చంపి లోకమందు ధర్మమును స్థాపించుచున్నావు. అట్లే
కానిచో ధర్మమీపాటికి మునుముట్ట నశింపకుండునా? లోకులు
గొప్పవారివర్తనమే ప్రమాణముగాఁ జేకొందురు కాన యట్లు
రక్షణీయమగు బ్రాహ్మణకులమును, ప్రభావముచేతను, ప్రియవా
క్యములచేతను, నీవు రక్షింపవేని శ్రేయస్సంపాదకమయి కర్మోపా
సనాత్మకమయి యున్న వేదమార్గము నశించును. నీవు లోకమం
దు ధర్మము నశింపకుండఁ జేయవలెనని ప్రతినపట్టినవాఁడవు. కా
వున శుద్ధసత్త్వగుణాశ్రయుఁడవయిన నీవు లోకక్షేమముకొఱకవ
తారములనుదాల్చి ధర్మవిరోధులయినవారిని సంహరించుచు
న్నావు. నీప్రతినచొప్పున ధర్మమును స్థాపించుచున్నావు. ఇట్లు
సర్వలోకాధిపతివయి సర్వజ్ఞుఁడవయి, సమస్తదేవదేవుఁడ వయి
యున్న నీవు బ్రాహ్మణులకు వందనము లాచరింతువు. అంతమా

త్రమున నీ ప్రభావమున కొఱకొఱంతకలుగునా ? కలుగదు. లోకశిక్షనిమిత్తమే యట్లు చేయుచున్నావు దేవా! మే మొకటి విన్నవించుచున్నాము. అవధరింపుము. మే మీ జయవిజయులకు శాప మిచ్చియున్నాము. ఆశాపము వారల కర్హమయినదని యంగీకరించినను సమ్మతమే. లేక నీవు వారలకు మఱియొకవిధముగా ననుగ్రహించినను మాకు సమ్మతమే. కాని ద్వారపాలుర కుచితవృత్తియందు వర్తించుచు నిరపరాధులయి యున్నజయవిజయులను మేము శపించితిమని తలంచెదేని యీ యపరాధము గావించినందులకు మాకుఁ దగినశిక్ష విధింపుము. నీయాన శిరసావహించువారమని మ్రొక్కి చేతులు జోడించియున్న సనకాదిమునుల నీక్షించి కనికరించి వారల కిట్లనియె. "ఓమునులారా! మీశాపప్రకారమున జయవిజయులు భూలోకమందు రాక్షసులయి జన్మించి నాయందు బద్ధక్రోధులయి దేవబ్రాహ్మణాదుల కపకారము చేయుచు వర్తించుచు నాచేఁ జంపఁబడి తిరిగి శీఘ్రకాలములోనే నాలోకమునకు వత్తురు. ఓ విప్రోత్తములారా! మీశాపము భవన్ముఖుండనైన నాచేతనే విధింపఁబడినదని తెలిసికొం"డని పలికెను. ఇట్లు సనకాదులు నేత్రానందకరుఁడయిన భగవంతుని, నతనికి స్థానమై స్వయంప్రకాశమై యున్న వైకుంఠలోకమును, జూచి భగవంతునికి నమస్కరించి ప్రదక్షిణము చేసి యనుజ్ఞ నొంది సంతసించి విష్ణుప్రభావమును నుతించుచుఁ దమతమమార్గంబులం జనిరి. అనంతరము నారాయణుండు భృత్యులఁ బొడఁగాంచి యిట్లనియె. "ఓయీ మీరెంతమాత్రము భయపడకుఁడు. భూలోకంబున రాక్షసులయి జన్మింపుఁడు. మీకు శుభమగుఁగాక. బ్రాహ్మణశాపమును ద్రిప్పనంతటిశక్తి నాకు

స్సను నాకిష్టమగుటం బట్టి త్రిప్పుట కంగీకరింపలేదు. మఱియు నిది లక్ష్మీదేవికిఁగూడ నిష్టమయినది. పూర్వము నేను బ్రణయకలహమును బొంది మిన్నక శయనించి యున్నయవసరంబున నలిగి నా గృహమునుండి తరలిపోయి తిరిగి కొంతవడికి నామందిరమునకు వచ్చునప్పుడు మీరాలక్ష్మిని వారించినారు. అందుల కామెకుఁ గోపమువచ్చి శపించినది. అందుచే మీరు తప్పక భూమిలో రక్షస్సులై జన్మింపుఁడు. అట్లు నాకు విరోధులై పుట్టి మీరు దేవతలకును లోకములకు, నపాయము చేయుచుండ నే నవతారములను దాల్చి మిమ్ముల౯ జంపెద. మీరు స్వల్పకాలములోనే నా లోకమును బొందఁగలరు'' అనిపలికి నారాయణుండు విమానశ్రేణిభూషణముగాఁ గలిగి నిరతిశయసౌందర్యమగు తనమందిరమును లక్ష్మితోఁ బ్రవేశించెను. ఆజయవిజయు లిరువురు బ్రాహ్మణశాపమువలన ప్రభావము నశించినవారయి వైకుంఠలోకమునుండి భూలోకమునకు వచ్చినారు. ఓ దేవతలారా! ఆజయవిజయులు వైకుంఠమునుండి క్రిందఁబడుచుండఁగా విమానాగ్రములందు సంచరించుమహామహులందఱు వారలదుస్స్థితిని జూచి విచారపరీతులై హాహాకారములం జేసిరి. ఆద్వారపాలురిరువురు కశ్యపుని తేజస్సును బొంది దితిజఠరమును బ్రవేశించినారు. వారితేజమే లోకంబుల వ్యాపించుచున్నది. కాని కొంతకాలములోనే భగవంతుఁడు వారితేజస్సును హరించి మీతేజస్సు స్థాపింపఁగలఁడు. ఓ దేవతలారా! మఱియుఁ బ్రపంచమునకు సృష్టిస్థితిలయములుఁ గల్పించుచుఁ, ద్రిలోకాధిపతియై, యోగీశ్వరాదులకయిన దురత్యయమగు మాయగల యాపరమేశ్వరుఁడు కాలము సంప్రాప్తించునప్పుడు వారలఁ జంపి మనకు క్షేమ

ము గలిగింపక మానఁడు. అట్టిదానిం గూర్చి మనము విచారింప నేల? అనెను. ఇది పదునాఱవయధ్యాయము.



## హిరణ్యాక్షహిరణ్యకశిపులజననము.

అని యిట్లు పలికిన బ్రహ్మవాక్యమువలన వ్యసనకారణమును జక్కఁగాఁ దెలిసికొని దేవతలు సందియముం బాసి బ్రహ్మలోకము నుండి మఱలి తమలోకము నొందిరి. ఓవిదురా! అంత దితి "దుష్టుల యిలోకములఁ బీడించుకుమారులఁ గందు" నన్న భర్తవాక్యముల నాలకించి దేవతలవలనఁ దనకుమారులకుఁ జావు వచ్చుట సిద్ధంబని పరితపించుచు నూఱువత్సరంబులు నిండినతోడనే యిద్దఱఁ గుమారులంబడసెను. వారు పుట్టినసమయంబున నసంఖ్యాకంబులును లోకభయావహములునగు మహోత్పాతంబులు భూమ్యంతరిక్షములందుఁ గానవచ్చె. పర్వతములతోఁ గూడ భూమి గిరగిరం దిరుగ నారంభించెను. దిక్కులన్నియుఁ బ్రజ్వరిల్లఁ జొచ్చెను. చుక్కలు తెగిపడెను. ఎల్లయెడల పిడుగులవర్షము గురిసె. లోకమున కుపద్రవకరములయిన తోఁకచుక్కలు గోచరంబులయ్యె. ఆసమయంబున మహావాయువు గఠినస్పర్శగలిగి ఢాట్కారధ్వనులఁ జేయుచు వృక్షరాజముల నవలీలఁ గూల్చుచుఁ, దనచే నుద్ధూతంబయి పైకెగసినధూళులే ధ్వజముగాఁ గలవాఁడై విజృంభించి యెల్లెడల భయంకరముగా వీవ నారంభించెను. కన్నులకు మిఱుమిట్లు గొలుపు మెఱుపులతో నొప్పుచున్న మేఘంబు లంబరంబున వ్యాపించి యుండుటచే జగమ్మంతయు నంధకారబంధురమగుచుండెను. ఆసమయమున సముద్రములు తరంగములను చేతులచే గుండె బాదుకొనుచు దుఃఖించుచున్నవా యనునట్లు భయంకరముగా ధ్వనిచే

సె. వాపీకూపతటాకాదులన్నియు క్షోభించె. రాహుగ్రస్తముల యిన సూర్యచంద్రమండలములు పరివేషములు గలవయ్యె. ఆకాశమందలి మేఘముల గర్జనలకుఁ బర్వతములు ప్రతిధ్వను లిచ్చె. జంబుకంబులును, గుడ్లగూబలును గ్రామముల మధ్యమున సంచరించుచు భయంకరమగు నిప్పుకల నోళ్లనుండి క్రక్కుచు నమంగళముగా ధ్వనిచేయ నారంభించె. కుక్కలు మూతులను పైకెత్తి పాటపాడుచున్నట్లు మొఱుఁగఁజొచ్చెను. గాడిదలు వాడియగు ఖురపుటములచే భూమిని ద్రవ్వుచు ఖాత్కారధ్వనుల గావించుచు మందమందలుగ నేర్పడి సరభసంబుగాఁ బర్వియుండెను. ఆకాలమం దుత్పన్నము లగుచున్నధ్వనులకు భయపడి పక్షికులములన్నియు వికారముగా ధ్వనులు చేయుచుఁ దమగూండ్లను విడిచి యాకసమునకు నెగసి పోయెను. గొల్లపల్లెలయందు నరణ్యములయందుఁ బశువులు మూత్రపురీషముల విడువఁజొచ్చె. ఆవులన్నియు భయము చెంది పాలకుబదులుగా రక్తము నొసంగఁ దొడఁగెను. మేఘంబు లెల్లయెడల రక్తవర్షముల వర్షించె. దేవాలయములయం దుండుదేవతాప్రతిమలన్నియు బాష్పజలంబును విడువఁజొచ్చె. వాయువు విఱువకయే కొన్ని వృక్షములు నేలఁబడఁ జొచ్చెను. శుభగ్రహములను క్రూరగ్రహములు పీడించె. మఱియు నాగ్రహములన్నియు వక్రగతిచేఁ దిరుగుచు నన్యోన్యము యుద్ధము సేసెను. ఇట్టిమహోత్పాతములను వీక్షించి భావివిదులయిన మునీశ్వరు లందఱు మిగుల భయపడిరి. కాని బ్రహ్మపుత్త్రులయిన మరీచ్యాదులు జ్ఞానసంపన్నులగుటచే భయపడలేదు. లోకములయందలి వారందఱు లోకములకు మహోపద్రవము రాక మానదని తలంచుచుండిరి. ఇట్లుండ దితికు

వారు లిరువురు పూర్వజన్మసిద్ధమయిన పౌరుషముతోఁ గూడికొని యుక్కుపంటిశరీరము కలవారయి దినదినమును బర్వతములవలె వర్ధిల్లుచుండిరి. వారు తమకిరీటము లాకసమును దాఁకించుచు కేయూరాదిభూషణములకాంతులచే దిక్కులను గప్పుచుఁ గటిస్థలములందున్న మేఖలలు సూర్యుని మించి ప్రకాశించునట్లు చేయుచు నడచుచున్నప్పుడు భూమి తమ బరువు నోర్వలేక కంపించునట్లు చేసి వర్తించుచుండిరి. అంతట కశ్యపుండు దితికుమారులం జూచి * తన దేహమునుండి ముందుగాఁ బుట్టిన బాలునికి హిరణ్యకశిపుఁడనియు దితిదేహమునుండి ముందుగా వెలువడిన బాలునికి హిరణ్యాక్షుఁడనియు నామకరణము చేసెను. పిమ్మట హిరణ్యకశిపుఁడు తన బాహాబలముచేతను బ్రహ్మ యిచ్చినవరములచేతను దనకు మృత్యువు లేదని నిశ్చయించి లోకములను లోకపాలురను స్త్రీలను దనవశము కావించుకొనెను. వానితమ్ముఁడయిన హిరణ్యాక్షుండు, తనయన్నయగు హిరణ్యకశిపునకు సంతసముగూర్చుచు దేవతలను జయించుచుండెను. అంత హిరణ్యాక్షుం డొకనాఁడు యుద్ధకుతూహలుండయి తనకు సముఁడయిన వీరునితో యుద్ధ

---

* ఇచ్చటఁ గశ్యపునకు ముందుపుట్టినవానికి హిరణ్యకశిపుఁడనియుఁ దితికి ముందుపుట్టినవానికి హిరణ్యాక్షుఁడనియు నామకరణము చేసెననుటకుఁ దాత్పర్య మేమనఁ బురుషునివీర్యము స్త్రీగర్భకోశవైపరీత్యముచే రెండు భాగములయి ప్రవేశించునప్పుడు కవలవాండ్రు పుట్టుచుందురు. మఱియు మొదటఁ బ్రవేశించినవీర్యము శిశువయి తరువాతఁ బుట్టుచుండును. వెనుక ప్రవేశించిన వీర్యము శిశువయి మొదటఁ బుట్టును. ఇచ్చట కశ్యపునుండి మొదట బయలు వెడలిన వీర్యము హిరణ్యకశిపుఁడయ్యె. కశ్యపునుండి వెనుక బయలుదేఱినవీర్యము శిశువయి దితియొక్క గర్భమునుండి ముందుగా వెలువడెను. ఆపిల్లఁడు హిరణ్యాక్షుఁడయ్యె.

ముచేయుచుఁ గోరి భూమండలమును వెదకి కానక స్వర్గపురంబునకుఁ బోయెను. అంత దేవతలు దుర్జయమయిన బలముగలవాఁడై వైజయంతి యనెడుపుష్పమాలికచే నలంకృతుండై స్వబలగర్వితుండై, నిర్భయుండై బంగరుపుటందెలు ధ్వని చేయుచుండ, వచ్చుచున్న హిరణ్యాక్షునిఁ జూచి మిగుల భయమును జెందిన గరుడునికి భయపడిన పాములవలె సందుగొందులఁ దూఱి దాఁగియుండిరి. ఇట్లు తనకు భయపడి పర్విడుచున్న దేవతలను పౌరుషహీనులఁగా నెంచి యందఱిలను మఱింత గర్వితుండయి భయంకరమగు సింహనాదము చేసెను. ఇట్లు భయంకరముగా ధ్వని చేయుచు నిష్టమువచ్చినట్లు క్రీడించుచు, స్వర్గపురమును విడిచి బయలు వెడలి మదపుటేనుఁగుచందంబున నంబుధిని ప్రవేశించెను. అప్పుడు వరుణుని సైనికులు వానినిఁ జూచి, మిగుల భయముచెంది యతని తేజంబుచేఁ దిరోహితులై దుఃఖితచిత్తులై యదృశ్యులైరి. అదినఁ గాంచి హిరణ్యాక్షుండు విరాటంబుగా సముద్రమందుఁ బెక్కు సంవత్సరంబులు విహరించి వాయువుచే నుద్భూతములగునట్టి గొప్పతరంగములను నయోమయమగు తన గదాదండముచేఁ గొట్టుచుఁ బోయిపోయి వరుణునికి రాజధాని

హిరణ్యాక్షుండు వరుణలోకంబున కేఁగుట

యగు విభావరీపురమును జెందెను. ఇట్లా రక్కసుండు వరుణుని రాజధానిం బ్రవేశించి లోకపాలకుండును యాదోగణముల కధినాథుండు నగు వరుణునిఁ జూచి మందహాసంబు గావించుచు నీచునివలె నతనికి నమస్కరించి "ఓ లోకపాలా! నాకు యుద్ధభిక్ష పెట్టుము. నీవు లోకపాలుఁడవు. మహాకీర్తిసంపన్నుఁడవు. మఱియు నీవు పూర్వమందు దేవదానవుల జయించి రాజసూయయాగ

మొనరించిన వీరుండనఁట. కావున నాతో యుద్ధము చేసి సంతసిం పఁజేయు"మని పల్కెను. అంత నపాంపతి యగువరుణుండు దురాత్ముఁడును, గర్వితుఁడు నగురాక్షసునివాక్యంబులు విని యందువలనఁ దనకుఁ గలుగుచున్నకోపమును శాంతింపఁజేసికొని యిట్లనియె. "ఓయీ దానవరాజా! నేను బూర్వ మట్లు చేసినవీరుండనే కాని యిప్పుడు యుద్ధమునుండి విరమించియున్నాను. నీతో నేను యుద్ధము చేయలేను. కాని నీకుఁ దగినవీరుని గనఁబఱచెదను. అతఁడు మహాబలవంతుఁడు, యుద్ధప్రియుఁడు. అతఁడు నీవంటివీరులను జూచినచో మిగుల సంతసించుచుండును. ఆపరమపురుషునికంటె నన్యుఁ డొక్కఁడును నీతోఁ బోరఁజాలఁడు. నీవతనిపాలికిఁబోయినచో యుద్ధభిక్షచే నిన్ను సంతసింపఁ జేయఁగలవాఁడు. అమ్మహాత్ముఁడు వైకుంఠపురమునం దుండును. అతఁడు మీవంటిదురాత్ములను సంహరింపఁ బెక్కులవతారంబులఁ దాల్చుచుండును. నీ వచ్చటికిఁబోయినచో నావిష్ణువు నిన్ను రణరంగంబున గూల్చి నీమాంసంబునఁ గుక్కలకు విందు చేయక మానఁడు. కావున నచ్చటికి రయంబునఁ జనుము" అనిపల్కుచున్న వరుణునిపలుకులకు సంతసించి రణరంగమునందు హరిని జంపి నాభుజబలంబును వెల్లడి చేయుదు నని పలుకుచు వైకుంఠపురాభిముఖుండయి పోవుచుండె.

ఇది బదునేడవయధ్యాయము.



ఆసమయంబున నారదుండు గగనమార్గంబున నెచ్చటికోపోవుచు నారాక్షసవీరున కెదురయి, "ఓయీ! దానవవీరా! గదాదండము కేల నమర్చి యెచ్చటికిఁ బోవుచున్నావు" నావుడు రాక్షసుండు నారదుంగాంచి యిట్లనియె. "మునీంద్రా! వైకుంఠమునం

దు విష్ణుమూర్తి యున్నాడఁట ! వానిం బరికించి యుద్ధముచేయుట కయి పోవుచున్నాను'' అనిపల్కువిని నారదుండిట్లనియె. 'ఓయీ! నీప్రయత్నము నిష్ప్రయోజనము. నీవు వైకుంఠమునకుఁ బోయిన లాభము లేదు. నీ వనుకొనినవిష్ణువు తనలోకంబున లేఁడు. పాతాళమందున్నాఁడు. పోవశక్తియున్నచోఁ బాతాళమునకుఁ బొ'మ్మని పల్కువిని దానవవీరుండు మిగుల సంతసించి సరభసగమనముతో రసాతలమునకుఁ బోయి గిరిసదృశమయిన యాకారముతో నొప్పుచు నిజదంష్ట్రాగ్రముచే భూతలమును బయి కెత్తుచుఁ దన మెఱ్ఱనినయనంబులకాంతిచే నాదానవుని తేజంబు నపహరించుచు నున్న యాహరినిఁజూచి " యరణ్యములందుఁ జూడఁదగిన వరాహ మిక్కడ నేలయుండె'' నని తనలోఁదాను నవ్వుకొనుచు సమీపించి యతని కిట్లనియె. 'ఓరీ! సూకరమూర్తీ! ఆభూతలమున కిట్టియుండనిమ్ము. రమ్ము. ఇటురమ్ము. నాతో యుద్ధము చేయుము. ఈభూమి పాతాళలోకవాసుల నిమిత్తము బ్రహ్మచే నీఁబడినది. మఱియు నీ భూమి నాకువశమయి వర్తించును. ఇట్లుండగా నేఁ జూచుచుండఁగనే దొంగతనముననఁగొనిపోఁ జూచుచున్నావా? నీవింతకాలము

హిరణ్యాక్షుండు యజ్ఞవరాహమునెదుర్కొని యుద్ధము చేయుట.

వఱకు మాయాబలమును గైకొని మావంశమందుఁ బుట్టినవారి నెల్ల జయించుచున్నావు. ఇదిగో ! చూడుము. ఇప్పుడే గదాదండముచే నిన్నుఁ జంపి మాబంధువులయు, స్నేహితులయుఁ, గన్నీళ్లను దుడిచెదను. ఇదిగో! ఇప్పుడే నిన్నుఁ జంపెదను. నాగదాఘాతమువలన నీవుచచ్చినతోడనే నిన్నింతదనుక నాశ్రయించి బలుల నర్పించు దేవతలును, ఋషులును, ననాశ్రయులై చచ్చెదరు.' అనిపలుకుచున్న దుష్టరాక్షసుని వచనతో మరములచే మిగులఁ

పీడింపఁబడి సహింపలేక యాగ్నవరాహమూర్తి కోఱదంష్ట్రాగ్రమునం దు మిగుల భయపడుచు నున్న భూదేవితో మఱియు బాధితయయి భీతినొందుచున్న మాతంగితోఁ గూడియున్న మాతంగవరమువలెఁ బ్రకాశించుచు నాజలమధ్యమునుండి బయలు వెడలి వచ్చుచుండెను. ఇట్లుదకములనుండి బయలు వెడలివచ్చుచున్న నారాహమూర్తిని గజేంద్రము ననుసరించుచున్న మహాగ్రాహమువలె ననుసరించినవాఁడయి హిరణ్యాక్షుండు కోపపండ్లు భయంకరములై చూపట్టు గంభీరవాక్యములతో నిట్లనియె "ఓరీ! దురాత్మా! నీకు సిగ్గులేదా? లోకములోనివారు నలుగురు నిందింతురని యయినను వెఱవవేమి? అవును. నిందాభయము లేనివానికి గర్హితకృత్యముండదు. కాన నీవు పలాయితుఁడ వగుటయు క్తమే!" అని పలుకుచున్న రాక్షసునిపలుకు లాలకించి కోపోద్దీపితమానసుండయి నీటి యుపరిభాగమందు భూతలమును నిలిపి దానియందుఁ దన యాధారశక్తి నుంచెను. అదిచూచి మిగుల నానందించి బ్రహ్మ యభినందించుచుండ దేవతలు హిరణ్యాక్షుఁడు చూచుచుండఁగాఁ బుష్పవర్షముం గురియించిరి. ఇట్లు దేవతలచే నుతింపఁబడుచు భగవంతుండు గనకకేయూరాదిభూషణముల కాంతులాకసము నింపుచుఁ, గాంచనమయ మగుకవచముగలిగి, మిగుల బలిష్ఠ మగుగదాదండమును గేల నమర్చి మర్మస్థానంబు నాటునట్లు దురుక్తులాడుచు వెన్నంటివచ్చుచున్న హిరణ్యాక్షునిఁ జూచి మందహాసముచేయుచు నిట్లనియె. "ఓరీ! దురాత్మా! నన్నుఁజూచి వనగోచరమృగమనియా యధిక్షేపించుచున్నావు? అవును, సత్యమే! నే నడవిమృగమనే? నీవంటిశునకములను వెదకి చంపు నిమిత్తము నేను మృగమనైతి. ఓరీ! దురాత్మా! వృథా

కాలుకూఁతలు కూయుటవలన నేమిలాభము? వీరులయినవా రెవ్వరును నిట్టిగర్వాలాపముల నాడరు. మృత్యుపాశబద్ధుఁడవయిన నీవు నిన్నుఁ బొగడుకొనిన వీరులు మెచ్చరు. ఈప్రల్లదంబులు వీరులు పల్కవలసినవగునా? మఱియు నీవు "పాతాళవాసులకు బ్రహ్మ యిచ్చినభూమిని నీవు హరించుచున్నా" వని పల్కినావు. పాతాళవాసుల నిక్షేపమయినభూమిని మేము హరించుచున్నామా? మేము లజ్జలేనివారమా? నీకు భయపడి మేము పాఱిపోవుచున్నామా? బలవంతుఁడవయిన నీతో విరోధమువహించి మే మెచ్చటికిఁ బోఁగలము. మాకు నీతో యుద్ధముచేయు నంతటిబలము లేకపోయినను లేనిబలమును దెచ్చికొని నీతో యుద్ధము చేసెదము. పదాతులలో నగ్రేసరుఁడవయిన నీవుగూడ నూరకుండక నాకుఁ బరాభవము జనింప యత్నింపుము. యత్నింపుము. యత్నింపుము. మఱియు నన్ను జంపి నీస్నేహితులదుఃఖమును దుడిచెదనని ప్రతిన పలికితివి. నీవు మగవాఁడవయిన నన్నుఁ జంపి నీప్రతిజ్ఞ నెఱవేర్చుకొనుము. చేసినప్రతిజ్ఞను నెఱవేర్పలేని పురుషుఁడు గౌరవహీనుఁ డనఁబడును." అని యిట్లు పలుకుచున్న హరిపలుకులు ములుకులవలెఁ జెవులకు నాటిన నద్దానవాధిపతి తోఁకద్రొక్కిన సర్పరాజువలె లేచి కన్నులనుండి నిప్పులు కుప్పలుగా రాలఁజూచుచుఁ గ్రుద్ధుండయి నిట్టూర్పుపుచ్చుచుఁ, గోపంబున నింద్రియములు చలింప సమీపించి సరభసముగాఁ దనగదాదండము చే హరినిగొట్టెను. భగవంతుఁడగు నావరాహమూర్తి హిరణ్యాక్షుఁ డురమందుఁ బ్రహరించిన గదాఘాతమును, యోగసిద్ధుఁడు మృత్యువును దప్పించుకొనునట్లు తిర్యగ్గమనుఁడై తప్పించికొనియె. అంతఁ గ్రమ్మఱ గదాదండంబును మాటిమాటికిఁ ద్రిప్పు

చున్నయాహిరణ్యాక్షునిఁ జూచి యాభగవంతుఁడు కోపపూరిత మానసుండయి దష్టాధరుండయి శత్రువును సమీపించి తనగదా దండముతోఁ గుడిపార్శ్వంబునఁ గొట్టఁగా గదాయుద్ధమందుఁ గుశలుఁడయిన యారాక్షసుండా దెబ్బను తనగదచే దప్పించుకొనెను. ఓవిదురా! ఇట్లాహరియు హిరణ్యాక్షుండును నొండొరుల జయింపఁ దలంపుగలవారయి భయంకరమయిన గదలతో నొకరి నొకరు కొట్టుకొనుచుండిరి. మఱియు నాహరి దానవు లిరువురు భయంకరములగు గదలతో మొత్తికొనుచు నాక్షతములనుండి స్రవించుచున్న రక్తము నాఘ్రాణించుటవలన రెట్టించిన కట్టలుక కలవారయి భూతలమునిమిత్తము వెక్కసీతులగా గదాయుద్ధ ముచేయుచు మత్తవృషభంబులచందంబునఁ బ్రకాశించిరి. ఆసమయమున స్వసంకల్పముచే నావరాహశరీరము దాలిచియున్న యజ్ఞమూర్తికిని నాహిరణ్యాక్షునికిని బ్రవర్తిల్లినయుద్ధంబు గనుఁగొనఁ గమలాసనుండు మరీచ్యాదులతోఁ గూడ నచ్చటికి కేతెంచెను. ఇట్లు బ్రహ్మ కుమారవర్గముతోఁగూడ దగ్గఱకువచ్చి భగవంతుని గదాఘాతములను బ్రతీకార మొనర్చుచున్నవాఁడును,యసహ్య పరాక్రమము కలవాఁడును,భయరహితుఁడును, మదోద్ధతుఁడును, నైనరక్కసుని వీక్షించి యాదివరాహరూపము నొందిననారాయణున కిట్లనియె. "దేవా! ఈరక్కసుండు మిగుల దురాత్ముఁడు. నీకు శరణాగతులయిన గోబ్రాహ్మణాదులను నిరపరాధులయిన భూతములను నిష్కరుణుఁడయి చంపుచున్నాఁడు. తన్నుఁజూచి పరుగిడువారి ధనప్రాణములను గొనునట్టినీచుఁడు. మఱియు నావలన వరంబులఁబొంది మిగుల మదించి యున్నాఁడు.వీఁడు యుద్ధప్రియుఁడయి తగినవీరునకై యెల్లప్పుడుఁ దిరుగుచుండును.వీఁడు లో

కములకు ముల్లువంటివాఁడు.వీఁడు మిగుల మాయావి.లోకముల లో వీని నెదుర్కొనువీరుఁ డెవ్వఁడును లేఁడు. వీఁడు మిగులకావరముచే నొప్పుచున్నాఁడు.వీఁడు క్రూరులలో నగ్రేసరుఁడు. వీనితో నింతసేపు యుద్ధముచేయుట పాముతో బాలకుఁడాడుకొనుటవలెనే ప్రాణాపాయకరమని తెలియుము. ఇంక సాయంకాలముగూడ నాసన్నమగుచున్నది. రాత్రియందు రాక్షసులకు బలము హెచ్చుగును. కావున నీవు నీమాయాబలము నాశ్రయించి సాయంకాలమునకుఁ బూర్వమే సంహరింపుము. లేనిచో వీనినిజంప దుస్సాధ్యమగును. వీఁడు శాంబరమాయ నవలంబించినచో వీని నెదుర్కొనుట కెవ్వరును సమర్థులుకారు. జాగరూకుఁడవయి వీఁడు స్వమాయాబలము నొందకమున్నే సంహరించి దేవతలకు జయము కలిగింపుము. ఇప్పు డభిజిత్తను పేరుగల మధ్యాహ్నకాలమే తెంచినది. వీనిని జంపుట కిది తగినసమయము. నీసేవకులమయిన మాక్షేమముకొఱకు దుర్జయుఁడయినను వీనిఁజంపుము. వీనికిఁ బోఁగాలము సమీపించినది. వీనికిఁ జావు తండ్రియగు కశ్యపుఁడే విధించియున్నాఁడు. యుద్ధమందు నీవిక్రమ మెల్లరు వినుతింప వీనితోఁ బోరాడి లోకములకు సుఖము కలిగింపుము' అనెను. ఇది బదునెనిమిదవయధ్యాయము.



ఇట్లు నిర్దుష్టముగాను,మధురముగాను,బలికిన బ్రహ్మవాక్యములు విని నారాయణుఁడు కాలస్వరూపుఁడ నయి'సర్వమును సంహరించు నాకుశత్రుభయమును గల్పించుచున్నాఁడ'ని మందహాసముచేసి ప్రేమసహితమగు కటాక్షముచే నతనివాక్కులను మన్నించెను. అట్లద్దేవుఁడు దేవతాభీష్టము నెఱవేర్పఁదలంచి తనయెదుట

మదిపుటేనుంగువలె నిర్భయుఁడయి సంచరించుచున్న హిరణ్యాక్షునిఁజూచి సమీపించి తనగదాదండముతో దవుడపయిఁ గొట్టెను. అది రాక్షసుండుచూచి తనపైకి వచ్చుచున్న గదను మధ్యమార్గముననే తనగదాదండముతోనే యది యటనుండి జారి ధ్వంసించుచుఁ గ్రిందఁబడియె. అందువలన భగవంతుండు నిరాయుధుండయ్యె. అదిచూచి దేవతలు హాహాకారంబులు చేసిరి. హిరణ్యాక్షుఁడు హరి నిరాయుధుఁడయి యుండుటను జూచియు, హరిని సులభముగాఁ జంపఁదగినసమయము తన కెలవడినను, "యుద్ధమందు నిరాయుధుని జంపఁగూడ"దను ధర్మబుద్ధితో హరిని బాధింప నిష్టపడలేదు. అంత విష్ణుమూర్తి తనచేతిలో నున్నగద భగ్నమగుటయు, నదిచూచి దేవతలు భయంబున హాహాకారంబులు చేయుటయు జూచి, నిరాయుధుఁ డయియున్నతన్ను బాధింపకపోయినందులకు రాక్షసునిధర్మబుద్ధికి మిగుల సంతసించెను. ఇట్లు సంతసించి తనచక్రము నొక్కమాఱు స్మరింపఁగావచ్చి తనహస్తమందు నిలిచెను. అంత హరి యాచక్రమును ధరించుటను దేవతలు చూచి మిగుల సంతసించి చక్రప్రభావ మెఱిఁగియున్నవారగుటచేత "ఈచక్రమున రాక్షసుని జయింపుము. రాక్షసుని జయింపుము" అనెడి వాక్యంబులు గగనభాగంబును గప్పుచుండెను. అంత రక్కసులమేటి హరి చక్రాయుధుఁడయి యుండుటం జూచి క్రోధాతిశయముచే క్షుభితేంద్రియుఁడయి, నిట్టూర్పుపుచ్చి భయంకరములయిన దంష్ట్రలచే నొప్పుచుఁ గన్నులనుండి నిప్పులఁ గుప్పలుగాఁ గురియుచుఁ బెదవిఁ గొఱుకుచు నందువలన రెట్టించినకట్టలుక కలవాఁడయి హరిని సమీపించి "ఈ దెబ్బతోఁ జచ్చితివ"ని పల్కుచుఁ దనగదాదండముతో మొత్తెను. యజ్ఞ

వరాహావతారమెత్తియున్న భగవంతుఁడా వచ్చుచున్న గదను మార్గమధ్యమందే తనయెడమపాదముతోఁ దన్ని దానిని దునుమాడి యది చూచుచున్న రాక్షసుని క్రోధమును రెట్టింపఁజేసెను. ఇట్లు చేసి, "ఓరీ! దానవాధమా! నీగదను దీసికొని యుద్ధమునకుఁ బ్రయత్నింపుము. ఊరకుండకుము. తప్పక నీవే జయమును బొందఁగలవు. లెమ్ము. అనుమానింపకుము" అని పలుకుచున్న హరి వాక్యంబులు విని కరమ్మలిగి యారాక్షసుండు గదాదండము సారించి దానితో వరాహునిఁ గొట్టి బిగ్గరగా సింహనాదము చేసెను. అంత భగవంతుండు తనపైకి వచ్చుచున్న రాక్షసునిగదాదండమును గరుత్మంతుఁడు నాగుఁబాము నొడిసిపట్టుకొనినట్లు లీలగాఁ బట్టికొనెను. ఇట్లాగదాదండమును బట్టుకొని రక్కసునిఁ జూచి "ఇదిగోఁ దీసికొనుము. ఈగదను ధరించి యుద్ధము చేయుము"అని యాగదాదండము నీఁబోఁగా హతతేజస్కుఁడయిన యాదానవుఁ డాగదాదండము నందికొన నిష్టపడలేదు; కాని తీవ్రమగు నగ్నిహోత్రమువలె భయంకరమయిన త్రిశూలంబు నొకదానిని గైకొని హరిపయిఁ బ్రయోగింప నది నభచారకర్మంబు మహావిద్యోపాసకుఁడగు బ్రాహ్మణునిఁ జెందలేనట్లు వరాహమూర్తిని జెంద భయపడుచు మందముగా వచ్చుచుండె. అంత నుద్గతమగుకాంతిపుంజముతో నాకాశమధ్యమందుఁ బ్రకాశించుచున్న యాశూలమును జూచి నారాయణుం డతిరయంబునఁ దనచక్రంబుచే నమృతహరణకాలమందుఁ దనవజ్రంబుచే వజ్రాయుధమును గారవింపఁదలంచి గరుత్మంతుఁడు విడిచిన పక్షంబును ద్రుంచినట్లు ద్రుంప దేవతల జయజయధ్వనులు రక్కసుల యాహాకారంబులతోఁగూడ నిర్గమించెను. ఇట్లు తన

శూలము హతమగుటచూచి హిరణ్యాక్షుం డతికోపంబు నూని హరిని సమీపించి సింహనాదంబు చేయుచు నాతనివక్షఃస్థలంబున( బిడికిటం బొడిచి యంతర్ధానము చెందెను. ఓవిదురా! ఇట్లు రాక్షసునిచే( గొట్ట(బడినను నారాయణుండు పుష్పదామాఘాతంబునకు లక్ష్యముచేయని మదపుటేనుంగుభంగి నాదెబ్బను సరకుగొనకుండెను. రాక్షసు( డట్లంతర్ధానముచెంది యాశ్చర్యశక్తులకు నాయకుడగు హరివిషయమునయి బహువిధములయిన మాయల సృజించెను. ఆమాయలను జూచి లోకులందఱు తప్పక లోకప్రళయ మహానని తలంచిరి. ఆసమయమున రాక్షససృష్టమయిన మాయాబలంబుచే భయంకరమైన వాయువు విజృంభించి ధూపరాగంబు నల్గడల నొందించి లోకంబును దిమిరావృతంబుగ( జేసి వీవ( దొడంగెను. నలుదిక్కులనుండి యంత్రములచే( బ్రయోగింప(బడుచున్నట్లు పాషాణవర్షము కురియుచుండెను. ఆకాశము కాంతి దక్కియుండెను. విద్యుత్సహితములయిన మేఘకదంబంబు లాకసమును గప్పి లోకములు బెగడుపడ గర్జించుచు( జీమును రక్తమును మూత్రపురీషములను గేశములను నెమ్ములను వర్షింప( దొడంగెను. పలువిధములయిన యాయుధముల( బ్రయోగించు పర్వతంబులెల్లను గాన నయ్యె. దిగంబరలును ముక్తకేశులును శూలధారిణులును నగు పెక్కండ్రు రాక్షసస్త్రీలు కన(బడ(జొచ్చిరి. మఱియు హింసాశీలురయిన యక్షులును, రక్షస్సులును జతురంగబలంబుతో నల్గడల(బర్వి 'చంపుము కొట్టుము' అని యొకరినొకరు పురికొల్పికొనుచు( దిరుగుచున్నట్లు నేత్రగోచరమాయెను. అంత నారాయణుండు చూచి లోకభయంకరములగు నాసురమాయల నంతము( బొందించుటకయి తనకు(

ప్రియతరమయిన చక్రాయుధమును బ్రయోగించెను. అదిచూచి దితి తనప్రియుండును ద్రికాలవేదియు నగు కశ్యపబ్రహ్మ చెప్పిన వాక్యముచొప్పునఁ దనకుమారుండు హరిచేఁ జచ్చుట సిద్ధంబని నిశ్చయించి భయంబున హృదయము గంపింప స్తనములు రక్తము స్రవింపఁజేయుచుండెను. అనంతరము కాంచనాక్షుండు తన మాయాబలం బాహరి నేమియుఁ జేయలేకపోవుట చూచి మొక్కవోనిబంటుతనమున హరిని సమీపించి తన బాహుయుగళంబు సాఁచి పుండరీకాక్షునివక్షంబున వజ్రఘాతంబులతో సమానములయిన పిడికిటిపోటులం బొడుచుచుండెను. అంత నారాయణుం డుగ్రుండయి దేవేంద్రుఁడు వృత్రాసురుని గొట్టినట్లు తనహస్తంబున వానికర్ణమును గొట్టెను. అందులకు నారక్కసుండు సహింపలేక భూమిపయిం బడి నిమీలితనేత్రుండయి గాలిచే నేల గూలిన వృక్షంబుపగిది గూలెను. ఇట్లు నారాయణునిచే వధింపఁబడి కాంతిదక్కి భయంకరదంష్ట్రలు గలిగి పెదవి గఱచికొని నేలఁబడియున్నహిరణ్యాక్షుం జూచి బ్రహ్మాదిదేవత లానందకందళితచిత్తులయి నారాయణుని సమీపించుచు నిట్లు పల్కిరి. "అయారే! ఇదిమిగుల వింతగా నున్నది. భగవంతుచేఁ జచ్చుపుణ్యాత్ముండు దుర్లభుండుగదా? యోగీశ్వరులందఱు సంసారనివృత్తులయి యోగమార్గముల నవలంబించి యెవని పాదపద్మముల రహస్యముగా భజింతురో యాభగవంతుని పాదపద్మముచేతనే యారక్కసుండు స్రుక్కెను. మఱియు భగవంతునిముఖమును జూచుచుఁ దనువువిడిచెను. వీనిపుణ్యమెంతని కొనియాడఁగలము! ఇంతకు నీహిరణ్యాక్షహిరణ్యకశిపులు బ్రాహ్మణశాపమువలన రాక్షసులయి జన్మించిరికాని వీరు భగవంతుని ద్వారపాలు రేకదా? వీరు మగుడఁ

గతిపయజన్మములలోఁ దమస్థానమును బొందఁగలరు. వీరు పుణ్యాత్ము లని వేఱ చెప్పవలయునా? అని యారక్కసునిపుణ్యమును బేర్కొనుచు హరిని సమీపించి యిట్లనిరి. 'ఓదేవా! నీవు కేవలము సత్వగుణాంశవే యయినను లోకరక్షణమునిమిత్తము స్వేచ్ఛోపాత్తశరీరుండ వయితివి. అట్టి నీకు నమస్కారము. నీవు సకలయాగస్వరూపుఁడవు యాగఫలప్రదుఁడవు. అట్టినీకు నమస్కారంబుల నాచరించుచున్నారము. మఱియు లోకములకు ముల్లువంటివాఁడగు నీరక్కసుండు చచ్చెను. నీపాదభక్తిచే మేము సుఖవంతుల మయి యుందుము" అని యిట్లసహ్యావిక్రమముగల రాక్షసునిఁ జక్కడి వరాహావతారమెత్తిననారాయణుండు కృతకృత్యుండయి బ్రహ్మాదులచే నుతింపఁబడుచు వారలసంస్తవంబులకు లో మిగుల ముద మందుచు వారలఁ గృపాకటాక్షవీక్షణములచేఁ జూచి మన్నింపుచు వైకుంఠమునకుఁ బోయెను. ఓవిదురా! భగవంతుని యవతారచరిత్రమును దురాత్ముఁడయిన హిరణ్యాక్షుని యుద్ధమందు లీలగాఁజంపినచరిత్రమును నీకుఁ దెలిపితిని. అని యిట్లు మైత్రేయుండు చెప్పినభగవత్కథ నాలించి విదురుం డెంతయు స్వాంతంబున సంతసంబొందె నని శుకుండు రాజునకుఁజెప్పి వెండి యు నిట్లనియె. మఱియు లోకములో మహాత్ములును, మహాయశస్కులును, బుణ్యాత్ములు, నగువారిచారిత్రములు విన్నప్పుడే హృదయ మమందానందము నొందుచున్నప్పుడు భగవంతుని యద్భుతచారిత్రము వినినప్పుడు హృదయ మమితానందము నొందు నని వేఱ చెప్పవలయునా? ఇంతయునుంగాక తొల్లి గజేంద్రుఁడు దైవికంబుగా నక్రముచేఁ బట్టుపడి వేయివత్సరంబులు దానితో యుద్ధంబు గావించి తుదకుఁ బోరాడ నశక్తుండయి భార్యా

సమేతుఁడయి భగవంతునిఁ బ్రార్థింప వారలకుయ్యాలించి చక్రధా
రియై సరభసంబున నేతెంచి నక్రమును సంహరించి గజేంద్రునిఁ
గాపాడెను. దిక్కులేనిమానవులచే మంచియుపాయంబులచే నా
రాధనీయుండును, దుష్టులకు దర్శనమొసంగనివాఁడును, శరణాగత
వత్సలుండును, నగుభగవంతుని సేవించుటకును, నాతనిసచ్చరిత్ర
ముల నాలకించుటకును కృతఘ్నుండుదక్క నెవ్వఁడు మానఁగలం
డు? లోకములో నున్నవారందఱు సేవింపక మానరు. మఱియు భగ
వంతుండు జగంబు గాపాడుటకయి వరాహావతారమెత్తి హిరణ్యా
క్షుని లీలమెయి సంహరించినకథను నెవరువిందురో, యెవ్వరు చదు
వుదురో, యెవ్వరుకీర్తింతురో, వారు బ్రహ్మహత్యాదిపాపమువలన
నుండియు విడువఁబడుదురు. ఈచరిత్రంబు విన్నవారు ధనమును
యశంబును, నాయుర్దాయంబును, యుద్ధములందు శౌర్యవర్ధనము
నుబొంది తుదను వైకుంఠమును బొందుదురు'. అనియిట్లు శుకుం
డు పరీక్షిత్తునకుఁ దెలియఁజెప్పెనని సూతుండుచెప్ప విని మిగుల
సంతసించి శౌనకుండు సూతునిఁజూచి యిట్లనియె. ఇది పందొమ్మి
దవయధ్యాయము.



"ఓసూతా! సమస్థితిని బొందినభూమి నధిష్ఠించినతరువాత
స్వాయంభువమనువు తక్కువజన్మములవారికి ధర్మార్థకామమో
క్షరూపపురుషార్థము సాధింపఁ బన్నినయుపాయము లెన్నివిధ
ములు? లోకసంగ్రహార్థమై తా నవలంబించిన మర్యాదలేవి?
మఱియు, విదురుఁడు నిరతిశయమయిన భగవద్భక్తి కలవాఁడు.
అతఁడు విష్ణునిదయారసమునకుఁ బాత్రుండు. భగవంతుఁడయిన
హరియందు బద్ధద్వేషులయినవారనియు, శ్రీహరివాక్యంబుల వా

రు వెడచెవులఁ బెట్టినారనియు దుర్యోధనాదియుతుఁడగు ధృత రాష్ట్రుని విడిచెను. ఆవిదురుఁడు భగవంతుఁడగు వ్యాసమహాము నికి జన్మించెను. సర్వవిధములచేత మిగుల గొప్పవాఁడు. సామా న్యుఁడు కాఁడు. అతఁడు సర్వాత్ముఁడయిన భగవంతుని యాశ్రి తుఁడు. సర్వమున కతనినే నమ్ముకొని సేవించుచునుండెను. అ ట్టిమహానుభావుఁడయిన విదురుండు గంగాదిపుణ్యనదులయందుఁ గృతావగాహుండయి యపగతపాతకుండయి కుశావర్తమను పు ణ్యతీర్థమునందు మైత్రేయునిఁ గలిసికొని నమస్కరించి యేమేమి యడిగెను? భాగవతోత్తములయిన విదురమైత్రేయులు ప్రసం గింప నారంభించినచో భగవంతుని పాదంబులవలనఁబుట్టి పాప నివర్తకములగు గంగాజలములవలె లోకపావనములయిన భగవ త్కథలు నిర్గమించుచుండును గదా! కావునఁ గీర్తనీయుఁడును,ను దారచరిత్రుఁడు నగుభగవంతుని కథలను మాకుఁ దెలియఁజేయు ము. నీకు మంగళంబులు గలుగుఁగాక. భగవంతునత్కథలనెడి యమృతము ద్రావి రసజ్ఞుఁ డగువాఁ డెవఁడు తృప్తిఁజెందు? అట్టిహ రికథామృతమును ద్రావుచుఁ దృప్తిచెందువాఁ డుండనేయుండఁ డు.” అని కుతూహలుండయి యడుగుచున్న శౌనకుం జూచి భగవ దర్పితచిత్తుఁడగు సూతుం డిట్లనియె. “మునీంద్రా! నీవడిగినట్లె రాజ ముగ శుకుండు రాజున కిట్లు చెప్పె. ఓరాజేంద్రా! నారాయణుండు వరాహావతారమెత్తి రసాతలమునుండి భూమి నుద్ధరించి హిర ణ్యాక్షుని సంహరించి వైకుంఠమును బొందినకథను మైత్రేయునివ లన విని విదురుండు సంతోషభరితస్వాంతుండయి మైత్రేయునిఁ జూచి ‘మునీంద్రా! చతుర్ముఖుండు ప్రజలను బుట్టించుటకయి మరీ చ్యాదిప్రజాపతుల సృజించెననికదా చెప్పియున్నావు! ఆప్రజా

పతులను సృజించినపిమ్మట బ్రహ్మ యేమిచేసెను? నీ వతీంద్రియమ గు స్వరూపముఁగూడ నెఱుఁగుదువు. కావున నాకుఁ జెప్పుము. మరీచిమొదలగువారును స్వాయంభువమనువును బ్రహ్మశాసనమువలన విశ్వము నెట్లు సృజించిరి. మఱియు వారలు సృష్ట్యాదికర్మములయందు స్వతంత్రులుకదా? అట్టివారలు భార్యాసమేతులయి సృజించినారా? లేక భార్యానిరపేక్షులై సృజించినారా? వీనినిగుఱించి విస్తరించి నాకుఁ జెప్పు''మని యడుగుచున్న విదురునిఁ జూచి మైత్రేయుండు సర్గాదిభేదములఁ జెప్పెద నాలింపు మని చెప్పి యిట్లనియె.

## మైత్రేయుండు విదురునికిఁ జతుర్ముఖుం డొనర్చు యక్షాదిదేవతాగణసృష్టిని దెలుపుట.

ఓవిదురా! అచింత్యప్రభావుఁడయిన యీశ్వరుండు కాలమువలనఁ గార్యోన్ముఖుఁడయి యుండఁగాఁ దనకు శరీరభూతమయి గుణత్రయాత్మకమయియున్న ప్రకృతివలన మహత్తత్త్వముదయించెను. రజఃప్రధానమయి భగవత్ప్రేరితమయి భూతజ్ఞానకర్మేంద్రియస్వరూపమైయున్న యామహత్తత్త్వమువలనఁ బంచమహాభూతములును, దన్మాత్రలును, జ్ఞానేంద్రియకర్మేంద్రియములును, నుద్భవించినవి. ఆభూతాదులు పరస్పరము కలియనివగుటచే భూతసంబంధమగు నండమును సృజింప నసమర్థములయి దైవయోగమువలన నేకీభవించి బ్రహ్మాండమును బుట్టించినవి. ఆయండ మధిష్ఠాతయగు చేతనము లేనిదయి సలిలమందుఁ జిరకాలమువఱకు వసించియుండెను. ఆయండకోశమందు భగవంతుండు వేయిసంవత్సరములధివసించెను. అట్లు శయనించియున్న భగవంతునినాభివలన సహస్రసూర్యప్రకాశమగుపద్మ ముద్భవించెను. ఆపద్మమే సమస్తజీవరాసులకు నివాసభూతము. ఆపద్మమువలన బ్రహ్మ స్వయముగాఁ

బుట్టెను. ఆ బ్రహ్మ భగవంతుని సంకల్పజ్ఞానమునకు విషయుఁడయి నామరూపాత్మకమయిన యీ ప్రపంచమును యథాపూర్వముగా సృజించెను, మఱియు నా బ్రహ్మ ముందుగాఁ దమోగుణమును బురస్కరించుకొని తామిస్రము, నంధతామిస్రము, తమము, మోహము, మహాతమము నాఁబడు నవిద్యాపంచకమును సృజించెను. ఆయవిద్యాపంచకములో నొకటియుఁ దమోమయము న గు నాస్వభావమును విడిచిపెట్టెను. అట్లు బ్రహ్మవిడిచినదానివలన యక్షరక్షస్సు లుదయించి యాకాయమును దమకు క్షుత్పిపాసలఁ గలిగించురాత్రినిగా గ్రహించిరి. ఇట్లాయక్షరక్షస్సులు, క్షుత్పిపాసాకులులయి యాచతుర్ముఖుని భక్షింప సమకట్టిన నాచతుర్ముఖుండు భయము చెంది.ఓరీ నేను మీజనకుండను. నన్ను మీరు భక్షించుట యుక్తముకాదు. మీరందఱు నాకుఁ బుత్త్రులరు. మీ రిట్టిక్రూరకర్మమునకుఁ బూనుకొనుట ధర్మముకాదు. మఱియు మీలోఁగొందఱు నన్ను రక్షింపవలదనియుఁ గొందఱు భక్షింపవలదనియుఁ బల్కినారు. కావున మీరు క్రమముగా రాక్షసులనియు యక్షులనియుఁ బ్రసిద్ధికెక్కుదురు. అనిపల్కెను. మొదటనిట్టి తమస్స్వభావులయిన యక్షరాక్షసాదుల సృజించి బ్రహ్మ ఛాయాప్రతియోగిని యగు తేజస్సును బొంది ప్రాఙ్ముఖుఁడయి దేవతల సృజించెను.అనంతరమా బ్రహ్మప్రభామయంబగు నాస్వభావంబు చాలించె.అదియహోరూపంబయి దేవతలకాశ్రయమయ్యె. తరువాత బ్రహ్మజఘనప్రదేశమువలన మిగులఁ గామాసక్తులయిన యసురుల సృజించె.అంత వారు కామాతురులయి మైథునాభిలాషులయి యా బ్రహ్మను సమీపించిరఁట!అంత బ్రహ్మ నిర్లజ్జులయి మైథునాభిలాషచేఁ దన్ను డాయవచ్చుచున్న యసురులనుజూచి నవ్వ

చు, వారిదుష్టచేష్టలకుఁ గోపితుండయి చేయునదిలేక పర్విడిపోయి భక్తార్తిహరుఁడై భక్తుల ననుగ్రహించునిమిత్తము వారివారిబుద్ధి కనురూపముగా దర్శనమిచ్చు నారాయణుని సమీపించి నమస్కరించి యిట్లనియె. "ఓదేవా ! లోకములకుఁ బ్రాప్తమయిన యాపదలఁ దొలఁగించునట్టివాఁడవీవె ? అట్లె నిన్నాశ్రయింపని దురాత్ములకుఁ గష్టముల నిచ్చెడువాఁడవును నీవే? కావున నాపన్నుండనయిన నన్నురక్షింపుము. భవదీయాజ్ఞానుసారంబుగ నీప్రజాసమూహమును సృజింప వారు దుర్మార్గులై బల్మిని నన్ను రమింపరాఁగా భయపడి యిందుఁ బర్విడి వచ్చితిని." అనిపల్కిన బ్రహ్మవాక్యంబుల విని స్పష్టముగాఁ బరాభిప్రాయము నెఱిఁగిననారాయణుఁడు కనికరించి బ్రహ్మను జూచి యీస్వభావంబును విసర్జింపుమనుడు నతఁ డట్లుకావించె. బ్రహ్మ యట్లు విసర్జించినస్వభావంబు సాయంకాలసంధ్య యయ్యె. అంత రాక్షసులు స్త్రీరూపముగాఁ గల్పితమగు సంధ్యను జూచిరి. ఇట్లుచూచి యవ్యక్తమధురముగా ధ్వనిచేయుచున్ననూపురములుగల పాదములచేతను,మదవిహ్వాలములయిన లోచనములచేతను, రత్నమయంబగు కాంచివలనను, ప్రకాశించెడిదుకూలమువలనను విలసిల్లునితంబబింబము చేతను, బరస్పర మొరసికొను నుత్తుంగ స్తనద్వయముచేతను, మల్లెల నిరసించుదంతపంక్తిచేతను,సంపెంగను ధిక్కరించునాసికచేతను, మందహాసముచే విలసిల్లు చూపులచేతను, నల్లని ముంగురులచేతను, మిగులఁ బ్రకాశించుచుఁ జూపఱకు మోహము గలిగించుచు సిగ్గుచేఁ దనశరీరమును డాచుకొనుచు, మెలఁగుచున్న స్త్రీగాఁ దలంచుకొని యసురు లందఱును గామమోహితులై దానింగూర్చి యిట్లు పలుకఁ నారంభించిరి.అయారె! దీనిసుందరాకారము

ను, దీనిలావణ్యాతిశయమును, దీనినవయౌవనమును గోరుచున్న మాలో నొకరినైన వరింపకపోవుచున్న దేమి? అని యిట్లు తలపో యుచు దానిని సత్కరించి ప్రణయమువలనఁ గుబుద్ధులై యిట్లడి గిరి. "ఓలలనామణీ! నీవు దేవతవా? లేక మనుష్యస్త్రీవా? లేక మఱియొక జాతిదానవా? ఓ సుశ్రోణి! నీ వెవ్వరికుమారికవు? ఇక్కడ నీ వభిలషించుపదార్థ మేమున్నది? నీవు నీసౌందర్యమ నెడు నమూల్యవస్తువును క్రయార్థముగానుంచి, యావస్తువును గొన శక్తిచాలనిదౌర్భాగ్యవంతు లగుమమ్మును, బాధించుచు న్నావు. నీ వేజాతి స్త్రీవయిన నేమి? మా భాగ్యవశమున నీసందర్శ నము లభించినది. నీవు కందుకక్రీడచే నిన్ను వీక్షించుచున్న మా చిత్తంబుల హరించుచున్నావు. ఓసుందరీ! ఎగిరి క్రిందఁబడుచున్న కందుకమును గరతలముచేఁ దూలించుచున్న దానవగుటచే నీపా దపద్మములొక్కయెడను నిలువఁజాలకున్నవి. బలిసినస్తనద్వయ మువలన భీతిచెంది కృశించి నీమధ్యము మిగులఁ గష్టపడుచున్నది. నీదృష్టిమందముగాఁ బ్రసరించుచున్నది. విడిపోయి జీరాడుచున్న నీసుందరకేశకలాపమును బంధింపుము." అనియిట్లు రాక్షసులు మోహవిహ్వాలులయి సాయంసంధ్యను భామినిగాఁ దలంచికొ నుచు నాసంధ్యను బట్టుకొనిరి. అది చూచి సరసిజాననుఁడు మి గులసంతసము చెందెను. అనంతరము బ్రహ్మ యభిప్రాయవిశేషము చే గంభీరముగా నవ్వి తన్ను నాఘ్రాణించుకొనుచుఁ గాంతి చేత గంధర్వులను నచ్చరలను బుట్టించి యాస్వభావమును విసర్జించెను. అది కాంతిబహుళమయిన ప్రాక్సంధ్యయయ్యెను. దానిని విశ్వావసువు మొదలగు గంధర్వాప్సరోగణంబు చేకొని యె. పిమ్మట బ్రహ్మ నిద్రారూపంబయినస్వభావంబుదాల్చి పిశాచ

గుహ్యాకులను సృజించి వారందఱు ముక్తకేశులలయి, దిగంబరు లయి యుండఁజూచి నేత్రముల నిమీలించి దానిని విస ర్జింపఁగ దాని వారలు కైకొనిరి. వార లట్లు జృంభణాఖ్యమగు స్వభావమును దాల్చినవా రగుటచేత దానిచే భూతములందు నిద్రయు నింద్రియవిరసత్వమును జూడఁబడుచున్నది. అనంతర ము బ్రహ్మ బలవంతునిగాఁ దలంచుచు సాధ్యగణములను, పితృ దేవతలను ననభిముఖుండయి సృజించెను. అంత సాధ్యులు పితృ దేవతలును, బలరూపకాయంబులను బొందిరి. అందువలననే సం తానవృద్ధి నపేక్షించువారును, బలము నపేక్షించువారును వార లను బూజించుచుందురు. అనంతరము బ్రహ్మ తిరోధానశక్తి నవలంబించి విద్యాధరులను సిద్ధులను సృజించెను. ఇట్లు సృజించి వారలకుఁ దిరోధానశక్తిరూపమయిన యాస్వభావము నర్పించెను. కావుననే వారలు తిరోధానశక్తిప్రధాను లయిరి. పిమ్మట బ్రహ్మ తనప్రతిబింబమును జూచుచుఁ గిన్నరకింపురుషాదుల సృజించె ను. అట్లు సృజించి వారలకుఁ బ్రతిబింబరూపమయినదాని నొసంగినదానిని వార లవలంబించిరి. కావున వారు బింబప్రతి బింబముల కున్నంతయభిమానమును వహించి ద్వంద్వములుగా వర్తించుచు, నా బ్రహ్మను బ్రాతఃకాలములయందు గానము చే యుచుందురు. తరువాత బ్రహ్మ సౌకుమార్యముగల దేహమును ధరించి శయనించి తనసృష్టి వృద్ధి కాకపోవుటకు మిగులఁ జింతిం చుచుఁ, గొంతవడికిఁ గోపము తెచ్చికొని బహుచింతారూపమ యిన యాశరీరమును విడిచెను. అందువలన జాఱిన కేశము లహి శ్రేష్ఠములయ్యె. పిమ్మట నుపసర్పించుచున్న యాదేహమువలన నతివేగముగల నాగము లుద్భవించినవి. అనంతరము కమలాస

నుండు తన్నుఁ గృతకృత్యునిగా భావించి తనమనస్సువలనఁ బ్రజ
ల సృజింపఁజాలినమనువులను సృజించి వారలకుఁ బురుషాకా
రమయిన దేహము నొసంగెను. అంత వార లాశరీరమును
గ్రహించి బ్రహ్మవలెనే పురుషాకారదేహవిశిష్టు లయిరి. అంత
వారలను జూచి మొదట సృష్టింపఁబడిన వారందఱు బ్రహ్మను
సమీపించి 'దేవా ! నీ వొనరించిన యీపురుషసృష్టి మిగుల బా
గుగ నున్నది. మోక్షసాధకములయిన కర్మములన్నియుఁ బురు
షులే యాచరింపవలసియున్నవి. కావున మా కట్టి పౌరుష
దేహ మర్పించినచో దానితో భోగజాత మనుభవించియుం
దుము. నీసృష్టి మిక్కిలి బాగుగ నున్న'దని నుతించిరి. అనంతర
ము బ్రహ్మ జితేంద్రియుఁడయి సమాధియోగము నవలంబించి
ఋషిగణంబుల సృజించె. ఆఋషుల కందఱకుఁ దనశరీరంబులోని
యొక్కొక్క భాగ మొక్కొక్కనికి నర్పించెను. ఆశరీరభాగములు
తపోవిద్యాసమాధిరూపములు కావున వారందఱు నణిమాద్య
ష్టసిద్ధులు గలవారలయి విషయములకు విముఖులయి ప్రవర్తిం
చుచున్నారని'' మైత్రేయుండు విదురున కెఱిఁగించిన నతండు పర
మానందభరితుండయి గోవిందుని చరణారవిందంబుల డెందం
బునం దలంచుకొనుచు మైత్రేయుంజూచి యిట్లనియె. ఇది యిరు
వదవయధ్యాయము.



"ఓ మునీంద్రా ! స్వాయంభువమనువువంశంబు సత్పురుషు
లందఱిచే వర్ణింపఁదగినది. ఆస్వాయంభువవంశమందు మైథున
క్రియవలనఁ బ్రజావృద్ధి యెట్లాయెనో తెలియఁజెప్పుము? స్వా
యంభువమనువు కుమారులయిన ప్రియవ్రతుఁడు నుత్తానపా
దుఁడును సప్తద్వీపయుతమయిన భూమిని ధర్మ మతిక్రమింపకుం

డ నెట్లుగాఁ బరిపాలించినారు? అతనికుమారికయయిన దేవహూతి కర్దమునికి భార్యయయ్యె నని చెప్పితివి? మహాయోగియు సంసారవిరక్తుఁడు నయినయాకర్దముఁ డెట్లుగా దేవహూతిని బెండ్లియాడెను? అమ్మహాముని దేవహూతియందు నెందఱిపుత్త్రులం బడసెను? మఱియుఁ జతుర్ముఖునికుమారుఁడయిన దక్షుఁడు మనుపుత్త్రియయిన ప్రసూతిని బెండ్లియాడి ప్రజాసృష్టి నెట్లుగా వివర్ధించెను?" అని యడుగుచున్నవిదురుని ప్రశ్నముల నాలకించి సంతసించి యతని కిట్లనియె. బ్రహ్మదేవుఁడు ప్రజాపతుల సృజించి ప్రజాసృష్టి వృద్ధిచేయుఁడని వారలతోఁ జెప్పెనని యిదివరలోనే చెప్పియున్నానుగదా? ఆ ప్రజాపతులలోఁ గర్దముండు తనతండ్రి చెప్పినట్లు చేయఁ దలంపు గలవాఁడయి సరస్వతీనది చెంతకుఁబోయి భగవంతు నుద్దేశించి పదివేలవత్సరంబులు ఘోరంబగుతపంబు నాచరించెను. ఇట్లు కర్దముఁడు ఫలాపేక్ష లేకుండ వర్ణాశ్రమముల కుచితముగాఁ జేయఁబడు భగవదారాధనచేతను, భగవదుపాసనచేతను, వరప్రదుఁడగు భగవంతుని సేవించె. అంత భగవంతుండగు నారాయణుం డతనితపంబునకు సంతోషించి పంచోపనిషద్ద్వ

నారాయణుండు కర్దమునకుఁ బ్రత్యక్షమగుట.

వ్యమయి, సౌకుమార్యాద్యనంతకల్యాణగుణములుగల దివ్యమంగళాకృతితో నతనికిఁ బ్రత్యక్షమాయెను. ఆ నారాయణుఁడు పరమపావనుండు. అతఁడు కోటిసూర్యప్రకాశముకలవాఁడు. అతఁడు పద్మములచేతను గలువలచేతఁ గూర్పఁబడిన మాలికకలవాఁడు. అతనిముఖపద్మము భృంగసదృశమయిన ముంగురులచే రంగారుచుండెను. అతనికట్టుపుట్టము మిగులఁ గాంతికలదయి చూపఱకుఁగనులపండువు లొనరించుచుండెను. అతనిశిరంబునఁ

గిరీటము చంద్రసంకాశమయి వెలయుచుండెను. అతనికర్ణయు గళంబున మణిమయములయిన మకరకుండలములు ప్రకాశించుచుండెను. అతనిబాహుత్రయమునను గ్రమముగాఁ జక్రము, శంఖము, గదాదండము, విలసిల్లుచుండెను. అతని నాల్గవకరంబునఁ దెల్లఁగలువ యనుక్రీడాసాధనము ప్రకాశించుచుండెను. కరుణారసపూరితములగు నతనిచూపులు మిగుల మనోహరముగా నుండెను. అతనిపాదపద్మములు గరుత్మంతుని యంసభాగమునఁ బ్రకాశించుచుండెను. అతనివక్షస్స్థలము శ్రీవత్సకౌస్తుభములచే నలరుచుండె. ఇట్టి దివ్యమంగళాకారుండయి నారాయణుండు గగనమందుండఁగాఁ బ్రీతిస్వభావుఁడగు కర్దముండు సూచి తనకోర్కె సఫలమయినందులకు మిగుల సంతసించి బద్ధాంజలియయి మధురవాక్యములతో నతని కిట్లనియె. ఓభగవంతా! ఓవందనీయా! నీసందర్శనమువలన నానేత్రములకు తపఃఫలంబు లభించినది. మఱియు భవదీయసందర్శనముగూర్చి ప్రయత్నించి యోగముల నవలంబించి యోగీశ్వరు లనేకజన్మములచేఁ బొందుచున్నారు. అట్టి నీసందర్శనము నాకింత సులభముగా లభించుట నాయదృష్టంబకాదె? లోకములోఁ గొందఱు మానవులు నీమాయాపాశములకు లోఁబడి నష్టబుద్ధులయి సంసారసముద్రమును దరింపఁజేయఁజాలిననీపాదపద్మమనుమహానావను గామలేశముకొఱకయి యుపాసించుచున్నారు. నీవు నిరతిశయ పురుషార్థమగుమోక్షము నిచ్చుచుండఁగా దాని నపేక్షింపక యల్పములయిన విషయసుఖములఁ గోరుకొనుచుందురు. ఇంతయు వివేకు లుందురా? నే నిట్లు లోకులను నిందించుచున్నాను. కాని నేనును మూఢబుద్ధి నయి నిరతిశయానందసముద్రమువయిన నిన్నుఁ

బొందియు సుఖలేశమునే యపేక్షించుచున్నాను. ముక్తిదాయకుఁడవయిన నీయనుగ్రహము గలిగినప్పుడు ముక్తికాంతను గోర నిష్టపడక గుణవయోరూపములచే నా కనుకూలురాలయి గృహస్థాశ్రమసౌఖ్యముల వర్ధించునట్టి కాంతాలలామ నిమ్మని కోరుచున్నాను. నే నెంత దుష్టాంతఃకరణుండనో చూడుము. నావంటి కాముకుండు లోకమందు మఱియొకఁ డుండునా? ఆ స్వల్పఫలము నపేక్షించియే సమస్తపురుషార్థములను సమకూర్చునట్టియుఁ గల్పవృక్షముతో సదృశమయిన నీపాదమూలమును జేరితిని. ఓ దేవా! వేదాత్మకమయిన నీవాక్యరజ్జువుచే లోకులు బద్ధులయి సంసారాభిలాషులయి, త్రివర్గఫలములనే యధికముగా మురించుచుఁ బశువులవలెఁ దిరుగుచుందురు. నేను నట్టి సాంసారికులయిన లోకుల నాశ్రయించితిని. ఓ దేవా! కాలస్వరూపుఁడవయిన నీకుఁ బూజ లొనర్చుచుందును. ఈ సాంసారికులగు లోకుల ననుసరింప నాకిష్టము లేకపోయినను మాజనకాజ్ఞ దాఁట వలనుపడదు. నే నేమిసేయుదును. కాలస్వరూపుఁడ వయిన నీవు నిరర్థజన్ములయిన సంసారులయాయువును క్షయింపఁజేయుదువఁట! నేను నట్టి సంసారులనే యనుసరింపనున్నాను. కావున నాయందు దయయుంచి నాయాయువును క్షయమును బొందింపకుండుటకై నీ కీపూజ లొనర్చుచున్నాను. నేను భవదీయాజ్ఞ మీఱకుండుటకయి సంసారము నవలంబించుచున్నాను. కాని కామసుఖంబు లనుభవింపఁదలంచి కాదు. ఆకారణంబుననయినను నాయందు దయ యుంచి నా యాయువును దఱిఁగింపకుము. ఓయీ! నీయాయువును క్షయింపఁజేయ నాకేమి శక్తియున్నది? అని యందువేని చెప్పెద వినుము. కాలచక్రము

నీచేతిలో నున్నది. అది యధికమాసముతోఁ గూడి పదుమూ డుమాసము లనునరములుకలది. ఆచక్రము మున్నూటయఱు వదిమూడుదినంబు లను పర్వంబులు కలది. అది ఋతుషట్క మనెడి నేమి కలది. అయ్యది చాతుర్మాస్యత్రయమనునాభితో నొప్పుచుండును. అయ్యది క్షణములు లవములు ననెడి పత్రము లు గలది. అట్టికాలచక్రము కాలాత్మకమగు మహావేగము క లదయి యక్షరంబయిన బ్రహ్మంబునందు సదా తిరుగుచుండును. ఆచక్రమే సమస్తజీవుల యాయువును గ్రసించుచుండును. అట్టి చక్రము నీచేతిలో నున్నప్పుడు జీవుల యాయువు నెచ్చించుట కుఁ దఱిఁగించుటకు నీకేశక్తి గలదు గాని మఱియెవ్వరికిఁ గలదు? కావున నన్ను దయఁజూచి రక్షింపుము. వెనుకటికాలచక్రంబు చే నీవు కామాభిభూతులయి పశుప్రాయులయినవారి యా యువుల హరించుచుందువు కాని మూఢులయిన సంసారులను,వా రి ననుసరించినవారిని జేరక భవదీయసత్కథలను నమృతరసము ను ద్రావి విసర్జితదేహధర్ములయినవారలయాయువు నెంతమాత్ర ము హరింపఁజాలవు.అదికారణంబున నన్ను సాధారణసాంసారికు నిగతిఁ జూడక యనుగ్రహించి రక్షింపుము.నన్నట్లు దయఁజూతు వనియే కాలచక్రశరీరుఁడవై యాశ్రితకల్పవృక్షమవగు నీపాద మూలమును జేరితిని. ఓయీ! బ్రహ్మరుద్రాదులుండఁగా వారల నందఱిని విడిచి నన్నుఁ జేరెదవేల? అందువేని చెప్పెదను విను. ఓదేవా! సృష్టికిఁ బూర్వమందు నామరూపవిభాగములఁ జేయఁ దగనంతసూక్ష్మదశలోనున్న చిదచిత్తులును గాలమును శరీరము గాఁగల * నీ వొక్కఁడవేయుంటివి. పిమ్మట నీవు నామరూపముల

---

* ఓయీ! సృష్టికిఁ బూర్వమందుఁ బ్రకృతిపురుషశరీరుఁడయిన పరమపు.

విభాగింపఁగాఁ దగినంత స్థూలావస్థనుబొందిన చిదచిత్తులచేఁ బ్ర కాశించుచుఁ బ్రపంచకంబును సృజింపఁ దలఁచి,స్వరూపమువలన ను, స్వభావమువలనను, నీకంటె నెక్కుడుభేదము గలిగినదయ్యు, స్వశరీరభూతమగు ప్రకృతిని బురస్కరించికొని, స్వశక్తిచేతనే తంతువుల సృజించుచుఁ దిరుగ నుపసంహారము చేయుచు వర్తించు సాలెపురుగుచందంబున, నీవును స్వశక్తిచేతనే యాత్మయందు లోకమును సృజించుచుఁ, బాలించుచు, సంహరించుచు, నున్నా

---

రుషుఁ డొక్కఁడేయున్నాఁడనియు, నతఁడు తనయందే సమస్తప్రపంచమును సృజించుచున్నాఁడనియుఁ జెప్పితివి. ఇందువలన భగవంతుఁ డొక్కఁడే జగంబున కుపాదానకారణమును నిమిత్తకారణము నగుచున్నట్టు తెలియవచ్చుచు న్నది. ఇది యనుభవసిద్ధముగాలేదు. లోకములో నొక కార్యమున కుపాదా నకారణ మొకవస్తువగుచున్నది. నిమిత్తకారణము మఱియొకవస్తు వగుచున్న ది. కుమ్మరి కుండలను జేయుచున్నాఁడు.ఆకుండలకుఁ గుమ్మరి నిమిత్తకారణము గాఁగా, మ న్నుపాదానకారణ మగుచున్నది.అంతియెకాని నిమిత్తోపాదా నకారణత్వములు కేవలము మంటియందుగాని కేవలము కులాలునియందుఁగాని లేవు. అట్లుండ భగవంతుని కొక్కనికే నిమిత్తోపాదానకారణత్వము లంగీక రించుట యెట్లని" అందువేని చెప్పెదవినుము. ఇక్కడఁ గులాలదృష్టాంతము భగవంతునికి సరిరాదు. కులాలుఁడు సర్వశక్తులు లేనివాఁడు కావున వాఁడు నిమిత్తకారణమేకాని యుపాదానముకాఁడు.మృత్తు జడమగుటచే నుపాదా నమేకాని నిమిత్తముకాదు. భగవంతుఁ డట్లుగాక "పరాస్యశక్తి ర్వివిధైవ శ్రూయతే"అనిచెప్పినట్లు సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వాదులగు ననంతకల్యాణగుణ ములు గలవాఁడగుటచే నామరూపవిభాగానర్హ సూక్ష్మచిదచిద్విశిష్టత్వరూప గుణముచే నుపాదాన మగుచున్నాఁడు.ప్రకృతిపురుషకాలములకు నియంత య గుచున్నాఁడు. కావునఁ దాదృశనియంతృరూపగుణముచే నిమిత్తకారణ మగు చున్నాఁడు. అందువలన భగవంతున కుభయవిధకారణత్వ మంగీకరింపవచ్చు.

వు. అందువలన నీవేజగత్కారణమవు. కారణపదార్థమే ధ్యానా ర్హమయినదని పెద్దలు చెప్పుటను విని నేను బ్రహ్మాదులను విడిచి జ గత్కారణమవయిన నిన్నును ధ్యానించుచుఁ బెండ్లాడ నభిలషించి నీపాదమూలమును జేరితిని. ఓభగవంతా! నీవు స్వసంకల్పముచే నహంకారమును ముందుగ సృజించి, దానివలన, శబ్దాదితన్మాత్ర లను, వానివలన భూతములను సృజించితివి. భూతసృష్టి కహంకా రము కారణమగుటచే మావంటిజీవులందఱును దానికి వశ్యులై నీపరమపదము నభిలషింపక యిట్టితుచ్ఛసుఖము లనుభవింపఁగో రుచున్నారు. ఇట్లు నేను భవత్పరమపదము నభిలషింపకపోయి నను, ప్రకాశించుతులసీమాలగల నీయాశ్చర్యవిగ్రహమును చూచినప్పుడె నీపదము నొందింపఁదగినయనుగ్రహంబునకుఁ బాత్రుండనైతిని. కావున నీ వట్టియనుగ్రహంబుచేఁ గోరకున్న ను నాకు నీపదప్రాప్తి గలిగింపకమానవు. ఓ పరమపురుషా ! మావంటివారి ననుగ్రహింపఁ బాటుపడుచు, స్వాత్మానుభవ ముచే జగద్వ్యాపారరూప ప్రయోజనంబునం దపేక్ష లేనివాఁడ వయ్యు స్వసంకల్పముచేతనే జగద్వ్యాపారంబుల నెఱవేర్చుచు, నీయారాధనను స్వల్పముగాఁ జేసినను నట్టిపురుషునికోర్కులఁ దీ ర్చుచు,వందనీయమగు పాదారవిందంబులు గలిగియున్న నీకు వం దనంబులు గావించుచున్నాను.'' అని సత్యముగాఁ బలుకుచున్నక ర్దమ ప్రజాపతిని వీక్షించి గరుత్మంతునిస్కంధమందుఁ బ్రకాశిం చుచున్ననారాయణమూర్తి ప్రేమాతిశయముచేతను,మందహాస ముచేతను, విలాసములఁజెందియున్న కనుబొమలు గలవాఁడయి

నారాయణుఁడు కర్దమునికి వరంబు లొసంగుట.

తేనెలొలుకుచున్న కులుకుపలుకులచేఁ గర్దముని కిట్లనియె. "ఓము

నీంద్రా! సుందరకన్యాప్రాప్తికయి పరమనిష్ఠాగరిష్ఠుండవయి శమ దమాది సుగుణసంపన్నుండవయి నన్నుఁగూర్చి ఘోరతపంబు చేసితివి. నన్ను సంతసింపఁజేసితివి. నీతపంబునకు మెచ్చితిని. నీయభిప్రాయంబంతయు నాకవగతంబయినది. నీయభిప్రాయము వింతకుముందే సంఘటించితిని. ఓమహానీయా! నాయారాధన మొకానొకప్పుడును నిష్ఫలంబుకాదు. సామాన్యులొనర్చిన యారాధనముగూడ నిష్ఫలము కాదని చెప్పవలసియున్నప్పుడు నియతేంద్రియులు, నిష్ఠాగరిష్ఠులనగు మీవంటివార లొనర్చిన యారాధనము వ్యర్థముకాదని వేఱచెప్పవలయునా? బ్రహ్మకుమారుఁడగు స్వాయంభువుండను చక్రవర్తి కలఁడు. అతఁడు మంగళాచారములచేఁ బ్రఖ్యాతిచెందియున్నాఁడు. అతఁడు బ్రహ్మావర్తమందు నివసించి సప్తసముద్రమధ్యగతమగు భూమండలమును బరిపాలించుచున్నాఁడు. అతనికి శతరూపయను నామముగలభార్యయు దేవహూతియను నొకకుమారీరత్నముం గలరు. ఆతని కూఁతురగు దేవహూతి లోకంబునఁగల సౌందర్యవతులలోనుత్తమురాలని చెప్పవచ్చును. ఆమెగుణములు నిరుపమానములు. ఆమె సత్ప్రవర్తనను జూచి పెద్దలుకూడ నేర్చికొనవలసియున్నది. ఆమె యిప్పుడు వివాహార్హయయి యున్నది. వివాహార్హయగు కుమారికంజూచి స్వాయంభువుండు తగిన వరునికర్పింపవలయు నని యాలోచించుచున్నాఁడు. ఆతఁడు నీగుణగణంబులును నీప్రభావమును విని నీకుఁ దనకుమారిక నర్పింపఁదలంపుతో రేపటిదినముభార్యాపుత్రికలతోఁగూడికొని నీయాశ్రమమునకు వచ్చి నీకర్పింపఁగలండు. ఇందులకెంతమాత్రము సందియములేదు. ఆసుందరకన్యక నిన్నుం బరిణయమాడి చిరకాలము

నుండి భోగాసక్తుఁడవయిన నీతోఁగూడి చిరకాలమునుండి యను భవింపవలసినకామముల నన్నియును క్షణమాత్రములోనే యను భవింపఁగలదు. ఆమెతోఁ గ్రీడించుచుఁ గాలమంతయు నవలీలఁ గడపఁగలవు? ఆమెయందు నీకుఁ దొమ్మండ్రుపుత్త్రికలు గలుగు దురు. ఆపుత్త్రికలను మరీచ్యాదులు పరిగ్రహించి వారలయం దు వారు వెక్కండ్రంబుత్త్రులఁ బడయఁగలరు. ఓమునీంద్రా ! నీవు మదాజ్ఞానుసారముగా సమస్తకార్యములను నెఱవేర్చి యా కర్మకలాపము నాయం దుంచి మదీయభక్తిపరుండవయి పిమ్మట నన్నుఁ బొందఁగలవు. జితేంద్రియుఁడ వయిననీవు సమస్తప్రాణు లయందు దయాళుండవయి యందఱికి నభయప్రదానం బొనరిం చుచు, నాత్మజ్ఞానపరుండవయి నాయందు సమస్తచరాచరరూప మయినజగత్తును నందులకు విలక్షణుఁడనయ్యు నందంతరాత్మనై ధారకుఁడనయి శాసకుఁడనై యున్ననన్నును జూడఁగలవు? నేను నాయంశాంశముచే నీ భార్యయగు దేవహూతియం దవతరించి యామెకుఁ బ్రకృతిపురుషేశ్వరవిభాగమును దెలియఁజేయునట్టి సంహిత నుపదేశింతును.'' అని యిట్లు కర్దమునికి వరంబు లొ సఁగి యింద్రియజన్యజ్ఞానము నధఃకరించినభగవంతుఁడు బిందు సరోవరతీరమందలి కర్దమాశ్రమంబును విడిచి కర్దముఁడు చూ చుచుండ సమస్తయోగీశ్వరులచేతను నుతింపఁబడుచు మార్గ మధ్యమందు సమస్తదేవతలు నొనరించుస్తోత్రముల నాలకించు చు, గరుడవాహనారూఢుండయి వైకుంఠమునకుఁ బోయెను. అనంతరము కర్దముండు భగవంతుండు నిర్దేశించినకాలమున స్వా యంభువమనువు తప్పక వచ్చుననితలంచి యాతనిరాకకయి బిందు సరోవరమునొద్ద వేచియుండెను. అంత స్వాయంభువమనువు కన

కమయాలంకారములచే నలంకృతమగు రథంబుపయిఁగూర్చుండి భార్యాపుత్రికలనందుఁగూర్చుండఁబెట్టికొని భూమండలమునంతను గలయఁ ద్రిమ్మరుచు భగవంతుఁడు నిర్దేశించినదినమందే యాకర్దమునియాశ్రమంబునకు వచ్చెను. ఆతనియాశ్రమము మిగుల

స్వాయంభువమనువు కర్దమాశ్రమంబున కేఁగుట.

మనోహరముగా నుండెను. మఱియుఁ గర్దమప్రజాపతియందున్న దయాతిరేకమునవలన భగవంతునికన్నులనుండి యానందబాష్పములు బయలువెడలి యచ్చటిసరస్సులోఁ బడెను. ఆకారణంబుననే యాసరస్సు బిందుసరోవరం బని ప్రసిద్ధికాంచినది. ఆ బిందుసరోవరమును సరస్వతీనది చుట్టుకొని యున్నది. అది చూపఱకుఁ బుణ్యమునొసంగును. అది, యమృతతుల్యములయి రోగప్రదములుకాని నిర్మలజలముచే నలరుచుండెను. మహర్షులు ప్రతిదినము నచ్చటకు వచ్చి సంధ్యావందనాదినిత్యకృత్యముల నెఱవేర్చుకొనుచుందురు. కర్దమాశ్రమ మట్టిసరోవరంబున కాశ్రయమయి ప్రకాశించుచుండె. అందున్న వనపంక్తులు, మధురముగా ధ్వనిచేయుచు, మిగులఁ బవిత్రములయియున్న పక్షినికరములచేనిండి, షడృతువులందు నుత్పన్నములగు పుష్పఫలాదులచే నలరుచుండెను.అందుమదించినపక్షులరుతము లంతటను విలసిల్లుచుండెను. గండుతుమ్మెద లందు ఝుంకారములొనర్చుచుఁ ద్రిమ్మరుచుండెను. మత్తమయూరము లనెడినటులనాట్యము,లందెల్లయెడలఁ జెలంగుచుండెను.అందుఁ గోకిలలు మృదుమధురస్వరములతోఁ బరస్పరముం బిలుచుకొనుచుండెను. ఆయాశ్రమము కదంబవృక్షములచేతను, నెమ్మిచెట్లచేతను,నశోకతరువులచేతను, వకుళమహీరుహములచేతను, నలంకృతమయి మనోహరముగా

నుండెను. అందుఁ గన్నెలేడిపిట్టలును, నీటికోళ్లును, రాజహంసలును, సారసపక్షులును, జక్రవాకములును, జకోరములును, మధురముగా ధ్వనిచేయుచు విహరించుచుండెను. ఆవనమందు, లేళ్లును, వనసూకరములును, నేఁదుఁబందులును, గవయమృగములును, మతంగములును, ప్లవంగములును, గోపుచ్ఛములనెడి మర్కటవిశేషములును, సింహములును, [illegible]ంగులును, గస్తూరీమృగములును, మిక్కుటమగుసంతసముతో నడయాడుచుండెను. ఇట్లనేకవిధములచేఁ జూపఱకు సంతసము గొలుపుకర్దమప్రజాపతియాశ్రమము నాస్వాయంభువమనువు ప్రవేశించి యనుచరసమేతుఁడయి పోయిపోయి యగ్నిహోత్రంబుల నిర్వర్తించికొని సుఖంబుగా నచ్చట నాసీనుండయియున్న కర్దమునిఁ బొడగాంచెను. ఆమునీంద్రుండు మూర్తిభవించినతపంబువలెఁ బ్రకాశించుచుండెను. అతఁడు నిరశనుండయి చిరకాలము తపం బాచరించినను భగవదనుగ్రహమువలన మిక్కిలి కృశించియుండక యతండువలికిన వచనామృతరసము ద్రావినవాఁ డగుటచేఁ గ్రమముగా బలియుచుండెను. అతనినేత్రములు పద్మపత్రములను బోలుచుండెను. అతనికటిప్రదేశమున నారచీర రంగారుచుండెను. అమ్మునీంద్రుండు నివుఱుగప్పిన నిప్పుచందమునను, మెఱుఁగుపెట్టనిరత్నంబువిధంబునను వెలయుచుండెను. ఇట్లు వెలయుచున్నయమ్మునీంద్రునిఁజూచి సంతసించి స్వాయంభువమనువు పర్ణశాలను సమీపించి యాతనిపాదపద్మముల కభివందనములు సలిపెను. అంతఁ గర్దముండు తనకు నమస్కరించినస్వాయంభువునకుఁ బ్రతివందనము గావించి తత్కాలోచితమగుపూజలచే నాతని సత్కరించెను. అట్లు కర్దమునివలనఁ బ్రతిపూజఁ గైకొని మానియై స్వాయంభు

వుం డుచితాసనమునఁ గూర్చుండియుండఁ గర్దముండు భగవదా
దేశమును స్మరించుకొనుచు,మధురవాక్యములచే నతనికిట్లనియె.
'ఓసార్వభౌమా ! విష్ణువుపాలకత్వశక్తి నీయందుండుటంబట్టి నీవు
భూమండలమునందుఁ బరిభ్రమించుచు దుష్టులశిక్షించుచు శిష్టుల
రక్షించుచున్నావు. ని న్నంతశక్తిమంతునిగాఁ జేసినవాఁడు నారా
యణుండేకదా ! జగత్పరిపాలనావసరము వచ్చినప్పుడు సూర్య
చంద్రులయు, నింద్రాగ్నివాయువులయు, యమవరుణులయు
రూపంబులనొందుచు నిర్మలాత్ముఁ డయియున్నమహాత్మునకు నేను
సర్వదా యభివందనములు చేయుచున్నాను. మఱియు మణిగణస్థ
గితమయినరథమందుఁ గూర్చుండి శత్రువులకు భయముగొలు
పఁజాలు కోదండమునుధరించి టంకారము గావించి చోరులహృ
దయముల నవియింపుచు, నీసేనాసమూహముల పాదతాడన
ములు భూమండలమును జలింపఁజేయ నెల్లయెడలఁ బరిభ్రమిం
చుచు, సూర్యునివలెఁ బ్రకాశించుచు, భగవత్కల్పితములయిన
వర్ణాశ్రమధర్మములను బరిపాలించుచు, లోకమునందలిప్రజలకుఁ
జోరాదిబాధలు కలుగకుండఁ గన్నకుమారులరీతిం బోడగాంచి
పాలించుచున్నావు. నీ విట్టిపనికిఁ బూనుకొననిచో లోకమంత
యుఁ గేవల మర్థకామపరాయణు లగుదుష్టుల యధర్మముచేత
భగవద్రచితములగు మర్యాదలు చెడిపోవును. ధర్మము మును
ముట్ట నశించును. అట్లు ధర్మపాలనాసక్తుఁడవయిన నీవు నాయా
శ్రమంబునకు రాఁబనియేమి? నీవేమియడిగినను నందులకు నేను
నిష్కపటహృదయముతో నంగీకరించి నీయభీష్టము నెఱవేర్చెద
ను. అనియిట్లు కర్దముండుపలుక నతం డొనర్చిన యాత్మస్తవం

బునకు సిగ్గుపడుచు మహానుభావుఁడయి నివృత్తిధర్మనిష్ఠుఁడయిన యమ్మునిఁ కిట్లనియె. ఇది యిరువదియొకఁడవ యధ్యాయము.



"ఓ మహాత్మా! వేదమయుఁడయి చతుర్ముఖశరీరకుఁడగు పరమాత్మ తనముఖమువలన విషయసుఖములయం దాసక్తులు కాక తపోయోగాదుల కాకరు లగుమీవంటిమహాత్ములను వేదరక్షణముకయి సృజించినాఁడుకదా? పిమ్మట వేదమార్గముల నాయామర్యాదలలో నుంచుటకును, మీవంటిమహాత్ములకు దుష్టులవలన బాధలు గలుగకుండ రక్షించుటకును, జతురాననుండు క్షత్త్రియులమగు మమ్మును దనబాహుసహస్రమునుండి సృజించినాఁడు. కావున బ్రహ్మకు బ్రహ్మకులము హృదయమనియు క్షత్త్రకుల మంగమనియుఁ జెప్పుదురు. వేదముల రక్షించుటకు మిమ్మును, మిమ్ముల రక్షించుటకు క్షత్త్రియులమయిన మమ్మును, సృజించియుండుటంబట్టి మనము మనకు విహితములయినకార్యముల నొనరించుచుండ మనల నుభయులను గార్యకారణాత్మకుఁడయిన నారాయణుండు రక్షించుచుండును. మీసందర్శనంబువలననే నా సంశయములన్నియు దూరముగాఁ దొలంగినవి. నా పూర్వపుణ్యాతిరేకమువలన దుష్టులకు దర్శనమొసంగనినీ సందర్శనము చేయఁగంటిని. నీపదపద్మముల యందలిపరాగమును దలయం దిడుకొనఁజాలితి. మఱియు నాపుణ్యాతిరేకముచే మీవంటిమహాత్ముల యనుశాసనాదిరూపమగు ననుగ్రహంబునకుఁ బాత్రుండనయితి. మనోహరములగు నీ మధురవాక్యములను వినఁ గలిగితిని. నాకుమారికయందున్న ప్రేమాతిశయముచే నా మెకుఁదగినభర్త లభించునో లభింపఁడో

యని మిగుల వగలఁబొగులుచు నీనుండనయిన నేను విన్నవించు కొనుసర్వమును గృపచేత నాకర్ణింతువుగాక. ఈ కన్యాలలామ ప్రియవ్రతోత్తానపాదుల తోఁబుట్టుపడుచు. ఈమె నాప్రియపుత్రిక. ఈమె ప్రాయముచేతను, సౌందర్యముచేతను, సద్గుణములచేతను దన కనుకూలుఁడగు భర్తగావలయునని కోరుచున్నది. ఈమె నారదునివలన నీసద్గుణములను నీప్రభావమును, సౌందర్యమును, నీవిద్యాతిశయమును విని నిన్నుఁదక్క మఱియొకని పెండ్లాడ నని నిశ్చయించుకొన్నది. ఓ మునీంద్రా! గృహస్థకర్మములయందు నీ కిది సర్వవిధముల నుపయోగించును; నీకర్పింపవలె నన్నతలంపుతోఁ దెచ్చితిని; కాన యీ కన్యాలలామను భార్యగాఁ బరిగ్రహింపుము. దైవికముగాఁ బ్రాప్తమయినవస్తువును ముక్తసంగుఁడయిన యోగియయినను దీసికొనకుండుట యుచితముకాదు. అట్లుండఁ గామాభిలాషగలవాఁడు స్వయంప్రాప్త మగువస్తువును దీసికొనకుండుట యుక్తముకాదని వేఱ చెప్పవలయునా? ఇదియునుంగాక దైవికముగాఁ బ్రాప్తమయినవస్తువును దిరస్కరించి పిమ్మట నట్టివస్తువునిమిత్తము కృపణుల యాచించిన వానికీర్తి గొప్పదయినను ద్వరలో క్షీణించును. పరాభవముచే గౌరవముగూడ నాశనమొందును. నేను నీవు వివాహప్రయత్నము కలవాఁడవయి యున్నావని విని నా కుమారి నర్పింపవలెనని వచ్చితిని. కావున నీమెను నీధర్మపత్నినిగాఁ జేకొనుము." అని వేఁడుచున్న మనువుపలుకు లాలకించి మునీంద్రుం డెంతయు స్వాంతమున సంతసించి యతని కిట్లనియె. "ఓ రాజచంద్రా! ఇదివఱలో నెవనికిని వాగ్దత్తకాని నీకుమారికను వరించుట కెంతమాత్రము సందియము లేదు. వరించుచున్నాను.

మాయిరువురిదాంపత్యము మిగులఁ దగియుండును. సృష్టిలో మొట్టమొదటిదగు బ్రాహ్మణవివాహవిధి ప్రవర్తిల్లుఁగాక. మఱి యుఁ గేవలము లక్ష్మీదేవివలెఁ దులదూఁగుచున్న నీకుమారికను బెండ్లాడ నిష్టపడని యవివేకి లోకమందుండునా? ఒకప్పుడు మే డమీఁదిభాగమున కాలనూపురములు గల్లుమనఁ గందుకక్రీడ సలుపుచుండుటచే నేత్రములు చలింప వెలయుచున్న సౌందర్య రాశియునగు నీకుమారిని జూచి విమానారూఢుండయి గగన మార్గమునఁ బోవుచున్న విశ్వావసు వనుగంధర్వరాజు మో హించి క్రిందఁబడెను. దేవతలకుఁగూడ మోహము కలిగించు నదై భర్తను బ్రార్థించుచు, లక్ష్మీకటాక్షము లేనిమానవులచేఁ జూడఁబడనిదై, మహాత్ముఁడగు నుత్తానపాదునకుఁ జెల్లెలయి, స్త్రీ లలో నుత్తమురాలై యున్న నీకన్యాలలామ నెవ్వఁడు వరింపక పోవును? ఆకారణమున నీమెను భార్యగా వరింతును. గాని యొ క్కసమయ మేర్పఱుపవలసియున్నది. నీకుమారికకు సంతాన ము కలుగుపర్యంతము నామెతో గృహస్థధర్మముల నడ పుదును. ఆమెకు సంతానము గలిగినపిమ్మట నీకుమారిని విడిచి, నివృత్తిధర్మపరుండనయి భగవంతునిచేఁ జెప్పఁబడిన సాత్విక ధర్మముల నాచరింప సమకట్టుదును. ఈసమయము నాబుద్ధికౢ తము కాదు. దేవమనుష్యాది భేదములచే విచిత్రమగు ప్రపంచ మెవనివలన నుత్పన్నమగుచున్నదో యీప్రపంచ మెవనియందు లయమగుచున్నదో, యెవఁడు దానియంతర్భాగమునుజొచ్చి శా సకుఁడయి ధారకుఁడయి వెలయుచున్నాఁడో, బ్రహ్మాదుల కధిపతి యగు నాభగవంతునివలననే యిది యేర్పఱుపఁబడినది. కావున నీసమయముభయులచేత నంగీకరింపవలసియున్నది.” అని యిట్లు

కర్దముండు పలికి భగవంతుని చిత్తమందుఁ దలంచుకొనుచు మందహాసముచే దేవహూతిమానసమును మోహమున ముంచెను. ఇట్లు పలికినకర్దమునివాక్యముల నాలకించి యందుల కంగీకరించి భార్యాసమేతుఁడయి తనకుమారికను గుణగణసంపన్నుండగు కర్దమున కర్పించి వివాహ మొనరించెను. అనంతరము

{ స్వాయంభువమనువు తనకుమారి యగుదేవహూతిఁ గర్దమునికిచ్చి పెండ్లిచేయుట. }

మనుభార్య యగుశతరూప కూఁతునకు నల్లునకు ననేకములయిన యలంకారములను, క్రీడోపకరణములను, బహుమానములుగా నర్పించి సంతోషము కలిగించెను. ఇట్లు స్వాయంభువుండు తనకుమార్తను సదృశుఁ డగుకర్దమున కర్పించుటంబట్టి యమితానందుండై తనముదులపట్టిని కౌఁగిలించుకొని పుత్త్రికావిరహమును సహింపలేక బాష్పములను విడుచుచు నాబాష్పజలముచేఁ గుమారికఁ దాన మాడించుచు నెట్టకేలకు మనంబును దృఢపఱుచుకొని కర్దమునియొద్ద సెలవుకైకొని కూఁతునకు బుద్ధులుచెప్పి భార్యాపరివారసమేతుఁడయి యరదంబు నధిరోహించి తనపురంబునకుఁ బోవుచుండెను. స్వాయంభువుం డట్లు పోవుచు నాసరస్వతీనదీతీరముల రెండింటియందు నివసించియున్నమునీంద్రులను, వారల యాశ్రమంబులను బొడఁగాంచుచు, నాయాశ్రమములం దున్నపుష్పఫలసంపదల కచ్చెరువొందుచు,నిజపురాభిముఖుండయి చనుచున్నయవసరంబునఁ దనపురజనులందఱు మిగుల సంతసించి సంగీతములతోను, స్తుతిపాఠములతోను,మంగళధ్వనులతోను,నెదురేగిరి.అంత నారాజు తన ప్రజలొసంగెడిపూజల నందికొనుచు బర్హిష్మతీనామముగల తన

పురంబుసొచ్చెను. ఓవిదురా! ఆపురమునకు బర్హిష్మతి యనునామం బుగలుగుటకుఁ గారణంబు దెలిపెదవినుము. పూర్వము నారాయణుం డు భూమినుద్ధరించుటకయి వరాహావతారముందాల్చినప్పుడు తన దేహమును జాడింప నతనిరోమములు కొన్ని యచ్చటఁ బడినవి. ఆపడినరోమములు హరితవర్ణములయి కుశకాశములయి సంభ వించినవి. ఆదర్భలను, రెల్లును సంగ్రహించి మునులందఱు యా గవిరోధులయిన రక్కసులను దిరస్కరించి యాగంబుల హరిప్రీతి గా నొనరించిరి. పిమ్మట మనువుగూడఁ గుశకాశరూపమయిన బర్హిస్సును సంపాదించి యజ్ఞస్వరూపుండయి నారాయణప్రీతిగా నాస్థలంబునఁ బెక్కుజన్నంబు లొనర్చెను. ఆబర్హిస్సులచే నిండి యుండి యాగార్హమయి యున్నయాస్థలంబున నొక్కపురంబు ప్ర బలెను. ఆపురమునే బర్హిష్మతి యని పిలుచుచుందురు. స్వాయం భువమనువు సమస్తసంపదలతోఁ దులదూఁగు నప్పురంబును బ్రవేశించి తాపత్రయరహితమయిన తనభవనంబు సొచ్చి, భా ర్యాపుత్త్రులతోఁ గూడికొని వర్ణాశ్రమప్రయుక్తమగు భగవ దారాధనరూపధనమునకు భంగముగలుగకుండ సమస్తసుఖము ల ననుభవించుచు, దేవతామిథునములచే నుతింపఁబడు నిర్మల కీర్తికలవాఁడయి, తానుత్కృష్టుఁడయినను భగవద్భక్తి విడనా డక ప్రతిప్రాతఃకాలములయందు శ్రీహరిసత్కథలను భక్తితో నాలకింపుచుఁ, గాలముగడపెను. స్వాయంభువుం డిట్లనుభవించు కామభోగములు కొంచెమైనను నతని వశపఱచుకొనలేకపోయి నవి. మఱియు నాస్వాయంభువుండు సర్వకాలములయందు హరి కథాశ్రవణముచేయుచుఁ దాపత్రయమును దొలంగించి డెబ్బ దియొకమహాయుగముల కాలపరిమాణముగల తన యంతరము

(స్వాయంభువమన్వంతరము) లో నొకజామయినను వృథాచే యకుండ రాజ్యంబుం బరిపాలించెను. ఆ స్వాయంభువమన్వంత రములో శరీరసంబంధములగు రోగములుగాని మనోవ్యాధులు గాని శీతోష్ణవాతాదులవలనఁ గలిగిన బాధలుకాని శత్రుచోర భయములుగాని లేనివారయి మానవులందఱు మిగుల సుఖము గాఁ గాలంబు గడపిరి. ఓయీ ! సంతతము భగవద్భక్తిసంప న్నులయి యున్నయీమానవులను బాధలెట్లు చెనకఁగలవు. ఆమ నువు రాజయినను మునీంద్రులకంటె నధికమయినజ్ఞానాతిశ యముకలవాఁడయి యొక్కొక్కప్పుడు మునీంద్రులును మానవు లును తనకడకు వచ్చి యడుగ వారలకు వర్ణాశ్రమధర్మములను మోక్షసాధనము లగుధర్మములను దెలుపుచుండెడివాఁడు. ఓ విదురా ! మొదటిరాజయిన మనువర్ణనీయచరిత్రము నీకు వర్ణించిచెప్పితి. ఇఁక నతనియపత్యమగు దేవహూతియుత్కర్షను వినుమనిపలికి వెండియు నిట్లనియె. ఇది యిరువదిరెండవ యధ్యా యము.



{కర్దముండు యోగమహిమచే విమానంబు గల్పించుకొని భార్యతోఁగూడ విహరించుట.}

ఓరాజా! మైత్రేయుండు విదురుని కిట్లు తెలిపె. 'ఓవిదురా! స్వా యంభువమనువు తనకూఁతును గర్దమునకిచ్చి వివాహముగావించి తగినహరణాదులనొసంగి తనపురంబునకుఁ జన్నపిమ్మట నక్కన్యా మణి, సుశీలముకలిగి తనభర్తహృద్గతాభిప్రాయము నెఱింగినదై పార్వతీదేవి పరమేశ్వరునకుఁ బరిచర్యచేసినచందంబున నమ్మహాము నిని బరిచరించెను. మఱియు నమ్మగువ మున్మరమ్మగు నమ్మకముచే తను, దనపవిత్రత్వముచేతను, నుదారంబగుగారవంబుచేతను,

నధికమగు నింద్రియనిగ్రహము చేతను, హితాహితములయిన విషయముల వినవలె నన్నతలంపుచేతను, స్నేహాతిశయము చేతను, మృదుమధురవచనరచనలచేతను, సంయుతయై, కామమును, కాపట్యమును, నిషిద్ధకార్యములను, గర్వమును, లోభమును, ద్వేషమును, విసర్జించి,తనభర్త నియమించినకార్యముల నప్రమత్తతతోఁ జేయుచు మహాతేజశ్శాలియయినతనభర్తను మిగుల సంతసింపఁజేసెను. ఇట్టులాకాంతామణి తనవలననుండి యపత్యమనుఫలమును బొందవలెనని యభిలాషతోఁ బరగుచు పరిచర్య చేయుటంబట్టి మిగులఁ గృశించియున్నయామెంజూచి కర్దముఁడు దయారసమును వెడలగ్రక్కుచు గద్గదము లగువచనములతో నిట్లనియె. 'ఓసుందరీ! నీవు చేసినపరిచర్యకును, నిరుపమానమయినభక్తికిని మిగుల సంతసించితిని. మఱియు నీవు నాకుఁ బరిచర్య చేయవలె నన్నతలంపుతో ననవరతము నాచెప్పినపనుల నొనరించుచు ప్రాణులకు మిక్కిలి ప్రియమయినను శ్లాఘ్యమైన నీమృదుకోమలాంగమును నానిమిత్తము గృశింపఁజేసితివి.తనప్రియునినిమిత్తమయి తనశరీరము నాశింపనియుత్తమురాలినిదివఱకు నేఁజూచియెఱుఁగను. అట్టియుత్తమురాలవయిన నీసుగుణముల నెన్న నాతరముకాదు. నీవు నాకెట్టిలోపములు కలుగకుండఁ బరిచర్య చేసినకతమున నేనును మదీయవర్ణాశ్రమధర్మములకు విహితములయిన కర్మముల సమాధిని, భగవదుపాసనను, జ్ఞానయోగమును, సంపాదించి, హరిని సంతసింపఁజేసి మఱియు భగవదనుగ్రహమును బొందితిని. అందువలన మనకుఁ గోరినభోగ్యపదార్థములు, శోకభయరహితములగు భోగ్యస్థానములును సంభవింపఁగలవు. నన్ననవరతము సేవించినందులకు నీకు దివ్యదృష్టి నిచ్చుచున్నాను. భగ

వంతునిపూర్ణానుగ్రహమును మనయందుండ మనకింకలోపమేది? కావునఁ జక్రవర్తులచే ననుభవింపఁదగియుండి నీ పాతివ్రత్యధర్మమువలననే సమకూరి సామాన్యులకుఁ బొంద నలవికాకయున్న భోగముల ననుభవింపుము" అని యిట్లు పరమకృపారసభరితుండయి యమ్మునివరుండు పలుక విని యాసుందరీలలామ తపోయోగములయందు నతని కున్న నిరుపమాన ప్రభావమును, జ్ఞానాతిశయమును బొడగని మనోవ్యథల నన్నింటిం దొలఁగఁద్రోచి వ్రీడావలోకనముల చేతను, మందహాసము చేతను, సుందరమయినవదనారవిందముకలదయి, వినయప్రేమములఁ బ్రకటించుచున్నముద్దుమాటలతోఁ దనభర్త కిట్లనియె. "ఓ మునీంద్రా! సఫలములయినయోగ ప్రభావముగల నీవు నాకు వల్లభుఁడవయి యుండఁగా దుర్లభమయినవస్తువు లోకమందుండునని నేఁ దలంపను. ఆ విషయము నాకుఁ జక్కఁగాఁ దెలియును. నీవు సంతానప్రాప్తి యగునంతవఱకుమాత్రమే నన్నుఁ గూడియుంటకుఁ బ్రతినచేసితివి. స్త్రీలకు భర్తవలన నపత్యలాభమును బొందుటకంటె నెక్కుడులాభము మఱియొకటి లేదు. మఱియు నీకొక్కటిఁ దెలిపెద నాలింపుము. నేను మిగులఁ గామపీడితనగుటచే నిట్లు కృశించి యున్నాను. సంభోగాభిలాష నన్ను మిక్కిలి బాధించుచున్నది. నా యా యభిలాషము తీర్పవలయును. కావున నందులకుఁ దగినట్టి మందిరములును భోగ్యపదార్థములును సంపాదింపుము." అనియిట్లు పలుకుచున్న ప్రియురాలిపలుకుల నాలించి యామెయభీష్టము నెఱింగినవాఁడయి కామగమనముగల యొకవిమానమును యోగమాయాసామర్థ్యమువలనఁ గల్పించెను. ఆవిమానము సమస్తవరముల నిచ్చుటకు సమర్థమయి యుండె. ఎల్ల విధముల

యిన రత్నములకు నిలయమైయుండె. అందలి సకలసంపద లుత్త రోత్తరాభివృద్ధి గలిగి నిండియుండె. అయ్యది మణిమయము లయిన స్తంభములతోఁ దులదూఁగుచుఁ జూపఱకుఁ గనువిందు వులు చేయుచుండెను. అది దేవతాసంబంధములయిన పరికరము లతో సంయుతమై యుండెను. అయ్యది సర్వకాలములయందు సుఖము కలిగింపఁజాలియుండెను. అయ్యది యబ్బురంబు గొలు పు పట్టువస్త్రపతాకములతో నలంకరింపఁబడియుండెను. మఱియు నానావిధమైన మాలారచనకుఁ దగినపుష్పములతోను, నందుం డి ధ్వనిచేయుభృంగంబులతోను వెలయు పూలదండలచే నలం కరింపఁబడెను. అది తెలిపట్టుచీరలచేతను, సాధారణపుపట్టువ స్త్రములచేతను, దదతిరిక్తములగు మఱికొన్నివస్త్రములచేతను మిక్కిలి ప్రకాశించుచుండెను. తదుపరిభాగమునందున్న గృహ ములు వేలువేలుగాఁ గల్పితములగు శయ్యలచేతను, బర్యంకం బులచేతను, దాళవృంతములచేతను, నర్హాసనములచేతను, మ నోహరములయి యుండెను. దానిగోడలం దచ్చటచ్చట శిల్పపుఁ బనులు వెలయుచుండె. అచ్చటచ్చట నింద్రనీలమణిమయము లగు ప్రదేశములందు, విద్రుమస్థగితము లగువేదికలు రంగారు చుండెను. ద్వారములు విద్రుమమయము లగుగడపలచేతను, వజ్రమయము లగుకవాటములచేతను; బ్రకాశించుచుండెను. మఱియు నింద్రనీలమణిమయములగు ద్వారశిఖరములందుఁ గ నకకుంభము లమర్పఁబడెను. అచ్చటచ్చట వజ్రఖచితములగు గోడలందుఁ బద్మరాగరత్నములు పొందింపఁబడెను. విచిత్రము లగు వితానములచేతను, హేమమయములయి, కావుననే యు మూల్యములయి యున్న బంగారుబహిర్ద్వారములచేతను, నది

రొప్పుచుండెను. అందమర్పఁబడినకృత్రిమహంసలను, కృత్రిమములగు పావురములనుజూచి, సజాతీయములుగా భావించుచు ధ్వనిచేయు హంసపారావతముల నినాదంబులు చెలంగుచుండెను. అయ్యది యథాసుఖముగాఁ గల్పితములగు, క్రీడాప్రదేశముల చేతను, శయనగృహముల చేతను,నుపభోగనిలయముల చేతను, గృహబహిర్భాగముల చేతను, ప్రాకారబహిర్భాగముల చేతను మిగులఁ బ్రకాశించుచుండెను. ఇట్టి విమానరాజమును బొడగాంచియు మిగుల సంతసింపని తనప్రియురాలియభిప్రాయమును సర్వభూతాభిప్రాయములఁ దెలిసికొనుకర్దముండు దెలిసికొని యామె కిట్లనియె. 'సుందరీ! నీయభిప్రాయము నాకవగతమయినది. నీ వీహ్రదమునందుఁ దానమాడుము. ఈహ్రదము భగవంతునియానంద బాష్పసందోహము చేఁ గల్పింపఁబడినది. ఈ హ్రదము మనుష్యులసమస్తవాంఛలను నెఱవేర్పఁజాలును. కావున నిందుఁ గ్రుంకులిడి విమాన మెక్కినచో నీయభీష్టము నెఱవేఱఁగలదు. సందియములేదు. అట్లు చేయుమని పలికిన తనభర్తపలుకులు విని కువలయమువంటినేత్రములుగల దేవహూతి మలినవస్త్రమును, వేణీభూతమయిన కేశపాశమును, మలపంకసంఛన్నము లగు స్తనములును, గలశరీరమును దాల్చిపోయి నిర్మలమయిన సరస్వతీనది కంతరితమైయున్న బిందుసరోవరమును బ్రవేశించెను. ఇట్లా దేవహూతి యాహ్రదంబులో మునిఁగి చొచ్చునప్పటికిఁ గొన్ని మందిరములును నామందిరములయందు విహరించుచు నుత్పలమువంటిదేహగంధముగలిగి లేఁబ్రాయముతోఁ దనరు వేగురు స్త్రీలును గానవచ్చిరి. వారలను జూచి దేవహూతి యచ్చెరువు పడుచుండఁగా నా స్త్రీలందఱు నామె

నుజూచి సరభసంబుగ లేచి సమీపించి చేతులుజోడించి, "ఓతల్లీ! మేమందఱము నీసేవకురాండ్రము. నీచెప్పినపనులను జేయుటకయి యిక్కడ వేచియున్నాము. ఏమిచేయవలయునో సెలవిమ్ము చేసెదము. అని యిట్లు పలుకుచు నా స్త్రీలామెను గొనిపోయి శ్రేష్ఠతమమయిన సుగంధితైలముచేఁ దలంటి తానమాడించి నిర్మలములయిన దుకూలములను గట్టనిచ్చిరి. మఱియు నామెకుఁ బ్రియములయి సుందరతమములయి ప్రకాశించుభూషణముల నిచ్చి చక్కఁగ నలంకరించి షడ్రసోపేతమయిన యన్నమును సుధారసమువంటిపానమును నొసంగిరి. ఇట్లు దేవహూతి యలంకరించికొని యద్దము చేతఁ గీలించి నిర్మలమయిన వసనములచేతను విచిత్రములయినపూసరులచేతను, దీప్తిమంతములయిన యలంకారములచేతను, మధురముగా ధ్వనిచేయుచున్న నూపురములచేతను, నేకములయిన చిఱుగంటలచేఁ దులదూఁగుచుఁ దనకటిప్రదేశము నలంకరించియున్న మేఖలచేతను, మహార్హములయిన ముత్యాలహారములచేతను, గుంకుమాది మంగళద్రవ్యములచేతను, మిక్కిలి ప్రకాశించుచు సొగసైన భ్రూలతలతోను సుందరదంతరాజితోను, మృదులమయిన క్రేగంటిచూపులతోను, బద్మములఁ దిరస్కరించులోచనములతోను, తుమ్మెదలను మించు నల్లనినెఱికురులతోను వెలయు వదనారవిందమున బొలుపారుచు మలరహితమై, మంగళాకరమయి, కన్యకలచే బహూకృతమయి యొప్పు తనసుందరదేహమును బొడగాంచి తన ప్రియవల్లభుఁడయిన కర్దమప్రజాపతిని దలంచెను. అంత నమ్మహాముని స్త్రీలచేఁ బరివృతుండయి వచ్చి యామెచెంత నుపవేశించెను. ఇట్లు దేవహూతి స్త్రీసహస్రముతోఁగూడియున్న

తనయెదుట వర్తించు భర్తను బొడగాంచి యతనియోగమ
హిమనుగూర్చి మిగుల నబ్బురపడఁజొచ్చెను. అంత నప్రతిమ
ప్రభావుఁడగు గర్దముండు వివాహముకంటె ముందున్న రూప
మువంటి రూపముతో వెలయుచు ప్రావృతములయి, రుచిరము
లయి, యున్న స్తనములుగల దేవహూతినిజూచి మిగుల సంతసించి
కామాదులను జయించినవాఁడయినను, మిక్కిలి మోహమును
జెందెను. ఇట్లు మోహవివశుఁడై కర్దముండు తనభార్యవలనను
దక్కఁగల స్త్రీసహస్రములవలనను శుశ్రూష కయికొనుచు నావి
మానము నధిరోహించి యాకాశమునందుఁ దారాగణములతోఁ
బ్రకాశించుచు నాకాశస్థుఁ డయియున్న చంద్రునివలెఁ బ్రకా
శించెను. ఇట్లాకర్దముం డాలలనతోఁ గూడికొని గగనమందు
సంచరించుచు నష్టదిక్పాలకులకు విహరణీయములును, మలయ
మారుతప్రసారమువలనఁ గామోద్దీపకములును, గంగానదీపాత
మువలనఁ గర్ణరసాయనములయిన నినాదములు గల కులపర్వత
గుహాలయందును, మానససరోవరమునందును, వైస్రంభకము,
స్వైరసనము, నందకము, పుష్పభద్రకము, చైత్రరథము నాఁబ
డు దేవోద్యానములందును, సిద్ధులచే నుతింపఁబడుచుఁ గుబేరు
నివలెఁ గ్రీడించెను. మఱియు నమ్మహాముని మహనీయమయి
కామగమనము గలిగియున్న విమానముపయి నధివసించి వా
యువువలెను సకలప్రదేశములయందు నప్రతిహతుండై సమ
స్తలోకములయందును సంచరింపఁదొడంగెను. తాపత్రయ నా
శనకరమగు భగవంతునిపాదముల నాశ్రయించి పరిపూతమన
స్కులయిన పురుషులకుఁ బ్రాప్తముకానివస్తు వేదికలదు? ఇట్లా
శ్చర్యమయుఁడయిన యమ్మునీశ్వరుం డప్రతిహతగమనుండయి

ద్వీపవర్షాదిభేదములచే వెలయు భూగోళంబునంతను దనభార్య కుఁ జూపి స్వాశ్రమమునకు వచ్చి కామపీడితయయియున్న తన భార్యను మిగుల రమింపఁజేయుచు, బెక్కుసంవత్సరములను నిముసమాత్రంబునఁ బుచ్చుచుండెను. ఆదేవహూతియు నిరతిశయసుఖమును గలిగించుచు సురతవర్ధకమయిన శయ్యయందు భర్తతోఁగూడి విహరించుచు, నెంతకాలము గతించినదో తెలియఁజాలకపోయె. యోగప్రభావము నవలంబించి క్రీడించుచున్న యీమునిదంపతు లిట్లు పెక్కుసంవత్సరములను, బుచ్చిరి. అంతటికాలమును వారు సుఖాతిశయముచే నిముసముగా భావించిరి. అప్పు డాకర్దముండు తనవీర్యమును దొమ్మిదివిధములుగాఁ జేసి తనభార్యయందుఁ బ్రవేశింపఁజేసెను. అంత నామెయు భర్తవలన వీర్యమును గ్రహించి తత్కాలమందే తొమ్మండ్రుగురఁ బుత్త్రికలను గనెను. ఆపుట్టినపిల్లలందఱు నధికసౌందర్యవంతురాండ్రయి రక్తోత్పలమువంటి సుగంధము గలవారయి యుండిరి. ఇట్లు తనకు సంతానప్రాప్తి కలిగినపిమ్మట దేవహూతి, తన్నెడఁబాసి పోవఁదలంచిన తనభర్తను బొడఁగాంచి మితిమీఱినట్టివిచారము తన్ను బాధింప నాబాధను సహింపలేక మాటిమాటికిఁ గన్నుంగవనుండి బయలు వెడలివచ్చు కన్నీటిని లోలో నరికట్టుచు, లోపల ననంతమగుదుఃఖము బాధించుచున్నను బైకి రానిమందహాసమును దెచ్చుకొనుచు, కాలిబొట్టనవ్రేలితో భూమిని గీయుచు, మృదుమధురములయిన వాక్యములతోఁ దనభర్త కిట్లనియె 'ఓప్రియవల్లభా! నీవు నాకుఁ బ్రతినచేసినప్రకారమున సర్వమును నెఱవేర్చితివి. నాయభీష్టములు నెఱవేఱినవి. నాయందు నీకు దయారసమున్నచో నీసేవ

కురాలనయిన నా కభయప్రదాన మొసంగుము. ఈజన్మించిన పుత్త్రికలఁ దగినవారి కొసంగి వివాహములొనర్చి వారల నంపివేసి, పిమ్మట నీవు నీ కభిమతమయినస్థలంబున కరుగుము. మఱియు నీవు న న్నెడఁబాసిపోయినచో నా కమితంబగుదుఃఖము జనింపక మానదు అట్టి దుఃఖమును దొలఁగింపఁజేయఁ జాలెడునొక పుత్త్రుని ప్రసాదింపుము. ఇంతవఱకు సంసారసుఖము లనుభవించుచుఁ గాలము కడపితిని. ఇంక నాకు సంసారసుఖాభిలాష తీరినది. ఇంతకుఁ బూర్వము నే నింతేనియుఁ బరమాత్మ నుపాసించి యుండలేదు. మహానుభావుఁడవయిన నీతో నింత కాలము విహరించియు సంసారసుఖముల కాసించితినిగాని యాత్మజ్ఞానమును గుఱించి ప్రయత్నింపలేదు. అందులకు మిగుల వగచుచున్నాను. ఆత్మజ్ఞానము నుంతేనియు లేనినన్నుఁ గరుణించి యందులకుఁ దగినయుపాయ మేదయిన నున్నయెడల దయచేసి నన్నుఁ గృతార్థురాలినిగాఁ జేయుము. అభయము దయచేయుము. మఱియు నోమహాత్మా! సజ్జనసహవాసము సద్గతి కారణమంచును, దుర్జనసహవాసము దుర్గతికిఁ గారణమంచును బెద్దలు చెప్పుట లాలించి సత్పురుషశ్రేష్ఠుఁడవయిన నీసాంగత్యముతో నింత కాలము గడపితిని. కావున నాకు సద్గతి గలుగుననియె తలంచెద. ప్రాణిసంగమమువలననే కదా లోకులకుఁ బుణ్యపాపములు సంభవించుచుండును. కావున సాధువయిన నీ సాంగత్యమువలన నాకు సద్గతి లభింపక మానదు. మఱియు నీలోకమం దొనర్చినకర్మము ధర్మముకొఱకుఁగాని జ్ఞానయోగముకొఱకుఁగాని సమర్థము కాదు. అట్టివానిని సంపాదింప సమర్థము కానిచో నట్టి కర్మములు చేయుట వ్యర్థమే. మఱియు భగవద్భక్తిని సంపాదింపఁజా

లినధర్మమును,జ్ఞానమును సంపాదించవలినరుఁడు జీవన్మృతుఁ డనుటకు సందియము లేదు. కాన యిదివఱకు నేఁ జేసినకృత్యము లన్నియు వ్యర్థములయిన వే. మహాత్ముండవయిననీ స్నేహము గలిగియుండియు భగవంతుని సంతోషింపఁ జేయఁజాలిన ధర్మజ్ఞానముల సంపాదింప లేక పోయితి.నీయనుగ్రహమువలన ముక్తిఁ జెందినఁ జెందఁగలనుగాని లేనిచో నాపుట్టువంతయు వ్యర్థమనవచ్చును. నేను నిశ్చయముగా భగవన్మాయచే వంచింపఁబడితిని. లేనిచో ముక్తిప్రదుఁడవయిన నిన్నుఁ బొందియు ముక్తి చెంద లేక పోవుదు నా? ఇది యిరువదిమూడవ యధ్యాయము.



అనియిట్లు దీనాతిదీనముగాఁ బలుకుచున్న మనుపుత్త్రి యగు దేవహూతిని గాంచి కర్దముండు దయాళువయి, భగవంతునివాక్యమును స్మరించుకొనుచు నిట్లనియె. 'ఓపరమసాధ్వీ!ఓపవిత్రప్రవర్తనురాలా!నీవిట్లు మనంబున నెవ్వగ చేఁ గుందకుము.నిరతిశయగుణవంతుఁడగు భగవంతుఁడు స్వల్పకాలములోనే నీకుఁ గుమారుండయి జన్మించును. నీవిచారములన్నియు గట్టెక్కును. విచారింపఁబని లేదు. నీవు పరమభక్తియుతురాలవయి బహిరింద్రియములను, నంతరింద్రియములను, జయించి, పాతివ్రత్యమునకుఁ దగిన తపంబుచేతను, ధనదానాదులచేతను శ్రద్ధతో సర్వదా యీశ్వరుని భజింపుచుండుము. అందులకు భగవంతుండు సంతసించి యమితంబగు దయారసము కలవాఁడయి, నాకీర్తిని లోకమందు వెల్లడించుచు నీగర్భమునుండి జనించి తత్త్వజ్ఞాన ముపదేశించి నీహృదయమందలి సందేహగ్రంథుల నన్నింటిని ఛేదింపఁగలఁడు" అనెను. తనప్రాణేశ్వరునిని దేశముచొ

ప్పున దేవహూతి భక్తిశ్రద్ధలతో నజ్ఞాననివర్తకుఁడును, పరమపురుషుఁడునగు నారాయణుని నెంతయుఁ బూజించెను. ఇట్లు చాలఁగాల మతిక్రమించినపిమ్మట భగవంతుఁడు కర్దమవీర్యమును బొంది దారువునం దగ్ని యుద్భవించినట్లు దేవహూతిగర్భము నుండి కపిలుండయి యుదయించెను.

భగవంతుండు దేవహూతికిఁ గపిలాచార్యుండై యుదయించుట.

ఆసమయమున గగనమందు దేవదుందుభులు మొరసెను. మేఘములు వర్షించెను. గంధర్వులమితానందులై గానముచేసిరి. అచ్చర లనంతంబగుసంతసమున నృత్యములుచేసిరి. దేవతలు జయజయధ్వనులుచేసితమయానందమును వెలిఁబుచ్చుచుఁ బుష్పవర్షంబులు గురియించిరి. దిక్కులు మిగుల నిర్మలములయి ప్రకాశించెను. మఱియు సమస్తనదులును, సమస్తజనులమానసములును నిర్మలములైయొప్పెను. అట్టిసమయమున బ్రహ్మమరీచ్యాదిమునులతోఁ గూడికొని సరస్వతీనదీచుట్టుకొనియున్న కర్దమాశ్రమమునకు వచ్చి, భగవంతుండు ప్రకృత్యాదితత్త్వములనిశ్చయమును లోకులకుఁ దెలుపఁదలంపుతోఁ దన్నువిడిచి వేఱుగనుండనిదై ఒకప్పుడును సంకోచము నొందని జ్ఞానముగలవాఁడయి, దేవహూతికిఁ జిన్నికుమారుండయి జన్మించెనని తెలిసికొని నిర్మలాంతఃకరణుండయి భగవచ్చరిత్రమును నుతించుచుఁ గావుననే సకలేంద్రియములు సంతృప్తిచెందుచుండ నానానందబాష్పము లనుసముద్రమందుఁ దొప్పదోఁగుచుఁ గర్దమదేవహూతులను బొడగాంచి కర్దమున కిట్లనియె. 'కుమారా! కర్దమా! నిష్కపటమగు ప్రేమాతిశయముగలవాఁడవై నా వాక్యమును మన్నించి ప్రవర్తించితివి. కాన నేను మిగుల

సంతసించితిని. నీవు పితృభక్తి చక్కనెఱపితివి. పితృవాక్యమునం దుత్తమగౌరవము నుంచితివి. కుమారులు జనకునియాజ్ఞ నతివొప్పునం బ్రవర్తించినచో నందువలన వారలకుం గల్గునానంద మింతంతని చెప్పవలనుపడునా? ఈ నీకుమారికలు మిగుల మంచివారు, సౌందర్యవతులు, మంగళప్రదలు. వీరలను మరీచ్యాదిమునుల కిచ్చి వివాహము చేసితివేని వీరు తమ పుత్త్ర పౌత్త్రాదులచే సృష్టిని వర్ధింపఁగలరు. కావున నీవు త్రికలను వారలకిచ్చి, లోకమునఁ గీర్తివంతుఁడవయి నెగడుము. మఱియు జగత్కారణుఁడయిన భగవంతుండు సర్వభూతములకు సకలాభీష్టముల నెఱవేర్చుటయందు నిధివలె నొప్పుచున్న దేహము నవలంబించి యాత్మసంకల్పముచే నీకుఁ బుత్త్రుండై జన్మించియున్నాఁడని తెలిసికొని యిచ్చటికి వచ్చితి'నని కర్దమునితోఁ జెప్పి దేవహూతితో 'జీవపరమాత్మలతత్త్వజ్ఞానము నుపదేశించి తనసేవచేయు భక్తుల పుణ్యపాపరూపకర్మములను నశింపఁజేయుటకై పుండరీకాక్షుండును, బద్మరేఖాంకితపాదుండును నగు భగవంతుండు నీకు సుతుండై సంభవించెను. అమ్మహాత్ముండు నీహృదయములో నున్నసర్వసంశయములను దొలఁగించి లోకమున సంచరింపంగలండు. ఇతఁడు యోగికులముల కధీశ్వరుండయి సాంఖ్య (తత్త్వ) శాస్త్రమున నాచార్యుండై లోకంబునఁ గపిలాచార్యుండని పిలువఁబడుచు నీసత్కీర్తిని మిగుల వ్యాపింపఁ జేయఁగలఁడు.' అనియిట్లు చతురాననుండు కర్దమదేవహూతులకు సంతసముకలిగించి హంసనధిష్ఠించి నారదునితోను సనకాదులతోను దనలోకంబునకుఁ బోయెను. ఇట్లు బ్రహ్మ తనలోకమున కేఁగినపిమ్మటఁ గర్దముండు తనకుమారికలను మరీచ్యాదిమునుల

కల్పించెను. అందు మరీచికిఁ గలయను కన్యకను, నత్రిమహాము నికి ననసూయను, నంగిరసునికి శ్రద్ధ యనుపుత్త్రికను, బులస్త్యు నకు హవిర్భువును, బులహునికి గతియను తనయను, గ్రతువు నకుఁ గ్రియయను కూఁతును, భృగుమహామునికి ఖ్యాతియను త నూజను, వసిష్ఠుని కరుంధతిని, నథర్వుణునికి బహుయోగవర్ధని యగు శాంతి నొసంగి వివాహములు కావించి భార్యాసమేతుల యిన మరీచ్యాదుల నధికముగా గౌరవించెను. ఓవిదురా! అనం తరము మరీచ్యాదిమునులందఱు భార్యాసహితులై కర్దమదేవ హూతుల యనుజ్ఞవడసి తమతమయాశ్రమంబులకుఁ జనిరి. అనంతరము కర్దముండు జ్ఞానశక్త్యాదిగుణంబులు గలవాఁడ యి తనకుఁ గుమారుఁడయి యున్న కపిలాచార్యుని రహస్య ప్రదేశ మునకుఁ గొనిపోయి నమస్కరించి యిట్లనియె. 'మహాత్మా! తమ తమపాపకర్మములచే మిగుల బాధల ననుభవించుచు సంసారసాగ రంబున మునింగి తేలుచున్నవారలయి యున్న మానవులకు దేవ తలు పెద్దకాలంబునకుఁగాని ప్రసన్నులు కారుకదా? మఱియు యతీశ్వరులును పెక్కుజన్మములనుండి సంపాదించి తెచ్చుకొను చున్న జ్ఞానాతిశయముంబట్టి రాగాదిరహితులయి నిర్మలాంతః కరణములం దేనీస్వరూపమును బొడఁగాంచుటకు యత్నించుచు న్నారో యట్టిమహానుభావుండవయిన నీవు "అయ్యో! మహాత్ముఁ డనైన నే నెట్టుగా సామాన్యులయిండ్లయందుఁ బుట్టుదు" నని యోజింపక సామాన్యులమయిన మమ్ము నుద్ధరించుటకయి యిట్లు పొడమితివి. నీవుతక్కినవారలకు దుర్లభుఁడవయినను భక్తు లకు మిక్కిలి సులభుఁడవని చెప్పుట కెంతమాత్రము సందియము లేదు. అట్లేకానిచో మాయింట నేలపుట్టుదువు? ఓభగవంతా!

పూర్వము నీవుపలికినవాక్యమును సత్యముగాఁ జేయుటకును, మా వంటిభక్తులకు జ్ఞానాభివృద్ధి కలిగించుటకును నీ విట్లు నాగృహమునం దుదయించితివి. నీవు నిష్కర్ముఁడవుగనుకఁ గర్మమును బురస్కరించికొనివచ్చెడి దేహాదులు నీకుఁ గలుగవు. అందువలన నీ కిష్ట మయినజన్మ మెత్తవచ్చును. నీవట్లు స్వతంత్రుఁడవయినను. నీకభిమతమయినశరీరముం దాల్చక నీభక్తుల కభిమతమయిన దేహమును ధరించుచుందువు. దీనింబట్టి యోజింప భక్తులందు నీ కెంత ప్రేమయున్నదో యెవ్వరు చెప్పఁగలరు? లోకములోని పండితులందఱు ప్రకృతిపురుషులయథార్థత్వమును దెలిసికొనఁదలంచి నీపాదముల కభివందించుచున్నారు. అట్టిమహాత్ములచే నుతింపఁబడుచు సకలైశ్వర్యపూర్ణుఁడవయి, జ్ఞానాదిగుణములతోఁ దులదూఁగుచున్న నిన్ను నమస్కరించి శరణుచొచ్చుచున్నాను. ఓదేవా! నీవు మాయాతీతుఁడవయినను మాయయె శరీరముగాఁగలవాఁడవు. నీవు కాలస్వరూపుఁడవు మహచ్ఛరీరకుండవు నీవే? మఱియు జీవశరీరకుండవు. సర్వజ్ఞుఁడవు. జ్ఞానశక్త్యాదిగుణంబులచే లోకములకుఁ బాలకుండవయి సమస్తభువనంబులను నీయందె యిమిడ్చికొనుచున్నాఁడవు. నీవు స్వాధీనమయిన సర్వశక్తులు కలవాఁడవు. ఇట్టి యనంతకల్యాణగుణములు కలిగి కపిలాచార్యుఁడవని ప్రసిద్ధికెక్కిన నీపాదముల కభివందనము లర్పించుచున్నాను. ఓమహాత్మా! నిన్నుఁ బుత్త్రునిగాఁ బడయుటవలన ఋణత్రయమువలనను విముక్తుండనయితిని. మఱియు సంసారబంధములఁ దెగఁద్రెంచియున్నాను. కావున శోకవర్జితుండనై సన్యాసాశ్రమమును స్వీకరించి నిన్నే హృదయకమలమందు నివసింపఁజేసి భజించెదను". అని భక్తిసంయుతుండయి పలికినకర్దమునిఁజూచి భగవంతుం

డిట్లనియె. 'ఓమునీంద్రా ! పూర్వము నీయెదుటఁ జేసిన ప్రతిజ్ఞ సత్యమునుగాఁ జేయుటకయి నీకుఁ గుమారుండనయి జన్మించితిని. లోకములోఁ బెక్కండ్రు దేహమునే యాత్మనుగా భావించుచున్నారు. అది మిగులఁ బొరపాటు. అందువలన మోక్షమందుఁ దలంపుగలవారి కందఱికిఁ బ్రకృతికంటె భిన్నులయిన జీవాత్మపరమాత్మల యాథార్థ్యమును దెలియఁజేయుటకును, ప్రకృతి, పురుషుఁడు, ఈశ్వరుఁడు, అనెడి యథార్థజ్ఞానమును దెలియఁజేసెడి తత్త్వములను, స్పష్టముగాఁ దెలియునట్లు చేయుటకును, 'బరమాత్మసందర్శనము చేయించుటకు నిట్లు జన్మించితినిగాని, నా పనికయి జన్మింపలేదు. ఆత్మతత్త్వము మిక్కిలి సూక్ష్మమయి నదగుటచేఁ దెలియుటకు వలనుపడునది కాదు. అట్టియాత్మతత్త్వమును బూర్వ ముపదేశించితినిగాని చిరకాలమయి యుండుటంజేసి యది నష్టమయినది. అట్టి యాత్మతత్త్వమును మగుడ స్థాపించుటకే యీజన్మమని తెలిసికొనుము. ఓమునీంద్రా ! నీకు సెలవిచ్చుచున్నాను. నీ కిష్టమయినస్థలమునకుఁ బొమ్ము. నీవొనరించెడికర్మములన్నియును నాయధీనములుగాఁ జేసి సామాన్యులకు జయింపఁదరముకాని మృత్యువును జయించి మత్ప్రాప్తిరూపమగు మోక్షమునకు విరోధులైన ప్రాచీనకర్మవాసనలను నిరసించుకొఱకు నన్ను భజింపుము. మద్భక్తియుతుఁడవయి వర్తించినచో సర్వము సఫలమగును. నీ కట్టిభక్తి యలవడినచో నీవు దుఃఖములనన్నింటిని దొలఁగించికొని సమస్తజీవులయందు నంతరాత్మనై స్వయంప్రకాశకుఁడనై సర్వభూతములహృదయకుహరములయందు శయనించియున్ననన్నుఁ బొందఁగలవు. మఱియు మాతల్లియయిన దేవహూతికి సకలకర్మవినాశకమయిన యాత్మవిద్య

నుపదేశించెదను. అందువలన నామెయు భయమును బాసి సంసారసాగరమును దరింపఁగలదు.' అని యిట్లుపలికిన కపిలాచార్యుని వాక్యములను విని సంతసించి ప్రదక్షిణనమస్కారములు కావించి పుత్త్రుని వీడ్కొని వనంబునకుఁ జనియె. అట్లుచని యాకర్దముండు మౌనవ్రతము నవలంబించి పరమాత్మనే శరణముగాఁ దలంచుచు,గృహస్థాశ్రమకర్మముల నన్నింటిని విడిచి నిస్సంగుఁడై యొక్కచో నివసింపక భూమండలమునందెల్లఁ ద్రిమ్మరఁ జొచ్చెను. మఱియు నాకర్దముండు దనచిత్తమును చిదచిద్విలక్షణుఁడును, కల్యాణగుణోపేతుఁడును, హేయగుణములు లేనివాఁడును, నగు పరబ్రహ్మమునందుఁ గీల్కొలిపి నిశ్చలమయినదానిగాఁ జేసి దేహాదులందున్నయభిమానమును విడిచి యహంకారనమకారమును దొలఁగించుకొని, శీతోష్ణాదులయిన ద్వంద్వముల నరకుగొనక సర్వభూతములందును సమదృష్టిగలవాఁడయి ప్రకృతికంటె విలక్షణుఁడగు పరబ్రహ్మమును, సాక్షాత్కరింపఁ జేసికొని ప్రత్యగాత్మయందు శాంతబుద్ధిగలవాఁడయి తరంగములులేని సముద్రునివలె * షడూర్ములు లేనివాఁడయి జీవాత్మల కంతరాత్మయయి యొప్పుచు, భగవంతుఁడయిన వాసుదేవునియందున్న భక్తివిశేషముచే నాత్మజ్ఞానమును బొంది సకలబంధవిముక్తుఁడయి సర్వభూతములయందును భగవంతుఁడు విలసిల్లుచున్నట్లు దెలిసికొని రాగాదిరహితమయిన మనస్సుకలవాఁడయి ముక్తిచెందెను.

ఇది యిరువదినాల్గవ యధ్యాయము.



* ఆఁకలి, దప్పి, దుఃఖము, మోహము, ముదుసలితనము, మృత్యువు అను నీయాఱు నూర్ములనఁబడును.

కపిలదేవహూతి సంవాదప్రారంభము.

అని చెప్పినవిని శౌనకుండు సూతున కిట్లనియె. ఓ మహానీయా! భగవంతుఁ డాత్మమాయ నవలంబించి తత్త్వసంఖ్యానము చేయుటకును, మానవుల కాత్మమార్గమును దెలియఁ జేయుటకును, జన్మకర్మాదులు లేనివాఁడయినను, గపిలాచార్యుండయి జన్మించెనని చెప్పితివి. యోగిశ్రేష్ఠుఁడయిన కపిలాచార్యుని కీర్తిమంతమయిన చారిత్రము నెంతవిన్నను మాకుఁ దృప్తికలుగదు. స్వచ్ఛందమయిన దేహముగల కపిలాచార్యుం డాత్మమాయాగుణముచే నెట్లు ప్రవర్తించెనో యా ప్రవర్తనలను మాకుఁ దెలియఁజెప్పుమని యడిగిన విని సూతుండు శౌనకాదుల కిట్లనియె. 'ఓ మునీంద్రులారా! వ్యాసమిత్రుఁడయిన మైత్రేయుండు తత్త్వనిరూపణమందుఁ బ్రేరితుండై విదురుంగాంచి పలికెను. ఓ విదురా! తనతండ్రియగు కర్దముండు తపోవనంబున కరిగినపిమ్మటఁ గపిలాచార్యుండు తనతల్లికిఁ బ్రియంబు చేయఁ దలంపుగలవాఁడయి యాబిందుసరోవరతీరమునందు నివసించియుండెను. అంత దేవహూతి కర్మాదిరహితుఁడును, దత్త్వమార్గదర్శియు నగు తనకుమారునిఁజూచి బ్రహ్మవాక్యములను దలంచికొని యిట్లనియె. 'ఓ దేవా! ఇంద్రియములంబట్టియే నే నజ్ఞానకూపంబునం బడితిని. న న్నజ్ఞానములో ముంచినట్టి ప్రకృతిపరిణామరూపములయిన యింద్రియములతృప్తి చేతనే మిగుల దుఃఖమును బొందుచున్నాను. దుష్పారమైన యజ్ఞానతమము పారమును బొందింపఁజాలినవాఁడవు నీవే! నీకంటె నన్యులులేరు. నీవే నాకు దివ్యలోచనమ వయితివి. ఇదివఱ కెన్నియోజన్మముల నెత్తితిని. కాని యొకప్పుడు నా కిట్టి దివ్యలోచనము కలుగలేదు. నేఁడు కలిగి

నది. కావున నిఁక నాకు నిదియే కడపటిజన్మమని తలంచెదను. చీఁకటుల నడఁగింప సూర్యుఁ డుదయించినట్లు నాయజ్ఞానమును దొలఁగించుటకుఁ బరమపురుషుఁడవును, లోకాధీశ్వరుఁడవును, భగవంతుఁడవు నగు నీవు నా కుదయించితివి. కావున నాయ వివేకమును దొలఁగించుటకు నీవర్హుండవు. మఱియు నీసంకల్పమువలన నుద్భవించిన యహంకారమమకారములను దొలఁగింపఁ దగినవాఁడవు. అదికారణమున సంసారవృక్షమును ఛేదించుటకు గొడ్డలివంటివాఁడవును, సమస్తయోగులకును శరణ్యుఁడవు నగు నీపాదముల శరణుచొచ్చుచున్నాను. నీవు తత్త్వవిదుఁడ వగుటచేఁ బ్రకృతిపురుషవిభాగముచేయ సమర్థుండవు. కావున నట్టిజ్ఞానమును నాకుఁ దెలియఁజేయుము". అని యిట్లు పలుకుచున్న తల్లివాక్యంబుల నాలించి యామె యభిప్రాయమును గ్రహించి మందహాసముచే ముఖారవిందము ప్రకాశింపఁ గపిలాచార్యుండు మనస్సుచే నమస్కరించి మోక్షోపాయమును దెలియఁ జేయనెంచి యిట్లనియె. "ఓజననీ! ఎల్లవారికిని దత్త్వజ్ఞానము మోక్షసాధనమని నామతము. ఆ యాత్మజ్ఞానయోగము సుఖదుఃఖములను మొదలంట నశింపఁజేయక మానదు. అట్టి యాత్మజ్ఞానమును బూర్వము వినఁ దలంపుగొనియున్నమునీంద్రులకు వివరించి చెప్పియున్నాను. దానినే యంగములతోఁగూడ నీకుఁ దెలియఁజేసెద నాలింపుము. ఓతల్లీ! విషయములయందు సక్తమయిన మానసము బంధముకొఱకుఁ గారణమగుచున్నది. భగవంతునియందు సక్తమయినచిత్తము ముక్తికొఱకుఁ గారణమగుచున్నది. కావున మనస్సే బంధమోక్షములకుఁ గారణమని యెఱుంగుము. ప్రకృతికంటె భిన్నమయిన

పరమాత్మ జ్ఞానస్వరూపమును దెలియఁదగిన మనస్స్వరూపమును జెప్పెదను విను. * ఆత్మపదార్థముకాని దేహాదులం దాత్మయను నభిమానము గలుగుచుండు. అట్లె తనదికాని వస్తువు నందుఁ దనదనెడి యభిమానము గలుగుచుండు. ఆ యభిమాన ద్వయమే యహంమమాభిమానము లనంబడు. ఈ యభిమానములనుండియే కామలోభాదులు జనించు. వానివలననే పుణ్యపాపంబు లుద్భవించు. అట్టి పుణ్యపాపములు ఫలాభిలాషలేని యీశ్వరారాధనరూపమగు వర్ణాశ్రమ ధర్మములచేఁ దొలంగుచుండును. కావుననే మనంబు పరిశుద్ధమై కనుక నేయింద్రియ జన్యంబులగు సుఖదుఃఖంబులచేఁ దిరస్కరింపఁబడక,యెల్లప్పుడు నేకరూపముగా నుండును. అట్టి మనంబుగల పురుషుండు జ్ఞానముచేతను, వైరాగ్యముచేతను, సంయుక్తమై భక్తిసమేతమై యొప్పుమానసముచేఁ బ్రకృతికార్యములగు శరీరముకంటెను, నింద్రియంబులకంటెను, మనంబుకంటెను, బ్రాణంబులకంటెను, స్వరూపస్వభావములచే మిక్కిలి విలక్షణమై, ప్రకృతిపరిణామవిశేషములగు దేవత్వ మనుష్యత్వాద్యాకారములు లేక, జ్ఞానముంబట్టి యేకరూపమైనది కాన భేదములేక, యణుపరిమాణము కలదగుటచే నాయుధంబులచే ఛేదింపఁబడక, యగ్నిచే దహింపఁబడక, దీపము తేజస్స్వరూపమయి, తేజోగుణము గలదై స్వయముగాఁ బ్రకాశించునట్లు జ్ఞానస్వరూపమయి, జ్ఞానగుణముకలదయి స్వయంప్రకాశమై యొప్పుచు నిర్వ్యాపారమై యున్న ప్రత్యగాత్మను, సమస్తప్రాణికోటిని

---

* ఇందులకు-శ్లో॥ "అనాత్మన్యాత్మబుద్ధిర్యా అస్వేస్వమితియామతిః। అవిద్యాతరుసంభూతం బీజమేతద్ద్విధాస్థితమ్" అనునది ప్రమాణము.

సంసారమునం బడఁద్రోయఁజాలిన బలము లేనిమాయను జూడఁగ
లేదు. ఓతల్లీ! ఆత్మస్వరూపమును దెలియఁజాలిన మనస్స్వరూప
మును, నట్టియాత్మయాథాత్మ్యము నీకుఁ జెప్పితిని. కాని ప్ర
కృతికంటె విలక్షణమయినదని చెప్పినంతమాత్రమున నాత్మస్వ
రూపమును గ్రహింపఁజాలరు. జీవాత్మస్వాభావికస్వరూప
ము పరమాత్మశరీరమై యుండుటయే కాన పరమాత్మశరీర
భూతమగు జీవాత్మస్వరూపమును దెలియఁగోరినచోఁ బరమా
త్మను దెలిసికొనుట యావశ్యకము. బ్రాహ్మణత్వాది జాతులను
గాని నలుపు, పసుపు మొదలగు గుణములనుగాని, ప్రత్యేకము
గాఁ బ్రత్యక్షము చేసికొనలేరు. అట్టిజాతులను గుణములను,
దెలిసికొనఁ దలంచినచో దదాశ్రయములయిన బ్రాహ్మణాదివ్యక్తు
లను, నెఱ్ఱనివియుఁ, బచ్చనివియు నగు వస్తువులను ముందుగా
సాక్షాత్కారము కావించుకొనవలయు. అట్లయిన జాతిగుణా
దులు ప్రత్యక్షములగును. అట్లె జీవాత్మస్వరూపము తదా
శ్రయమగు పరమాత్మవలననే కాని ప్రత్యేకముగా లభింపదు.
దానిఁ దెలిసికోఁదలంచినజీవాత్మ శరీరముగాఁ గల పరమాత్మను
దెలిసికొనవలయు. పరమాత్మను దెలిసికొనినఁ బరమాత్మ శరీర
మగు ప్రత్యగాత్మస్వరూపము తెలిసికొనఁగలరు. కావునఁ బ్ర
కృతికంటె విలక్షణమగు ప్రత్యగాత్మను దెలిసికొనుటకు బ్ర
హ్మసాక్షాత్కార మావశ్యకము. బ్రహ్మసాక్షాత్కారమున కు
పాయ మేమని యడిగెదవేని చెప్పెద. జీవాత్మలకంతరాత్మయై
యొప్పు భగవంతునియం దుంచిన * భక్తియే బ్రహ్మమువలె

* ఈ చెప్పుటవలన విధివిహితములగు వర్ణాశ్రమధర్మములను ఫలాపేక్షలే
కుండ నొనరించి యందువలనఁ గామాదిదోషములను దొలంగించుకొని నిర్మలాం

పాపములఁ దొలంగించుకొనుట మొదలగు నెనిమిదిగుణములను గలుగునట్లు జేసికొన యోగులకుఁ బ్రధానసాధనము. ఇంతకంటె నన్యాపేక్షమగు నుపాయము మఱియొకటి లేదు. ఓతల్లీ! అట్టిభక్తి యుదయించుటకుఁ బ్రధానమగు నివృత్తిధర్మములం దభిరుచి గలుగుటకు సత్సంగతియే ముఖ్యకారణమని తెలియుము. దుష్టములగు నింద్రియవిషయములం దత్యాసక్తి జీవాత్మకు దృఢమగు పాశబంధనమే యని పండితులందురు. సాధుసంగతియం దట్టి యాసక్తియుండిన నది యనర్గళమగు మోక్షద్వారమే. అట్టిసాధువు లెవ్వరని యడిగినఁ జెప్పెద. మూర్ఖులవిషయమై కూడ భూమివలె మిగుల నోర్పుగలిగి, స్వప్రయోజనాపేక్ష లేకయే పరుల దుఃఖములను నిరాకరింపఁ దలంచుచుఁ, గనుకనే సమస్తప్రాణులకును మిత్రులయి వర్తించుచుఁ, గావుననే యెవరితోను విరోధింపక మఱియు శమదమాదిగుణ సంపన్నులయి, పరులకార్యములను సాధించువారై, సాధుస్వభావమే యలంకారమునుగా ధరించి వర్తించువారలే సాధువు లనంబడుదురు. మఱియు, నాయారాధనకు విరోధులయిన ప్రవృత్తిధర్మములను, నాభజనకు విరోధులయిన స్వజనమును విడిచి యన్యవస్తువులందుఁ బ్రవేశింపని యంతఃకరణముచే నాయందు భక్తిగలవారును సాధువులే. ఇంతేకాక తమచిత్తములను నాయందు నిలిపి సంతుష్టులై నాసత్కథలను వినుచుఁ, బరులకుఁ దెలియఁజెప్పుచు, నాధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము నాఁబడు తాపముల

---

తఃకరణుఁడై తాదృశాంతఃకరణముచే బ్రహ్మశరీరభూతమగు ప్రత్యగాత్మ యాథాత్మ్యము దెలియవలయును గాన యట్టిపరమాత్మను సాక్షాత్కారము చేసికొనఁ దద్భక్తియే సాధనమని తెలియుమన్నది.

పొలఁబడక వర్తించువారలును సాధువులే. ఓసాధ్వీమణీ! సమస్తవిషయసంగములను విసర్జించి వర్తించుసాధువు లింద్రియార్థప్రసంగమువలనఁ గలిగి యనాదులయిన పుణ్యపాప రూపదోషములను హరించువారలు కావున నీ వట్టిసాధుసంగమును దప్పక ప్రార్థింపఁదగినది. సాధుప్రసంగమువలన నివృత్తిధర్మములం దభిరుచి యెట్లుకలుగునని సందియపడ నవసరములేదు. సాధుప్రసంగమువలన నిత్యాసంకుచితజ్ఞానముచే సమస్తమును సాక్షాత్కరింపఁజేయు నాకథలు హృదయమునకును, గర్ణములకును, నమృతమువలె రుచికరములయి ప్రవర్తించును. అట్టికథలను వినుటవలన మోక్షమునకు ద్వారభూతమగు గురుసదనమందు శ్రద్ధయు, నతనిసన్నిధియందు భగవత్కథలను సర్వదా వినుచుండుటవలన నివృత్తిధర్మములును గలుగును. ఇట్లు సత్సంగతి మొదలగువానింబట్టి భగవత్ప్రీతిరూపభక్తి యుద్భవించును. సృష్ట్యాదివ్యాపారములను జింతింపఁజేయు నాభక్తివలననే దృష్టములగు నిహాలోకఫలములందును, శ్రుతములగు పరలోకఫలములందును విరక్తిచెంది పురుషుఁడు ఫలాపేక్షలేని కర్మయోగ జ్ఞానయోగంబు లలవరించుకొని చిత్తమున నేకరూపత్వమును సంపాదించు భక్తియోగసాధనముల వివేకము, విమోకము, అభ్యాసము మొదలగువానిచే మనోనియమనమందుఁ బ్రమాదరహితుఁడై యత్నము చేయుచుండును. సత్త్వాదిగుణముల పరిణామరూపములయి నిషిద్ధములై యున్న యన్నాదుల ననుభవింపకుండుటచేతను, వైరాగ్యముచే నతిశయించిన జ్ఞానయోగముచేతను, ఫలాపేక్షలేని కర్మయోగముచేతను, నాయందు సమర్పితమయిన భక్తియోగమువలనఁ బురుషుఁడు ప్రత్యగాత్మయే శరీరముగాఁ

గలనన్నుఁ బొందును." అని పలుకుచున్న కుమారునిఁజూచి దేవహూతి యిట్లనియె. 'నాయనా! ముక్తిసాధనకుఁ దగిన భక్తిస్వరూప మెట్టిది? నా కెట్టిభక్తి యుచితమైనది? తాపత్రయముచే నాతురురాలయిన నే నెట్టిదాని నవలంబించినచో నిర్విఘ్నముగా నిరతిశయసుఖమగు నీపదము నందఁగలను? అట్టిదానిని దెలుపుము. ఓ యానందస్వరూపా! లక్ష్యరూపుఁడవగు నీయందు బాణరూపముగాఁ బ్రయోగింపఁదగిన యోగం బెటువంటిది. దానికి నంగము లెన్ని? ఆయంగములవలనఁ బరమాత్మతత్త్వ మెట్లుకలుగుచున్నది? నాయడిగిన ప్రశ్నంబులకు సదుత్తరంబుల నొసంగి నాబుద్ధిమాంద్యమును వదలింపుము. నే నబలను, నే నొరులుపదేశించు నుత్కృష్టసంగతుల గ్రహింపఁదగినంత బుద్ధిగలదానను గాను. మఱియు నాధ్యాత్మికవిషయములు మిగుల దురవగాహములని వినియుందును. అవి దురవగాహములయినను నీబుద్ధిచాతుర్యముచే సులభముగాఁ జేసి నాకుఁ దెలియఁజెప్పి నన్నుఁ దరింపఁజేయుము' అనియడుగ విని కపిలుండు భక్తియోగాదులఁ దెలిసికొననున్న తల్లితలంపు దెలిసికొని ఆమెయందుఁ దా నుత్పన్నుఁడగుటంబట్టి మాతృస్నేహము కలవాఁడయ్యెను. తత్త్వసంఖ్యానముచే నాత్మస్వరూపమును బ్రకాశింపఁజేయు భక్తియోగము తెలుప నిశ్చయించి తల్లికిఁ గుమారుండయిన కపిలుం డిట్లనియె. 'ఓజననీ! భక్తియనఁగా నెట్టిదని యడిగితివి. సత్త్వమయుఁడయిన భగవంతునియందు నిర్నిమిత్తముగా స్థిరపడినట్టి జ్ఞానేంద్రియములయు, కర్మేంద్రియములయు, నేకాగ్రమయిన మనస్సంబంధమైనదియు, నగు వ్యాపారమునకే భక్తియనిపేరు. ఆభక్తి కైవల్యాదులఁ గలిగించుటంబట్టి, మిగుల గరిష్ఠమైనది. ఆభక్తి

సమస్తకర్మవాసనలను భుక్తపదార్థమును జఠరాగ్ని నశింపఁజేసినవిధమున క్షణకాలములోనే నశింపఁజేయఁగలదు. అట్టిభక్తిమార్గము నవలంబించినవారు, నాపాదపద్మభజనయం దాసక్తులై సర్వేంద్రియవ్యాపారములను నాయందుఁ బొందుపఱిచి కల్యాణగుణప్రకాశకములగు నాసచ్చరిత్రములను సర్వదా యాలకించి పరస్పరము నుతించికొనుచు, గౌరవించుచున్నవారలయి *సాధర్మ్యరూపముక్తినిగూడ నిష్టపడరు. తల్లీ! భక్తి యంత యుత్కృష్టమయినదని తెలిసికొమ్ము. మఱియు సత్పురుషులు సుందరములగు వక్త్రలోచనాదులు గలిగి యిష్టవస్తువుల నిచ్చుచున్న నాదివ్యమంగళశరీరములను గాంచి ధ్యానించుచు, నాయారూపముల నొందినప్పుడు నాపలికినవాక్యంబులఁ బరస్పరము చెప్పికొని యమితానందము చెందుదురు. వారు దర్శనీయములయిన నాదివ్యరూపములచేతను, కరుణావలోకనములచేతను, మృదుమధురములయిన వాక్యరచనములచేతను, దమయాత్మలు హరింపఁబడుటంజేసి ముక్తినిగోరకున్నను భగవద్భక్తి, ప్రారబ్ధకర్మము నశించినపిమ్మట, †నర్చిరాదికమయిన గమనమును బొందించి మదీయమాయచే సృజింపఁబడిన బ్రహ్మలోకపర్యంతంబుగల భూతిని, నణిమాద్యష్టాంగయోగమును, బొంద నిష్టపడనీయక నిరతిశయానందదాయకమయిన నాలోకమును జెందునట్లు చేయును. అంతి

---

* సాధర్మ్యరూపముక్తియనఁగా భగవంతునితో సమానమైన ధర్మములు గలిగియుండుటయే.

† ఈలోకమునుండి పైలోకముల కేఁగువారికి ధూమాదిగతియనియు, అర్చిరాదిగతియనియు, రెండువిధములుకలవు. ఈగతులస్వరూపము ద్వితీయస్కంధంబున రూపింపఁబడెను.

యకాని నిత్యములు కానివియు, సామాన్యసుఖములు గలవి యునగు స్వర్గాదిలోకములయందుండ నిష్టపడనీదు; స్వర్గాది లోకములవలెనే వైకుంఠముగూడ నశించునని తలంపకుము. * శాంతస్వరూపమయిన నాలోకమునందు నన్ను భజించుచున్న వా రెప్పుడు నాశనము చెందరు; ఒకప్పుడును భక్తిహీనులయి యుండరు. కాన నా కాలచక్రము వారిని నెంతమాత్రము నశింపఁజేయలేదు. నాలోకములో వసించువారి కందఱికి నేను గుమారునివలెఁ బ్రేమాస్పదుఁడనై మిత్రునివలె విశ్వాసపాత్రుఁడనై గురువువలెనె హితోపదేష్టనై, దైవమువలెఁ, బూజనీయుండనై యుందును. మఱియు నిహపరలోకములు నీచములని తెలిసికొని యీరెండులోకములయం దుండఁదగిన దేహాదుల నిష్టపడక పుత్త్రకళత్రాదులయందును, ధనములయందును, గృహములయందును, దేహమందును నభిమానము విడిచి యితరవిషయాసక్తులుగాక యన్యప్రయోజనములేని భక్తిచే నన్ను సంతతము భజించువారలను నేను సంసారసాగరమును

---

* ఇట భగవంతుఁడగు కపిలుని యభిప్రాయము ప్రతిదినమును వర్ణాశ్రమధర్మములఁ బ్రవర్తింపఁజేయుటచే సంభూతమయిన మదుపాసనచేతను, మదారాధనమును సలుపుటచేతను నేను సంతసించి, సర్వవిధములచేతను నన్నుపాసించుభక్తులను నిరతిశయానందరూపమగు నాపదమును బొందించి వారికి మగుడ జన్మమును గలుగనీయనని యన్నట్లు తెలియుచున్నది. ఇందులకు భగవద్గీత. శ్లో॥ "మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్। నాప్నువన్తి మహాత్మాన స్సంసిద్ధిం పరమాంగతాః ॥ ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోర్జున। మాముపేత్యతు కౌన్తేయ పునర్జన్మ నవిద్యతే॥" ఇందువలన బ్రహ్మలోకాదులకుఁ బోయినవారికిఁ బునర్జన్మమున్నదికాని వైకుంఠము నొందినవారికిఁ బునర్జన్మము లేనట్లు స్పష్టమగుచున్నది

దాఁటించి నాలోకమునకుఁ గొనిపోయి సుఖింపఁ జేయుచుందు ను. ఇంక వారలకుఁ దిరిగి పుట్టువుండదని నమ్ముము. మఱియు సమస్త చేతనాచేతనముల కంతరాత్మనై, నియంతనై, భగవం తుండనై యున్నన న్నాశ్రయించిన వారి కెట్టిభయము కలుగ నేరదు. నన్నుఁగాక యితరుల సేవించినవారికి గర్భజన్మజరామర ణాది దుఃఖములు నివర్తింపవు. నేను బ్రహ్మాదులకు గల సమస్త దేవతలను నాయాజ్ఞలయందుఁ బ్రవర్తింపఁజేయుచున్నాను. నా యాజ్ఞ నతిక్రమించువాఁ డుండఁడు. నాకు వాయువు మిగులభయ పడుచుఁ బ్రసారణరూపమయిన వ్యాపారమందు సర్వదా ప్రవ ర్తించుచుండును. నేను సూర్యుని,లోకములకు వెలుతురును వేఁడి మిని గలిగించునిమిత్తము నియమించితిని. అందువలన నతఁ డా వ్యాపారములనే తప్పక చేయుచుండును. నాయనుమతిచేత నే యింద్రుండు లోకమునిమిత్తము వర్షించుచుండును. అగ్ని సర్వ మును దహించుచుండును. మృత్యువుకూడ నాకు భయపడి తిరుగు చుండును. ఇట్లు నేను సర్వనియామకుఁడనగుటంబట్టి యోగీశ్వరు లందఱు వైరాగ్యయుక్తమయిన భక్తిమార్గము నవలంబించి క్షే మముపొందుటకయి నాపాదమూలములఁ జేరుదురు. అట్టివారల కెందువలనను భయము లేదు. మహత్తరమయిన భక్తిమార్గము చే నిర్మలమయిన తమచిత్తమును నాయందు స్థిరముగా జేర్చుట యే ప్రకృతిమండలంబున వర్తించు బద్ధజీవులకు నతిశయమైన పరమపురుషార్థమని తలపోయుచుండుము. ఇది యిరువదియై దవ యధ్యాయము.

"ఓతల్లీ! నీకు భక్తిమార్గమును దెల్లము కావించితిని. ఇంక నీకుఁ దత్త్వలక్షణం మెఱింగింతు వినుము. ఆతత్త్వమును జక్కఁగఁ దెలిసినవాఁడు సత్త్వాదిగుణకార్యములగు పుణ్యపాపముల నుండి విముక్తుఁ డగుచున్నాఁడు. మఱియు జ్ఞానము బ్రహ్మసాక్షాత్కారము కలిగించును. అది మోక్షమునకు సాధనమయినది. అది హృదయమందున్న యజ్ఞానమును దొలంగించును. అట్టిజ్ఞానమునుగూడ నీకుఁ దెలియఁజేయుదును. ఓజననీ! తత్త్వలక్షణమును, జ్ఞానలక్షణమును, జెప్పుటకుఁ బూర్వము, ప్రకృతికంటె విలక్షణమయిన యాత్మస్వరూపమును దెలియఁబఱిచెద. సావధానచిత్తవయి యుండుము.

కపిలుఁడు తల్లికి నాత్మస్వరూపంబును జెప్పుట.

* దీపాదులు తేజోరూపములయి ప్రకాశించుచుఁ దన్నుండి వేఱుచేయ వలనుపడని ప్రభచే నితరవస్తుజాలంబును బ్రకాశింపఁజేయుచుండును. మఱియు స్వధర్మభూతమగు ప్రభ నపేక్షింపకయే వెలుంగుచుండును. అట్లె జీవాత్మయుఁ, దనకు ధర్మభూతమగు జ్ఞానంబుచే నన్యవస్తుజాతంబునెల్లను బ్రకాశిం

* ఇట్టిదీపాదులకు నాత్మకుఁగల భేదమేమన, దీపాదులు తమ్మును, నితరమును, నితరులనిమిత్తమే ప్రకాశింపఁజేయును. ఆత్మ తన్నును, నితరులను దననిమిత్తమే ప్రకాశింపఁజేయుచుండును. దీపము స్వధర్మభూతమగుప్రభచే నితరులను దదపేక్ష లేకుండ స్వాత్మను బ్రకాశింపఁజేయును అట్లె యాత్మయు ధర్మభూతజ్ఞానముచే నితరులనుఁ దదపేక్షలేకుండ ధర్మిజ్ఞానముచే స్వాత్మను బ్రకాశింపఁజేయును. ఈదీపదృష్టాంతముచే నాత్మ జ్ఞానస్వరూపము, జ్ఞానగుణకము, నై యొప్పుచున్నదని తెలియుచున్నది. మఱియు నాత్మ తననిమిత్తమే ప్రకాశించెడిదగుటచే, దీపాదులవలె జడముకాదనియుఁ దెలియవచ్చుచున్నది. ప్రత్యగాత్మత్వమనఁగాఁ దన్ను నితరులను దననిమిత్తము ప్రకాశింపంజేయుట యని యెఱుంగునది.

పఁ జేయుచు, స్వధర్మభూతమగు జ్ఞాన మపేక్షింపక స్వయముగానే ప్రకాశించుచుండును. మఱియు జీవాత్మ తాను బ్రకాశించుచు సమస్తమును దనకొఱకే ప్రకాశింపఁ జేయుచుండును. దీపాదు లట్లుకాక తన్నును నితరులను నితరులనిమిత్తమే ప్రకాశింపఁ జేయుచున్నవి. అందువలన, దీపాదిదృష్టాంతంబువలన నాత్మకుఁ బ్రాప్తమగు జడత్వము వారించుచున్నది. మఱియు ఆత్మ ప్రకృతిపరిణామరూపములయిన మనశ్శరీరేంద్రియప్రాణాదుల కంటెఁ బరుఁడయి యొప్పుచుండును. అతఁడు మాయాజన్యము లయిన సత్త్వాదిగుణములు లేనివాఁడు. ఇట్లతఁడు నిర్గుణుఁడై యొప్పుచున్నను శరీరాంతర్యామియై వానిని ధరించుచున్నాఁడు. అతనిస్వరూపముచేతనే బ్రహ్మ మొదలు స్తంబపర్యంతముగల స్థూలసూక్ష్మరూపములచే నొప్పుప్రపంచము వ్యాప్తమయినది. ఇందువలన బ్రహ్మాదిశరీరములు వ్యాప్యములనియు నాత్మ వ్యాపకుఁడనియుఁ దేటపడుచున్నదిగదా. ఆత్మ వ్యాపకుఁడగుటవలనను, నిరతిశయసూక్ష్ముఁ డగుటవలనను, ననాదియగుటవలనను, దేహాదులకంటె విలక్షణుఁడగుటవలనను, దేహాద్యుపాధులచేఁ గలిగెడి చావుగాని జన్మముగాని యతనికిఁ గలుగదు. ఓయీ! నేను స్థూలరూపుఁడను, నేను దేవుఁడను, నేను మనుష్యుఁడను, నను చుఁ జెప్పవలసివచ్చినప్పుడు దేహాత్మలకభేదమే గోచరమగుచుండుటం బట్టి దేహాదులతోఁగూడ నాత్మకు జననమరణాదు లెందుకు సంభవింప వని యడిగినచోఁ దెలిపెద నాలింపుము. పుణ్యపాపకర్మనిమిత్తములయిన స్థూలత్వాదిదేహధర్మములు పరమాత్మయం దారోపించుకొనుటం జేసియట్టిప్రతీతికలుగుచున్నది. కాని యతనికి జననమరణాదులు లేవు. మఱియు మానవుండు స్వప్నమందు నద్భు

తమయిన పదార్థములను జూచుచున్నాఁడు. పిమ్మట స్వప్నదృష్టంబులగు పదార్థములు నాశనము చెందినప్పుడు నాస్వప్నద్రష్టకు నాశనములేదు. ఇది యందఱికిఁ దెలిసినవిషయమేకదా? అట్లు దేహాదులు జననమరణాదులు కలిగియున్నను దేహాదిసంబంధము వలన నవి యాత్మ కెంతమాత్రము కలుగనేరవు. ఇట్టియాత్మకు మాయాసంసర్గ మెట్లు కలిగినదో చెప్పెద వినుము. * జగదాది

---

* పురుషుఁడు జీవుఁడనియు, నీశ్వరుఁడనియు రెండువిధములయి యుండును. ప్రకృతియు నావరణశక్తియనియు, విక్షేపణశక్తి యనియు రెండువిధంబులు. అందు జీవుఁడు ప్రకృతిని దెలిసికోలేక తద్వశుండయి సంసారంబునం బడును. ఈశ్వరుండు ప్రకృతి నెఱింగినవాఁడై కావుననే తద్వశుండు కాక విక్షేపణశక్తిచే సృష్ట్యాదివ్యాపారములను జక్కఁ జేట్టుచుండును అందుఁ బ్రకృతినెఱుంగక సంసారంబునఁబడినవాఁ డావరణశక్తిచేఁ దిరోహితుఁడగుచుండు నని చెప్పి-శ్లో॥ "సఏషప్రకృతింసూక్ష్మాం దైవీంగుణ మయీంవిభుః। యదృచ్ఛయైవోపగతా మభ్యపద్యత లీలయా" యను నీశ్లోకముచేఁ గొందఱాత్మకుఁ బ్రకృతిసంబంధంబును జెప్పుచున్నాఁడని వ్యాఖ్యానముచేయుచున్నారు. కాని యది యసంగతము. ఆత్మ స్వప్రకాశస్వరూపుఁడని యంగీకరించుచున్నారు. అవిద్యకు విరోధియగు స్వప్రకాశముగలయాత్మ కవిద్యాసంబంధంబు గలుగుటయే దుస్తరము. ఆత్మ ప్రకాశరూపమయినది. అవిద్య చీకటివంటిది. ప్రకాశమునకుఁ జీకటిసంబంధ మెప్పుడయినను గలుగునా? కలుగదు. అట్లె, యాత్మ కవిద్యాసంబంధము కలుగుట యసంభవము. అట్టిసంబంధమే యసంభవమగుచుండ "నేను బ్రకృతి స్వరూపుఁడ" నని యనుకొనుట యెట్లు ? అదిలేనప్పుడు సంసారపతన మెట్లు ? కావున నిది సముచితముకాదు. "ఓయీ ! సృష్ట్యాది వ్యాపారము లీలారూపమగుచున్నది. కాన యట్టిలీల సంపాదించుకొనుట కావరణశక్తిచేఁ దిరోహితుఁడయి మోహము చెందుచున్నాఁడు. కావున సంసారపతనము సంభవించున"ని యందురేని యట్లన వీలులేదు. "లీలాసంపాదన

జీవునికిఁ గలిగినప్రకృతిసంబంధమును నిరూపించుట

యందుఁ బ్రకృతి నిరతిశయ సూక్ష్మదశను బొంది, కావుననే నా

---

ముకై యావరణశక్తిచేఁ దిరోహితుఁడయి భ్రాంతి చెందుచున్నాఁడని చెప్పుచున్నారు". అనఁగా నేమి యర్థము? లీలవలన భ్రాంతికలుగుచున్నదని చెప్పదురా? లేక భ్రాంతివలన లీలకలుగుచున్నదని చెప్పదురా? లేక భ్రాంతియే లీలయని చెప్పదురా? వానిలో లీలవలన భ్రాంతి కలుగుచున్నదని చెప్ప వలనుపడదు. లీలచేతను దనకు భ్రాంతి సంపాదించుకొనుటయే యనుపపన్న మగుచున్నది. మఱియు, నీశ్వరుఁడు శ్రు॥ "బహుస్యాం ప్రజాయేయ" యని సంకల్పించుకొని లీలారూపమయినసృష్ట్యాదివ్యాపారమునుజేయుచున్నాఁడు. కాని భ్రాంతుఁడనగుదునని సంకల్పించికొని సృజింపలేదు. "ఇంతియకాక లోకములో, నేను భ్రాంతిపొందెదనని" భ్రాంతి చెందుట యెచ్చటను జూచితిమా! కావున లీలచేత భ్రాంతిసంపాదన మసంభవము. మఱియు లీలార్థము సృష్ట్యాదివ్యాపారము చేయునట్టి యీశ్వరుఁడు సర్వజ్ఞుఁడా? లేక యజ్ఞుఁడా? సర్వజ్ఞుఁడని యందురేని, అతనికి సమస్తము తెలియును గావున సంసారము తనకనర్థకరమని తెలిసికొని తాదృశసంసారమును బ్రవర్తింపఁజేయనేచేయఁడు. అతఁడజ్ఞుఁడు కావునఁ దెలియమిచే సంసారమును బ్రవర్తింపఁజేయుచున్నాఁడందురేని నీశ్వరునకు సర్వజ్ఞత్వమును దెలియఁజేయుశ్రుతులకు విరోధము కలుగుచున్నది. "ఓయీ! యీశ్వరుఁడు సర్వజ్ఞుఁడనియే చెప్పుదురు సృష్ట్యాదు లొనరించుటవలనఁ దన కనర్థము సంప్రాప్తమగునని యతనికిఁ దెలియు. జ్ఞాననివృత్తిచే సంప్రాప్తమగు ననర్థములఁ దొలఁగించుకొనవచ్చుననిజగంబుల సృజించిన సృజింపవచ్చునే!" యని యందురేని యట్లు చెప్పవలనుపడదు. ఈశ్వరునికి లోకసృష్ట్యాదియగు వ్యాపారము లీలామాత్రమని యంగీకరింపక తీఱదు. అది యన్నిమతములవారు నంగీకరించిరి. నీవు చెప్పినట్లు జగత్సృష్టి స్వానర్థపరిహారము నిమిత్తమన్నచో, లీలామాత్రమనుట యెట్లు పొసఁగును? అనర్థపరిహారరూపమగు ప్రయోజనముండఁగా లీలార్థమెట్లగు? రోగపీడితునకు నౌషధముకొనివచ్చుట లీలార్థమగునా? కాదు. కావున లోకసృష్ట్యాదులు లీలార్థమని యంగీకరించుటచే తనకు వచ్చెడియనర్థములఁ దొలంగించుకొన

మరూపముల విభజింప నర్హము కాకయుండును. అది విష్ణువునకు లీలలను సంపాదించునది కావున జీవునికిఁ దత్సంబంధము సహజము కాకపోయినను యథేచ్ఛముగానే సంప్రాప్తమగుచుండును.

---

వచ్చునని చెప్పవీలులేకపోవుటచేతను, సర్వజ్ఞుఁడగు నీశ్వరుండు తన కనర్థము కలిగించు సంసారమును, ప్రవర్తింపఁజేయనివాఁడగుటచేతను, లీలచేత భ్రాంతి సంపాదన మసంభవము. అందువలన లీలవలన భ్రాంతికలుగుచున్నదని చెప్పవలనుపడదు. భ్రాంతివలన లీల కలుగుచున్నదనియుఁ జెప్పరాదు. అట్లుచెప్పినచో లీలారూపకమయిన "బహుస్యా" మనుసంకల్పము లీలారూపకము కాక భ్రాంతిమూలకమయి యుండవలయు. కాని ఈశ్వరున కీసంకల్పంబునకుఁ బూర్వము భ్రాంతియేలేదు. కావున నిది యసంభవమే. లీలయనఁగా భ్రాంతియనియు చెప్పెదమన్న నట్లుచెప్పరాదు. అట్లేచెప్పినచో పైత్యాది వికారములచేఁ గలుగు భ్రమలన్నియు లీలలే కావలసివచ్చును. కావున లీలారూపమగు సృష్ట్యాదివ్యాపారమును జక్కఁజేసికొనుట కావరణశక్తిచేఁ దిరోహితుఁడయి భ్రాంతుఁడగుచున్నాఁడని చెప్పరాదు. ఈశ్వరుఁడు తాను భ్రాంతిచెందక లీలచేతను బరులను మోహింపఁజేయుచున్నాఁడనియుఁ జెప్పరాదు. నీమతమందు జీవేశ్వరుల కైక్య మంగీకరింపఁబడుటచేతను నీశ్వరునికి భ్రాంతిలేదని చెప్పుటచేతను, భ్రాంత్యాదులవలనఁ దనకంటె నితరులను జూచుటయె యసంభవము. ఒకవేళఁ బరదర్శనము సంభవించినను నతని కాజీవు లతనికంటె భిన్నులు కారనెడి జ్ఞానముకలిగియుండును. మఱియు నీమతమందు నిర్విశేష సన్మాత్రుఁడగు పరబ్రహ్మ నిర్విశేషుఁడుగాన లీల సంభవింపనే సంభవింపదు. ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడును సంసారరహితుఁడును, జీవులను దనకంటె నన్యులనుగాఁ జూడనివాఁడునుగాన నతనికి జననమరణాదులను గలిగించు నరకపతనాదివ్యాపారంబు లీలామాత్రము కాదు కావున నీశ్లోకముచే జీవునికి సంసారప్రకారమును జెప్పరాదు. మఱేమి చెప్పవలయు ననగా సకలహేయంబులను నిరసించు ననంతకల్యాణగుణంబుల కాకరుఁడయిన

అది సత్త్వాదిగుణ ప్రచురమయినది. అట్టి మాయను నిరతిశయ సూక్ష్ముఁడగుటవలన సర్వాంతర్వ్యాపకుఁడగు ప్రత్యగాత్మ చూచెను. ఓయీ! యథేచ్ఛముగాఁ గలిగిన భగవంతునిసంకల్పముచే జీవునకుఁ బ్రకృతిసంబంధము కలిగినఁ గలుగవచ్చును. కాని కర్తృత్వాదిక మెట్లు వచ్చినదని యందువేని చెప్పెద. విను. దేవమనుష్యాదిరూపములచే బహువిధములవారయినను బ్రకృతిపరిణామత్వమునుబట్టి యేకరూపులయిన ప్రజలను సత్త్వాదిగుణములచేఁ గార్యదశయందు సృజించుచున్న ప్రకృతిని బొడగాంచి జ్ఞానమును గప్పిపుచ్చునదగు దానియందుఁ దా ననేకబుద్ధిని గలిగించుకొనెను. ఇట్లు ప్రకృతిచేఁ దనస్వరూపము కప్పఁబడియుంటచే జీవుఁడు స్వస్వరూపమును మఱచి ప్రకృతిగుణము లొనర్చుచున్న కర్మముల కర్తృత్వమును దనయం దారోపించుకొనుచున్నాఁడు. కావున జీవునకు సాంసారికప్రవృత్తులందుఁ గర్తృత్వము గుణత్రయము వలనఁ గలిగినదేకాని స్వరూపప్రయుక్తమయినదికాదు. వాస్తవముగా జీవుఁడు సంసారబంధములేనివాఁడు. అతనికి గమనాగమనాదులయిన సాంసారికప్రవృత్తులాదుఁ గర్తృత్వము లేదు. అతఁడు కర్మవశుఁడుకాఁడు. అతఁడు జ్ఞానగుణము కలవాఁడు. మఱియు జ్ఞానస్వరూపుఁడు. ఓతల్లీ! కావున జీవస్వరూపము జ్ఞానగుణముకలిగి జ్ఞానస్వరూపమయి పాపనివృత్తిచేసికొనుట మొదలగు నెనిమిదిగుణములు కలిగి ప్రకృతిరహితమైయున్నదియే యని

---

యీశ్వరునకు లీలాసాధనమై తన్నియామ్యమైయున్న మాయచే, వాస్తవముగా నీశ్వరునకు లీలారూపమయిన జగత్సృష్ట్యాదివ్యాపారమును నిర్వర్తించునిమిత్తమై యతనికి శరీరభూతుఁడయి తద్విలక్షణుఁడయియున్న ప్రత్యగాత్మకు మాయాసంబంధ మీశ్లోకముచేఁ జెప్పఁబడినదని గ్రహింపవలయును.

గ్రహింపుము. * ఓజననీ! భోగసాధనభూతములయినక్రియల క

* ఇచటఁ దెలియఁదగినయంశ మేమనఁగా! మొదట జీవాత్మలు సంకు చితముకాక యపరిచ్ఛిన్నమై నిర్మలమైయున్న జ్ఞానమే స్వరూపముగాఁ గలవా రయినను గర్మరూపయగు నవిద్యచే నావృతులై యుందురుకాన యాయాకర్మముల కనురూపమగు జ్ఞానసంకోచమును బొందుచు, బ్రహ్మమొదలు స్తంబపర్యంతము గల వివిధవిచిత్రదేహంబుల బ్రవేశించి యాయాదేహముల కను గుణమగు జ్ఞానప్రసారము కలవారయి, యాయాదేహంబులం దభిమానంబుగలిగి, వాని కుచితములగు కర్మముల నాచరించుచు, వాని కుచితములగు సుఖదుఃఖం బుల ననుభవించుచు, సంసారప్రవాహంబును బొందుచున్నారు. ఓయీ! ఆత్మ, జ్ఞానస్వరూపుఁడనియు స్వయంప్రకాశుఁడనియుఁ జెప్పియున్నావుకదా! అట్టి జీవునికి దేవాదిస్వరూపములం దాత్మాభిమాన మున్నదని చెప్పినచో స్వరూపప్రకా శమునకు దిరోధాన మవశ్యము నంగీకరింపవలసియున్నది. అట్లు స్వరూపప్రకా శమునకుఁ దిరోధానము చెప్పనిచో నాత్మయందు మఱియొకయాకారము నారో పించుకొనుటయే యసంగతము కావలసివచ్చును. అట్లు స్వరూపప్రకాశతిరో ధాన మంగీకరించినచో స్వరూపనాశప్రసంగము కలుగుచున్నది. కాన యిది యెట్లు సరిపడునని యందువేని చెప్పెదవినుము. మా మతమం దాత్మ జ్ఞానస్వరూపుఁ డనియు, జ్ఞానగుణము గలవాఁడనియుఁగూడ నొప్పియున్నారము. ఆత్మ ధర్మి భూత జ్ఞానమగుచున్నాఁడు; మఱియు ధర్మభూతజ్ఞానము కలవాఁడు నగుచు న్నాఁడు. కావున ధర్మభూతజ్ఞానమునకే తిరోధాన మంగీకరించెదము కాని స్వరూపజ్ఞానమున కంగీకరింపము. పటమునందలి యొఱుపురంగు నశించినను బటము నశింపనివిధమున ధర్మభూతజ్ఞానము కప్పఁబడినంతమాత్రమున స్వరూపనాశన ముకలుగదు. ఓయీ! ధర్మభూతజ్ఞానమునకైనను దిరోధాన మవశ్య మంగీకరిం తురుకదా? ఇఁకఁ దిరోధానమనఁగాఁ గర్మరూపమగు నవిద్యచేఁ బ్రకాశో త్పత్తికిఁ బ్రతిబంధమనియర్థము చెప్పదురా? లేక స్వతస్సిద్ధముగానున్న ప్రకా శము నివర్తించుటయే యనియర్థము చెప్పదురా? పైని జెప్పినపక్షములలో దేని నంగీకరించినను నిత్యమని యంగీకరించినధర్మభూతజ్ఞానము నశింపవలసి

న్నింటికిని బురుషుని కధిష్ఠానభూతమయి శరీరాకారముగాఁ బరి

వచ్చుచున్నది యని చెప్పవలనుపడదు. ఇచటఁ దిరోధానపదమునకు మీరు చె ప్పిన ట్లర్థము చెప్పము. ఆత్మకు ధర్మభూతమగుజ్ఞానము స్వాభావిక మైనదయి నను గర్మసంబంధముచే సంకోచమును వికాసంబును బొందుచున్నదని చెప్పెద ము. ఇప్పుడు జ్ఞానముయొక్క సంకోచవికాసములు కర్మాధీనము లగుటంజేసియు, నేను దేవుఁడను, నేను మనుష్యుఁడను ననెడిభ్రమ యాత్మ నపేక్షించియుం డుటంజేసియు, స్వయంప్రకాశరూపమగు ధర్మిస్వరూప మె భ్రమ కధిష్ఠానమై యొప్పుచుండును. ఆత్మ, శుక్త్యాదులవలె జడపదార్థముకాదు. కనుక నిందువిష యమయి మఱియొకజ్ఞానము నపేక్షింప నవసరములేదు. కాని భ్రమకు విరోధు లై యాత్మయందుండు నిత్యత్వాదిధర్మములుమాత్రము జ్ఞానాంతరవేద్యములే. తాదృశ నిత్యత్వాదిధర్మములను దెలుపునట్టి జ్ఞానమునకుఁ దిరోధానము గలిగిన చో నాత్మయందు దేవాదిభ్రాంతి కలుగుచుండును. జ్ఞానతిరోధానములేనిచో స్వస్వరూపజ్ఞానము కలుగుచుండును. ఇట జ్ఞానతిరోధానమనఁగా ధర్మభూత జ్ఞానమునకు ధర్మమగు ప్రసరాఖ్యరూపప్రకాశముయొక్క నివృత్తి యని యర్థ ము. ధర్మభూతజ్ఞానమందుండు ప్రసారాఖ్యధర్మము నివర్తించుటయే సంకో చమనియు, దాదృశ ప్రసారాఖ్య ధర్మముండుటయే వికాసమనియు నర్థముచె ప్పెదము. ఆత్మయందుండు నిత్యత్వాది ధర్మములను దెలుపునట్టి జ్ఞానముయొ క్క ప్రసారాభావము సంకోచమనియుఁ దాదృశ జ్ఞానప్రసరమే వికాసమని యు నంగీకరించుటచే, నాప్రసరము లేనప్పుడు దేవాదిభ్రమ కలుగుచుండు ననియు, నాప్రసరమున్నప్పుడు స్వరూపజ్ఞానము కలుగుచుండుననియు, జ్ఞానప్రస రమునకే తిరోధాన మంగీకరించుటచే ధర్మిభూతజ్ఞానము ధర్మభూతజ్ఞానము నిత్యమనియుఁ దెల్లమగుచున్నది. కావున మామతమందు స్వరూపనాశప్రసక్తి లేదు. జ్ఞానము నిత్యమనుటయు స్థిరపడినది. ఇట్లు ధర్మిభూతజ్ఞానమును, ధర్మ భూతజ్ఞానము నొప్పి ధర్మభూతజ్ఞానమునకు ధర్మమగు ప్రసరమునకుఁ దిరోధాన మంగీకరింపక, కేవలము జ్ఞానస్వరూపమే యాత్మ యనెడి యద్వైతులమతమందు జ్ఞానస్వరూపమునకుఁ దిరోధాన మంగీకరించినప్పుడు స్వరూపనాశప్రసక్తి గలు

ణమించియున్న ప్రకృతియే కారణమని చెప్పుదురు. శరీరము నధి

---

గికమానదు. ఓయీ! ధర్మిభూతజ్ఞానమనియు, ధర్మభూతజ్ఞానమనియు నాఁబడు జ్ఞానద్వయము నాశ్రయించి ధర్మభూతజ్ఞానమునకు ధర్మిభూతజ్ఞాన మాశ్రయమగుచున్నదని చెప్పుచున్నారు. జ్ఞానము జ్ఞానాంతరము నాశ్రయించియుండుట యెట్టిటను జూడలేదే యని యడుగవచ్చును. జ్ఞానము జ్ఞానాంతరము నాశ్రయింపదనుట యనుభవసిద్ధమా, లేక శ్రుతిసిద్ధమా? అనుభవసిద్ధమన వీలులేదు. జ్ఞాన మెప్పుడు నొకానొకదాని ధర్మమైనట్లు తోఁచుచున్నది కాని స్వతంత్రవస్తువైనట్లు గానరాదు. స్వతంత్రవస్తువు కానప్పుడది దేనినైన నాశ్రయింపవలసియుండును మఱియు జ్ఞాన మాత్మకంటె నితరపదార్థముల నాశ్రయించియుండదు. మామతమందు ధర్మభూతజ్ఞానమొకటి ప్రత్యేకముగా నంగీకరించియున్నాము. కాన ధర్మభూతజ్ఞానమునకు ధర్మిభూతజ్ఞాన మాశ్రయమగుచున్నదని చెప్ప వీలగుచున్నది. కాని ధర్మభూతజ్ఞానము నంగీకరింపక మీమతము దాత్మ జ్ఞానస్వరూపుఁడని మాత్రము స్వీకరించుటచే నాత్మకూడ నొకదానికి ధర్మమయి యుండవలసివచ్చును కావున మేము చెప్పినట్లు ధర్మభూతజ్ఞానమును గూడ నంగీకరింపవలయును. లేక శ్రుతిసిద్ధమని యందురేని శ్రుతులు జ్ఞానము జ్ఞానాంతరము నాశ్రయింపవచ్చుననియే చెప్పుచున్నవి కాని యట్లుండరాదని చెప్పలేదు. శ్రు॥ "కర్తా బోద్ధా విజ్ఞానాత్మా" అనఁగా విజ్ఞానస్వరూపుఁడగు నాత్మ కర్త్రాశ్రయుఁడును బోధాశ్రయుఁడు నగుచున్నాఁడని యర్థము. ఇట జ్ఞానస్వరూపుఁడగు నాత్మ జ్ఞానాశ్రయుఁ డగుచున్నట్లు చెప్పఁబడుచున్నది కాన జ్ఞానము జ్ఞానాంతరము నాశ్రయింపవచ్చును. అన్నివిధముల నాలోచింప ధర్మిభూతజ్ఞానము ధర్మభూతజ్ఞానమును దప్పక యంగీకరింప వలయును. ఓయీ! "ప్రకృతేః పుమాన్। కర్మసుక్రియమాణేషు గుణైరాత్మని మన్యతే" అని చెప్పఁబడియున్నది. అనఁగాఁ బ్రకృతిగుణములగు సత్త్వాదిగుణములచేఁ గర్మములు జేయఁబడుచుండఁగా బురుషుఁడు గుణములకర్తృత్వమును దనయం దారోపించుకొనుచున్నాఁడు. మఱియు నధ్యాత్మశాస్త్రములం దాత్మ కర్త కాఁడనియుఁ బ్రకృతిగుణములే కర్తలనియుఁ జెప్పఁబడుచున్నది. కఠవల్లియందు. శ్రు॥ "నజాయతే నమ్రియతే"

ష్టింపఁ జేసికొను యత్నమునందుమాత్రమే కర్తృత్వమును, మ

---

అని చెప్పఁబడియున్నది. అనఁగా నాత్మపుట్టునాఁడుకాఁడు. చచ్చువాఁడు కాఁడు. అనియర్థము. ఈచెప్పుటచే జననజరామరణాదిధర్మములు ప్రకృతివే కాని యాత్మవికావని స్పష్టమగుచున్నది. ఇంతియకాక హననాదిక్రియలందుఁ గూడ నాత్మకుఁ గర్తృత్వము నిషేధింపఁబడుచున్నది. హననాదిక్రియలయం దాత్మకుఁ గర్తృత్వము లేదన్నందులకు బ్రమాణము. "హంతా చేన్మన్యతే హంతుం హతశ్చేన్మన్యతేహతం। ఉభౌ తౌ నవిజానీతో నాయంహంతి నహన్యతే" ఇందువలన నాత్మను జచ్చినవానిగాఁ దలంచినవార లాత్మపదార్థము నెఱుంగరనుతాత్పర్యము తెల్లమగుచున్నది. ఇదియే భగవద్గీతయందుఁగూడ స్పష్టముగాఁ జెప్పఁబడినది ఎట్లన- శ్లో॥ "ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణినిత్యశః।అహంకారవిమూఢాత్మా కర్తాహమితిమన్యతే॥ నాన్యం గుణేభ్యః కర్తారం యదాద్రష్టానుపశ్యతి । కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే । పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే" అనఁగాఁ బ్రకృతిసంబంధులగు సత్త్వాదిగుణము లెల్లప్పుడును గర్మంబుల నొనరించుచుండఁగా నహంకారముచే వ్యామోహము చెందినవాఁడయి యాత్మ తానే కర్తయని తలంచుచున్నాఁడు. కానిగుణములకంటె భిన్నునిఁ గర్తగాఁదలఁపరాదు. సమస్తక్రియలకును గారణమును గర్తయుఁ బ్రకృతియనియే యెఱుంగవలయును. పురుషుఁడు సుఖదుఃఖంబుల ననుభవించుటకే హేతువగుచున్నాఁడని తాత్పర్యము. ఈచెప్పుటంబట్టియుఁ బ్రకృతికే కర్తృత్వమున్నట్లును బురుషుఁడే భోక్తయగుచున్నట్లును దెల్లమగుచున్నది. కాని యీచెప్పినదానికిని "కర్తాశాస్త్రార్థవత్త్వాత్" అను నధికరణమునకు విరోధము సంభవించుచున్నది. కర్త్రధికరణమునం దాత్మయె కర్తయనియు గుణములు కర్తకావనియుఁ జెప్పఁబడినది. అట్లుచెప్పిననే కాని శాస్త్రములు చరితార్థములుకావు. ఎట్లనఁగా "యజేతస్వర్గకామః" స్వర్గము నపేక్షించువాఁడు యజ్ఞముచేయవలెనని యర్థము. "ముముక్షుర్బ్రహ్మోపాసీత" ముక్తి నపేక్షించువాఁడు పరబ్రహ్మ నుపాసింపవలయునని యర్థము. ఇట్టివిధివాక్యములందు యజ్ఞాదిక్రియలయందును వానివలన సంప్రాప్తంబగు ఫలం

ఱియుఁ దన కధిష్ఠానమయిన శరీరముగాఁ బరిణమించిన ప్రకృతి

బుల ననుభవించుటయందును నాత్మయు కర్తగా నంగీకరింపఁబడుచున్నది. మఱియు నెవఁడు యజ్ఞము కావించునో వాఁడే స్వర్గఫల మనుభవింపవలయును. ఎవఁడు పరబ్రహ్మను నుపాసించునో వాఁడే ముక్తి చెందవలయును గాని యొకఁడు చేసినకర్మముల ఫలమును మఱియొకఁ డనుభవించుట యనుభవవిరుద్ధము. విధినిషేధంబులం దాత్మను కర్తగా నంగీకరించిననే చరితార్థము లగును గాని లేనిచో వ్యర్థములే. మఱియు "శాస్త్రఫలం ప్రయోక్తరి" అనఁగా శాస్త్రిదుల లెస్సగా నాచరించినవానికే తత్ఫలము చెందవలయునని చెప్పఁబడుచున్నది. కొన్నింటియం దాత్మ కర్త కాఁడనియు, గుణములే కర్తలనియుఁ జెప్పఁబడుచున్నది. మఱికొన్నింటియం దాత్మయే కర్తయని చెప్పఁబడుచున్నదికదా? ఈవిరోధము నెట్లు పరిహరింపవలయునని పూర్వపక్షము. దీనికి సిద్ధాంత మేమనఁగా కర్త్రధికరణమునం దాత్మకు శరీరమున కధిష్ఠాతయై యుండుటలోనే కర్తృత్వ మంగీకరింపఁబడుచున్నది. "హంతా చే న్మన్యతే" "నజాయతే మ్రియతే" ఇత్యాదిస్థలంబులం దాత్మ నిత్యుఁడు కనుక నతనికి జననమరణాదులు లేవనుటయు చెప్పఁబడుచున్నది. "ప్రకృతేః క్రియమాణాని" అను భగవద్గీతయందు జీవునికి సాంసారికప్రవృత్తులయందుఁ గర్తృత్వ మంగీకరించుచున్నను, నది సత్త్వరజస్తమోగుణములసంపర్కమువలనఁ గలిగినది కాని స్వరూపప్రయుక్తమైనది కాదు. ఈయంశము గీతలలోనె మఱియొకస్థలమందు స్పష్టముగఁ జెప్పఁబడుచున్నది. "కారణం గుణసంగోస్య సదసద్యోనిజన్మసు" అనఁగా సాంసారికప్రవృత్తులందు జీవునికిఁ గలుగుచున్న కర్తృత్వము సత్త్వాదిగుణకృతమయినది. కావున నీచెప్పుటవలన ఫలితార్థ మేమనఁగా, జీవునికిఁ దన కధిష్ఠానభూతమగు శరీరమునధిష్ఠించుటలోమాత్రమే కర్తృత్వము గలుగుచున్నది. సాంసారికవ్యాపారములం దితనికి గుణసంబంధంబువలననే కర్తృత్వము సంభవించుచున్నది. కాని స్వరూపప్రయుక్తమయినది కాదు. కావున వెనుకఁ జూపఁబడిన యధికరణవిరోధము తొలంగుచున్నది. ఇట్లు సాంసారిక ప్రవృత్తులయందుఁ గర్తృత్వము ప్రకృతి సంబంధమువల

యొనర్చుచుండిన కర్మములకు ఫలరూపములగు సుఖదుఃఖంబుల భోక్తృత్వమ్మును బురుషునికిఁ గలుగుచున్నవి. అని చెప్పుచున్నకపిలాచార్యుని వాక్యంబులు విని దేవహూతి యిట్లనియె. "ఓపురుషోత్తమా ! కార్యావస్థకుఁ బూర్వమందు జగత్కారణములయి నామరూపవిభాగమునకుఁ దగనంత సూక్ష్మదశను బొందినవగుటచే భగవంతునికి శరీరమైయున్న ప్రకృతిపురుషుల కార్యభేదములను దెలియఁజేయుము. మఱియుఁ గారణభూతులయిన పిత్రాదులును, గార్యభూతులయిన పుత్రాదులును బ్రకృతిపురుషాత్మకు లయినవారే కావున వారిలక్షణంబులును దెలుపవలయును." అని యడుగ దేవహూతికిఁ గపిలుం డిట్లనియె. 'జననీ! ప్రకృతిపురుషుల కార్యావస్థలను దెలుపుటకుఁ బూర్వము ప్రకృతి కారణ కార్యావస్థలను సంగ్రహముగాఁ దెలిపెద నాలింపుము. కారణావస్థయందుఁ బృథివ్యాది విశేషములు లేక కావుననే నామరూపములవిభజింప నసర్హమయి సత్త్వరజస్తమోగుణరూపమయి యుండును. అది కారణావస్థయందుండు ప్రకృతిస్వరూపమని తెలియుము. ఆ ప్రకృతియే కార్యావస్థయందుఁ బృథివ్యాదివిశేషములతోఁ గూడినదయి మహత్తత్త్వము మొదలు పృథివివఱకుఁ గల కారణములుగాను బ్రహ్మమొదలు తృణమువఱకుఁ గల కార్యములుగాను బరిణమించుచున్నది. జ్ఞానకర్మేంద్రియంబులును, బంచభూత

---

ననే కలిగినది కాని స్వరూపప్రయుక్తమయినది కాదన్న యర్థమునే తెలియపఱుచుచు శరీరాధిష్ఠాతృరూపకర్తృత్వము కలవాఁడు కావుననే, యాత్మ సాంసారికప్రవృత్తులందుఁగూడఁ దత్ప్రవృత్తికి ఫలములగు సుఖదుఃఖంబుల ననుభవించుచున్నాఁ డనునర్థమును దెలియఁజేయుచున్నాఁడు.

ములును, బంచతన్మాత్రములును, నంతఃకరణచతుష్టయమును గలిసి చతుర్వింశతితత్త్వము లయ్యె. ఈతత్త్వసమూహము ప్రకృతికార్యసమూహమని చెప్పుదురు. మఱియు సత్త్వాదిగుణరూపమగు ప్రకృతికిఁ గార్యభూతములగు పృథివ్యాదులే శరీరముగాఁ గలుగు పరబ్రహ్మయవస్థావిశేషమే యీతత్త్వసమూహమని యెఱుంగుము. కాల మిరువదియైదవ తత్త్వమని కొందఱందురు. కాని మఱికొందఱు కాలమనఁగాఁ బ్రపంచకముయొక్క సృష్టిస్థితిలయములు కావించుచున్న పరమపురుషునిసామర్థ్యమే కాని తత్త్వములలోని దొకటి కాదని పల్కిరి. కాని కాలమును గుఱించి నే నట్లు తలంపను. అనాత్మయయిన దేహాదులయందు నాత్మయనెడి యభిమానముచే మోహితుండై స్వస్వరూపమును మఱచియున్న జీవుఁడును, నామరూపాదివిశేషములేనిదయి సంహారదశయందు సత్త్వరజస్తమోగుణముల సామ్యావస్థ కలదయియున్న ప్రకృతియు, ప్రపంచరూపముగాఁ బరిణమించుటయనెడి వ్యాపారము లేభగవంతునివలనఁ గలుగుచున్నవియో యాభగవంతుఁడే కాలస్వరూపుఁడని యెఱుంగుము. నీకుఁ బ్రకృతిపురుషకాలముల స్వరూపమును జెప్పితిని. అందుఁ బ్రకృతి పృథివ్యాదిభూతరూపము నొందినది. కావున నది యెల్లరకుఁ దెలియవచ్చుచున్నది. కాని పురుషకాలములకుఁ బ్రకృతికివలె స్థూలరూపపరిమాణము లేదు. కావున వానిని రెండింటిని యుక్తిచేతఁ గనుఁగొనవలయును. కాని ప్రత్యక్షముగాఁ గానలేము. మఱియుఁ బృథివ్యాదులవలనఁ గలిగిన సమస్తభూతముల లోపలఁ బురుషరూపముతోఁ బ్రవేశించి రాగద్వేషసుఖదుఃఖాదుల కాశ్రయుఁడై యెవఁడు వెలుంగుచున్నాఁడో, యట్టి

భూతజాతము బహిర్భాగములందుఁ గాలరూపము గలవాఁడయి యెవఁడు ప్రకాశించుచున్నాఁడో, అట్టివాఁడు భగవంతుండే. కావునఁ బురుషకాలములు భగవత్స్వరూపములని చెప్పవచ్చును. ఓజననీ! నీ కిప్పుడు భగవంతుఁడు ప్రకృతిపురుషరూపశరీరము కలవాఁడని చెప్పితిని. ఇంక సృష్టిక్రమమును జెప్పెదను. అవధరింపుము. ఆపరమపురుషుఁడు దైవసంకల్పమువలన గుణములు వ్యత్యస్తమైనట్టి ప్రకృతియందు మహాదాది ప్రపంచమును సృజింపఁదగినసామర్థ్యము నుంచెను. అంత నాప్రకృతి కాంతిచేఁ బూర్ణమైన మహత్తత్త్వమును బుట్టించినది. జగత్కారణుఁడును నిర్వికారుఁడునగు భగవంతుఁడు ప్రళయకాలమందుఁ దనయం దిమిడియున్న సమస్తప్రపంచమును వెల్లడిపఱుపఁ దలంపుగలవాఁడయి యట్లుచేయుచు జీవాత్మలకు జ్ఞానసంకోచము కలిగించుతమోగుణమును దిరస్కరించెను. అట్లు తమోగుణమును దిరస్కరించుటచే సత్త్వగుణంబుగలదయి, కావుననే స్వచ్ఛమై భగవంతునిఁ బొందఁదగినదై యేది వాసుదేవనామముగలవ్యూహముచే నధిష్ఠితమగుచున్నదో, * యేది యంతఃకరణభేదమగు చిత్తమున కనుగ్రాహక మగుచున్నదో యట్టి యవ్యక్తమే మహత్తత్త్వముగాఁ బరిణమించినది. ఓయీ!

---

*ఇందులకు మూలము "వాసుదేవాఖ్యంచిత్తం" అనియున్నది. ఇటఁ జిత్తానుగ్రాహకుఁడును, జిత్తమున కధిష్ఠాతయు నగువాసుదేవునకును, వాసుదేవున కనుగ్రాహ్యమును నధిష్ఠేయమును నగుచిత్తమునకు నభేదమనుబుద్ధితో నిది చెప్పఁబడినది. అంతియకాని సాత్త్వికాహంకారమునకుఁ గార్యమయిన యంతఃకరణభేదమగుచిత్తము వాసుదేవునిచే నధిష్ఠితమైయున్నదని, మహదాత్మకమయి యున్నదనికాని, దీనిచేఁ జెప్పుటలేదు. "చిత్తంచైత్యస్తతోభవ" అని ముందుచిత్తము

అవ్యక్తముచే నంతఃకరణ మెప్పు డనుగృహీతమై చిత్తమని చెప్పఁబడుచున్నదని యడుగుదువేని వినుము. జలము స్వభావసిద్ధమైన స్వచ్ఛత్వముకలిగి నురుఁగు, కెరటములు మొదలగునవి లేక ప్రతిబింబగ్రహణమునకు సమర్థమయినట్లు లెప్పుడు మనస్సు వికారాదులు లేక, కావుననే శాంతమయి భగవద్రూపమును గ్రహింపఁదగినంత స్వచ్ఛతకలిగియుండునో యప్పుడే మన స్సవ్యక్తమున కనుగృహీతమగుచున్నదని యెఱుంగుము. భగవంతుని సంకల్పజ్ఞానముచేఁ జోదితమయిన మహత్తత్త్వము వికారము నొందుటవలన నహంకార ముత్పన్నమయ్యె. అది రాజసమనియుఁ దామస

---

క్షేత్రజ్ఞుని కధిష్ఠానమగునని చెప్పఁబోవుటవలన వాసుదేవాధిష్ఠితత్త్వమని చెప్పరాదు. మఱియు మహత్తత్త్వమువలన జనించిన యహంకారమునకుఁ గార్యమయిన చిత్తము మహత్తత్త్వమైయుండుటకూడ నసంభవము. కారణము కార్యమందుండునేకాని కార్యము కారణముండదుకదా? ఒకవేళఁ గార్యము కారణమందుండునని చెప్పుటయు సంహారదశయందుఁగాని సంభవింప నేరదు. ఇది సృష్టిప్రకరణము. దాని నెట్లంగీకరింపవలనుపడును? "మహదాత్మక" మని మూలమునఁ జెప్పుటచేత నంతఃకరణభేదమగు చిత్తము మహత్తత్త్వమున కనుగ్రాహ్యమనియు నూహింప వలనుపడదు. "మహాన్ వై బుద్ధిలక్షణ" యని చెప్పుటచే మహత్తత్త్వము బుద్ధికే యనుగ్రాహ్యముకాని చిత్తమునకుఁ గాదు. చిత్తము, బుద్ధియు, నంతఃకరణభేదములే కాన చిత్తశబ్దముచే బుద్ధియని వివక్షచేసినను వలనుపడదు. "బుద్ధేర్గిరాంపతి" యని చెప్పఁబోవుటచే బుద్ధిగీష్పతి కధిష్ఠానము కాని వాసుదేవున కధిష్ఠానమైయుండుట యనుచితము. కావున నిటఁ దమోగుణరహితమై సత్త్వగుణము కలదయిన యవ్యక్తమే వాసుదేవునిచే నధిష్ఠితమయి మహత్తత్త్వముగాఁ బరిణమించినదని యర్థము స్వీకరింపవలయు. మఱియు నవ్యక్తమున కధిష్ఠాతయగు వాసుదేవుఁడే మహత్తత్త్వమునకుఁగూడ నధిష్ఠాత యని చెప్పుదురు.

మనియు, సాత్వికమనియుఁ ద్రివిధంబయి రజోగుణోద్రేకము కలిగి యుద్భవించెను. ఆత్రివిధంబగు నహంకారంబువలననే మనస్సు, నింద్రియదశకము, పృథివ్యాదిభూతములును, గంధాది తన్మాత్రలును నుద్భవించె. వేయిపడగలు గలయనంతుఁడు సంకర్షణుఁడనుపేరు కలవాఁడయి యీయహంకారము నధిష్ఠించె. అందువలన నది * సంకర్షణవ్యూహమని పిలువఁబడుచు భూతేంద్రియాదులకుఁ గారణమయినదయి యున్నదని చెప్పుదురు. ఓజననీ! ఇంక నహంకారలక్షణంబులను, తనకుఁ గార్యభూతమగు నంతఃకరణ భేదాహంకారమున కనుగ్రాహకత్వమును, దెలిపెదను. వినుము. కర్తృత్వము, కరణత్వము, కార్యత్వము, నీమూఁడునుగాని, ప్రకాశకత్వము, విక్షిప్తత్వము, మూఢత్వము, నీమూఁడునుగాని యహంకారమునకు లక్షణంబులగు. వికారమును బొందిన సాత్వికాహంకారమువలన మనస్తత్త్వ ముదయించె. ఆమనస్సు దేహోత్పాదు లొక్కటియే యనెడిసంకల్పమును, ననేకవిధములగాఁ జింతించుట యనెడి వికల్పమును గలిగి వర్తించుచుండును. † మనస్తత్త్వమునకుఁ గారణమగు సాత్వికాహం

* ఇది భగవంతుని నాలుగువ్యూహములలోను నొకటి. అది సంకర్షణునిచే నధిష్ఠిత మగుచుండును.

† ఇందులకు మూలము. "వైకారికాద్వికుర్వాణా న్మనస్తత్వమజాయత। యత్సంకల్పవికల్పాభ్యాం వర్తతే కామసంభవః" ఇట సామాన్యముగా సందర్భమునుబట్టి మనమున కధిష్ఠాత ప్రద్యుమ్నుఁడని యర్థము వచ్చుచున్నది. కాని యట్లు చెప్పరాదు. "మనస శ్చంద్రమాజాత" అని యుండుటచే మనస్సున కధిష్ఠాత చంద్రనుఁడని తెల్లమగుచున్నది. కాన మనఃకారణమగు సాత్వికాహంకారమునకే ప్రద్యుమ్నుఁ డధిష్ఠాత యని తెలియఁదగినది. మఱియు మనస్సు సాత్వికాహంకారజన్యమైనను "లోభః ప్రవృత్తిరారంభః కర్మణామశమఃస్పృహా।

కారమును ప్రద్యుమ్నుఁ డధిష్ఠించియుండును. కాన యది ప్రద్యుమ్నవ్యూహమని చెప్పఁబడుచున్నది. * ఇంద్రియముల కధిష్ఠాతయు, శరత్కాలమందుండు నల్లఁగలువలవలె శ్యామలకాంతి గలవాఁడును, ఋషులచే లెస్సగా నారాధనీయుఁడు నగు ననిరుద్ధుఁడు తైజసాహంకారము నధిష్ఠించియుండును. కావున నది యనిరుద్ధవ్యూహమని పరఁగుచున్నది. ఓయీ ! తైజసాహంకారమువలన నింద్రియములకుఁ గలుగున నుగ్రహ మెట్టిది? యని యందువేని చెప్పెద. వికారమునొందిన తైజసాహంకారమువలన జ్ఞానస్వరూపమును గలిగించు సామర్థ్య ముదయించినది. అదియే యింద్రియములకుఁ జేసిన యనుగ్రహము. సామాన్యముగా ద్రవ్యమని తెలిసికొనెడి జ్ఞానము, వికల్పజ్ఞానము, శంఖమందున్న తెల్లఁదనమును బచ్చఁదనమునుగా భావించినట్లు ధర్మియందున్నధర్మమును ధర్మాంతరమని తలపింపఁజేయు నన్యథాజ్ఞానమును, ముత్తెపుఁజిప్పముక్కను జూచి రజతమని యనుకొన్నట్లు లోకధర్మిని మఱియొకధర్మినిగాఁ దలంపఁజేయు విపరీతజ్ఞానమును, ప్రమాణరూపమగు జ్ఞానము, ననుభూతవస్తువులగుఱించి కలుగుజ్ఞాన

రజస్యైతాని'' యనియుండుటచే స్పృహాదులు రజఃకార్యము లగుచున్నను, ప్రవర్తనాత్మకమగు క్రియాశక్తితోఁ గూడినదగుటవలనను రాజసాహంకారమునే దాని కనుగ్రాహకముగా గ్రహింపవలయు. ఇట్లె తామసాహంకారకార్యములగు నాకాశాదులకుఁగూడఁ గార్యజననము విషయమై రాజసాహంకారమే యనుగ్రాహకమని యెఱుంగవలయును.

* ఇట ననిరుద్ధుఁ డింద్రియములకుఁ బ్రత్యక్షముగా నధిష్ఠాతకాకపోయినను నింద్రియముల! కనుగ్రాహకమగు తైజసాహంకారమున కధిష్ఠాతయగుచున్నాఁడు కావున నింద్రియములకుఁగూడ నధిష్ఠాత కావచ్చును.

ము, నిద్ర, మొదలగునవి బుద్ధికి వృత్తులవలనఁ గలిగినలక్షణంబులని యెఱుంగుము. తైజసాహంకారజన్యమగు బుద్ధితత్త్వమింద్రియానుగ్రాహక మగుటచేఁ దైజసాహంకారము గూడ నింద్రియానుగ్రాహక మనుట స్పష్టమగుచున్నది. *కర్మేంద్రియంబులు జ్ఞానేంద్రియంబులు నాఁబడు నుభయవిధంబులును రాజసాహంకారానుగృహీత మగు సాత్త్వికాహంకారంబువలనఁ గలిగినవేయని తెలిసికొనవలయు. అందుఁ గర్మేంద్రియగణమునకు గమనాగమనాదిక్రియారూప మగుశక్తియు జ్ఞానేంద్రియవర్గమునకుఁ బ్రకాశనరూపశక్తియుఁ గలవు. ఇంక భూతాదిప్రపంచసృష్టిని దెలిపెద వినుము. భగవద్వీర్యమువలనఁ బ్రేరితంబయి వికారము చెందియున్న తామసాహంకారంబువలన శబ్దతన్మాత్ర ముదయించెను. దానివలన నాకాశంబు గలిగె. దానిని గ్రహించునది కర్ణేంద్రియము. అందు శబ్దము వేదములవలనఁ దెలియఁబడు భగవంతునికి లక్షణంబును, సర్థాశ్రయంబునయి

---

*ఇందులకు మూలము. "తైజసానీంద్రియాణ్యేవ" అనఁగా నుభయవిధేంద్రియంబులును దైజసాహంకారమువలననే జనించినవని యర్థము వచ్చుచున్నది. ఓయీ! పూర్వము తైజసాహంకారము ఇంద్రియంబుల కనుగ్రాహకమగుచున్నదని చెప్పఁబడినది. ఇప్పుడింద్రియములన్నియుఁ దైజసంబువలననే జన్మించినవని చెప్పుచున్నావదియెట్లు సరిపడును. అనుశంక నివారించుటకయి "తైజసానీన్ద్రియాణి" అనుచోట తైజసాని యనుపదమునకు రాజసాహంకారానుగృహీతమగు సాత్త్వికాహంకారమువలనఁ గలిగినవని యర్థము చెప్పవలెను. ఇట్లు చెప్పినచోఁ బూర్వము తైజస మింద్రియములకు జ్ఞానస్వరూపజననసామర్థ్యము కలిగించుటలో ననుగ్రహము చూపుచున్నది. ఇప్పుడు ఇంద్రియముల గలిగించుటలో సాత్త్వికాహంకారమునకుఁ దోడగుచున్నదనియుఁ స్పష్టమగుచున్నది కాన పూర్వాపరవిరోధములేదు.

శ్రోతకు జ్ఞానజనకంబయ్యె. మఱియు నాకాశంబునకు శబ్దతన్మాత్ర గలిగియుండుట లక్షణంబని పండితులు పలుకుదురు. ఆయాకాశంబు సమస్తభూతంబులకును వెలుపలను, లోపలను, నవకాశమిచ్చుచు, నాత్మకుఁ బ్రాణంబులకు నింద్రియంబులకు నాధారంబయి యుండు. శబ్దతన్మాత్రము లక్షణంబుగాఁ గలయాకాశము కాలగతివలన వికారమును జెంది స్పర్శతన్మాత్రను బుట్టించె. ఆస్పర్శతన్మాత్రవలన వాయు వుదయించె. ఆస్పర్శమును గ్రహించునది త్వగింద్రియము. స్పర్శతన్మాత్రకు మృదుత్వము కఠినత్వము శైత్యోష్ణత్వములు వీనిస్పర్శత్వమే లక్షణంబనియందురు. వాయువునకు స్పర్శగుణము గలిగి యుండుట లక్షణంబుం జెప్పుదురు. మఱియు వాయువునకుఁ జలనత్వము ద్రవ్యములఁ బరస్పరము విభాగించుటయుఁ దిరిగి కలుపుటయు, ద్రవ్యములను, శబ్దంబులను, దూరమునుండి గొనివచ్చి వానిలో సుగంధరూపమయిన ద్రవ్యముచే ఘ్రాణేంద్రియంబును శబ్దముచే శ్రోత్రేంద్రియంబును దనుపుచుండుటయు సకలేంద్రియములకు నాధారమగుటయు, మొదలగు కర్మలక్షణంబులుకలవు. స్పర్శతన్మాత్ర గల వాయువు దైవప్రేరితంబయి వికారంబుచెంది రూపతన్మాత్రనుబుట్టించె. ఆరూపంబువలనఁ దేజం బుదయించె. నేత్రేంద్రియము రూపగ్రాహకంబయ్యె. రూపతన్మాత్రమునకు ద్రవ్యమును ద్రవ్యాంతరమునుండి వేఱుపఱుచుట, ద్రవ్యము నాశ్రయించి యుండుట, వ్యక్తిని మఱొకవ్యక్తినుండి వేఱుపఱుచుటయును తేజస్సున కసాధారణగుణమై యుండుట మొదలగునవి. తేజస్సునకుఁ బ్రకాశము, తండులాదికమును బచనముకావించుటయు, క్షుత్పిపాసలమూలంబున నన్నపానంబులగొనుట, శైత్య

మును దొలఁగించుటయు, శోషణమును, కార్యములు. రూప
తన్మాత్రమయిన తేజస్సు కాలగతిచే వికృతినొంది రసతన్మాత్ర
ను బుట్టించె. ఆరసతన్మాత్రమువలన నుదకము జనించె. రస
నేంద్రియంబు తాన్మశరసగ్రాహకం బగుచుండును. ఆరసత
న్మాత్ర వివిధములయినను భూతసంపర్కమువలనఁ దియ్యఁదనము,
పుల్లఁదనము, వెగటు మొదలగు భేదములను జెందినది. మఱియుఁ
దడుపుటయు, మన్ను మొదలగువానిని పిండముగాఁ గావించుట
యుఁ, దృప్తి కలిగించుటయు, జీవనము నిచ్చుటయుఁ, బిపాసాదు
లను దొలఁగించుటయు, మెత్తఁదనము గలదానిగాఁ జేయుట కూ
పాదులనుండి తోడుచున్నను మగుడ గలుగుచుండుట, జల
మునకుఁ గార్యములు. రసతన్మాత్రమగు నుదకము కాలగతివలన
వికారమునొంది గంధతన్మాత్రమును బుట్టించెను. ఆగంధతన్మా
త్రమువలనఁ బుడమిజనించెను. ఘ్రాణేంద్రియము తదీయగంధ
మును గ్రహించునదయ్యె. మఱియు గంధ మొక్కటియేయయి
నను ద్రవ్యసంపర్కమువలన దుర్గంధ సుగంధ మిశ్రగంధాదు
లనెడి పెక్కుభేదంబులను జెందినది. మఱియు ఘటాదులను బు
ట్టించుటయు సమస్తచరాచరంబులకు నాధారమయియుండుట
యు, ధాన్యాదులను గలిగించుటయు నాయాదేశములందుండు
ప్రాణుల యాకారవిశేషమునకుఁ గారణమగుటయు భూమికిఁ
గార్యములు. మఱియు గగనమునకసాధారణగుణ మగుశబ్ద
మును గ్రహించునది శ్రోత్రమనఁబడు వాయువునకసా
ధారణగుణమయిన స్పర్శంబును గ్రహించునది త్వగింద్రియ
మనఁబడు. తేజంబునకసాధారణగుణమయిన రూపంబును గ్ర
హించునది చక్షురింద్రియము నాఁబడు. జలంబునకసాధా

తణాగుణమయిన రసమును గ్రహించునది రసనేంద్రియమనఁబడు. భూమికసాధారణగుణంబయిన గంధంబును గ్రహించునది ఘ్రాణ మనఁబడు. ఆకాశాదులకు ధర్మములగు శబ్దాదు లితరములగు వాయ్వాదులందుఁగూడఁ జూడఁబడుచున్నవి. కాన యాకాశాదులందుండు గుణములన్నియుఁ బృథివియందుఁ జూపట్టుచున్నవి. ఇట్లు మహత్తత్త్వము, అహంకారము, పృథివి, జలము, తేజస్సు, వాయువు, గగనము నను నేడు నుదయించినను బరస్పరము మిళితంబులు కానికారణంబున భోగాయతనంబగు పురుషునిఁ, గల్పింప సమర్థంబులు కాక యుండఁగాఁ బుణ్యపాపరూపమగు నదృష్టముతోను, సత్వాదిగుణములతోను, గాలాదులతో నుపేతుండై జగత్కారణుండును, సర్వనియామకుండును నగు నీశ్వరుం డామహాదాదితత్త్వములను బ్రవేశించెను. ఇట్లు భగవంతుండు మహాదాదితత్త్వములను బ్రవేశింపఁగా మహాదాదులన్నియు మిళితములయి దేనినుండి విరాట్పురుషుఁ డుదయించునో చేతనరహితమగునట్టి యండమును గలిగించె. మఱియు నాయండము బహిర్భాగములయందుఁ బ్రధానముచేఁ గప్పఁబడినవియు, నొకదానికంటె నొకటి పదిమడుఁగుల యాధిక్యముకలవియు నగు పృథివ్యాదికములయిన యావరణములచే నావృతంబయియుండును. మఱియు నాయండమునందె సమస్తదేవమనుష్యాదిరూపమయిన లోకము పుట్టును. అదియే భగవంతునిరూపమని పలుకుదురు ఇట్టి హిరణ్మయాండము మహాదాదులవలనఁ గల్పింపఁబడి చిరకాలము జలమందు నివసించియుండెను. అట్లు జలములో నివసించియున్న యాయండములోనుండి ప్రవృత్తికున్ముఖుఁడయి లేచి మహానుభావుఁడును జగత్కారణుండు నగునారాయణుండు చతు

ర్ముఖు నావేశించి సమష్టిభూతుఁడగు చతుర్ముఖునిశరీరమందుండు నింద్రియగణమును వ్యష్టిరూపముగా ననేకవిధములుగా నొనర్చె ను. అట్టింద్రియములు నేర్పడుటలో ముందుగా నాచతుర్ముఖుని సమష్టిముఖమువలన వ్యష్టిముఖ మేర్పడినది. పిమ్మట వాగింద్రియ ము కలిగినది. ఆ వాగింద్రియముతోనే యధిష్ఠానదేవతయగు వహ్ని యేర్పడెను. తరువాత నతనివలన ఘ్రాణేంద్రియవాస యోగ్యంబులయిన నాసాకుహరము లుత్పన్నంబులయ్యె. ఆనా సాకుహరములవలన వ్యష్టిఘ్రాణేంద్రియ మేర్పడెను. అందువల నఁ దదధిష్ఠానదేవతయగు వాయు వేర్పడియెను. పిమ్మట సమష్టిపు రుషుని చక్షుర్గోళములనుండి వ్యష్టిపురుషుని చక్షుర్గోళంబు లుద యించినవి. ఆచక్షువులవలనఁ జక్షురింద్రియ మేర్పడియె. ఆయిం ద్రియమువలన సూర్యుం డేర్పడి తదధిష్ఠానదేవతయయ్యె. పిమ్మట సమష్టిపురుషుని కర్ణములవలన వ్యష్టికర్ణము లుదయించినవి. పురుషునివలనఁ గర్ణేంద్రియ మేర్పడియె. అందువలనఁ దదధిష్ఠాన దేవతలగు దిక్కు లేర్పడినవి. తరువాతఁ ద్వగింద్రియము నివసిం పఁదగిన రోమాదు లుదయించినవి. వానివలనఁ ద్వగింద్రియము కలిగినది. అందువలన నోషధు లేర్పడి తదధిష్ఠానదేవతలయ్యె. అనంతర ముపస్థేంద్రియమున కధిష్ఠానమయిన శిశ్న ముదయిం చెను. అందువలన నుపస్థేంద్రియ ముదయించెను. దానివలనఁ దదధిష్ఠానదేవతలగు నుదకము లేర్పడినవి. తరువాతఁ బాయ్విం ద్రియమున కధిష్ఠానమయిన గుదము జనించినది. అందువలనఁ బాయ్వింద్రియ ముత్పన్నంబయ్యె. ఆయింద్రియమువలన లోక భయంకరుఁడగు మృత్యువుదయించి తదధిష్ఠానదేవతయయ్యె. అనంతరమునఁ బాణేంద్రియాధిష్ఠాన మేర్పడెను. అందు బల

మను పేరుగల పాణీంద్రియ మేర్పడియె. అందువలన నింద్రుఁ డుదయించి తదధిష్ఠాన దేవతయయ్యెను. తరువాతఁ బాదము లుద యించినవి. అందువలన గతి యను పేరుగల పాదేంద్రియ ముద్భ వించినది. అందువలన నుపేంద్రుం డుదయించి తదధిష్ఠాతయ య్యె. పిమ్మట నధిష్ఠానరూపములగు నాడు లుదయించినవి. అందువలన రక్తము జనించెను. దానివలన నధిష్ఠానదేవతల యిన నదు లుత్పన్నంబులయ్యెను. తరువాత నుదరమనెడి యధి ష్ఠానము కలిగెను. అందువలన క్షుత్పిపాస లుదయించె. వాని వలన నధిష్ఠాతయగు సముద్ర ముదయించెను. తరువాత హృద యము పుండరీకాకారమయి యేర్పడెను. అందువలన మన స్సే ర్పడెను. దానివలనఁ జంద్రుఁ డేర్పడి తదధిష్ఠానదేవతయయ్యె. ఆహృదయాధిష్ఠానమువలననే బుద్ధిరూపమయిన యింద్రియ మే ర్పడినది. బ్రహ్మ దానికధిపతియయ్యె. అందువలనే యహంకార ముదయించె. ఆ యహంకారమునకు రుద్రుం డధిపతియయ్యె. ఆ హృదయమువలననే చిత్తమేర్పడె క్షేత్రజ్ఞుఁడు దానికధిష్ఠాత య య్యెను. ఇట్లు విరాట్పురుషునివలన నింద్రియసమూహమును ద దధిష్ఠానదేవతలు నేర్పడినను, క్షేత్రజ్ఞునిఁ బ్రవృత్తి ప్రవర్తకునిగాఁ జేయ సమర్థములు కానివయ్యెను. ఆకారణంబున నధిష్ఠానదేవత లాయాయధిష్ఠానములను గ్రమముగాఁ బ్రవేశించెను. అందు వహ్ని వాగింద్రియముతోఁ గూడి ముఖమును బ్రవేశించె. అందు వలన విరాట్కార్యంబగు వ్యష్టిశరీరజాతం బుత్పన్నంబు కాద య్యె. పిమ్మట వాయువు ఘ్రాణేంద్రియముతోఁ గూడి నాసికా వివరంబులఁ బ్రవేశించెను. సూర్యుఁడు చక్షురింద్రియముతోఁ గూడఁ జక్షుర్గోళకములను బ్రవేశించెను. దిక్కులు కర్ణేంద్రియ

ముతోఁగూడఁ గర్ణగోళములఁ బ్రవేశించెను. అధిష్ఠానదేవత లయిన యోషధులు త్వగింద్రియముతోఁగూడ రోమములనొంది నను విరాట్కార్యంబు వ్యర్థంబయ్యె. తరువాత నుదకంబు లుపస్థేంద్రియముతోఁగూడ శిశ్నమును బొందియును వృథాభూతంబయ్యె. మృత్యు వపానేంద్రియముతోఁగూడ గుదమును బ్రవేశించె; కాని కార్యంబు విఫలంబయ్యె. విష్ణువు గతీంద్రియముతోఁ బాదములనొందినను, నింద్రుఁడు బలేంద్రియముతోఁ గూడ హస్తంబులఁ బ్రవేశించినను, నదులు రక్తముతోఁగూడ నాడీపుంజమును బ్రవేశించినను, సముద్రము క్షుత్పిపాసలతోఁ గూడ నుదరమును బ్రవేశించినను, విరాట్పురుషుని వ్యష్టిశరీరజాతకార్యంబు సఫలంబు కాదయ్యె. ఇక్కార్యంబు నెఱవేర్పుట కయి చంద్రుండు మనస్సుతోఁగూడి హృదయగోళమును బ్రవేశించినను, బ్రహ్మ బుద్ధీంద్రియముతోఁగూడి హృదయమును బ్రవేశించినను, రుద్రుఁ డహంకారముతోఁ బ్రవేశించినను విఫలంబయ్యె. కాని యెప్పుడు క్షేత్రజ్ఞుఁడు చిత్తముతోఁగూడ హృదయమును బ్రవేశించెనో యప్పుడే విరాట్కార్యభూతమయిన పురుషుఁడు సలిలకార్యమయిన బ్రహ్మాండమును బ్రవేశించి ప్రవృత్తిసమర్థుండయ్యె. ఓతల్లీ! సమస్తేంద్రియంబులు తత్తదధిష్ఠానదేవతలతోఁగూడ నధిష్ఠానములను బ్రవేశించినను క్షేత్రజ్ఞుఁడు చిత్తముతో హృదయమును బ్రవేశించునంతకాలము ప్రాణాదులు తమబలముచే నిద్రచెందినవారిని లేచునట్లు చేయలేనివిధమున సమర్థంబులు కావయ్యె. కావున నోజననీ! పరిశుద్ధస్వరూపుఁడయిన జీవుని శరీరబుద్ధీంద్రియాదులకంటె వేఱుగాఁజేసి తత్వజ్ఞానవివేచన శీలమయిన బుద్ధిని భక్తిమార్గమం

దుఁ బ్రవేశింపఁజేసి చక్కఁగాఁ బరబ్రహ్మమును ధ్యానింపవలయును. ప్రకృతిపురుషుల వేఱ్పాటు నిగ్రహించినవారు మోక్షము నొందుదురు. ప్రకృతిసంబంధంబునంజేసి సంసారబంధంబు సంభవించుచుండునని కపిలాచార్యుండు తల్లికిఁ దెలియఁజెప్పి వెండియు నిట్లనియె. ఇది యిరువదియాఱవయధ్యాయము.



ఓజననీ! జీవుఁ డిట్లు ప్రకృతికల్పితమయిన దేహము నధివసించియున్నను, వచ్చుట, పోవుట మొదలగు బాహ్యములగు వ్యాపారములకాశ్రయుఁడు కాకపోవుటచేతను, సత్త్వాదిగుణసంబంధము లేనివాఁ డగుటచేతను, నవికారుఁ డగుటచేతను, జలములోఁ బ్రతిబింబించిన సూర్యునికి దజ్జలసంబంధులగు కంపాదులు కలుగని విధమున సత్త్వాదిగుణములవలనఁ గలిగినదోషంబు లాజీవుని కంటఁజాలవు. ఇట్టి యాత్మకు దేవమనుష్యాదిదేహసంబంధ మెట్లు కలుగుచున్నదో సాంసారిక ప్రవృత్తులందుఁ గర్తృత్వ మెట్లు లభించుచున్నదో, సుఖదుఃఖానుభవ మెట్లు కలుగుచున్నదో చెప్పెద వినుము. అట్లు ప్రకృతివిలక్షణుఁడయినను, నాత్మ, యహంకారముచే మోహితుఁడయి దేహాత్మాభిమానము గలవాఁడయి యెప్పుడు బ్రకృతిగుణములయిన శబ్దాదులయం దాసక్తి గలిగి తానె కర్తయని యనుకొనుచున్నాఁడో యప్పుడే యట్టియభిమానముచేఁ గర్మాధీనుండయి కర్మాయత్తములయిన సుఖదుఃఖముల ననుభవించుచు, ప్రకృతిసంబంధమువలనఁ జేసికొన్న పుణ్యాపాపకర్మములను బురస్కరించుకొని యుత్తమాధమమధ్యములయిన దేవ,పశు,పక్షి, నర, యోనులం దుద్భవించుచు, సంసారపదవిని బొందుచున్నాఁడు. ఓయీ! దేహాద్యాకారము లాత్మకు

స్వాభావికాకారములు కానప్పుడు వానివలన నేమియనర్థము సంభవించు నందువేని చెప్పెద. విను. స్వప్నశరీరము లాత్మకా కారములు కాకపోయినను వానివలనఁ గలిగిన సుఖదుఃఖరూపానర్థములను జెందుచున్నవిధముగ నాత్మకు దేవమనుష్యాద్యాకారములు స్వాభావికములు కాకపోయినను శబ్దాదివిషయచింతనమే తప్పక చేయుచుండుటచేత సంసారరూపానర్థము సంప్రాప్తమగుచున్నది. విషయాసక్తతయే యిట్టి యనర్థములను గలిగించుచుండును గాన ముందుగ మనోనియమనమును జేసికొనవలెను. మఱియుఁ బండితుఁడు నిరంతరాయమగు భక్తియోగము చేతను, వైరాగ్యము చేతను శబ్దాదివిషయములందుఁ బ్రసక్తమగుమనంబును వశంబు గావించుకొనవలెను. ఇట్లు చేసినచో సంసారబంధము నివర్తించును. మఱియు మనోనియమనవిషయమగు త్వరతోఁ గూడినవాఁడై నాయందుంచిన పితృమాతృభావము చేతను, సత్యావచనము చేతను, మత్కథాశ్రవణము చేతను, సమస్తమును బ్రకృతిపురుషశరీరకుఁడగు భగవంతుని రూపముగా నెంచుటచేతను, శబ్దాదివిషయములం దభిలాషలేకుండుటచేతను, బ్రహ్మచర్యము చేతను, మితభాషిత్వము చేతను, భక్తియోగమునుగల్గించువానిలో బలవత్తరమగుస్వధర్మము చేతను భక్తియోగము నభ్యసించుచుండవలయును. మఱియు దైవికముగా సంప్రాప్తమగు నన్నాదులను భుజించుచు, భోజనాదులందుసైతము భగవత్పరిశీలనమునే చేయుచు, రహస్యప్రదేశమందుండ నభిలాషగలవాఁడై, భయాదులను విడిచి, భయజనకములగు భూతములనుండిసైతము మైత్రి నపేక్షించుచు, సమస్తభూతములందుఁ గరుణాళువయి, శ్రేష్ఠమగు మనస్సుగలిగి భార్యామొద

లగు ననుబంధంబులతోఁగూడిన యీదేహమం దహంకారము ను మమకారమును, నుంచక యాథాత్మ్యమును జూపించు ప్రకృతిపురుషజ్ఞానముచే మనస్సంబంధులగు సంకల్పవికల్పాదు లను దొలంగించుకొని భగవద్వ్యతిరిక్తమగు దానిని జూడ నొల్లక ప్రకృతికంటె విలక్షణుఁడయిన యాత్మను సందర్శించి సూర్యాధిష్ఠితమగు చక్షురింద్రియముచే నధిష్ఠాతయగు నాది త్యునిఁ జూచుచున్నట్లు పరమాత్మాధిష్ఠితమగు ప్రత్యగాత్మచేఁ బరమాత్మను సాక్షాత్కరించుకొనవలెను. అట్లు చేసినయనం తరము ప్రారబ్ధావసానమందు దేవాదిశరీరముల నెడఁబాసి యెల్లప్పుడును సంకోచమునొందని జ్ఞానమే స్వరూపముగాఁ గలిగి ప్రత్యగాత్మకు సర్వవిధములచేతను బంధువయి దేహా దులనుగూడఁ బ్రకాశింపఁజేయుచు, సర్వాంతర్యామియై స్వస మాభ్యధికరహితుఁ డగు పరమాత్మను బొందుచున్నాఁడు. ఓయీ! ప్రకృతికంటె విలక్షణుఁ డగునాత్మను జూచుచునే తదం తర్యామియగు పరమాత్మను గాంచి యాపరమాత్మను బొందు చున్నాఁడని చెప్పితివి. కాని యింద్రియాతీతమయి నిరతిశయ సూక్ష్మమయియున్న యాత్మస్వరూప మెట్టిదిగా దర్శనయోగ్య మగునని యందువేని, యట్లు సందియమంద నవసరములేదు. ఆ త్మ దేహేంద్రియాదులకంటె విలక్షణుఁడై జాగరాద్యవస్థలందుఁ బ్రత్యక్షీభూతుఁడగుచున్నాఁడు.*తృణము మొదలగువానిం బ్రకా

* దీనిఫలితార్థ మేమనఁగా నాదిత్యుఁడుకాని ప్రతిబింబాదులం దాది త్యుఁడనెడి భ్రాంతియు వాస్తవాదిత్యునియందలి యాదిత్యబుద్ధియు, నాది త్యునకు ధర్మభూతమగు కాంతిచేతనే గలుగుచున్నది. అట్లే యాత్మపదార్థ ముకాని దేహాదులం దాత్మబుద్ధియు సత్యమగు నాత్మయం దాత్మప్రతిపత్తి యు నాత్మధర్మభూతమగు జ్ఞానముచేతనే కలుగుచున్నది.

శింపఁజేయు సూర్యకాంతిచేతనే జలస్థమగు సూర్యప్రతిబింబమును జూచుచున్నాము. మఱియు జలమందు సూర్యప్రతిబింబమును బ్రకాశింపఁజేసెడి సూర్యకాంతిచేతనే యాకాశమందున్న సత్యసూర్యుండు చూడఁబడుచున్నాఁడు. అట్లు భూతములు నింద్రియములు, మనస్సు స్వరూపముగాఁ గలిగి త్రివిధాహంకారమను పేరుగల ప్రకృతిపరిణామవిశేషము స్వధర్మభూతమగు జ్ఞానములచేతనే యాత్మవ్యతిరిక్తమగునదియైనను నాత్మస్వరూపముగానే గ్రహింపఁబడుచున్నది. మఱియు తనకుఁ బ్రభాభూతమగు జ్ఞానముచేతను నిర్వికారమగు జ్ఞానమేస్వరూపముగాఁ గలయీ యాత్మయు గ్రహింపఁబడుచున్నాఁడు. కావున నాత్మకు ధర్మభూతమగు జ్ఞానముచేతనే యాత్మప్రత్యక్షము కలుగవచ్చును. ఓజననీ! ఇంద్రియాదులు జాగరూకము కాకయున్నప్పుడుకూడ నాత్మావభాసము కలుగుచుండును. నిద్రచేతను భూతసూక్ష్మములు, నింద్రియములు, మనస్సు, బుద్ధి మొదలగునవి తమతమకార్యంబులు నెఱవేర్ప సమర్థములు కాకయుండును. అప్పు డాత్మ దేహమందు నిద్రారహితుఁడయి దేహాత్మాభిమానములేక వర్తిల్లుచుఁ దనధనము నశింపఁగాఁ దనకే నాశము కలిగినట్లు లాతురుఁడయినవానిచందంబున సుషుప్తియందు దేహాత్మాభిమానరూపమగు నహంకారమునకు విషయము నశించుటచే నహంకారము నశించినదగుచుండఁగా నాత్మయే నష్టమయినట్లు తలంచుచుఁ బ్రకృతికంటె వివిక్తమగు నాత్మస్వరూపమును దెలియఁగోరి సుషుప్తియం దాత్మవృత్తిని బరామర్శించుకొని పంచభూతసముదాయమున కవస్థాపకమయి దేహప్రవృత్తికి హేతుభూతమయియున్న ప్రకృతికంటె వివిక్తమగు ప్రత్యగాత్మ

స్వరూపమును బొందుచున్నాఁడు. * కావున జాగ్రదవస్థయందును, స్వప్నావస్థయందును, సుషుప్తియందునుగూడ నాత్మావ

* ఓయీ! సుషుప్తియం దాత్మావభాసము కలుగుచున్నట్లు చెప్పుచున్నావు. జాగ్రదవస్థయందును స్వప్నమందును నాత్మావభాసముండునుగాని సుషుప్తియందున్నట్లు తోఁపదు. కావుననే శ్రు. "నాహం ఖల్వయమేవం సంప్రత్యాత్మానం జానాత్యయ మహమస్మి" అను శ్రుతిగూడ నీయర్థమునే సూచించుచున్నది. అని ప్రశ్నింపఁగూడదు. సుషుప్తియం దహమర్థమగు నాత్మకంటె వివిక్తములయిన బ్రాహ్మణత్వాది ధర్మములకు స్ఫుటప్రతిభానములేకపోయినను మేల్కొనునంతపర్యంతము "అహమహం" అని యేకరీతిగా నాత్మకు స్ఫురణమున్నదికాని లేకపోలేదు. కావుననే మనుజుఁడు నిద్రించి లేచి యిట్లనుకొనుచున్నాఁడు. శ్రు. "సుఖమహమస్వాప్సం నకించిదవేదిషం మామప్యహం నజ్ఞాతవాన్" అనఁగా నేను సుఖముగా నిద్రించితిని. కొంచెమేనియు నెఱుంగను. నేను నన్నునుగూడఁ దెలిసికోఁజాలనైతి. ఈయనుకొనుటంబట్టి యాత్మకు సుషుప్తియందు సుఖిత్వము జ్ఞాతృత్వము గలిగియున్నట్లు తెలియవచ్చుచున్నది. ఓయీ! "ఏతావంతం కాలం నకించిదహమజ్ఞాసిషం" అనఁగా నీసుషుప్తియం దున్నంతకాలము కొంచెమేని నేనెఱుంగను" అని యనుకొనుటకలదు. దీనిఁ గోజింప సుషుప్తియం దేమియు జ్ఞానములేదని యర్థమువచ్చుచున్నదే యని యడుగరాదు. ఆయవస్థయం దాత్మపదార్థమున కనువృత్తి కలుగుచుండుటచేఁ దెలిసికోఁదగినవిషయము నిషేధింపఁబడుచున్నది. మఱియు నట్లే, "మామప్యహం నజ్ఞాతవాన్" "నన్ను నేనెఱుంగను" అనుటచే ప్రబోధసమయమందుఁ గలుగుచున్నట్లు బ్రాహ్మణత్వాది ధర్మములచే విశిష్టుఁడగునన్ను నేనెఱుంగనని యర్థముకాని కేవలస్వరూపము నెఱుంగనని యర్థముకాదు. "నాహంఖల్వయ" మను శ్రుతియందుఁగూడ బ్రాహ్మణత్వాదిధర్మములు తెలియకపోవుటచేఁ దాదృశధర్మయుక్తుఁ డగువాని నెఱుంగకపోవచ్చునుగాని స్వరూపము నెఱుంగకపోఁడు. కావున సుషుప్తియందుసైత మాత్మస్ఫురణ మున్నది.

భాసము విశదతరమై కలుగుచున్నది. అని చెప్పుచున్న కపిలునిఁగాంచి దేవహూతి యిట్లనియె. "ఓపురుషవరేణ్యా! ప్రకృతిపురుషులు నిత్యులగుటవలనను, బరస్పరము దృఢతరమగుసంబంధముగలవా రగుటవలనను, వారి కెప్పుడును వేఱువేఱుగా నుండుట సంభవింపనేరదు. అట్లుండఁ బ్రకృతి పురుషుని విడిచి యెట్లుండును? పృథివికిని గంధమునకు నెప్పుడయిన బృథగవస్థానము కలుగునా? జలమునకును జలమున కపృథక్సిద్ధమగు రసమునకుఁ బృథగ్భావము సంభవించునా? సంభవింపనేరదు. అట్లె ప్రకృతికిని బురుషునికిని బృథగ్భావము కలుగనేరదు. మఱియు సంసారసంబంధములైన గమనాగమనాది ప్రవృత్తులందు స్వాభావికకర్తృత్వము లేనిపురుషునికిఁ గర్మరూపబంధము ప్రకృతిసంబంధమువలన నేకదా గలుగుచున్నది. పురుషుని కట్టి కర్మబంధము కలిగించు ప్రకృతియుఁ, బ్రకృతిగుణములగు సత్వాదులును, విద్యమానము లగుచుండఁగా నాప్రకృతిగుణములనుండి యాత్మకు విముక్తికలుగుట యెట్లు? ఒకవేళఁ దత్త్వజ్ఞానమువలనఁ బ్రకృతి యాత్మను విడుచునని చెప్పుదువేని యది సరిపడదు. ఒకప్పుడు తత్త్వావమర్శచే సంసారరూపభయము సామాన్యముగాఁ దొలంగినను, దాదృశసంసారభయము గలిగించు ప్రకృతిసంబంధము నివర్తింపకపోవుటచే మగుడ నది కలుగుచునేయుండును.' అని యడిగిన దేవహూతికిఁ గపిలుం డిట్లనియె ?

'ఓజననీ! నీవాక్యము యథార్థము. నీప్రశ్నములు సముచితములు కాని ఫలాభిసంధిరహితమగు స్వధర్మముచేతను, విశుద్ధమగు నంతఃకరణముచేతను, మత్కథాశ్రవణముచే సంవర్ధితమై యంతరాయములచేఁ జలింపని ప్రకృతిపురుషయాథాత్మ్య

మును దెలుపు జ్ఞానముచేతను, బలీయమగు వైరాగ్యము చేతను, దేహశోషణాది రూపమగు తపంబులతోఁ గూడిన యోగములచేతను, నుత్కృష్టమగు చిత్తైకాగ్రత్వముచేతను సంవర్ధితమై యొప్పుచున్న మద్భక్తిచేత రాత్రిందివములు పీడితమయి యాత్మప్రతిబంధకర మగుప్రకృతి మెల్లమెల్లగా నివర్తించును. ఓతల్లీ! అగ్నిని దిరోధానము కావించు నరణియగ్నిచేఁ దహింపఁబడుచున్నట్టు లాత్మను గప్పిపుచ్చు ప్రకృతి యాత్మజ్ఞానముచేతనే నివర్తించుచున్నది. అట్లు నివర్తించినచోఁ బ్రకృతి పురుషునికి సంసారబంధము గలిగింపఁజాలదని తెలిసికొనుము. భుక్తభోగయు నిత్యము గాన వచ్చుచున్న దోషములు గలదియు, కావుననే విడువఁబడినదియు నగుప్రకృతి కర్మవశ్యుఁడుకాక యపహతపాప్మత్వము మొదలగు నష్టగుణములు గలిగి వర్తించునాత్మకు సంసారము నెప్పుడును గలిగింపనేరదు. ఓతల్లీ! నిద్రించినవానికి స్వప్నము స్వశిరశ్ఛేదనాదికములగు పెక్కనర్థములు గలిగించును. మేల్కనియున్నపని కాస్వప్న మనర్థములఁ గలిగింపనేరదు. అట్లె యజ్ఞునికిఁ బ్రకృతి సంసారరూపానర్థములఁ గలిగించునుగాని ప్రకృతిపురుషేశ్వరతత్త్వమును బాగుగ గ్రహించి నాయందుఁ దనమానసంబును నిలిపి యాత్మానుభవపరుఁడయి యున్నజ్ఞానికిఁ బ్రకృతి యొకప్పుడయినను సంసారబంధము కల్పింపనేరదు. మఱియు నాత్మారాముఁడయి బహుజన్మముల కాలముచేఁ దత్త్వమును బురుషార్థములను దెలిసికొని బ్రహ్మలోకపర్యంతము కలుగు లోకములఁ బొంద నపేక్షింపక నిరతిశయప్రీతిరూపమగు మద్భక్తికలవాఁడయి, భగవంతుఁడనగు నాసాక్షాత్కారముచే సమస్త సంశయములను దొలంగిఁ

చుకొనినయోగి, ప్రారబ్ధకర్మమునశించినప్పు డేస్థానమును బొంది తిరుగ జన్మంబునకు రాఁడో నిరతిశయపురుషార్థరూపమగునట్టి నాస్థానమును మదీయానుగ్రహముచేఁ బొందఁగలఁడు. ఓజనయిత్రీ! భక్తియోగమందు సిద్ధుఁడగు పురుషునిచిత్తము యోగసాధ్యములయి సంసారమును నివర్తింపలేక యాశ్చర్యకరములయి యున్నయణిమాదిసిద్ధులం దెప్పుడు సక్తముకాదో యప్పుడే నిరతిశయమగు మత్పదమును జేరఁగలఁడు. ఇది యిరువదియేడవ యధ్యాయము.



'ఓ జననీ! భక్తియోగముచే మనంబును నిర్మలంబు గావించుకొని శ్రేయస్సు బొందుచున్నాఁడు. కావున నట్టిభక్తియోగమును ససాధకముగ తెలియఁజేసెద. మఱియు యోగమార్గంబుల నుపదేశింతును వినుము. యోగముల నభ్యసించువారు ముందుగ వివేకసాధనసప్తకంబును సంపాదింపవలసి యున్నది. వానిని వివరించెదను వినుము. స్వశక్తిచే నిష్కామమునగా స్వవర్ణాశ్రమోచితధర్మముల నాచరింపవలయును. ప్రతిషిద్ధకార్యములనుండి మరలవలయును. దైవవశమువలనఁ దనకుఁ బ్రాప్తమగు నన్నాదులచే సంతసించుచుండవలయును. పరమభాగవతులయిన పూజ్యులను బూజించుచుండవలయును. ధర్మార్థకామముల నపేక్షింపకుండవలెను. మోక్షమం దిష్టముకలిగి యుండవలయును. ఓజననీ సాధనసప్తకాంతర్భూతమగు క్రియలను జెప్పితి. ఆసాధనసప్తకములో నేడవది వివేకము. దానిం దెలిపెదను వినుము. జాతిచేతను, నాశ్రయముచేతను, నిమిత్తముచేతను, దుష్టము లగువానినుండి వేఱయి సాత్వికముల

యిన యన్నాదులను దినుచు, నట్టియన్నమును మితముగా ననుభవించుచు, మఱియు జాతిచేతను దుష్టములగు కలంజాదులను, నాశ్రయముచే దుష్టములయిన చండాలాది ద్రవ్యమును, గేశాదినిమిత్తములచే దుష్టము లయినవానిని దినక కేవలము పవిత్రమయినదానినే భుజింపవలయును. ఇదియే వివేకము. ఒరులను హింసింప కుండుటయు దొంగిలింప కుండుటయు, సత్యము పలుకుటయు, దేహయాత్రాదులకుఁ గావలసినంతమాత్రమే ధనసంగ్రహము చేయుటయు, నింద్రియముల జయించుటయుఁ, గృచ్ఛ్రచాంద్రాయణాది తపంబుల నొనర్చుటయు, వేదాధ్యయనము చేయుటయు, భగవంతునిఁ బూజించుటయు, నీచెప్పఁబడినవి వివేకాది సప్తకములో నంతర్భూతములయినను విస్తరార్థము చెప్పితిని. ఇఁక నాసనాద్యంగములఁ దెలిపెద వినుము. సర్వకాలములయందు మౌనియయి యొకచోట స్థిరముగానుండి మెల్లమెల్లగాఁ బ్రాణవాయువులను వశముకావించుకొని ఇంద్రియములనన్నింటిని శబ్దాది విషయములనుండి మఱలించి మనస్సుతోఁగూడ హృదయమందుఁ జేర్చి చిత్తమును నింద్రియాదులను, మూలాధారాది స్థానములలో నొకదానియందుంచి భగవంతుం డొనర్చిన యద్భుతచరిత్రములను స్మరించుచు మనస్సు నాత్మతో నేకీభవింపఁ జేయవలయును. మఱియుఁ బైని చెప్పిన స్వధర్మములనెల్ల నాచరించుటవలన మనంబు దుష్టమార్గంబును జొరకుండునట్లుచేసి జితప్రాణుఁడయి తొందరలేనివాఁడై మంచిమార్గమందుఁ బ్రవేశింపఁ జేయవలయును. పిమ్మట నట్టివాఁడు జితాసనుండై పరిశుద్ధ

మైన ప్రదేశమునందు దర్భాసనమునుంచి * స్వస్తికాసనముచే శరీరమును దిన్నగాఁజేసి, ఓంకారము నభ్యసించుచుండవలయును. తరువాతఁ బూరకకుంభక రేచకముల నెడి ప్రాణాయామములచేతఁ జిత్తము స్థిరమై యిఁకనెప్పటికిఁ జంచలత్వము నొందకుండునట్లు ప్రాణములను జక్కఁగాఁ బరిశోధింపవలయును. ఇట్లు ప్రాణములను నిరోధించియున్న యోగిమనస్సు శీఘ్రకాలములోనే తప్తమయిన బంగారము నిర్మలమయిన చందము నన నిర్మలమగును. ఇట్లు చేసినవాఁడు ప్రాణాయామములచేత వాతపిత్తాదిదోషములను దొలంగించుకొనును. ధారణాదులచేఁ బాపములను దహింపఁజేసికొనును. ఇంద్రియప్రత్యాహారముచేత విషయసంబంధములను నశింపఁజేసికొనును. ధ్యానముచేఁ గ్లేశాదులను దహింపఁజేసికొనును. ఇట్లు ప్రాణాయామాదులచేత నిర్మలమయిన తనమనస్సును భగవంతునందుఁ జేర్చి నాసాగ్రమందే దృష్టికలవాఁడై భగవద్విగ్రహమును ధ్యానము చేయవలయును. నిర్మలమయిన ముఖపద్మముతోను, బద్మపత్రముల బురుడించు నరుణనేత్రములతోను, నల్లఁగలువవలె శ్యామలవర్ణముతోను బ్రకాశించుచు, శంఖచక్రాదిసాధనంబులధరించి, పద్మకింజల్కమువలె నలరుచున్న పీతాంబరము కటిసీమయందొప్పార, శ్రీవత్సమనెడి లాంఛన మురమునందు రంగారఁ, గౌస్తుభాలంకృతిమయిన గళము మిగుల నలరారుచుండ, మత్తమధుకరములచే నిండియున్న వనమాలయు ముక్తాహారకంకణాదులయిన యలంకారములును వెలుంగఁ గాంచనమయమయిన మేఖల

---

* స్వస్తికాసనము=తొడలయొక్కయుఁ బిక్కలయొక్కయు నడుమ తన పాదములను జొనిపి శరీరమును దిన్నగా నిక్కింప స్వస్తికాసన మనఁబడును.

చే విభూషితుండయి సమస్తయోగిబృందములకు వందితుండయి, దర్శనీయుండయి, మహానందదాయకుఁడై, శాంతస్వరూపుఁడై, భక్తరక్షణమునం దత్యాసక్తి కలిగి, నుతింపఁదగిన కీర్తిపుంజముచేఁ జెలంగియున్న నారాయణుని సంతతము ధ్యానముచేయుచు, నడుచునప్పుడుకాని నిద్రించునప్పుడుకాని కూర్చుండినప్పుడుకాని తననిర్మలహృదయకుహరమునం దరవిందాక్షునిఁ గనుఁగొనుచుఁ బ్రవర్తింపవలయు. అందువలన నలవడినమనస్సు నారాయణునివిడిచి యన్యమునందుఁ బ్రవేశింపనేరదు. ఇట్లు భగవంతునిసర్వావయవములందు సక్తమయిన తనచిత్తమును భగవంతునియొక్క యొక్కొక్కయవయవమునందు లగ్నము చేయవలయును. ఆక్రమమును జెప్పెదను వినుము. చక్రశంఖయవాదిరేఖలచే నొప్పుచు నుత్తుంగములును రక్తములునగు నఖములకాంతిసంతానముచే భక్తులహృదయకుహరంబులనుండు నజ్ఞానమను చీఁకటిని దొలంగఁద్రోయుచు వేనియుం దుద్భవించిన గంగానది శిరంబునందాల్చి యీశ్వరుండు పవిత్రుండయ్యెనో యేవి పాపశైలములకు వజ్రాయుధములో యట్టినారాయణుని పాదారవిందములను ధ్యానముచేయుచుండవలెను. పిమ్మట లోకమాతయు సమస్తలోకములకుఁ బూజనీయయు నగు శ్రీలక్ష్మీదేవి యేభగవంతుని జానువులను దనతొడలందు నిడుకొని కరపల్లవములచే సేవయొనర్చుచుఁ గృతార్థురాలయ్యెనో యట్టిభగవంతునిజానువులను భక్తితో ధ్యానముచేయవలయును. అనంతరము గరుత్మంతునిస్కంధములయందుఁ బ్రకాశించుచు బలమునకు స్థానభూతములయి యతసీకుసుమసమానములయిన యూరువులను ధ్యానముచేయవలయును. తరువాత

కాంచనమయమయినకాంతిచే నుదంచితమై పాదములపర్యంతము జీరాడు పీతాంబరముచే సుందరమయియున్న భగవంతుని నితంబబింబమును హృదయమందుంపవలెను. పిమ్మట నాభగవంతుని నాభీకుహరము లోకముల కాధారమైయున్నదో దేనివలనఁ జతుర్ముఖబ్రహ్మకుఁ గారణభూతమును సకలలోకాత్మకమునగు పద్మముదయించెనో యట్టి నాభీకుహరమును దనహృదయకుహరంబునఁ జొనిపి స్మరింపవలయును. పిమ్మట మరకతమణిశ్రేష్ఠములవలె నొప్పుచు ముత్యాలహారములకాంతులచే గౌరములయిన భగవంతుని స్తనముల ధ్యానింపవలయు. తరువాత లక్ష్మికి నివాసభూతమయి శ్రీవత్సముచేతను బొలుపారుచు ధ్యానించువారి నయనముల కానందము కలిగించు నారాయణుని వక్షస్థలమును ధ్యానింపవలయును. తరువాతఁ గౌస్తుభాద్యలంకారములతో నలరుచున్నట్టి భగవంతునికంఠమును స్మరించుచుండవలెను. పూర్వము పాలసంద్రము మథించుకాలమునఁ గూర్మావతారముదాల్చి పర్వతమును ధరించుచుండుటచే నాపర్వతపరివర్తనములచేఁ బ్రకాశించునట్టి యంగదాద్యాభరణంబులు కలిగి లోకపాలకులవలె నొప్పుచున్న నారాయణునిబాహువులను భజింపవలయును. ఇట్లు భగవదవయవములను సంస్మరించుచు, నతనియాయుధములను స్మరింపవలయును. సమస్తరాక్షసచక్రంబునకు భయమును గలిగించునదియు సహస్రధారలు కలదియునగు చక్రంబును దలంపవలయును. పిమ్మట భగవంతుని కరసరోరుహమందున్న రాజహంసమువలెఁ దెల్లనికాంతులచే మనోహరమయిన శంఖమును, సమస్తదుష్టుల రక్తముచే సిక్తమయినదియు భగవత్ప్రీతి

దాయినియు నగు భగవంతుని కౌమోదకిని, భగవంతుని కంఠమందుఁ బ్రకాశించుచున్నదియు మధుకరముల ఝుంకార ధ్వనులు కలదియునగు వనమాలను జీవునికి నధిష్ఠాన దేవతవలె నొప్పు కౌస్తుభరత్నమును స్మరింపవలయును. పిమ్మట భక్తానుగ్రహమునిమిత్తము దాల్పఁబడి మకరకుండలకాంతిసంతానముచే మండితములయిన గండస్థలంబులు నాసికయు గలిగియుల్లసిలు భ్రూలతలచే నొప్పుచు మత్తమధుకరబృందమువలె నల్లనికుంతలములతో నలరుచు స్వీయకాంతిచేతను మధుకరములచేతను బ్రకాశించుచు రెండుగండుమీల కాశ్రయమగుపద్మమును ధిక్కరించు భగవంతునివదనమును ధ్యానింపవలె. తరువాత భక్తజనుల కభయప్రదానంబు నొసంగుచుండెడి పాణిపల్లవములను దలంపవలయును. పిమ్మట భయంకరమయిన తాపత్రయమును నశింపఁజేయఁజాలినవియు, భగవంతునిచేఁ బ్రసరింపఁజేయఁబడుచున్నవియు, మందహాసములచే ద్విగుణితములయినవియు, నగు భగవంతుని కరుణావలోకనంబులను ధ్యానము చేయవలయును. మఱియు సమస్తభక్తజనుల దుఃఖసాగరముల హరించు మందహాసమును, నిర్జితేంద్రియులయిన మునులకు, సమస్తలోకమును మోహమున ముంపుమన్మథునకు మోహముకలిగింప నాత్మ మాయచేఁ బరిగృహీతమగు భ్రూమండలమును, ప్రవాళమువంటి యధరకాంతులచే నరుణాయితమయిన భగవంతుని దంతకుందపంక్తిని విశదీకరించు భగవంతుని ప్రహసితమును, భగవదర్పితమనస్కుఁడయి స్మరింపవలయు. హృదయకుహరమునందు ధ్యానింపఁబడుచున్నవిష్ణుమూర్తియందు భక్తిగలిగి యతనియందే చిత్తము నర్పించి

భగవద్వ్యతిరిక్తమగువస్తు వున్నదని విశ్వసింపరాదు. ఇట్లు భగవంతుని సుందరరూపమును సంస్మరింపుచు, భగవంతునందలి ప్రేమాతిశయముచేఁ బొరలి పొరలివచ్చుచున్న యానందబాష్పబిందుసందోహమువలన నభిషిక్తుండై యందువలన నుద్భూతంబులయిన పులకాంకురంబులు శరీరమంతటను నిండుచుండఁ జిత్తాపహారియగు భగవంతునియందుఁ దనచిత్తమును జేర్పఁగలఁడు. పొగ లేనిదీపశిఖవిధమున శబ్దాదివిషయములం దగులమిచే నిర్మలమయిన మనస్సు, భగవద్విగ్రహ చింతనంబును విడిచి యెప్పుడు బాహ్యవ్యాపారములను వదలుటచే సుఖించుచున్నదో, యప్పుడు తాను బరమాత్మయందుఁ బ్రత్యక్షసంబంధముకలిగి దేవాది భేదరహితుఁడయి యున్నయాత్మను దేహాత్మాభిమానమును స్వతంత్రాభిమానమును విడిచినవాఁడయి పరమాత్మకు శరీరభూతమగునట్లుగాఁ జింతింపవలయును. ఓజననీ! భక్తియోగమును సవిస్తరముగా నీకుఁ దెలిపితిని. ఇఁకఁ దాదృశభక్తివలనఁ గలుగులాభమును జెప్పెద విను. పురుషుండు ప్రారబ్ధము నశించునంతవఱకు ననుసరించుచున్న మనోవ్యాపారరూపమయినభక్తిచే పరమాత్మస్వరూపమును సాక్షాత్కరించుకొని, సుఖదుఃఖముల నతిక్రమించినగుణాష్టకరూపమహిమయందున్నవాఁడయి తనయాత్మయందు సుఖదుఃఖములకు హేతువగు దేహాత్మాభిమానాదికము కర్మాధీనమయి ప్రకృతిపరిణామరూపమయిన దేహసంబంధమున కధీనమయినదని చూచుచున్నాఁడు. ప్రారబ్ధమున్నంతకాల మనువర్తనముగలిగి పరమాత్మసాక్షాత్కారమువలన స్వస్వరూపము నెఱిఁగినవాఁడు నిరతిశయానంద బ్రహ్మస్వరూపమును దచ్ఛరీరుఁడయిన ప్ర

త్యగాత్మను దెలిసికొని యానందసముద్రమున మునింగి, యీశ్వరసంకల్పమువలన నపగతమయిన నశ్వరదేహమును కల్లుద్రావినవాఁడు తన్మదాంధుఁడయి కట్టుపుట్టమును జూడనివిధమునఁ జూడక వర్తించుచుండు. ఈశ్వరసంకల్పరూపమగు పుణ్యాపుణ్యముల కధీనమయిన దేహము దనకు నిమిత్తభూతమగు కర్మమెంతకాలము నశింపక యుండునో యంతకాలము నింద్రియప్రాణసహితమయి యాకర్మావసానమునకయి ప్రతీక్షించుచుండు. అట్లు ప్రతీక్షించిన మహాత్ముఁడు గుణాష్టకముతోఁ గూడిన యాత్మస్వరూపమును బొంది ప్రారబ్ధావసానమందు ముక్తిఁ జెంది స్వప్నపదార్థములవలె ననిత్యములయిన దారపుత్త్రాదులతోఁ గూడియున్న దేహము నింకఁ బొందఁడు. లోకములో మానవుఁ డత్యంత ప్రియుఁడయిన పుత్త్రునికంటెను ధనముకంటెను మిత్రునికంటెను వేఱయినవాఁడై యున్నట్లు ప్రతీయమానుం డగుచున్నాఁడు. అట్లె తనకుఁ బ్రియమైన దగుటచేతను, నాత్మయగుటచేతను, దనకభిన్నమగుటచేతను నభిమత మగుశరీరాదులకంటెను బ్రత్యగాత్మ వేఱగుచున్నాఁడు. కొఱవికంటెను మిణుఁగుఱులకంటెను ధూమముకంటె నగ్ని వేఱగుచున్నది. అట్లె యాత్మ యాత్మయని యే తలంచుకొనుచున్న దేహాదులకంటె వేఱగుచున్నాఁడు. మఱియు వెనుకటిదృష్టాంతములవలె భూతములు, నింద్రియములు నంతఃకరణము స్వరూపముగాఁ గల్గుప్రకృతికంటెను క్షేత్రజ్ఞునికంటెను నాప్రకృతి పురుషులలోఁ బ్రవేశించి ధారకుఁడయి సర్వజ్ఞుఁడయి షాడ్గుణ్యముతో నొప్పుచు సాఱొద్బ్రహ్మపదవాచ్యుఁడయిన భగవంతుఁడు పృథక్కృతుఁ డేయని తలపోయుము. దేవాదిచతుర్విధశరీరములందుఁ బ్రవేశించి ధారకుఁ

డయియున్న జీవాత్మలను జ్ఞానైకాకారత్వాదులచే నేకస్వరూపులనుగాఁ జూచుచు నట్లె యాత్మయందు ధార్యములయి యున్న దేవాదిచతుర్విధభూతములను గర్భాధీనమయివచ్చు నవాంతర భేదములను విడిచి ప్రకృతిపరిణామరూపము లగుటచే నేక రూపము లేయని చూడవలయును. మఱియు నాజీవులు పరమాత్మకత్వమును జూడవలయును. ఓజననీ! తనకుఁ గారణభూతము లగుతృణమునందును, దారువునం దున్నయగ్ని యొక్కటైనను కారణములైన తృణదారువులందున్న దీర్ఘత్వకుటిలత్వాదిధర్మములచేఁ గలుగు వైషమ్యమువలన నానావిధములయినట్లు తోఁచుచున్నది అట్లె ప్రకృతియందునున్న ప్రత్యగాత్మయు దేవాది కృతభేదముచే నానావిధములయి తోఁచుచున్నాఁడు. కాని జ్ఞానైకాకారతనుబట్టి జీవులందఱేకరూపులేయని యెఱుంగవలెను. విష్ణుసంబంధినియై కార్యకారణ రూపముగానున్నదై దురత్యయమైయున్న ప్రకృతిని భక్తియోగముచేఁ దిరోధానము గావించుకొని గుణాష్టకముతోఁ గూడినరూపమును బొంది మగుడ సంసారబంధమునుబొందఁడు. ఇది యిరువదియొనిమిదవయధ్యాయము.



అని చెప్పినకపిలాచార్యుంజూచి దేవహూతి యిట్లనియె. "ఓ మహాత్మా! మహదాదితత్త్వంబులకును, బ్రకృతికిని, బురుషునకును, బరస్పరలక్షణంబులను, దదీయస్వరూపంబులను దెలియఁ జెప్పితివి. ఇఁకమీఁద నీచెప్పినప్రకారమున సాంఖ్యమం దేప్రకారముగాఁ జెప్పఁబడినదో తెలియఁజేయుము. మఱియు బురుషుం

కపిలుండు దేవహూతికి భక్తిమార్గము తెలియఁ జేయుట.

డు భక్తియోగంబునంజేసి సమస్తలోకవిరక్తుం డగునట్టియో

గంబును; ప్రాణులకు సంసారం బనేకవిధములయి వర్తించును గావున నాయావిధంబులను దెలియఁజేయుము. ఓ దేవా! నీవు, సమస్తమానవుల నజ్ఞానమనెడి యంధకారమున మునిఁగి వర్తించుచున్నవారలయి నిద్రవ్రాలుచుండఁగా వారలను మేలుకొలుప యోగభాస్కరుండవయి యవతరించినావు. నీదయవలన నాయవివేకము చాలవఱకు మరలినది. ఈనాయడిగినప్రశ్నములకు నుత్తరంబులనిచ్చి సంశయములంబాపి తరింపఁజేయుము" అని పలుకుచున్న దేవహూతికిఁ గపిలాచార్యుం డిట్లనియె. తల్లీ! లోకములోని పురుషస్వభావంబులంబట్టి భక్తియోగము సాత్త్వికంబనియు, రాజసంబనియుఁ, దామసంబనియు మూఁడు తెఱంగులయ్యె. అందుఁ దామసభక్తియోగంబు దెలిపెదవినుము. హింసనుగాని, దంభమునుగాని మచ్చరమునుగాని వీనిలో రెంటినిగాని మూఁడింటినిగాని యవలంబించి వర్తించుచుఁ, గ్రోధపరీతుండై భేదబుద్ధిగలవాఁడయి నాయందు భక్తిభావమును గనుపఱుచువాఁడు, తామసభక్తుఁ డనఁబడు. శబ్దాదివిషయలాభములనుగాని కీర్తినిగాని నైశ్వర్యమునుగాని యపేక్షించి పృథగ్భావముకలవాఁడై, నన్నుఁ బూజించువాఁడు రాజసభక్తుండనంబడు. మఱియుఁ దనపాపకర్మములను నశింపఁజేసికొనఁగోరి సమస్తమును బ్రహ్మస్వరూపముగా నెఱింగి "మానవుఁడై జన్మించినవాఁడు భగవంతుని బూజించుట విహితకృత్యము"ని తలంచుచు భక్తితో నన్నుఁ బూజించువాఁడు సాత్త్వికభక్తుఁ డనఁబడును. అట్టి భక్తుఁడు సర్వగుణాశ్రయుఁడనయిన నాసచ్చరిత్రముల వినుటచే సముద్రమందు నిరాటంకంబుగాఁ బ్రవేశించు గంగాప్రవాహమువలె నొప్పి యితరవస్తువున్నదనునమ్మకము లేక ఫలా

ద్యుపాధిరహితయయి ప్రీతిపూర్వనుండుఁ గల యనుస్మరణపూర్వకమగు మనోవృత్తియే భక్తియోగస్వరూపమని యెఱుంగుము. అందులోఁ బరమేశ్వరుండనయిన నాయందు నిమిత్తకమయిన భక్తి కలవాఁడయి ప్రవర్తించినచో నట్టినాభక్తులకు నిష్కామమయిన భక్తియోగము సాయుజ్య, సాలోక్య, సామీప్య, సారూప్య, ముక్తులకు సాధనంబులయి యుండును. నిర్గుణభక్తులు నాసేవనుదక్క సాలోక్యాదిముక్తుల నపేక్షింపరు, ఇట్లుండ సాంసారికఫలముల నపేక్షింపరని వేఱచెప్పవలయునా ? అట్లు సాలోక్యాదిముక్తులు న్నను వానిని విడిచి నిష్కాముఁడై నాపదభజనంబు సేవించువాఁ డితరకార్యములయందు మానసమును జొనుపక యుండిన నాత్యంతికభక్తుఁ డనఁబడును. అట్టిభక్తియోగ మాత్యంతిక మనఁ బడును. అట్టియాత్యంతికభక్తియోగ మవలంబించి యేవాఁడు సత్వాదిగుణముల నతిక్రమించి మత్స్వరూపమును జెందునో వాఁ డాత్యంతికభక్తుఁ డనఁబడును. మఱియు ఫలాపేక్ష లేకుండఁ దనవిహితకృత్యముల నాచరించుటయు భక్త్యంగములలో బలవత్తరమయి, ప్రశస్తమయియున్న పంచరాత్రోక్తపూజాయోగమును నడపుటయు, నానివాసస్థానమయిన వైకుంఠమును జూచుటయు, నన్నుఁ బూజించుటయు, స్పృశించుటయు, స్తోత్రము చేయుటయు, నుతించుటయు, సమస్తభూతములు నాస్వరూపము లేయని తలంచుటయు, ధైర్యవంతమగు వైరాగ్యము గలిగియుండుటయుఁ, దనకంటె నధికులగువారిని గౌరవించుటయు, దీనులయందు దయగలిగి యుండుటయు, దనతోసమానులగు వారితో సఖ్యము చేయుటయు, యమనియమాదులయిన యోగముల నభ్యసించుటయును, వేదాంతశాస్త్రములను సర్వదా నాల

కించుటయు, నానామమును సంస్మరించుటయు, మనోవాక్కా యశుద్ధిగా సాధుస్నేహము చేయుటయు, నిరహంకారుఁడయి వర్తించుటయు, నివియన్నియు భక్తి కంగములని తెలియుము. నీచెప్పినగుణములన్నియుఁ గలిగి మద్ధర్మానుష్ఠానమును జేయు నట్టి మానవు చిత్తము నిర్మలమగును. మఱియు వేగముగా నాపదమును బ్రయత్నము లేకయే పొందుచున్నాఁడు. పుష్పము లందుండు పరిమళము వాయువు నొంది యప్రయత్నముగానే వచ్చి ఘ్రాణేంద్రియమును బొందుచున్నట్లు యోగముల నభ్యసించువానిమానస మప్రయత్నము చేతనే పరబ్రహ్మమైననన్నుఁ బొందుచున్నది. ఈ చెప్పినవి సాత్త్వికభక్తియోగములు. ఇఁక తామసభక్తియోగములను దెల్పెద నాలింపుము. సమస్తభూతములయందు నంతరాత్మరూపుఁడనై యున్న నన్నుఁ దెలిసికొనక నన్నుఁ బూజింప నారంభింతురు. మఱియు భూతములయందు నివసించియున్న నన్నుఁ దెలిసికొనక పూజించువాఁడు భస్మమునందు చేసినహోమమువలె వ్యర్థమని తలపోయుము. దేహగేహములయం దభిమానము కలవాఁడై యితరభూతములయందున్న నాతో విరోధించుచు నాపూజాదులయందు భేదబుద్ధి కలవాఁడయి, యున్నవానిచిత్త మెప్పటికిని శాంతత్వమును బొందలేదు. ఓతల్లీ! కొండంత లేసి పదార్థములచేఁ బూజించినను భూతసమూహముల కవమానము చేయువారలను గూర్చి నేను సంతసింపను. వానిపూజలన్నియు వ్యర్థములే యని తెలిసికొనుము. కావునఁ దనహృదయమందును, సర్వభూతములయందును, నున్న నన్నుఁ దెలిసికొనునంతవఱకు స్వధర్మముల నాచరించుచుఁ దనహృదయపద్మమునందుఁ బూజిం

చుకొనుచుండవలయును. సమస్తభూతములను దన్నును గొంచెమైన భేదబుద్ధితోఁ జూచినను వాఁడు మృత్యుభయము నధికముగాఁ జెందుచుండును. మఱియు ఘోరంబులగు నరకంబులం బడును. కావున మున్ముందు సర్వభూతములయందు నున్నన్ను మైత్రితోఁ జూచి యభేదబుద్ధి కనఁబఱుచుచు, దానము, గౌరవము మొదలగువానిచే బూజింపవలయును. భూతముల తారతమ్యమును దెలిపెదవినుము. చేతనములు చేతనరహితములగు పృథివ్యాదులకంటె నుత్తమమయినవి. స్పర్శనజ్ఞానంబు గలిగి ప్రాణవంతములయి వర్తించు వృక్షాదులకంటె రసజ్ఞానము గలిగి వర్తించు మత్స్యాదులు శ్రేష్ఠములు. వానికంటె పరిమళమును దెలిసికొనునట్టి మధుకరాదు లుత్తమములు. ఆ మధుకరాదులకంటె శబ్దవేదులయిన సర్పాదు లుత్తమములు. అట్టి సర్పాదులకంటె రూపములను దెలిసికొనఁ జాలినట్టి కాకాదు లుత్తమములు. వానికంటె రెండువైపులను దంతములు గలవి యుత్తమములు. వానికంటెఁ జతుష్పాజ్జంతువు లుత్తమములు. వానికంటె ద్విపాజ్జంతువు లనఁబడు మనుష్యాదు లుత్తమములు. వారలలో బ్రాహ్మణాది నాల్గువర్ణములవారు నుత్తములు. వారిలో బ్రాహ్మణు లుత్తములు. వారికంటె వేదములను జదివినవాఁ డుత్తముఁడు. వానికంటె వేదార్థమును బాగుగ నెఱిఁగినవాఁ డుత్తముఁడు. వానికంటె సందియముల నన్నింటిని దొలంగింపఁజాలినవాఁడగు మీమాంసకుం డుత్తముఁడు. వానికంటెఁ దనకు విహితములయిన కృత్యముల నాచరించినవాఁ డుత్తముఁడు. వానికంటె ముక్తసంగుఁడు శ్రేష్ఠుండు. నిష్కాముఁడయి ముక్తసంగుఁ డయినవానికంటెఁ దాఁ జేసినకర్మకలాపము

ను దనయాత్మను నాకర్పించినవాఁడుత్తముఁడు. ఓతల్లీ ! శేషి యు నంతర్యామియునగు నాయందుఁ దనయాత్మను నిలిపి తాఁ జేసిన కర్మకలాపము నాకర్పించి సర్వభూతముల కాత్మనై క్రియాప్రవర్తకుఁడనై యున్న నాయందుఁ బనులందలి కర్తృత్వ మంతయు నుంచుటవలనఁ దనయందుఁ గర్త్రభిమాన ముంచు కొనక జేతనాచేతనాత్మక మగు ప్రపంచము బ్రహ్మాత్మక మయి నదను జ్ఞానముగల భక్తునికంటె నధికుఁడయినవాఁడు లోకము లో నుండఁడని తెలిసికొనుము. మఱియు మానవుఁడు నిర హంకారుఁడును నిర్గర్వుఁడునై సమస్త చరాచరములయందు భగవత్కళ యున్నది యని భావించి మనస్సుచేత సర్వభూతము లకు నమస్కరింపవలయును. అదియె సమదర్శన మనఁబడును. ఓజననీ ! భగవదుపాసనాత్మక మగు భక్తియోగమును, బ్రకృ తికంటె వేఱయి బ్రహ్మశరీరకుఁడయియున్న ప్రత్యగాత్మను దె లుపు జ్ఞానయోగమును నీకుఁ దెలిపితిని. పండితుఁ డీరెండింటిలో నొకదానిని జేకొని పరమపురుషునిఁ జేరవలయును. ప్రాణి లోకంబునకుఁ గలిగెడి వివిధములయిన సంసారబంధములఁ దె లిపెద వినుము. ప్రకృతిపురుషులకంటె నీశ్వరసంకల్పముకంటె నదృష్టముకంటెను విలక్షణమై, యున్నకాలము భగవద్రూ ప మని చెప్పుచున్నారు. అట్టి భగవద్రూపమయినకాలమే రూప విశేషములకుఁ గారణమయి మహదాదిభూతములకుఁ గూడఁ బరిణామమును గలిగించుచు భేదబుద్ధులకు భయమును గలిగిం చుచున్నది. కాలస్వరూపుఁడయిన భగవంతుఁడు సమస్తభూ తములయందుఁ బ్రవేశించి భూతములచేత మఱికొన్నిభూతము లను జంపుచున్నారు. ఆకాలరూపినె విష్ణువని పిలువఁబడు

చున్నాఁడు. అతఁడు బ్రహ్మాదిదేవతలకుఁగూడ నధిపతియై ప్రవర్తించుచున్నాఁడు. అతనికి లోకములో నొకఁడు శత్రువు లేడు. మిత్రుఁడులేడు. అందఱు సమానులేకాని లోకములోఁ బ్రమత్తులై వర్తించు మూఢజనులయందు ద్వేషము నవలంబించి చంపుచుండును. అతనియాజ్ఞకు సమస్తభూతములును భయపడును. అతనికి భయపడి యతనియానను శిరసావహించి వాయువు సర్వకాలములయందు వీచుచుండును. సూర్యుఁడెల్లప్పుడుఁ బ్రకాశించుచు లోకములకు వెలుతురును వేఁడిమిని నిచ్చుచుండును. పర్జన్యుండు వర్షించును. నక్షత్రసమూహములన్నియుఁ బ్రకాశించుచున్నవి. సమస్తజాతులగు చెట్లు, తీవెలు మొదలగునవి యాయాకాలములయందుఁ బూచుచు, ఫలించుచునుండును. నదులన్నియు స్రవించుచుండును. సముద్రము తనమేరనుమీఱి రానొల్లదు. అగ్ని ప్రజ్వలించును. భూమి సమస్తగిరిసమూహముతోను గదలక వర్తించును. ఆకాశము సమస్తజంతువులకు నవకాశ మిచ్చుచున్నది. మహత్తత్వము పృథివ్యాద్యావరణములతోఁ గూడియున్న స్వదేహమును విస్తరింపఁ జేయుచున్నది. రజస్తమోగుణాభిమానులయిన బ్రహ్మాదిదేవతలందఱు నతనియాజ్ఞను దలనిడికొని ప్రతియుగమునందు జగత్సృష్టిని జేయుచున్నారు. మఱియుఁ గాలస్వరూపియయిన భగవంతుండు, జననమరణాదిరహితుండై వర్తించుచు జనకాదులచేఁ బుత్త్రులను బుట్టించుచు,మృత్యువుచే వారలను జంపించుచు,నంటియు నంటనిచందంబునఁ బ్రవర్తించుచుండును. ఇది యిరువది తొమ్మిదవయధ్యాయము.



ఓతల్లీ! ప్రాణులయొక్క సంసారక్రమములను దెలియఁజె ప్పెదను వినుము. భగవద్రూపమగు కాలముచే సమస్తప్రాణు ల యాయువులు హరింపఁబడుచున్నను, దమ్ముఁ తోలఁగఁద్రోయు చున్న వాయుప్రబలమును మబ్బులసమూహ మెఱుఁగనివిధంబు నఁ బ్రాణు లా కాలమునకుఁగల జనము నెఱుఁగఁజాలరు. మఱియుఁ బ్రాణికోటి సుఖము నభిలషించి యందులకుఁ గారణములయినప దార్థముల నతిప్రయాసముచే సంపాదించుకొనుచుండఁ గాలాత్మ కుఁడయిన భగవంతుఁడు వాని నెల్ల నశింపఁజేయుచుండును. అం దువలనఁ బ్రాణులు తమకు సుఖకారణములయినవస్తువులు నాశ నమందినవని తలంచి యేడ్చుచుందురు. మఱియును బ్రాణులకు దారపుత్త్రాదులు, ధనములు, గృహములు, మొదలగునవి యన్నియు నశించునవే కాని నిత్యములు కావు. అట్లయినను మా నవు లవివేకముచే వాని నన్నింటిని నిత్యములుగా నెంచుచుందు రు. ఆకారణమున వెనుకటివస్తువులలో నేదైన నశించినచో మితిలేనిదుఃఖము నొందుచుందురు. ఇందులకుఁ గారణము దే హాదు లనిత్యములయినను నిత్యవస్తువులనుగాఁ దలంచుటయే యని తెలిసికొనుము. ప్రాణులు దేవమనుష్యాదిజన్మములను నిజకర్మకారణంబున నెత్తుచుందురు. అట్లు పుట్టి సుంతేనియు సుఖ మనుభవింపఁజాలరు. సుఖములేని యిట్టిజన్మములతో లా భ మేమికలదని విరాగమునయినను జెందరు. నరకము లనుభవిం చుట మిగులఁ గష్టములని యందఱికిని దెలిసిన విషయమే కదా? ప్రాణు లట్టినరకములోనున్నను భగవంతునిచే మోహి తులయి, యచ్చట నీఁబడుచున్న యాహారాదులవలనఁ గొంచె ము సుఖము కలవారయినందున నా నరకమందుండు దేహముల

నైన విడువనిష్టపడరు. అట్టి నరకసంబంధియగుశరీరమునే విడువ నిష్టపడ రనునప్పుడు దేవమనుష్యాదిశరీరములను విడువఁజాలరని వేఱ చెప్పవలయునా? మఱియు జీవులు తమదేహములను, భార్య లను, పుత్త్రాదిబంధువులను, ధనములను, గృహములను, జూచికొని తాను మిగుల నుత్కృష్టుఁడని తలంచుకొనుచుందురు. ప్రాణులు తమభార్యాపుత్త్రాదులను బోషింప సమకట్టియహర్నిశము బాటుపడుచు, నాయాకాలములయందుఁ దమకుఁ బ్రాప్తము లగుచున్న శరీరములకు వచ్చుకష్టములనోర్చి దుష్టచిత్తులయి పె క్కులగు దురితకార్యముల నాచరించుచుఁ బ్రవర్తించుచుందురు. అకటా! నశ్వరములయిన వానిగూర్చి పాటుపడుచు దుఃఖముల ననుభవింపఁజేయు పాపకార్యముల నార్జించుకొనుచున్నామే? వీనిని విడువవలయునని తలంపక వర్తించుచున్నవారలను మూ ఢులని చెప్పుటకు సందియమున్నదా? వారు, వ్యభిచారిణులయి వర్తించు స్త్రీలసంభోగాది రహస్యకృత్యములకును, దనకుమారు లు పలుకుచున్న ముద్దుమాటలకుఁ దమచిత్తముల నధీనముల గాఁజేసి మిగుల నవివేకవృత్తితో సంచరింతురు. మఱియు గృహ స్థులు దుఃఖమే ప్రధానముగాఁగల గృహములయందు సంచరిం చుచు, దమచేతనైన కర్మముల నాచరించి దుఃఖములను గొంచె ము నివర్తించుకొనుచుఁ, దాము సుఖవంతులయి వఱలుచున్నట్లు తలంచుకొనుచుందురు. ప్రాణులు సేయుంబవళ్లు బహుక్రూరకృ త్యముల నాచరించి సమస్తభూతములకును, బాధగలిగించి ద్ర వ్యంబును గొనివచ్చి దారసుతాదులను బోషించుచు వారలు తినఁగా మిగిలినదానిని దా ననుభవించుచు, నిట్లు తమశరీరము నంతను వారికయి యుపయోగించి పిమ్మట నధోలోకములకుఁ

బోవుచున్నారు. మఱియుఁ దమభార్యాపుత్త్రాదులను బోషింపఁ దగినంత ధనమును సంపాదింప నారంభించి జీవనోపాయము దైవముచే నిహతముకాఁగాఁ బేరాసగలవారయి యసమర్థులై పరులద్రవ్యము నాశించి యపహరింపఁ బూనుకొనుచుందురు. అట్లు పరులద్రవ్యముల నపహరించి కుటుంబభరణమం దశక్తుఁడయి కుటిలబుద్ధియై మందభాగ్యుఁడై వృథాప్రయాసముఁ బడుచు, చింతతోనే తనజీవితకాలమునంతను బుచ్చుచు, నెట్టిసత్కార్యమునైన నాచరింపలేక, రిత్తవిచారంబు పెట్టికొని తనయింట వసించుచుండు. అప్పుడు తమదారసుతాదులు వానినిఁ దమ్ముఁ బోషింప సమర్థుండు కాఁడనియెఱింగి, సేద్యగాఁడు పనిచేయలేనంత ముదుసలియైయున్న వృషభమునెడ రోఁతనొందునట్లు, "వీఁడెందులకుఁ బనికిరాఁడు. తిని కూర్చుండుటతప్ప మఱేమియుఁ జేయలేఁడు. ఇట్టివాఁడు బ్రదికి మమ్ము బాధించుచుండుటకంటెఁ జచ్చుటయే మంచిద"ని నిష్ఠురవాక్యములను బలుకుచుఁ దిరస్కరించుచుందురు. అట్లు దారపుత్త్రాదులు నిష్ఠురవాక్యములచే నొప్పించుచున్నను, విరక్తి చెందనిష్టపడక, పూర్వము తాను సంపాదించినధనాదులచే దారపుత్త్రాదు లవమానించుచుఁ బెట్టుచున్నయన్నాదులను శునకమువలెఁ దిని జీవించుచు, ముదుసలితనము శరీరపాటవమును నపహరింపఁ దిన్నపదార్థము నఱిగించునంతటి జఠరాగ్ని లేమిచే నల్పాహారియై, శ్లేష్మముచే నావరింపఁబడిన ప్రేవులుకలవాఁడై కాసశ్వాసాదిరోగములచే మిగుల నాయాసపడుచు,మాటలాడ శక్తిలేక కంఠమునందే ఘురఘురశబ్దమును జేయుచుండు. మఱియుఁ దాను మంచమున శయనించి యేడ్చుచుఁ దన్నుఁ బరివేష్టించియున్న బంధువులచేఁ బిలువఁబడి

యుఁ గాలపాశవశుఁడగుట ప్రత్యుత్తర మీఁజాలఁడు. ఓజననీ! ప్రాణులకుంగల యౌవనజరావస్థ లిట్లు దుఃఖబహుళములయి యుండును. ఇట్లు కుటుంబభరణమందు వ్యాపృతుండై యొక సత్కార్యమయిన నాచరింపలేక యజితేంద్రియుఁడయి, తన వారు విలపించుచుండఁ జచ్చును. అప్పుడు యమభటులువచ్చి కాలపాశములచేఁ గట్టఁగా వాఁడు భయముచెంది మూత్ర పురీషములను బుచ్చుచుండు. అంత యమభటులు వానిని*యా తనా దేహమునందుఁ బ్రవేశింపఁజేసి యపరాధిని రాజభటులు గొనిపోయినచందంబున నీడ్చుకొనిపోవుచుఁ జాలదూరము పోయి పోయి మధ్యమార్గమందు యమభటు లర్పించుచున్న దెబ్బలకు సైఁపలేక గడగడవడఁకుచు, నొక్కొక్కచోఁ గుక్కలచేఁ గఱువఁబడి యాబాధల ననుభవించుచు, దానార్జించిన పాపముల నన్నింటిని దలంచుకొని మిక్కిలి పశ్చాత్తాపపడుచుండును. మఱియు విశ్రాంతిస్థానములును జలమును లేనిమార్గమున నాఁకలిచేతను, దప్పిచేతను, మిగుల బాధపడుచు,సూర్యాగ్నుల వేఁడిమిచేఁ దపింపఁబడుచు, కొరడాదెబ్బలను, దినుచు,నడువశక్తి లేనివాఁడయిన నతికష్టముచే నడుచుచుండును. ఇట్లు వాఁడు పాపిష్ఠమార్గమున నొక్కొకచోటఁ బడుచు లేచుచు మూర్ఛిల్లుచు బలుబాము లనుభవించుచు యమలోకమునకుఁ దీసికొని పోఁబడును. మఱియు యమలోక మిచ్చటికిఁ దొంబదితొమ్మిది వేల యోజనములదూరమం దుండును. అంతదూరమున్నను బ్రాణి పాపాత్ముఁడైనచో మూఁడు ముహూర్తములకాలములోఁ

* పరలోకములందుఁ బుణ్యపాపంబుల ననుభవించుటకయి మరణానంతరమున జీవులు గైకొను శరీరమునకే యాతనాశరీరమని పేరు.

గాని రెండు ముహూర్తముల కాలములోఁగాని కొనిపోఁబడును. ఆయమలోకమందుఁ బాపాత్ము లనుభవించుచున్న బాధలకు మితిలేదు. కొఱవులచే వానిశరీరమును గప్పి ప్రజ్వలింపఁజేయుదురు. తనశరీరమాంసమును గత్తులతో ఛేదించి తనకుఁ దినుటకై యిత్తురు. కుక్కలచేతను, గృధ్రములచేతను గఱపించి వానిశరీరములో నున్న ప్రేవులను బైకి నూడలాగింతురు. తేళ్లచేతను, బాములచేతను బాధింతురు. ముక్కముక్కలుగా ఖండింతురు. ఏనుఁగులచేఁ ద్రొక్కింతురు. పర్వతములపయి కెక్కించి క్రిందికిఁ దిరుగఁద్రోతురు. నూతులలోనుంచి యడుగున నుండనిత్తురు. మఱియుఁ దామిస్రము, అంధతామిస్రము మొదలగు రౌరవాదినరకములం ద్రోసి మిగుల బాధింతురు. ఇట్లు స్త్రీలుగాని పురుషులుగాని యాతనాదేహములనుబొంది మిగుల బాధింపఁబడుచుందురు. ఓతల్లీ! స్వర్గనరకము లీలోకమందె కలవందురు. నరకబాధలుకూడ నీలోకమునఁ గలవు. ఓతల్లీ! కుటుంబపోషణమునిమిత్తమై పాటుపడుచున్న వారలంతమునఁ దనదేహమును, గుటుంబమును విడిచి నరకలోకమునకుఁబోయి కుటుంబపోషణ ఫలమునుమాత్రమే యనుభవించుచుందురు. మఱియు భూతములకు ద్రోహము చేసి సంపాదించిన ధనము వలన పోషింపఁబడిన దేహము నిచట విడిచి పాపమునే దారిబత్తెమునుగాఁగొని నరకమార్గమును బొందుదురు. వారలు తాము చేసికొన్న పాపముల నన్నియుఁ దామే యనుభవింపవలయును. మఱియుఁ గేవలము కుటుంబభరణమువలనఁ గలిగిన పాపము దైవప్రాపితముకాఁగా నష్టధనునివలె నాతురుఁడయి నరకమందు దాని ననుభవించును. కొంచెమేనియు ధర్మముచే

యక కుటుంభరణాసక్తుఁడగువాఁ డంధతామిస్ర మనునరకము ననుభవించు. ఇట్లు పాపముల నార్జించుకొని చచ్చి యమలోక మున సమస్తపాపము లనుభవించి పవిత్రుండయి తిరిగి భూలోక మునకువచ్చి నరుఁడైపుట్టుచున్నాఁడు" అని చెప్పి కపిలాచార్యుండు తిరిగి తల్లికిట్లనియె. ఇది ముప్పదవ యధ్యాయము.

—·✣·—

**కపిలుండు దేవహూతికిఁ బిండోత్పత్తిక్రమము తెలుపుట**

తల్లీ! యౌవనమందును, జరావస్థయందును, జచ్చినతరు వాతను గలుగుచున్న దుఃఖములను దెలియఁజెప్పితిని. ఇంకఁ బ్రాణులు తల్లిగర్భమందున్నప్పు డనుభవించుచున్న కష్టముల నుగుఱించి చెప్పెద నాలింపుము. * జీవుడు భగవంతుని యాజ్ఞ

* ఓయీ! "పునరస్త్రాప్రజేచ్ఛుచిః" అని చెప్పఁబడినది. అనఁగాఁ గర్మములు పూర్ణముగా ననుభవింపఁబడుటచేఁ బవిత్రుఁడయి యీలోకము నకు వచ్చునని యర్థము మఱియు "కర్మణాదైవనేత్రేణ" ఈశ్వరుఁ డేర్పాటు జేసిన తనపూర్వకర్మముచేఁ దిరుగఁ బుట్టుచున్నాఁడని చెప్పుచున్నారు. వీనికి సకలకర్మములు ననుభవింపఁబడియుండ దైవము వీనికిఁ దిరుగ కర్మము నెట్లు తేఁగలఁడు. శ్రుతులుకూడ సమస్తకర్మఫలములు ననుభూతములయినట్లు చెప్పఁ బడుచున్నవి. శ్రు. "యావత్సంపాతముషిత్వా దైవతమేవాధ్వానం పునర్నివర్తంతే" అనఁగాఁ గర్మమున్నంతకాల మచట నివసించి మఱలుదురని తాత్పర్యము. అట్లె మఱియొకశ్రుతి. "ప్రాప్యాంతంకర్మణస్తస్య యత్కించేహకరోత్యయం। తస్మాల్లోకాత్పునరేత్యస్మై లోకాయకర్మణః" అనియున్నది. కావున సకలకర్మఫలము ననుభవించి శుచిత్వమును బొందినవాఁడు తిరిగి యిచ్చటికివచ్చుననుట విపరీతముగా నున్నది. అదియందురేని చెప్పెద వినుఁడు. అనుభవింపఁబడనిదియు, నకృతప్రాయశ్చిత్తములునైన కర్మములు కర్మాంతరఫల మనుభవించుటవలన నశింపవు. కాన దానాకర్మములను బురస్కరించుకొని రావ

ప్రకారము తిరిగి మానవశరీరము దాల్ప యత్నించి యొకపురుషు నాశ్రయించి పిమ్మట నతని తేజఃకణము నాశ్రయించి స్త్రీగర్భగోళమందుఁ బ్రవేశించి యొకరాత్రియంతయు రక్తమిశ్రమయియుండు. అది యైదుదినములకు గుండ్రనిదయి పది దినంబులకు రేఁగుబండంతదియై కొంచెము కఠినమయినదయియుండును. తరువాత నది యొకమాంసపుముద్దయగును.

---

చ్చు. తా ననుభవించిన కర్మమునఁగూర్చియే వానికి శుచిత్వము కలుగుచున్నది కాని సర్వకర్మఫలములు ననుభూతములగుటచే శుచిత్వముకలుగలేదు కావున దా ననుభవింపనికర్మములఁ బురస్కరించుచు మగుడ నీలోకమునకు రావచ్చును. ఇట్లనుటకుఁ బ్రమాణము శ్రుతిస్మృతులుకలవు. శ్రు. "యఇహ రమణీయచరణా అభ్యాశోహయత్తే రమణీయాం యోని మాపద్యేరన్ బ్రాహ్మణయోనిం క్షత్రయోనిం వైశ్యయోనింవా, అథయఇహ కపూయచరణా అభ్యాశోహయత్తే రమణీయాం యోని మాపద్యేరన్ శ్వయోనిం సూకరయోనిం చండాలయోనింవా" అనఁగా నెవరీలోకమునఁ బుణ్యకర్మములాచరింతురో వారు బ్రాహ్మణులై కాని క్షత్రియులైకాని వైశ్యులై కాని పుట్టుచుందురు. ఎవరీలోకమునఁ బాపకర్మములాచరింతురో వారు కుక్కలై కాని పందులైకాని చండాలురయికాని పుట్టుదురని తాత్పర్యము. ఈయర్థము విషయమయి స్మృతియుఁగూడ గలదు. "వర్ణాశ్రమాశ్చస్వకర్మనిష్ఠాః ప్రేత్యకర్మఫలమనుభూయ తతశ్శేషేణ విశిష్టదేశజాతికులరూపాయుశ్శ్రుతవృత్తవిత్తసుఖమేధసో జన్మప్రతిపద్యంతే విష్వంచో విపరీతానశ్యంతి తథాతత్పరివృత్తౌ కర్మఫలశేషేణ జాతింరూపంవర్ణం" అనఁగా వర్ణాశ్రమోచితకర్మనిష్ఠులు మరణించి కర్మఫల మనుభవించుచు మిగిలిన కర్మమనుభవింపఁ బ్రవృత్తులై తత్తత్కర్మానుసారముగా సుదేశములందు మంచిజాతులందు మంచికులమందు రూపవంతులై ధనవంతులై యాయుష్మంతులై సుప్రవర్తనులై సుఖవంతులై మేధావంతులై పుట్టుచున్నారని తాత్పర్యము. కావున దైవప్రేరితములగు కర్మాంతరములను బురస్కరించుకొనిజన్మింపవచ్చును.

ఒక్కమాస మగునప్పటికి శిరస్సేర్పడును. రెండుమాసములకు కరచరణాద్యవయవవిభాగ మేర్పడును. మూడవమాసమునం దు నఖరోమాదులును, లింగమును ఛిద్రములును కలుగును. నాల్గవమాసమందు సప్తధాతువులు నుదయించును. అయిదవ మాసమునందు నాఁకలియు దప్పియు జనించును. ఆఱవమాసము న జరాయువుచేఁ బరివేష్టింపఁబడి తల్లికుడిపార్శ్వమునందు వర్తిం చును. అది మొదలు కుక్షిస్థజంతువు తల్లితినుచున్నయన్నపానా దులచే వర్ధింపఁబడుచు సూక్ష్మజంతువులచేఁ బరీతమయి మూ త్రపురీషాదులుగల గర్భకోశమునందు శయనించుచుండును. అచ్చట వర్తించుచు క్షుధితములగు సూక్ష్మజంతువులచేఁ గఱవఁ బడుచుఁ దాను సుకుమారాంగుఁడై యుండుటవలన నాకాటుల బాధలకోర్వలేక మాటిమాటికి మూర్ఛచెందుచుండును. మఱి యుఁ దనతల్లి, కారపువస్తువులుగాని పులుసువస్తువులుకాని చేఁ దువస్తువులుకాని మఱి దుస్సహవస్తువులనుగాని తినినచో నా యారసములచేత మిక్కిలి సంతాపమును జెందుచుండును. మా విచేఁ బరీతుఁడయి తనశిరస్సును గుక్షియందుఁ జేర్చికొని మెడను వంకరగానుంచుకొని, ప్రేవులచే నావృతుండై కదలుటకయినఁ దగినంత యవకాశము లేక పంజరమందున్న పక్షివలె వర్తించు చుండును. అప్పుడు దైవవశమువలన నతఁడు బూర్వకర్మజ్ఞానము గలవాఁడై తనకర్మములను స్మరించుకొనుచుఁ బశ్చాత్తాపమును జెంది నిట్టూర్పుపుచ్చుచుఁ, గొంచెమైనను సుఖములేక వర్తిం చును. పిమ్మట నేడవమాసమునందు సుఖదుఃఖాదిజ్ఞానములు కలిగి ప్రసూతివాయువులచే మిగులఁ గంపితుండయి, యాయుదరమల మందు జనించిన పురుగుచందంబు నొక్కచోట నుండఁజాలక

తిరుగుచుండును. అంత నాజీవుండు మగుడ గర్భవాసము చేయుటకు భీతుండై బంధనంబులవంటి సప్తధాతువులచేత బద్ధుండై, దీనవదనుండయి, యెవనియనుమతిచొప్పున తా నీగర్భమందు వసించెనో యాభగవంతునికి నమస్కరించుచు, జేతులు జోడించి దుఃఖాతిశయముచే గొంతుక రాల్పడ నిట్లనును. "ఓపరమపురుషా! సమస్తభువనములను రక్షించుటకయి పెక్కురూపములఁ దాల్చి వర్తించుచు దుర్మార్గుఁడనగు నాకనురూపముగ నిట్టిగతినిగల్పించిన నీపాదపద్మములను శరణుపొందుచున్నాను. దేవా? నీపాదమూలము చేరినవాని కెందువలనను భయము కలుగనేరదు కదా? పూర్వమిట్టిజ్ఞానము కలవాఁడనై నీపాదముల నాశ్రయింపకపోవుటచేతనే యిట్టిగతి సంప్రాప్తమయినది. మఱియుఁ దల్లిదేహమునందు భూతేంద్రియరూపముగాఁ బరిణతమయిన మాయను బురస్కరించికొని కర్తరూపమయినయవిద్యాతిశయముచే స్వస్వరూపజ్ఞానము లేక, వర్తించుజీవునివలె నీవు మాయాసహచరుండవయి వర్తించుచున్నను నామాయాగుణములను గలిగించుకొనక జరామరణాదివికారములు లేక సంకుచితముకాని జ్ఞానస్వరూపము కలవాఁడవయి యున్న నీపాదముల కభివందనము లాచరించుచున్నాను. *పంచభూతములచేఁ గల్పితమయిన దేహమందు వర్తించుచున్న నావలెను, నీవుగూడ శరీరాదులచేత నావృతుండవయిన

---

*ఓయీ! కర్మవశ్యుఁడగు జీవునికివలె భగవంతునికి నశుచిదేహసంబంధమున్నను దద్గతదోషములు భగవంతునికిఁ జెందవని చెప్పితివి అది యెట్లు సరిపడును? భగవంతుఁడు జీవునివలెఁ గర్మవశ్యుఁడు గాకపోయినను నానావిధములగు నశుచిదేహములతో సంబంధమున్నప్పుడు జీవునికివలెఁ బరమాత్మకుఁగూడ దోషములు ప్రాప్తము కావలసినదే. జీవుఁడు కర్మవశ్యుఁడయియుండుటచే శరీర

ను దదీయదోషములను గొంచెమయినను బొందవు. నీవు సమస్త

---

సంబంధము గలుగుచున్నది. భగవంతుఁడు కర్మవశ్యుఁడు కాఁడు కనుక జీవునికి వలెఁ దదీయదోషములు కలుగవని యందువేని అదిసరి కాదు. బురదలో నొకరి ప్రేరణచే దుమికినను దనంతటఁ దానే దుమికినను నాబురద యంటుకొనకమానునా? అట్లే యశుచిదేహసంబంధము కర్మవశమునఁ గలిగినను స్వేచ్ఛచేఁ గలిగించుకొన్నను దదీయదోషములు బొరయకమానవు. కావున భగవంతునికి నానావిధములగు నశుచిదేహముల సంబంధమున్నచో జీవునికివలె దోషములు రాకమానునా? కావున భగవంతుఁడు జగత్కారణుఁడును సర్వజ్ఞత్వాది గుణములుకలవాఁడును నైనను, శ్రు. "యఃపృథివ్యాంతిష్ఠన్" "యఆత్మనితిష్ఠన్" "యోరేతసితిష్ఠన్" ఇత్యాది శ్రుతులందుఁ జెప్పఁబడినవిధముగా నాయాయశుచివస్తువులందున్నప్పు డాయావస్తుదోషంబులు గలుగుట నిశ్చయము. ఇట్లుండ జీవుఁడు భగవంతుని కేలనమస్కరింపవలె? నందువేని చెప్పెదవినుము. జీవుఁడు కర్మవశ్యుఁ డగుటవలన నతనికి నాయాకర్మముల కనుగుణములగు వస్తువులసంబంధమును, నాయావస్తుసంబంధమువలనఁగలిగిన యపురుషార్థములుతప్పవు. కాని పరబ్రహ్మ కర్మవశ్యుఁడు కాకపోవుటవలన నతని కట్టివస్తుసంబంధము లీలారూపముగాఁ బరిణమించుచున్నది. స్వేచ్ఛచే నియమనము చేయుచున్నను వస్తుస్వభావాధీనమగు నపురుషార్థము చెందక మానదని యనరాదు. భగవంతుఁడు తాదృశదోషములకు విరోధి. చీఁకట్లకు విరోధియగు సూర్యుఁడు తానై చీఁకటిలోఁ జొచ్చినను నాచీఁకటు లాతనిఁ జేరలేనివిధమున దోషప్రతిభటుఁడుకాన భగవంతుఁడు దోషసంబంధము కలిగించుకొనినను నతనిఁ బొందలేవు. మఱియు నచిద్వస్తు వెప్పుడును స్వభావమువలన నపురుషార్థము కాదు. అట్టియచిద్వస్తువు కర్మవశ్యులకు కర్మస్వభావానుగుణ్యముంబట్టియు దైవసంకల్పముంబట్టియు దేశకాలభేదముచేతను బురుషభేదముచేతను దుఃఖముకొఱకును సుఖముకొఱకునుగూడ నగుచున్నది. కావున దేహసంబంధము కర్మవశ్యుఁడగు జీవునికిఁ దత్కర్మానుగుణములగు నపురుషార్థములఁ గల్పించుచున్నది. అదియె దోషప్రతిభటుఁడయిన భగవంతునికి లీలారూపమగు

మును నియమించువాఁడవు. నీ స్వరూప మెప్పుడును బుణ్యపాప కర్మములచే సంకోచమునొందదు. మఱియు నీవు సర్వజ్ఞుఁడవు. నీవు ప్రకృతిపురుషులకంటె వ్యతిరిక్తుఁడవయి యొప్పుచున్నావు. నీవు పరమపురుషుండవు. అట్టి నీపాదపద్మముల కభివందనము లాచరించుచున్నాను. ఓయీ! నమస్కరించినంత మాత్రమున సంసారము నివర్తించునా యని సంశయింపఁబనిలేదు. ఓ భగవంతా? జీవుండు నీమాయచే మోహితుండై సత్త్వాదిగుణ నిమిత్తములయిన బంధనసాధనములతో వెలయుచున్న సంసారమునం బడి చరించుచు, నందు జనించినశ్రమచే జ్ఞానమును గోల్పోయి యెన్నఁటికి నట్లు సంసారచక్రమందు జననమరణము లొందుచుండు. అట్టివాఁడు మగుడ స్వస్వరూపము జెందుటకు నీయనుగ్రహముకంటె మఱియొకయుపాయ మేదికలదు? ఓ భగవంతా? తాను బంధనమును దప్పించుకొని యితరుల బంధనమును దప్పింపవలయునని పండితులందురు కాన నీవే జ్ఞానప్రదానముచేసి సంసారమును విడిపింపఁగలవుగాని బ్రహ్మాదులట్లు చేయలేరు. నీవు త్రికాలజ్ఞానసంపన్నుండవు. సమస్త చరాచ

---

చున్నది. ఒక్కవస్తువు దేశకాలపురుషభేదముచే సుఖదుఃఖములకొఱ కగుచున్నదనుటకుఁ బ్రమాణము. శ్లో॥ "నరకస్స్వర్గసంజ్ఞే వై పాపపుణ్యే ద్విజోత్తమ। వస్త్వేక మేవదుఃఖాయ సుఖాయేర్ష్యాగమాయచ। కోపాయచయత స్తస్మాద్వస్తువస్త్వాత్మకంకుతః। తదేవప్రీతయే భూత్వా పునర్దుఃఖాయజాయతే। తదేవకోపాయయతః ప్రసాదాయచ జాయతే। తస్మాద్దుఃఖాత్మకంనాస్తి నచ కించిత్సుఖాత్మకమ్" అని చెప్పఁబడినది. కావున జీవుఁడు కర్మవశ్యుఁడ. భగవంతుఁ డట్లుకాదు. జీవుఁడు హేయార్హుఁడు భగవంతుఁడు హేయప్రతిభటుఁడు. కావున జీవపరమాత్మలకు వైషమ్యమున్నది. కాన జీవునికి నమస్కార్యుఁడే.

రములయందును నంతర్యామివయి యలరుచున్నావు. జీవాంతరాత్మవయి వఱలుచున్న నీజ్ఞాన మెన్నఁడును సంకోచమునొందదు. నీవు బ్రహ్మాదులకుఁగూడ నధిపతివయి చరించుచున్నావు. తాపత్రయము తొలఁగుటకయి యట్టినీకు నమస్కరించుచున్నాను. తాపత్రయ నివారణచేయుము. ఓ మహనీయా! నీయనుమతి చొప్పున వచ్చి యీగర్భగోళమందు వసించి యుండున్న క్రిమికీటాదులచేఁ బలుబాధఁ నుబడుచు జఠరాగ్నిచేఁ దప్తుఁడనగుచు, నీగర్భకోశమునుండి వెలువడుటకుఁ బ్రయత్నించి యవధిమాసములను లెక్కించుచు, వర్తించుచున్నాను. దయాసముద్రుఁడవయిననీ వెన్నఁడు నన్నుఁ బైకిఁ దొలంగింతువొకదా! ఓదేవా? నన్నీకూపమునుండి యుద్ధరింపుము. ఓదేవదేవా? నీవు నిరుపమానుఁడవు. దయానిధి యయిన నీవు పదిమాసముల వయస్సుగలవాఁడనయినను నాకు నిట్టిజ్ఞానము కలిగించితివి. నీవుచేసిన యుపకారమునకు నీవే సంతసింపుము. మహోపకారివగు నీకు నమస్కారముతప్ప నేమియుపకారము చేయఁగలను? ఏదియుఁజేయలేను. ఇదిగో నమస్కారముచేయుచున్నాను. దీనినే గొప్పప్రత్యుపకారముగా భావించి నన్నీబాధనుండి తొలంగింపుము. పరమపురుషునిచే నధిష్ఠితమై, జీవుని కర్మములవలన సంప్రాప్తమయియున్న శరీరమందు ఖిన్నుఁడయియుండి సప్తవిధములగు త్వక్కులచే వేష్టితమగు దేహమును ధరించి శమదమాదియుక్తుఁడయిన యోగి యీశ్వరదత్తమగు నుపాసనాత్మకబుద్ధిచే నిన్నుఁ జూచుచున్నాఁడు. అట్లే నేనును నంతర్బహిర్భాగములందుఁ బ్రతీయమానుఁడ వగుచు యోగపరిశుద్ధ చిత్తముచే గృహీతుండవయి యున్న నిన్ను భగ

వంతుఁడవగు నీచే నర్పితమగుబుద్ధిచే సాక్షాత్కరింపఁ జేసికొం దును. ఓదేవా! ఈగర్భనరకము నాకు మిక్కిలి బాధలు కలి గించుచున్నను దివ్యజ్ఞానముగలవాఁడ నగుటచేఁ బైకివచ్చుట కిష్టము లేదు. ఈకూపమును గడచి పైకివచ్చినచో నీమాయ న న్నావరించి యీదివ్యజ్ఞానమునంతయుఁ బోవునట్లు చేయును. అందువలన నేను దేహాద్యభిమానము కలవాఁడనయి సంసార చక్రమునంబడి తిరిగి పుట్టుచు చచ్చుచు వర్తింపవలసి వచ్చుచు న్నది. కావున నన్నీగర్భకుహరమునుండి తప్పించి యంతకంటె నధికభయంకరమగు సంసారకూపంబునఁ బడవేయక నాకీ జ్ఞానముండునట్లు చేయుము. దానివలన నీమాయ నతిక్రమించి వేగముగా నీరూపమును జూడఁగలను. సర్వభూతహితుండవ యిన నీవు గర్భనరకమునుండి తప్పించినట్లుగానే దయాకరుండ వయి సంసారకూపమునుండికూడఁ దప్పించి రక్షింపుము. గర్భ వాసనారూపమయిన దుఃఖము నాకు రాకుండఁ గాపాడుము. నీపాదపద్మముల నాశ్రయించినవారి కెట్టిలోపములు నుండఁగూ దునా! అని యిట్లు గర్భగోళమందుండి యపారమయిన దుఃఖ ము లనుభవించుచు భగవంతునిఁ బ్రార్థించుచు దశమాస పరిమితుఁడయి యున్నజీవునిఁ బ్రసూతివాయువులు ప్రసవము కొఱకుఁ బ్రేరణచేయును. ఆవాయువుచేత జీవుఁడు స్వస్థానము వలననుండి కదలి శిరస్సును గ్రిందుగాఁ జేసికొని గర్భమందున్న ప్పటి జ్ఞానమునంతను గోల్పోయి యతికష్టముచేఁ దల్లియు దరమునుండి బయలు వెడలివచ్చును. ఇట్లు వెడలివచ్చి రక్తసిక్త గాత్రుఁడయి భూమిపయింబడి చిన్నపురుగువలెను గదలుచు మె దలుచు నజ్ఞానావృతుండయి మిక్కిలి రోదనము చేయును. వాఁ

డట్లు రోదనము చేయుచుండ నాశిశువునభిప్రాయ మెఱుఁగఁజాలక పాలనిమిత్త మేడ్చినప్పు డుదరవ్యథచే నేడ్చుచున్నాఁడని చేఁదురసముసిచ్చుచు, నుదరవ్యథచేఁ బీడితుఁడగునప్పుడు పాలకొఱకేడ్చుచున్నాఁడని స్తన్య మొసంగుచునుందురు. అందువలన మఱింత బాధగలవాఁడయి నాశిశువు దోమలు నల్లులు మొదలగువానిచేఁ గల్మషమైయొప్పు మంచముపై శయనింపఁజేయఁబడి యవయవములకండూతిని దొలంగించుకొనుటకుఁగాని కూర్చుండుటకుఁగాని నడుచుటకుఁగాని యసమర్థుండై, రోదనముఁ జేయుచుండును. ఇట్లు పలుబాము లనుభవించుచు శైశవావస్థ నతిక్రమించి యజ్ఞానమునకును గోపాదులకును నాకరమయి వర్తించును. పిమ్మటఁ గ్రోధాదులు శరీరముతోఁ గూడ బెరుఁగుచు, వానిని గామునిగాఁ జేసి వానిజీవనములనుగూడఁ బాయునట్లు చేయును. పంచభూతములచేఁ గల్పితమయిన దేహమునందు వసించి జీవుఁడు నిరస్తవివేకుండయి యహంకార మమకారములతోఁ గూడి వర్తించుచు, సర్వము నేనే చేయుచున్నాననియు, సర్వము నాదే యనియు బుద్ధికలవాఁడై, కుమతియై వర్తించును. మఱియు నా ప్రాణి యేకర్మముల నాచరించిన సంసారము తనకుఁ బ్రాప్తమగునో యట్టికర్మములనే యాచరించుచు, మాటిమాటికిఁ బుట్టుచుఁ జచ్చుచు మగుడ దుఃఖావహమగు దేహమునే పొందుచుండును. భార్యాపుత్త్రాదుల పోషణకయి పెక్కులగు నసత్కార్యముల నాచరించుచు, నరకకూపమునఁ బడును. మఱియు దారపుత్త్రాదుల సాంగత్యమును జేసినచో, సత్యము, శౌచము, దయ, మౌనవ్రతము, బుద్ధియు, శ్రీ, లజ్జ, కీర్తి, యోర్పు, శమదమాదులు మొదలగు గుణములన్నియు నాశనమును బొందకమానవు.

ఇట్టినష్టము కలిగించువారలతోఁ బండితుఁడయినవాఁడు సాంగత్య ము చేయఁగూడదు. మఱియు స్త్రీలు క్రీడామృగములవంటివా రు. వారు క్రీడామృగములు వేటకానిహృదయముల నాకర్షిం చినవిధమున మానవుల మానసమును హరించుచుందురు. విష యవాంఛారహితులుకాక దేహాత్మబుద్ధిగలిగి మూఢలయియున్న స్త్రీలయెడ మెలఁకువగలిగి వర్తింపవలయును.లోకమున స్త్రీ సాం గత్యమువలనఁ బురుషునికి సంసారబంధము సంభవించినట్లు మఱియొక దానివలనఁ గలుగ నేరదు. స్త్రీసాంగత్యమువలన మ హానర్థములు సంభవింపకమానవు. ఇందుల కొక్కయితిహాసము కలదు చెప్పెదను వినుము. తనకూఁతురయినసరస్వతి మృగియై వర్తించుచుండ నదిచూచి బ్రహ్మ, దానిసౌందర్యమున కోటువడి వివశాంగుండై సిగ్గువిడిచి తాను నొక్కజింకయై మృగరూపిణియై యున్న తనకూఁతు ననుసరింప మొదలుపెట్టె. చూడుము మట్టిమహా నీయునికిఁగూడ నెట్టిదుర్బుద్ధి కలిగినదో? స్త్రీసాంగత్యము పురు షుల మానసములను నినుపవస్తువుల నాకర్షింప నయస్కాంత మువంటిదని తలపోయుము. ఆబ్రహ్మచే సృజింపఁబడిన మరీచ్యా ది మహామునులయినను స్త్రీసాంగత్యమును విడుచునంతటి బు ద్ధిగలవారు కాలేకపోయిరి. మహామహులయిన బ్రహ్మాదులే కా మమోహితులై స్త్రీలవలలలోఁ జిక్కుచున్నప్పుడు వారలకంటెఁ దక్కువప్రభావముగలవా రెట్టుగా దానిని విసర్జింపఁగలరు?సృష్టి లోనెల్ల స్త్రీసాంగత్యమును దొలఁగఁద్రోసినమహాత్ముఁడొక్క నారాయణముని.అతఁడుకాక మఱియొకఁడు లేడు.ఓతల్లీ! స్త్రీరూ పమయియున్న నామాయామహిమమునుజూడుము.ఆస్త్రీవ్యక్తి తనభ్రూవిక్షేపముచేతనే దిగ్విజేతలగుశూరులనుసైతము స్వాధీ

నము చేసికొనును. నాసేవనముచే నాత్మజ్ఞానముపడసి భక్తియోగఫలమగు నాపదమును గోరువాఁడొకప్పుడును స్త్రీసంగమును జేయరాదు. లేనిచో నెంతటిజ్ఞానవంతుఁడైనను దప్పక మోహితుండయి చెడి యందువలన నింద్యకార్యములనాచరించి ఘోరతరంబులగు నరకంబులంబడును. శుశ్రూషాదిమిషలచే భగవన్నిర్మితయగు నేస్త్రీరూపమాయ తొలఁగుచున్నదో యామాయను దన కనర్థములు కలిగించుదానిగాను తృణావృతకూపములనుగాను జూడవలయును. అట్టికూపములు తృణముచే నావృతంబులయి యుండి చూపఱకు స్థలబుద్ధిని గలిగించి తనగర్భమందు వేసికొనినట్లే స్త్రీలుకూడఁ దమవిలాసములచేఁ బురుషులకు సుఖబుద్ధిని గలిగించి తమమాయలలోఁద్రోసి యనర్థము కలిగించుచుందురు. కావున స్త్రీలను జయించుట మిగుల గొప్పకార్యము. స్త్రీసాంగత్యము విడిచిన మహనీయుఁడు నామాయాసంబంధమును విడిచినవాఁడనియె తలంపుము. అట్టివాఁడు క్రమముగా మోక్షపదము నందఁగలఁడు. పురుషరూపంబునొందిన జీవుండు సంతతము స్త్రీని దలంచుచు నంతకాలమందుఁ గళేబరంబువిడిచి స్త్రీరూపమును జెందును. అట్లె స్త్రీరూపంబునొందిన జీవుండును మన్మాయచేఁ బురుషరూపంబు నొందును. మఱియు వేఁటకాండ్రసంగీతము మొదట మృగముల కానందదాయకమయినను దరువాత బంధకారణం బయిన తెఱంగునఁ, దనకు ధనాదులనిచ్చి పోషించు భర్త మొదట సంతోషము కలిగించువాఁడయినను బిమ్మటఁ దనకు బంధకారణుండగు. విత్తాదులనిచ్చి సంతసింపఁజేయు పతిని దైవవశమువలనఁ బ్రాప్తమగు మృత్యువునుగాఁ దలంపవలయుం గావున మోక్షమం దిచ్ఛగల స్త్రీలుగూడఁ బురుషసంగమును,

విసర్జింపవలయును. ఓతల్లీ ! జీవుఁడు గర్భమం దున్నది మొదలు కొని యావనాంతమువఱకు ననుభవించుచున్న కష్టములను దెలియఁ జేసితి. జరామరణాది కష్టములనుగుఱించి పూర్వమందె తెలియఁబఱిచితి. ఇంక నిత్యమైన యాత్మకు జననమరణాదు లెట్టుగాఁ బ్రాప్తము లగుచున్నవో, ప్రాప్తములయినను వాని స్వరూపము లెట్టివియో, యనుభవమువలనఁ బుణ్యాపాపక్షయమగుచుండఁగా నొకశరీరమునుండి శరీరాంతరమున కాత్మ యెట్లు పోవుచున్నదియో, శరీరాంతరమునకుఁబోవుట సంభవించినను బ్రాక్తనములగు భూతసూక్ష్ములతోఁ గూడియె పోవునా ? లేక వానిని విడిచియేపోవునా ? యిట్టి యాశంకలన్నియుఁ దొలంగునట్లు లుపదేశించెద విను. జీవుఁడు తన కభిన్నమయినదని యభిమతమగు భూతేంద్రియ మనోరూపకమయిన సూక్ష్మదేహము చేత సూక్ష్మపరిణామరూపమగు స్థూలశరీరమునుండి తాదృశ స్థూలదేహాంతరమునకు ననుసరించిపోవుచుఁ బూర్వమున స్థూల దేహముచే సంపాదింపఁబడిన కర్మఫలముల ననుభవించుచు మఁగుడ నుత్తరజన్మమున కారంభకములగు కర్మములను సంతత మొనరించుచుండును. జీవుఁడీదృశసూక్ష్మదేహముతో దేహము నుండి దేహాంతరమునకుఁ బోవుట యెట్లు తెలిసికొనఁబడును ? అని శంకింపఁబనిలేదు. జీవత్వాభిమానముగల భూతేంద్రియాత్మకమగు సూక్ష్మదేహము జీవాత్మ ననుసరించి పోవుచుండును. అభ్యుపగతములగు ప్రారబ్ధకర్మములు భోగమువలన నశించినను దక్కినకర్మములు నశింపవు. కావునఁ గర్మములకు సమాప్తి గలుగనేరదు. నిత్యమగు నాత్మకు జననమరణములు దేహద్వారకములేకాని స్వభావసిద్ధమయినవి లేవు. స్థూలదేహమును విడిచి

సూక్ష్మావస్థను బొందుటయే జీవునికి మరణమనియు సూక్ష్మావస్థను విడిచి స్థూలావస్థనుబొందుటయె జననమనియు భావింపఁబడుచున్నది. జననమరణస్వరూపము లెట్టివియో తెలిపెదను.* పృథివ్యాది

* "తదేతదక్షయం నిత్యం జగత్ స్థావరజఙ్గమమ్ । ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి" అని ప్రకృతిపురుషు లుభయులును నిత్యులని చెప్పఁబడుచున్నది. కాన యట్టివాని కుత్పత్తివినాశములు సంభవింప నేరవు. ఆత్మ పరిణామము నొందనివాఁడగుటచే స్వాభావికముగా నుత్పత్త్యాదు లతనికి సంభవింపకపోయినను బ్రకృతిద్వారకము లగునవి సంభవించుచునే యున్నవి. ప్రకృతికి స్వభావసిద్ధములగు నుత్పత్త్యాదులు కలవు. అట్లు కలిగియున్నను ద్రవ్యము నిత్యమని యంగీకరించుటచే బ్రకృతి నిత్యమైనదనియె గ్రహింపవలయును. అట్లయిన నుత్పత్తివినాశాదు లెట్లు కలుగుచున్నవని యందురేని యుత్పత్తివినాశాదులు ద్రవ్యముయొక్క యవస్థావిశేషములే కాని వేఱయినవి కావు. తంతువులు మొదలగు ద్రవ్యములు తాము నశింపకయే రచనావిశేషయుక్తములయి పటాదులగుచున్నవి. మఱియు నాపటమందుఁ దంతుసంతానవిశేషమునకంటె నతిరిక్తపదార్థమున్నట్లు తోఁపలేదు. ఇంతియకాక తంతురచనావిశేషమే పటమగుచున్న దన్నంతమాత్రముననే సరిపోవుచుండఁగా నచ్చట ద్రవ్యాంతరమయినట్లు కల్పించుట యయుక్తము. ఉత్పత్తివినాశాదులు ద్రవ్యముయొక్క యవస్థావిశేషములనియే గ్రహింపవలయును. ఉత్పత్తియనెడి యవస్థనుబొందిన ద్రవ్యమునకు దద్విరుద్ధావస్థను మఱియొకదానిని బొందుటయె వినాశ మనఁబడుచున్నది. అవస్థాంతరమును బొందుటయె యుత్పత్తియనఁబడును. మన్ను పిండముగాను ఘటముగాను గపాలముగాను, జూర్ణముగాను మాఱుట స్వభావసిద్ధమని యందఱికిఁ దెలిసినవిషయమె. అందు బిండత్వాదులగు పెక్కవస్థలు గానవచ్చుచున్నవి. చూర్ణావస్థను బొందియున్న ద్రవ్యము త్తరావస్థను జెందుటయె వినాశమనియు నుత్తరావస్థ ప్రాప్తియె యుత్పత్తియనియు స్పష్టమగుచున్నది. కావునఁ బురుషునివలెఁ బ్రకృతియు నిత్యమనియు దానియుత్పత్తివినాశముల నఁగా ద్రవ్యముయొక్క యవస్థావిశేషములేయనియుఁ దెలియునది.

ద్రవ్యములని తెలియవచ్చుచున్న దేహ మాత్మాభిమానమునకు విషయమయి యది సూక్ష్మావస్థనొందుటయె మరణమనియు, నహమ్మనెడి యభిమానముచే ద్రవ్యదర్శనము కలుగుటయె దేహమున కుత్పత్తియనియుఁ దెలియఁదగినది. తిమిరాదులచే దృష్టి యుపహతమయినప్పుడు గోచరవస్తువున్నను జక్షువుచూడలేదు. కావున నింద్రియగోళకమునకు దర్శనయోగ్యత లేనట్టు స్పష్టమగుచున్నది. ఈరీతినే శోభనదృష్టిగల పురుషునియాత్మ సావధానమై యుండనప్పుడు నేత్రము తెఱవఁబడినను ద్రవ్యమును జూడలేదు. కావునఁ జక్షురింద్రియమునకుఁగూడ దర్శనయోగ్యతలేనట్టు తెల్లమగుచున్నది. కాన చేతనమే ద్రవ్యము చూడగలదుకాని కేవల మింద్రియము చూడలేదు. ఇంద్రియము చూడలేకపోయినను చూచుటలో నాత్మకు సాధనమగుచున్నది. అందువలన నేత్రమునకును జేతనమునకును గరణత్వకరణిత్వరూపమగు సంబంధయోగ్యతకలదు. ఈ చెప్పుటచే నింద్రియ మాత్మ కానట్టు తెలియవచ్చుచున్నది. అట్లె దేహముగూడ నాత్మస్వరూపము కాదని గ్రహింపవలయును. జన్మజరామరణాదులుగల దేహ మాత్మ కాదు కనుక దేహమునకు మరణాదులు సంభవించినపుడు భయపడక పుత్త్రాదులు నశించినపుడు దుఃఖింపక పుత్త్రాదులు పుట్టినపుడు సంతసింపక సుఖదుఃఖములను సమముగాఁ జూచుకొనుచుఁ బ్రకృతివిలక్షణమగు నాత్మస్వరూపమును దెలిసికొని దేహమందును గేహమందును దారపుత్త్రాదులందును నాసక్తివిడిచి యీలోకంబునఁ జరింపవలయును. మఱియు నబాధితమగు శాస్త్రజన్యజ్ఞానముగలిగి ప్రకృతికంటె నాత్మ వేఱయినదనెడి జ్ఞానముచేతను బ్రహ్మాతిరిక్తమగువస్తువునందలి వైరాగ్యము

చేతనుగూడ భగవదుపాసనాత్మకబుద్ధివలన మాయావిరచిత మగు లోకమందును దేహాదులందాస్థవిడిచి నివృత్తిధర్మముల నాచరింపవలయును. ఇది ముప్పదియొకటవయధ్యాయము.



ఓతల్లీ! గృహమేధి గృహమందు నివసించుచు గృహస్థాశ్రమమున కనుగుణములగు ధర్మముల ననుష్ఠించుచు, నర్థకామముల ను బొందుచుం దఱుచుగా నా ప్రవృత్తిధర్మములనే పాలించును. ఇట్లు కేవలము గృహస్థాశ్రమధర్మముల నాచరించువాఁడు విషయాసక్తిచే మూఢుఁడయి కావుననే భగవద్ధర్మములకు విముఖుఁడయి ప్రవృత్తిధర్మములందలి శ్రద్ధచే యాగములచే దేవతలను బూజించుచు, శ్రాద్ధాదులచేఁ బితృదేవతల సంతసింపఁ జేయుచుండును. మఱియు సంతతము పితృదేవతలకొఱకును దేవతలకొఱకును వ్రతములఁ జేయుచుండును. ఇట్లు యాగాదుల నొనరించినవాఁడు చంద్రలోకమునకుఁబోయి భగవంతుఁడు శేషశాయియై యున్నప్పుడు గృహమేధులు పొందిన లోకములు నశించునుగావున మగుడ నీలోకమునకు నత్తురు. కాని యెవరు జితేంద్రియులయి వర్ణాశ్రమధర్మముల నర్థకామముల నిమిత్త ముపయోగింపక దుష్టసంగమును విడిచి వర్ణాశ్రమోచితకర్మములను నా కర్పణముచేసి శమదమాదియుతులై స్వధర్మానుష్ఠానముచే నిర్మలచిత్తులై నివృత్తిధర్మములం దాసక్తి గలిగి యహంకారమమకారవర్జితులై స్వధర్మజన్య మయిననిర్మలచిత్తముచే * నర్చిరాదిగతిచేఁ

* జీవు లూర్ధ్వలోకముల కేఁగుటకు ధూమాదిగతియనియు నర్చిరాదిగతియనియు రెండుగలవు. ధూమము, రాత్రి, కృష్ణపక్షము, దక్షిణాయనము, పక్షా

బరమపురుషుఁడును, విశ్వమునకు బంధమోక్షములను గలిగించు వాఁడును, విశ్వమునకు సృష్టిస్థితిలయములు కల్పించువాఁడును, సర్వజ్ఞుఁడును, బరాత్పరుఁడు నగునన్నుఁ బొందుదురో వారు తిరుగఁ బుట్టుకకు రారు. ఇది పరబ్రహ్మము నుపాసించినవారికిఁ గలిగెడి గతి. చతుర్ముఖాదులను గొందఱు ఉపాసింతురు. అట్టివారలు మరణానంతరమున సత్యలోకమునకుఁబోయి రెండుపరార్ధముల కాలమువఱకు నచ్చట నివసించియుందురు. భగవంతుం డెప్పుడు పృథివ్యాది భూతపంచకముతోడను మానసేంద్రియాదులతోడను శబ్దాది తన్మాత్రములతోడను గూడియున్న లోకంబును, బ్రకృతియందు లీనంబుచేయఁదలంచి సమస్తలోకములను సంహరించునో యప్పుడు జితేంద్రియులై పరబ్రహ్మముకంటె నితరములగు నైశ్వర్యములందు వైరాగ్యము చెంది దేహాత్మాభిమానమువదలి తనలోకమందున్న యోగులతోఁగూడఁ జతుర్ముఖుండు పరమపురుషు నొందును. ముక్తిచెందుటకు నిట్టిమార్గములు కలవు. కావున ఓతల్లీ ! సర్వభూతముల హృదయారవిందములయందు నివసించినవాఁడును శ్రుతప్రభావుఁడును నగు పరమపురుషుని శరణుచెందుము. పరమపదము చెందుటకు మఱికొన్ని మార్గములున్నను పరమపదము నొందుటకు భక్తిమార్గముకంటె మిగుల సులభమగుమార్గము లేదు. ఆ మార్గమునే నీ వనుసరించి సర్వాం

---

సము పితృలోకము, ఆకాశము చంద్రుఁడు. వీరిద్వారకముగాఁ బోయి యాకాశము, వాయువు, ధూమము, మేఘము వీరిద్వారకముగా మరల నీలోకమున కవతరింతురు. శుక్లపక్షము అర్చిరాదిగతియన అర్చిస్సు, పగలు, ఉత్తరాయణము, సంవత్సరము, వాయువు, సూర్యుఁడు, చంద్రుఁడు, విద్యుత్తు, వరుణుఁడు, ఇంద్రుఁడు, బ్రహ్మ, వీరిద్వారకముగాఁ బోవుట.

తర్యామివయిన భగవంతుని భజించుచుండుము. ఓతల్లీ! ఎవర యిన సాభిమానులయి వర్తించినవారు తప్పక సంసారబంధంబులను బొందుదురు. సమస్తచరాచరలోకమును సృజింపఁ జాలినంతశక్తికల బ్రహ్మయంతనను, సాభిమానుఁడయి వర్తించినచో సంసారము నొందక మానఁడు.ఆబ్రహ్మయు భేదదృష్టితోను నభిమానముతోను నిస్సంగకర్మముల నాచరించుటవలన యోగప్రవర్తకులగు సనకాదులతోఁ గూడ సూక్ష్మచిదచిద్విశిష్టుఁడగు భగవంతునియందు లీనత చెంది మగుడ సృష్టిదశయందుఁ బూర్వమువలెనే పుట్టుచుండును.పారమేష్ఠ్యమగు నైశ్వర్యముగూడఁ గర్మాయత్తమేకావున దాని ననుభవించి పరమపురుషునిఁ జెంది మగుడఁ బుట్టుచున్నారు.ఓజననీ ! నిష్కామకర్ములే సాభిమానులైనప్పుడు సంసారమునొందుచున్నారని చెప్పవలసియుండఁగా నకామకర్ములగువారు సాభిమానులయినచో సంసారమునొందుదురని వేఱ చెప్పవలయునా? పారమేష్ఠ్యాదులగు నైశ్వర్యములందు నాసక్తులై తత్సాధనములగు కర్మములందు శ్రద్ధగలిగి కామ్యములగు నిత్యకర్మములను సైతము స్వర్గాద్యపేక్షతోఁ జేయుచుందురు.మఱియు వారిమనస్సు రజోగుణముచే వ్యాకులతఁ జెందుటచేఁ గామాసక్తులై కావుననే యింద్రియములను జయింపలేక గార్హస్థ్యసుఖంబులనే కోరుచుఁ బ్రతిదినము ను బితృదేవతలను బూజించుచుందురు. వారు నిరతిశయమగు కీర్తిగలిగి యుపాసనాత్మకజ్ఞానమునకు విషయుఁడయిన భగవంతునికథలకు విముఖులయి ధర్మార్థకామపరాయణులయి యుందురు.మఱియు నానీచులు హరికథాశ్రవణమునకు సంతసింపక సూకరాదులు పురీషమునకు సంతసించిన ట్లన్యకథలకు సంతసించుచుందురు.అట్టివారు తప్పక దైవహా

తులని చెప్పవలసియున్నది. ఇఁక వారి కెట్టిగతి ప్రాప్తమగునో యెఱిఁగించెద. వారు ధూమాదిమార్గముచేఁ బితృలోకమునకుఁ బోయి మఱలఁ దమపుత్త్రాదులకుఁ బుట్టుచుందురు. అట్లు జనించి శ్మశానాంతమువఱకు గలసంస్కారములను బొంది మఱలఁ బరలోకమునకుఁబోవ ననుభవముచే సుకృతాదులు క్షీణింపఁగా నచ్చటిదేవతలు వారి నచ్చటినుండి క్రిందికిఁ ద్రోసివేయుదురు. అప్పుడు వారు వివశులై మరల నీలోకమును బొందుదురు. ఓజననీ! సకామకర్మలగతి యిట్లుండును. కావున నీవు భగవంతుని జ్ఞానశక్త్యాదులగు గుణములే యాశ్రయముగాఁ గలభక్తిచేఁ బరమాకాశాధిపతియై దేవతలకు నారాధ్యములగు పదపద్మములు గలిగియున్న భగవంతునే సమస్తమునకు నమ్ముకొని సేవింపుము. ఇట్లు భగవంతుఁడగు వాసుదేవునం దుంచినభక్తి యోగాత్మకజ్ఞానమె వేగముగా వైరాగ్యమును జనింపఁజేయును. ఆజ్ఞానమే బ్రహ్మ సాక్షాత్కారము కలిగించునది. భక్తియోగాత్మకజ్ఞాన మెప్పుడు బ్రహ్మసాక్షాత్కారము కలిగించునని యందువేని చెప్పెద విను. ఎప్పు డుపాసకుని చిత్త మనుకూలములును ప్రతికూలములు నగు శబ్దాదివిషయములను బొంది వికారము చెందనిదై ప్రియాప్రియరూప వైషమ్యమును గ్రహింపదో యెప్పుడుచిత్తము శబ్దాదివిషయసంగమును విడిచి ద్వేష్యములనియు నద్వేష్యములనియు విషమభావమునుబొందక సమస్తమును బ్రహ్మాత్మకముగానే యనుసంధానము చేయుచు, శుభాశ్రయమగుపదము నారోహించునో, యప్పుడు తాదృశచిత్తముచే భగవంతుని సాక్షాత్కరింపఁ జేసికొనుచున్నాఁడు. ఈ విశ్వమంతయు బ్రహ్మాత్మక మెట్లగునని సందేహిం

పరాదు. పరమాత్మాది శబ్దములచేఁ జెప్పఁబడుచు జ్ఞానమాత్ర
మే స్వరూపముగాఁ గలిగి యున్న భగవంతుఁ డొక్కఁడే పృథి
వ్యాదిపంచభూతములచేఁ గల్పితములగు దేహములుగల దేవ
మనుష్యాదులగాఁ బ్రతీయమానుఁ డగుచున్నాఁడు. కావున సమ
స్తవిశ్వము బ్రహ్మాత్మకమే. యోగులు సాంగయుక్తమగు భక్తి
యోగముచే నిరతిశయసుఖమును బరమపురుషార్థమగు గుణా
ష్టకప్రాప్తిని బ్రకృతిసంబంధాభావమును బొందుదురు. భక్తి
యోగమునకు నిష్టప్రాప్తియు ననిష్టనివృత్తియు ఫలములని యె
ఱుఁగుము. పృథివ్యాదిసంబంధము పరమాత్మకుఁ గలిగినట్లె
జీవునికిఁగూడఁ గలదు. కాని యందొక్క విశేషముకలదు. సత్త్వా
దిగుణరహితుఁడును జ్ఞానస్వరూపుఁడునగు జీవుఁడు పరప్రకాశక
ములగు నింద్రియములచే శబ్దాదిధర్మములుగల పంచభూతము
లచే నారబ్ధమగు దేవాదిరూపములచేతను భ్రాంతిగలవాఁ డగు
చున్నాఁడు. పరమాత్మ సర్వజ్ఞుఁడు కాన యతని కట్టి భ్రాంతి లేదు.
ఓజననీ! మహత్తత్త్వ మహంకారమయి యది సాత్త్వికాదిభేదము
లచేఁ ద్రివిధంబయి యదియే భూతరూపమున నైదువిధముల
యి, యదియే యింద్రియరూపమున నేకాదశవిధంబు లయ్యె.
తాదృశతత్త్వాత్మకమగు నీయండమును బ్రహ్మయు నెవనివల
ననుండి యుత్పన్నతఁజెందిరో యాతనికి సమస్తప్రపంచమును
శరీరమయి యుండుట పరమార్థము. ఈవిశ్వమంతయు భగవదా
త్మకమగుటను విరక్తుఁడును నిస్సంగుఁడును దృఢచిత్తుఁడునగు
యోగి శ్రద్ధాభక్తులచేతను, వైరాగ్యముచేతను లెస్సగాఁదెలిసి
కొనును. ఓజననీ! దేనిచేఁ బ్రకృతిపురుషేశ్వరులతత్త్వము తె
లియఁబడునో బ్రహ్మదర్శనోపాయమయిన యాజ్ఞానము నుపదే

శించితిని. అట్లె భగవదుపాసనరూపమగు జ్ఞానయోగమును సత్త్వాదిగుణ రహితమై మద్విషయమై యున్న భక్తియోగమును, జెప్పితిని. ఈరెంటింటికిని భగవచ్ఛబ్దవాచ్యుఁడగు పరమపురుషుఁడే ప్రయోజనమనియుం జెప్పితిని. ఓయీ! జ్ఞానభక్తియోగములకు భగవంతుఁడొక్కఁడే ప్రాప్యుఁడనుట యెట్లని శంకింపరాదు. క్షీరాదిపదార్థ మొక్కటియైనను జక్షురింద్రియమునకు శ్వేతాదిగుణములచేతను రసనేంద్రియమునకు మాధుర్యాదిగుణములచేతను, త్వగింద్రియమునకు శైత్యాదిగుణములచేతను,విషయమగుచున్నట్లు భగవంతుఁడొక్కఁడే నానామార్గభేదములచే నారాధ్యుఁడయి ప్రాప్యుఁడగుచున్నాఁడు. మఱియుఁ బాంచరాత్రమందుఁ జెప్పఁబడిన పూజాకలాపములచేతను, వేదపూర్వభాగమునఁ బ్రతిపాదితములగు యాగములచేతను, దానములచేతను, దపంబులచేతను, వేదాధ్యయనంబుచేతను, వేదార్థము నవమర్శించుటచేతను, శమదమములచేతను, కర్మములను నిష్కామముగా నాచరించుటలచేతను, సాంఖ్యయుక్తమగు భక్తియోగముచేతను, ప్రకృతికంటె విలక్షణమగు నాత్మతత్త్వమును దెలుపు జ్ఞానయోగముచేతను, *సకామనిష్కామములే లక్షణముగాఁ గలుగు ధర్మములచేతను, నాత్మతత్త్వముచేతను, దృఢమగు వైరాగ్యము

* ఓయీ! సకామధర్మములచేఁ బొందఁబడునవి స్వర్గాదిలోకములుకాని భగవంతుఁడుకాఁడే యని సంశయపడ నవసరములేదు. శ్లో॥ "అహంహిసర్వయజ్ఞానాం భోక్తాచప్రభురేవచ। యోయోయాంయాం తనుంభక్తశ్శ్రద్ధయార్చితుమిచ్ఛతి। తస్యతస్యాచలాంశ్రద్ధాం తామేవవిదధామ్యహం। సతయాశ్రద్ధయాయుక్తస్తస్యారాధనమీహతే। లభతేచ తతఃకామాన్మయైవవిహితాన్ హితాన్। అంతవత్తుఫలంతేషాం తద్భవత్యల్పమేధసామ్" అని చెప్పఁబడియున్నది కాన యాగాదులచే నింద్రాదుల నారాధించినను నింద్రాది

చేతను, నీమొదలగు క్రియలచేత మంగళగుణుఁడును హేయగుణరహితుఁడును స్వప్రకాశుఁడునగు భగవంతుఁడొక్కఁడే పొందఁబడుచున్నాఁడు. ఓ జననీ! తామసమనియు, రాజసమనియు, సాత్వికమనియు, నైర్గుణ్యరూపమనియుఁ బరఁగు చతుర్విధభక్తియోగంబులను నీకుఁ దెలిపితిని. సమస్తజంతువులకు నంతము పొందించుచు నవ్యక్తగతియై యొప్పు కాలస్వరూపమును జెప్పితిని. జీవాత్మ వేనియందుఁ బ్రవేశించి తనయాథాత్మ్యమును దెలిసికొనలేఁడో యవిద్యాఖ్య కర్మనిర్మితములగు నా సంసారగతులాత్మకుఁ గలవు. వానిని నీకుఁ బూర్వమే తెలిపితిని. ఓజననీ ! నీ కుపదేశించిన యీ వేదాంతార్థములను నధికారులకే కాని యనధికారుల కుపదేశింపరాదు. అనధికారుల నెఱింగించెదను. వినుము. పరులకు భయము కలిగించువారును, ధూర్తులును, మూర్ఖులును, దురాచారులును, డాంబికులును, విషయాసక్తులును, గృహస్థాశ్రమాసక్తులును, నాకు భక్తులు కానివారును, నాభక్తులకు శత్రువులయినవారును, నీవేదాంతార్థము నుపదేశము నొందనర్హులుకారు. శుశ్రూషాభిలాషులును, శమదమాదిసంపన్నులును, సదాచారనిష్ఠులును, సమస్తప్రియవస్తువులలో నన్నే ప్రియతమునిఁగ భావించువారును, నిర్మత్సరులును, భూతమైత్రిగలవారును నిందుల కధికారులు. ఓజననీ ! ఈవేదాంతార్థమును మహాశ్రద్ధతో వినుపురుషుఁడు పరుల కుపదేశించుపురుషుఁడును మదుపా

---

రూపముల దాలిచి స్వర్గాదిఫలముల నిచ్చువాఁడు భగవంతుఁడేయని తెలిసికొనవలెను. అందు మఱియొక్క విశేషముకలదు. యాగాదులచే నింద్రాదిరూపుఁడగు భగవంతుఁ డారాధితుఁ డయి సాంతమగుఫలము నొసంగును. భక్తిజ్ఞానయోగములచే నారాధితుఁడయి నిరతిశయమోక్షఫలము నొసంగును.

సననిష్ఠుఁడయి ముక్తిని బొందుచున్నారు. ఇది ముప్పదిరెండవ యధ్యాయము.



ఓవిదురా! కపిలాచార్యుఁడు చేసిన జ్ఞానబోధముచే సమస్త బంధములను ద్రెంచుకొని దేవహూతి ప్రకృతిపురుషేశ్వరజ్ఞానముచే సుప్రసిద్ధులగు యోగుల కాశ్రయుఁడగు భగవంతునకు నమస్కరించి యిట్లు స్తోత్రము చేసెను. 'ఓ దేవదేవా! నీనాభికమలము నుండి సమస్తలోకములను సృజింపఁదగినంత శక్తిగల బ్రహ్మ యుదయించెను. అట్టులయినను, భూతేంద్రియ మనోమయమయి, చిదచిద్రూపమయిన లోకసమూహము జఠరములో ధరించి, సమస్తమునకు బీజరూపమయిన నీస్వరూపమును జూడలేక బ్రహ్మ మనస్సుచే ధ్యానించెను. అట్టి మహనీయుఁడవయిన నిన్నుఁ గొనియాడ నాతరంబగునే? ఓమహాత్మా! మఱియు నీవు నిరీహుఁడవై నిర్వ్యాపారుఁడవయి యున్నను లీలకొఱకు గుణత్రయము నవలంబించి బ్రహ్మాదిరూపములయం దనుప్రవేశించి సత్యసంకల్పుఁడవయి సంకల్పమాత్రముచేత నే సృష్ట్యాదిలీలలఁ జేయుచున్నావు. సంకల్పమాత్రముచే స్వర్గాదిలీలల నెట్లు చేయఁగలిగెనని సందేహింప నవసరము లేదు. ఓదేవా? నీవనంతశక్తివి. అట్టి నీకేది కొఱంత? నీశక్తు లిట్టివని యెవ్వరు నెఱుఁగరు. ఓదేవదేవా? నీవు యుగాంతమునందు నీప్రపంచమునంతను నీయందు లీనము కావించుకొని బాలుండవయి, వటపత్రములపయి శయనించి కాలిబొట్టనవ్రేలిని సర్వదా రుచిచూచుచుఁ జూపఱకు మోహమును గలిగించుచున్నావు. అట్లు పరమపురుషుండవై, సర్వనియంతవై, జగత్కారణుండవై, యొప్పుచున్నను నీవు నాగ

ర్భమందు జన్మించి మమ్మును కృతార్థులను గావించితివి. మాయ దృష్ట మేమని చెప్పఁగలను? నాయనా! పాపాత్ముల నశింపఁజేయుట కును భక్తులరక్షించుటకును నిదివఱకు వరాహాద్యవతారములు ధరించినట్లు లోకమున కాత్మతత్త్వము బోధింప నాగర్భమునజన్మించితివి. మఱియు నీ వీయవతారమెత్తుటవలన సమస్తపాపములు నశించినవి. తత్వశాస్త్రము లోకమందు స్థిరమయినది. ఓభగవంతా? నీ నామము భజించినను, నీసత్కథలను విన్నను, నీస్వరూపమును ధ్యానించినను, శ్వపచాదినీచులకుఁగూడ ముక్తికలుగుచున్నప్పుడు నిన్నుఁ దనయునిగాఁబడసి నీస్వరూపమును గన్నులారఁ గాంచినమాకు నీయనుగ్రహమువలన ముక్తిగలుగునని వేఱ చెప్పవలయునా? మఱియు మరణకాలమందు నీనామమును స్మరించినచో వాఁడు శ్వపచుఁడయినను గొప్పవాఁడేచుమీ? మఱియుఁ దపంబులయినను జేసియుండుటయు యాగాదులయినను జేసియుండుటయుఁ బుణ్యక్షేత్రములయందుఁ దిరుగుచుండుటయు వేదాంగములతోఁగూడ వేదములనైన నధ్యయనముచేసియుండుటయు లేక భగవంతుని మిక్కిలి భక్తితో నారాధించుటయు వీని నన్నింటిని మహాత్ములొనర్చుట యంత్యకాలమున నీ నామస్మరణ లభించు నిమిత్తమేకదా? కావున నీనామ ప్రభావమును వర్ణింప మాతరముకాదు. మఱియు నీవు సమస్తజీవులకు నంతరాత్మవై వెలయుచున్నావు. నీవు పరమపురుషుండవు. సమస్తయోగిబృందముల చేతను వందనీయుండవు. నీవు సమస్తమునకధిపతివయిన నారాయణుఁడవు. మఱియు వేదగర్భుఁడవు. అట్టి నీపాదపద్మములకు సంతతము వందనము లాచరించుచున్నానని నుతింపఁగా నామె స్తుతివాక్యముల నాలకించి మిగుల సంతసించి

కపిలుండు గంభీరవాక్యములతోఁ దల్లి కిట్లనియె. "ఓతల్లీ ! నా చెప్పిన సులభమయిన భక్తిమార్గము ననుసరింపుము. నీ వట్లు చేసితివేని యవలీల ముక్తిని బొందఁగలవు. ఇందులకు సంశయము లేదు. ఇది నామతము. ఇది వెక్కండ్రగు బ్రహ్మవాదుల చే ననుష్ఠింపఁబడియున్నది. ఈమార్గము నవలంబించినవారికి సంసారభయము లేదు. మృత్యువు లేదు. మోక్షము కరతలామలకమువంటిదని తెలిసికొనుము. దానివిషయమయి నీవు జాగరూకురాలవు కమ్ము" అని కపిలుం డిట్లు జ్ఞానమార్గము నుపదేశించి బ్రహ్మవాదిని యగునామె యనుమతిని బడసి యథేష్టముగాఁ బోయెను. అంత దేవహూతి తనకుమారుం డుపదేశించిన తత్త్వమార్గమును జేకొని సరస్వతీనది కలంకారభూతమయిన తన యాశ్రమమునందు సమాహితచిత్తయై కుటిలమయిన కేశపాశమును జటలుగా బంధించి వల్కలములను ధరించి భయంకరంబులగు తపంబులచేఁ గృశించినశరీరముతో వర్తింపఁదొడఁగెను. మఱియు నా దేవహూతి విరక్తి చెంది తనభర్తచే తపోయోగంబుల సంపాదింపఁబడి దేవతలకు సైతము కోరఁదగియున్న గృహస్థాశ్రమవస్తువుల నన్నింటి విడిచె. ఇదియునుగాక మందిరములను నురుఁగువలెఁ దెల్లని శయ్యాసమూహమును, పరిశుభ్రములై సువర్ణమయములై వెలయు నాసనములను, బరికరములను మహాకనకమయములయి సుఖస్పర్శముగల యాస్తరణములను, నలంకారార్థముగ మరకతాది మాణిక్యములుగల స్ఫటికమయకుడ్యములచేతను లలనారత్నములచేతను బ్రకాశించు గోడలుగల మేడలను, కుసుమితములగు మందారాదిసురవృక్షములచే రమ్యమయి మధురధ్వనులను జేయువిహంగమద్వంద్వములచే నిండి,

గానముచేయు మత్తమధుకరములచేఁ బొలుపారి, దేనిని బ్రవేశించినతన్నును గిన్నరాదులు గానముచేసిరో యట్టియుద్యానవనమును, దేనియందుఁగర్దముండు తన్నుపలాలనసేసెనో యుత్పలగంధిని యనఁబడు నాదిగుడుబావిని, దేవతాస్త్రీల కభీష్టతమములయిన యాసమస్తవస్తువులను విడిచి పుత్త్రవియోగమును సహింపలేనిదయి వెలవెలపోవు వదనముతో నుండెను. మఱియు భర్తయగు కర్దముఁడు సన్యసించి వనమునకుఁ బోవుటచేతను, బుత్త్రుఁడు తన్ను విడిచిపోవుటచేతను దాను దత్త్వజ్ఞానసంపన్నురాలయినను బతిపుత్త్రవియోగము సహింపలేక వత్సలయగుగోవు గతించిన వత్సనిమిత్తము నగచినట్లు కుమారునిఁగూర్చి మిగుల దుఃఖించెను. తరువాత నామెపుత్త్రుఁడగు కపిలుని సంతతమును ధ్యానించుచు నిస్పృహురాలయి గృహమందుఁ గొంతకాలముండెను. పిదప దేవహూతి దనకుమారుఁడగు కపిలుచేఁ జెప్పఁబడి ధ్యానయోగ్యమయి ప్రసన్నములగు వదనాద్యవయవములుగల భగవంతుని సమస్తావయవములను బ్రత్యేకముగాఁ దలంచుటచేతను, బ్రహ్మప్రాప్తికి హేతువైన జ్ఞానయోగకర్మయోగంబులచేతను వైరాగ్యముచేతను ననుగృహీతమగు భక్తియోగముచేతను, నిర్మలమగు మనంబుచేతను, సర్వజ్ఞుఁడును, నశనాదులగు షడూర్ములు లేనివాఁడును నగు పరమపురుషుని ధ్యానముచేయుచు, జీవాత్మల కాధారభూతుఁడగు పరబ్రహ్మమునందు మనంబును నిశ్చలముగా నిలిపి ప్రకృతిసంబంధమును విడిచినదగుటచే శీతోష్ణాదిక్లేశాదుల నెడఁబాసి పరమాత్మానుభవరూపమగు నానంద మనుభవించుచుఁ బ్రతిదినమును బ్రకృతివిలక్షణుఁడగు ప్రత్యగాత్మ శరీరుఁడయిన పరమాత్మయందుఁ జిత్తమును నిలిపినదగు

టచేఁ బ్రకృతిగుణకార్యములగు దేహాత్మాభిమానాది భ్రమలను దొలంగించుకొని నిద్రనుండి లేచినపురుషుఁడు కలలో గాంచిన పదార్థములను స్మరింపనివిధమున దన దేహమును స్మరింపదాయె. ఇట్లామె శరీరము పోషణాదులు లేకపోయినను మనఃపీడాదులు లేకపోవుటచేఁ గృశింపక, యభ్యంజనాదులు లేకపోవుటంబట్టి మలయుక్తమయ్యును, సధూమమగు నగ్నిహోత్రమువలెఁ బ్రకాశించెను. ఆమె భగవదనుభవజనితమగు నానందసముద్రంబునఁ దొప్పదోఁగినదగుటచేఁ దపోయోగప్రచురమై జీరాడు కేశపాశముగలిగి దైవరక్షితమయిన తనదేహము దిగంబరమయినను దెలిసికొనలేకపోయెను. ఓవిదురా! ఇట్లు దేవహూతి కపిలోక్త మార్గము ననుసరించి నిరతిశయానందరూపుఁడగు భగవంతునిఁ బొందెను. ఓయీ! ఆ దేవహూతి సిద్ధిచెందిన పుణ్యక్షేత్రము ముల్లోకములందును బ్రఖ్యాతిగాంచెను. మఱియు నది నామముచే సిద్ధాశ్రమమని ప్రసిద్ధిచెందెను. ఆమె మానవదేహము యోగాదులచే మానవధర్మములను విడిచినదయి సిద్ధాదులచే సేవింపఁబడుచు సకలసిద్ధుల నొసంగుచున్న నదీశ్రేష్ఠయయ్యెను. కపిలమహామునియుఁ దల్లి నట్లాజ్ఞాపించి యామె యనుమతిచెంది యీశానదిక్కును గూర్చిపోయెను. అట్లుపోయి సిద్ధులచేతను, గంధర్వులచేతను, జారణులచేతను, మునులచేతను, నచ్చరలచేతను నుతింపఁబడుచు సముద్రుఁ డిచ్చినస్థలమును నివాసస్థానముగాఁ జేసికొనియె. మఱియు నతఁడు సాంఖ్యప్రవర్తకులగు యోగులచే సన్నుతుఁడయి ముల్లోకములసేమమునిమిత్తము స్వయముగా యోగ మవలంబించియుండెను. "ఓపాపరహితా! విదురా! నీవడిగిన కపిల దేవహూతుల సంవాదరూపమగు పావన

కథను వినిపించితిని. ఓమహాత్మా ! కపిలునిచే నిగదితమయి రహస్యతమమయి యున్న యాత్మయోగము వినినవాఁడును, చెప్పినవాఁడును భక్తియోగ మవలంబించుకొని భగవంతునియందు మనంబును నిలిపి యతని పాదమూలమును జేరుచున్నాఁడని మైత్రేయుండు విదురునకుఁ జెప్పెనని శుకుండు రాజున కెఱింగించెనని సూతుఁడు శౌనకాదులకు దెలియఁజెప్పె. ఇది ముప్పదిమూఁడవ యధ్యాయము.

తృతీయస్కంధము సమాప్తము.

శ్రీకృష్ణార్పణమస్తు.





శుభమస్తు.

# శ్రీమదాంధ్రవచనభాగవతము.

## చతుర్థస్కంధము.



మైత్రేయుండు విదురుంజూచి యిట్లనియె. "ఓవిదురా! మనువునకు శతరూపయందు మువ్వురుపుత్త్రికలు జన్మించిరి. వారు క్రమముగ నాకూతియనియు, దేవహూతియనియుఁ, బ్రసూతియనియుఁ బ్రసిద్ధికెక్కిరి. అంత స్వాయంభువమనువు శతరూపయనుమతినిఁ బడసి తాను బుత్త్రవంతుఁడయ్యును బెక్కుపుత్త్రులు గావలయు ననుతలంపునఁ *బుత్త్రికాధర్మము నాశ్రయించి యాకూతిని రుచికిచ్చి వివాహముచేసెను. అంత రుచి బ్రాహ్మణధర్మముల నాచరించుటవలనఁ గలిగిన తేజోవిశేషముచే నొప్పుచు భార్యాసమేతుఁడై గురుతరమగు సమాధిచే నారాయణు

---

* పుత్త్రికాధర్మ మనఁగా-శ్లో॥ అభ్రాతృకాం ప్రదాస్యామి తుభ్యం కన్యామలంకృతామ్। అస్యాం యో జాయతే పుత్త్రస్స మే పుత్త్రో భవిష్యతి" అనఁగా ఓయీ? నాకుఁ బుత్త్రసంతానములేదు. ఈపుత్త్రికను నీకిచ్చుచున్నాను ఈమెకుఁ బుత్త్రుఁడు జనించినచో నే నాతనిఁబుత్త్రునిగా స్వీకరింతును. అని వాక్ప్రబంధనపూర్వకముగాఁ జేసిన కన్యాదానము పుత్త్రికాధర్మ మనఁబడును. ఇట మనువు తనకుఁ బుత్త్రులున్నను బహుపుత్త్రులు కావలయునని కోరినాఁడు కాన పుత్త్రికాధర్మ మవలంబించినను దోషములేదు.

నారాధించి తదనుగ్రహంబు చెంది, యజ్ఞస్వరూపుఁడగు నతని యజ్ఞుఁడను కుమారునిగాను,విష్ణువు నెల్లప్పుడును విడువక వర్తించు చున్న లక్ష్మిని దక్షిణ నాఁబడుకుమారినిగాను బొందెను. అంత స్వాయంభువుండు సంతోషయుక్తుండయి వచ్చి నారాయణాంశ సంభూతుఁడయి కావుననే విస్తారమగు తేజస్సుగల పౌత్రునిఁ గ్రతువును, దనయింటికిఁ గొనిపోయెను. రుచిముని దక్షిణను బుత్రునివలెఁ జూచి పాలించుచుండెను. వివాహార్థ యై పతిని గోరుచున్న దక్షిణను గ్రతువు పెండ్లియాడెను. పిమ్మటఁ దనయందుఁ బ్రీతిగలయామెయందుఁ దాను బ్రీతిగలవాఁడయి పన్నిద్దఱు పుత్రులను బుట్టించెను. వారు తోషుండనియుఁ, బ్రతోషుండనియు, సంతోషుఁడనియు, భద్రుండనియు, శాంతియనియు, నిడస్పతియనియు, నిధ్ముఁడనియు, గవియనియు, విభువనియు, వహ్నియనియు, సుదేవుఁడనియు, రోచనుఁడనియుఁ బిలువఁబడుదురు. పరస్పరము ప్రేమగల తలిదండ్రులవలనఁ గలిగినవారుగాన తుషితులనం బరఁగిరి. మఱియుఁ దుషితులను దేవతలును, మరీచ్యాది మహామునులును, నారాయణాంశసంభూతుండగు యజ్ఞుండును, మహాబలులైె మనుపుత్త్రులగు ప్రియవ్రతోత్తానపాదులును, వారివారి సంతతివారును లోకధర్మములు చెడకుండ స్వాయంభువమన్వంతరకాలమును బరిపాలించిరి. మఱియు దేవహూతిని గర్దమునకిచ్చుటయు, వారల సంతానాభివృద్ధియు, భగవంతుండు గపిలుండై యుదయించుటయు వినిపించియున్నాను. కాన నది నీకు శ్రుతప్రాయమే. పిమ్మట స్వాయంభువమనువు తన మూఁడవపుత్త్రికయగు ప్రసూతిని బ్రహ్మపుత్త్రుఁడయిన దక్ష ప్రజాపతికి నొసంగె. ఆ ప్రసూతిదక్షప్రజాపతుల సంతతిచే

మూఁడులోకంబులు నిండినవి. మఱియుఁ గర్దమప్రజాపతి పుత్త్రికలను మరీచ్యాది బ్రహ్మర్షులు పెండ్లియాడిరని చెప్పియున్నాను. ముందుగాఁ వారల సంతానక్రమమును జెప్పెద నాలింపుము. కర్దమపుత్త్రికలలోఁ గల యనుకన్యామణిని మరీచి వరించె. ఆమరీచికిఁ గళయందుఁ గశ్యపుఁడను కుమారుఁడును బూర్ణిముఁడను కుమారుఁడును బుట్టిరి. వారివలనఁ బుట్టినప్రజాపరంపర

కర్దమప్రజాపతిసంతతిని దెలుపుట.

చే భువనమంతయుఁ బూర్ణమాయె. అందుఁ బూర్ణిముఁడు భువనవ్యాపకుండగు విరజుఁడనుకుమారునిఁ గనియెను. మఱియు దేవకుల్య యనుకుమారికను గాంచెను. ఆదేవకుల్య పూర్వజన్మమందు హరిపాదసంభూతయై పరమపూతయై ముల్లోకములందు వ్యాప్తయై యొప్పు గంగానదియె. మఱియుఁ గర్దమపుత్త్రికలలో రెండవదాని నత్రిమహాముని వరించెనని చెప్పితిని. ఆయత్రిమహామునికి ననసూయయందు దత్తాత్రేయుఁడు, దుర్వాసుఁడు, చంద్రుఁడు నను మువ్వురుపుత్త్రులుపుట్టిరి. అందు * నారా

* ఇందులకు మూలము. "ఆత్మేశబ్రహ్మసంభవాః" అనియున్నది. అనఁగా హరిహరబ్రహ్మలయొక్క యభివ్యక్తిగలవారి యనియర్థము. ఇట "ఆత్మశబ్దముచే "తవాన్తరాత్మామమచ" ఇత్యాదికమగు శ్రుతులచే విష్ణువునకుఁ బరమాత్మత్వమును, శివబ్రహ్మలకు జీవత్వమును బ్రసిద్ధమయియున్నట్లు సూచింపఁబడుచున్నది. ఓయీ! సర్వాంతర్యామియగు పరమాత్మ జీవునిమూలముగాఁ దనజ్ఞానశక్త్యాదిగుణములలో నొకదాని వెల్లడించి యంశావతార మందుట యుచితము గానుండునుగాని పరమాత్మ కంశభూతులై యణుస్వరూపులై జీవవిశేషులయిన బ్రహ్మరుద్రులు మఱియొకజీవునియం దనుప్రవేశమనెడి యంశావతారము నొందుటయెట్లు? అనియందువేని చెప్పెదవినుము. శ్లో॥ "అవిద్యాకర్మసంజ్ఞా

యనాంశమువలన దత్తాత్రేయుండును, రుద్రాంశమువలన దుర్వా సుండును, బ్రహ్మాంశమువలన సోముండును నుదయించిరి". అని నుడువు చున్న మైత్రేయుంగాంచి విదురుం డిట్లనియె. "ఓమహానీయా! సృష్టిస్థితిలయముల కాధారులయి వెలయుచున్న బ్రహ్మవిష్ణుమహేశ్వరు లేమికారణమున నత్రిమహామునిగృహమునం బుట్టినారు? వా రేమేమికార్యములం జేయనెంచి యట్టు లుద్భవించినారు? ఆయుదంతమంతయుఁ దెలియఁజేయుము" అని యడిగిన విదురునకు మైత్రేయుం డిట్లనియె. "ఓవిదురా? నీ ప్రశ్నమునకు త్తరము నిచ్చుచున్నాను. ఆలింపుము. బ్రహ్మ యత్రిని గాంచి తప మాచరించి సంతానమునుగాంచు మనవుఁడు, నతం డట్లయని యతనియనుమతి పడసి భార్యాసమేతుండై ఋక్షమను పేరుగల కులపర్వతమునకుఁ బోయెను. నిర్వింధ్యానదీజలము లంతటను ధ్వనిగావించుచున్న యాకాననమందు నొకయాశ్రమము ను గల్పించుకొని జటావల్కలంబులు ధరించి, యేకపాదంబున

న్యా తృతీయాశక్తిరిష్యతే । యయాక్షేత్రజ్ఞశక్తిస్సా వేష్టితా నృపసర్వదా। సంసారతాపా నఖిలా నవాప్నోత్యతిసంతతాన్ । తయాతిరోహితత్వాచ్చ శక్తిః క్షేత్రజ్ఞసంజ్ఞితా। సర్వభూతేషు భూపాల తారతమ్యేనవర్తతే" ఇత్యాదికముచేఁ జెప్పఁబడినట్లు జీవునికి ధర్మభూతజ్ఞాన మవిద్యచేఁ దిరోహితమయి మిగులవ్యత్యాసముగలదై వర్తించును. అప్పుడు పరమాత్మప్రసాదమువలన నవిద్యారూపమగు నావరణము తొలఁగినతోడనే ధర్మభూతజ్ఞానము సంకోచములేకుండఁ బ్రసరించును. కావునఁ బ్రస్తుతమున బ్రహ్మరుద్రులు జీవులయినను బరమపురుషానుగ్రహమును సంపాదించుకొని యజ్ఞానమును నివర్తించుకొన్నవారగుటచే మనకంటె నధికమగు జ్ఞానప్రసారముకలవారు. అందుచే వారు ధర్మభూతజ్ఞానముచే దూర్వాసునియందును, జంద్రునియందును నను ప్రవేశించుటకుఁ దగియుండుటచే బ్రహ్మరుద్రులంశావతారమునొందుట యుపపన్నమగుచున్నది

నిలిచి వాయుమాత్ర భక్షకుండై, భగవంతుండు తనకుఁ గుమారుండయి పొడముఁగాక యనికోరుచు, ఘోరాతిఘోరంబై సాటిలేనితపం బాచరింపం దొడంగె. ఇట్లు శతదివ్యవత్సరముల కాలము చనునప్పటికి నాయత్రిమహామునిమూర్ధమునుండి తపోవహ్ని బయలువెడలి యూర్ధ్వలోకముల దహింప సమకట్టె. అంత త్రిమూర్తులుగాంచి తా మిఁక నుపేక్షించిన లోకములు దగ్ధములగుట నిక్కంబని తలంచి, గంధర్వులు, సిద్ధులు, విద్యాధరులు మొదలగు సమస్తబృందారకబృందంబులు తమ

## అత్రిమహామునికి బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ప్రత్యక్షమగుట.

కీర్తుల నుతించుచుండ నత్రిముని యాశ్రమంబున కరుదెంచిరి. అంత నత్రిముని తనయాశ్రమంబునకు వచ్చి హంససుపర్ణవృషభంబులపై నధిరోహించి తమతమచిహ్నముల ధరించి, సమస్త గీర్వాణులచే నుతింపఁబడుచునున్న బ్రహ్మవిష్ణుమహేశ్వరులం బొడగాంచి సమస్తప్రపంచమునకుఁ గారణభూతులయి మందహాసములచేతను, గరుణావలోకనములచేతను, సుందరవదనారవిందములు గలిగియున్న యా దేవోత్తముల పాదమూలంబులకు నమస్కారంబు గావించి చేతులుజోడించి దుస్సహమయిన త్రిమూర్తుల తేజంబు చూడఁజాలక ముకుళితనేత్రుండై, తదీయ పాదకమలంబుల మనంబున సంస్మరించుచు, మృదుమధురవాక్కులతో నిట్లు నుతింపఁగడంగె. "ఓ మహనీయులారా! మీరు లోకమును సృజింప భరింప హరింపఁ దలంపుచే మాయాగుణములయిన రజస్సత్త్వతమోగుణంబుల నాశ్రయించి బ్రహ్మయనియు, వాసుదేవుఁడనియు, శివుఁడనియు వేర్వేఱ పిలువఁబడుచున్నారు.

అట్టి మహామహు లయినమీపాదకమలముల కభివందనము లాచరించుచున్నాను. మీరుముగ్గురు దుస్సహతేజస్సుతో వఱలుచున్నారు. మీ ముగ్గురియందు నాచేఁ బిలువఁబడిన మహనీయుఁ డెవ్వఁడు? మీరే చెప్పుడు. మఱియు నే నందఱిలో నుత్కృష్టుఁడగు భగవంతుఁడు నాకుఁ బుత్త్రుఁడుకావలె నని ధ్యాంచి మనంబునఁదలంచి యొక్కరి నేపిలువఁగా మీరు ముగ్గురు నే తెంచినారు. మానవుల మనస్సునకుఁగూడ దూరమగు మీరిప్పు డిచ్చటికి నేలవచ్చితిరి. అట్లు వచ్చుటకుఁ గారణమేమి?' అని భక్తి వినమితగాత్రుండై యడుగుచున్న మునిపుంగవుం జూచి దేవత లిట్లనిరి. "ఓ మునీంద్రా! నీసంకల్పమెట్లో యట్లేయగుఁగాక;నీవు సత్యసంకల్పుఁడవు. నీవే జగదీశ్వరతత్త్వమును ధ్యానము చేసితివో యాతత్త్వము మేమే. మేము ముగ్గురమే.అయినను జక్కఁ నాలోచింప మేము ముగ్గురము నేకమైయుందుము. అందువలన నీ వొక్కని బిలిచినను ముగ్గుర మరుదెంచినారము. నీమానసమునందలికోర్కి మా కవగతమయినది. మాయంశంబులచే నీకు ముగ్గురుపుత్త్రులు పుట్టఁగలరు. వారు ముగ్గురు లోకములలో మిగులఁ బ్రఖ్యాతిని వహించి తమతమకీర్తులను సుగుణములను వెలువరింపఁగలరు. ఇందుల కెంతమాత్రము సందియము లేదు " అని యత్త్రిముని యభీష్టము నెఱవేర్చి యామునిదంపతులచేఁ బూజితులై తమతమ నివాసంబుల కరిగిరి. అత్త్రియు, ననసూయయు దేవత లేఁగినపిమ్మట మిగుల నానందభరితులై యున్న యవసరంబున బ్రహ్మాంశమువలనఁ జంద్రుండును నారాయణాంశమువలన దత్తాత్త్రేయుండును, శంకరాంశమువలన దుర్వాసుండు నుదయించిరి. మఱియు నంగిరసునకు

శ్రద్ధయను కన్యక నొసంగెనని చెప్పియుంటిని. ఆమునిచంద్రు నకు శ్రద్ధయందు సినీవాలి, కుహువు, రాక, యనుమతి యనునల్వురు కుమారిక లుదయమందిరి. మఱియు నంగిరసునకు బృహస్పతియు నుచథ్యుండు నను నిర్వురుపుత్త్రులు గలిగిరి. వారిరువురు స్వారోచిషమన్వంతరమునఁ బ్రఖ్యాతిఁ గాంచిరి. పులస్త్యుఁడు కర్దముని నాల్గవకుమారికయగు హవిర్భుక్కును బెండ్లియాడి యామెయందు, నగస్త్యమునీంద్రుని, విశ్రవసుని గనియె. ఆవిశ్రవసునకు నిలబిల యను కన్యకయందుఁ గుబేరుం డుదయించి యక్షాధిపతియయ్యెను. మఱియు విశ్రవసునికి రెండవ భార్యయగు కేకసియందు రావణ కుంభకర్ణ విభీషణు లుదయించిరి. మఱియుఁ బులహుండు గర్దముని యైదవకూఁతురగుగతి యను సుందరియందుఁ, గర్మశ్రేష్ఠుండు వరీయాంసుండు, సహిష్ణుండు నను మువ్వురుపుత్త్రు లుదయించిరి. క్రతువను ప్రజాపతి కర్దముని యాఱవకూఁతురగు క్రియ యను కన్యకయందు బ్రహ్మతేజస్కులై యొప్పుచున్న వాలఖిల్యాదిమహామునుల నఱువదివేవురం గాంచెను. మఱియు వసిష్ఠుండు కర్దముని నవమపుత్రికయగు నరుంధతిని వరించి యామెయందుఁ, జిత్రకేతుండు, సురోచి, విరజుండు, మిత్రుండు, నుల్బణుండు, వసుభృద్యానుండు, ద్యుమంతుండు నను నేడుగురుపుత్త్రులం గనెను. మఱియు నతనికి రెండవభార్యయందు శక్తిముఖపుత్త్రు లుదయించిరి. మఱియు నథర్వుండు కర్దమునియష్టమపుత్త్రియగు శాంతిను వరించి యామెయందు, ధృతవ్రతుండు, దధ్యంచుండు, నశ్వశిరుండు నను మువ్వురుపుత్త్రులఁ గాంచె. మహాత్ముండగు భృగువునకు ఖ్యాతి యనుపత్నియందు ధాతయు విధాతయు నను నిర్వురుతనయులుగలి

గిరి. మఱియు భగవత్పదపరాయణయగు శ్రీ యనుకన్యక యు ద్భవించెను. అధాతృవిధాతృలు మేరువను మునీంద్రుని కుమారికలగు నాయతిని నియతిని బెండ్లియాడి, వారియందుఁ గ్రమముగా మృకండుఁడు,ప్రాణుఁడు నను తనయులను బడసిరి. అందు మృకండునకు మార్కండేయుఁడు. ప్రాణునకు వేదశిరుండు నను పుత్త్రులు పుట్టిరి. ఆవేదశిరునకు శుక్రుం డుదయించె. ఇట్లు కర్దముకుమారికలయందుఁ బుట్టిన సంతానపరంపరచే లోకంబెల్లయుఁ బరిపూర్ణంబయ్యె. ఓవిదురా ? ఈ కర్దముసంతతి ప్రకారంబు విన్నవాఁడు సమస్త పాపవిముక్తుం డగు. ఇంక దక్షుని వంశానుక్రమమును దెలిపెద నాలింపుము. ఓవిదు

దక్షప్రజాపతిసంతతిని దెలుపుట.

రా ! మనుపుత్త్రికయయిన ప్రసూతిని దక్షుఁడు భార్యగా వరించియున్నాఁడని చెప్పియుంటిని. ఆదక్షప్రజాపతికిఁ బ్రసూతియందుఁ బదాఱుగురుతనయలు గలిగిరి. ఇట్లుదయించిన కన్యకలలో శ్రద్ధయు, మైత్రియు,దయయు, శాంతియుఁ, దుష్టియుఁ, బుష్టియు, గ్రియయు, నున్నతియు, బుద్ధియు, మేధయుఁ, దితిక్షయు, హ్రీయు, మూర్తియు నను నామంబులుగల పదుమువ్వురు కన్యకలను, ధర్మున కొసంగెను. మఱియు దక్షుండు, మఱియొకకన్యక నగ్నికర్పించెను. మఱియొకకన్యకను బితృలకును, గడపటికూఁతును సంసారనివర్తకుండగు నీశ్వరునకు నర్పించె. పిమ్మట యాధర్మునకు, శ్రద్ధవలన శ్రుతమును, మైత్రివలనఁ బ్రసాదంబును, దయవలన భయంబును, శాంతివలన సుఖంబును, దుష్టివలన ముదంబును, బుష్టివలన స్మయంబును, గ్రియవలన యోగంబును, నున్నతివలన దర్పంబును, బుద్ధివలన నర్థంబు, మేధ

తలన స్మృతియుఁ, దితిక్షువలన క్షేమంబును, హ్రీవలనఁ బ్రశ్రయంబు గలిగెను. ఇందుఁజెప్పఁబడిన శ్రుతప్రసాదాదులు తత్తదభిమానిదేవతలని యెఱుంగునది. మఱియు ధర్మునకుఁ బదుమూఁడవభార్యయగు మూర్తివలన నరనారాయణులను నిర్వురుపుత్త్రులుపుట్టిరి. వారలిరువురు నుదయించుకాలమందు ననుకూలమయిన మందమారుతము ప్రసరించెను. దిశాముఖములన్నియు నిర్మలములాయెను. సమస్తలోకములు నానందముతో వర్తిల్లె. నదులును సముద్రములును బ్రసన్నములై ప్రకాశించెను. దేవదుందుభులు మొరసెను. గంధర్వులు గానముచేసిరి. అసంఖ్యాకులగునచ్చరలు నాట్యములు సలిపిరి. సమస్తబృందారకులును గగనమందుండి పుష్పవర్షము లమితముగా గురియించిరి.మునీంద్రులందఱు నధికానందంబుచెంది నుతులొనర్చిరి. వారలుదయించినదిన

—— బ్రహ్మాదులు నరనారాయణుల నుతించుట. ——

ము పరమమంగళమయి వెలసెను.ఆసమయంబున బ్రహ్మాదిదేవతలమ్మహాత్ములకడ కరుదెంచి యిట్లునుతించిరి. "ఓమహాత్ములారా? మీరు నారాయణాంశసంభూతులరు. మిమ్ము రెండురూపముల తోవర్తిల్లెడు భగవంతుఁడని యెఱుంగుదుము. అట్టి యోభగవంతా ! ఆకాశమునందు నలుపు, తెలుపు మొదలగు రంగు భేదములున్నట్లు నీ పరమాత్మయందు మాయచే దేవమనుష్యాదిభేదములుగల యీ విశ్వమంతయుఁ జేయఁబడియె. ఇట్లు మాయచే రచింపఁబడిన ప్రపంచస్వరూపమును, దేవాది విలక్షణమయిన బ్రహ్మస్వరూపమును జీవాత్మస్వరూపమును దెలియఁజేయుటకై నీవు ధర్మునియింటఁ బుట్టితివి. అట్టి పరమపురుషుఁడవయిన నీపాదపద్మములకభినందనము సలుపుచున్నాము.

మఱియు నో దేవా! నీసంకల్పంబువలననే లోకమునకు బంధమోక్షములు కలుగుచున్నవి. నీవు జ్ఞానైకవేద్యుఁడవు. వివిధవిచిత్రశక్తిమంతుండవు. ప్రపంచకముయొక్క *సృష్టిస్థితిలయములు ప్రవర్తించునిమిత్తము సృష్టింపఁబడిన మమ్మును గరుణారసపూరితములు, నరవిందసదృశములునగు విలోకనములచేఁ గనుఁగొనుము' అని యిట్లు దేవతాబృందములచే నుతింపఁబడుచు నరనారాయణులు గంధమాదనపర్వతముం గూర్చిపోయిరి. ఓ విదురా! ఆనరనారాయణమునులే భూభారమును హరింపఁగోరి ద్వాపరమునందుఁ గృష్ణార్జునులై యవతరించిరి. మఱియు దక్షుండు తనకుమారికయగు స్వాహాదేవిని పావకునకిచ్చి పెండ్లి చేసెనని చెప్పితిని. ఆయగ్ని యా స్వాహాదేవియందు హుతభోజనులయినవారును, పావకుండును, పవమానుండును, శుచియు నను నామంబులు గలవారునగు మువ్వురుపుత్త్రులం బడసెను. వారలే త్రేతాగ్న్యభిమానిదేవతలని పిలువఁబడుదురు. వారివలన నలువదియైదువిధంబులుగల యగ్ను లుత్పన్నంబులయ్యె. అవియే పితృపితామహయుక్తంబులై నలువదితొమ్మిదివిధములుగలవయ్యె. ఆయాయగ్నుల నామంబులచేతనే బ్రహ్మవాదులు యాగాదులయందు నగ్నిదేవతాకములయిన యిష్టులం జేయుచుందురు. ఆయగ్ను లగ్నిష్వాత్తులు, బర్హిషదులు, సోమ్యులు, పితరులు, నాజ్యపులు, సాగ్నులు, నిరగ్నులు నను నేడు తెఱంగులయియుందురు. మఱియుఁ బితరులకు స్వధ యను కన్యకయందు

* ఇట స్థితిపదము పాలనాధికారమం దుంపఁబడినవారును భగవదంశసంభూతులునునగు నింద్రాదిదిక్పాలకుల నుద్దేశించి చెప్పఁబడెను. కాని విష్ణువు నుద్దేశించి చెప్పఁబడలేదు.

వయున, ధారుణి యను నిర్వురుపుత్త్రికలు కలిగిరి. ఆయిరువురు కన్యలు సంసారంబునొల్లక బ్రహ్మచారిణులయి పరఁగిరి. దక్షుని కడపటికూఁతురయిన సతీదేవి శంకరుని ననవరతముగొల్చుచుండియు, గుణశీలములచే నాత్మసదృశుఁడగు తనయునిఁ బడయ లేక పోయెను. అనంతరము బాలికయగు సతి తండ్రిచే నవమానింపఁబడి యోగాగ్నికల్పించికొని యందుఁ దన దేహమును బూర్ణాహుతిగావించె.'' అని చెప్పుచున్న మైత్రేయుంగాంచి విదురుండిట్లనియె. ఇది ప్రథమాధ్యాయము.

---

ఈశ్వరునికి దక్షునకు విరోధము సంభవించినకథ.

"ఓమునీంద్రా! సర్వసముఁడయి ప్రవర్తిల్లు నీశ్వరునకును దక్షునకు విరోధమెట్లు సంభవించినది? మఱియు దుహితృవత్సలుఁడయిన దక్షుఁడు కుమారిక నేలతిరస్కరించెను? ఈశ్వరుండు లోకంబుల కధిపతి; స్థావరములకుఁగూడ జ్ఞానముకలిగింప సమర్థుండు. అతఁడు వైరములేనివాఁడై, శాంతవిగ్రహుండయి,యాత్మారాముండై, సమస్తజగదారాధ్యుండై యొప్పుచుండును. అట్టిమహానుభావునితో దక్షుఁ డేలకలహించెను? ఓమహాత్మా! వారిరువురు కలహించిన వృత్తాంతమును నాకలహమువలన సతీదేవి మరణించినవిధమును సవిస్తరముగాఁ దెలియఁజేయుము.'' అని యడిగిన విదురుంజూచి మైత్రేయుండిట్లనియె. "ఓవిదురా? ఆయుదంతముచెప్పెద నాలింపుము. పూర్వము మరీచ్యాదులయిన ప్రజాపతులు సత్త్రయాగమును జేయుచుండిరి. ఆయజ్ఞమును జూచుటకయి మహామునులును, దేవతలును, నగ్న్యభిమానదేవతలును వచ్చిరి. ఆసమయమున సూర్యునివలెఁ బ్రకాశించుచుఁ,

దనకాంతిపుంజముచే లోకమును జీఁకటిలేకుండునట్లు గావించుచు, నాసభామధ్యమున కరుదెంచుచున్న దక్షప్రజాపతినిజూచి బ్రహ్మయు నీశ్వరుండును దక్క్కఁ దక్కిన సభాసదులందఱును స్వస్థానములనుండి లేచి గౌరవించిరి. ఇట్లు సభాసదులచే గౌరవింపఁబడుచు, దక్షుండు లోకగురువగు బ్రహ్మను సమీపించి నమస్కారములం గావించి యతనియనుజ్ఞవడసి యుపవేశించెను. అనంతరము దక్షుఁడు ప్రత్యుత్థానాదులచేఁ దన్ను గౌరవింపక తనకంటె ముందుగ గూర్చుండియుండిన శంకరునిఁజూచి కోపము నాఁపఁజాలక కన్నులచే నిప్పులఁ గుప్పలుగాఁ గురియుచు నిట్లనియె. "ఓమునీంద్రులారా! ఓదేవతలారా! నే నొక్కమాట వచించుచున్నాను. సావధానులరై వినుఁడు. నేను సజ్జనప్రవర్తనను గుఱించి చక్కఁగాఁ జెప్పుచున్నాను. అంతియకాని తెల్వితక్కువచేఁగాని మచ్చరమువలనఁగాని చెప్పలేదు. ఈరుద్రుఁడు త్రపారహితుఁడు. హీనులలో హీనతముఁడని చెప్పవలసియున్నది. వీఁడు లోకపాలకుఁడని పేరుపెట్టికొని యీలోకపాలపదమును జెఱిచినాఁడు. వీఁడు స్వవిహితధర్మము నెఱుంగనిమూర్ఖు. మఱియు వీఁడు సత్పురుషు లాచరించుచున్నమార్గము నవలంబింపక చరించుచున్నాఁడు. నాకుమారికయగు సతీదేవిని వరించియుండుటచే వీఁడునాకు శిష్యప్రాయుఁడు. వీఁడు పరమయోగ్యునివలెవచ్చి నాపిల్లను నగ్నిసాక్షిగాఁ బెండ్లియాడెను. అకటా! ఇట్టిదుష్టుఁడని తెలిసినచో వీనికి నాముద్దుకూఁతు నర్పింతునా? మర్కటలోచనుఁడై కురూపియై యున్న వీఁడు మృగవిశాలనేత్రయై సౌందర్యవతియై యున్నకూఁతునువరించి నమస్కారయోగ్యుఁడనగు నాకు నమస్కరించుట లేదుగదా. వాక్కులచేతనైనను గౌరవింపఁడాయెను.

* విహితకృత్యములను బరిత్యజించి కావుననే యపరిశుద్ధుఁడై, దురహంకారియై ధర్మమర్యాదల నతిక్రమించియున్న వీనికి నేను సద్గుణురాలగు నాకూఁతును శూద్రునకు నిరుష్టమగు శ్రుతినొసంగినట్లు లొసంగితిని. ఎంత తెలివితక్కువకార్య మాచరించితిని !

---

* ఇట రుద్రనిందాపరమగు గ్రంథమును గొందఱు స్తోత్రపరముగా వ్యాఖ్యానము చేయుచున్నారు. ఎట్లన, శ్లో॥ "లుప్తక్రియాయాశుచయే మానినే భిన్నసేతవే" అనుచోట, లుప్తక్రియాయ=ఈశ్వరుఁడు పరబ్రహ్మస్వరూపుఁడు కాన క్రియాకలాపము విడిచినవాఁడు, అశుచయే=ఎవనికంటె శుచియగుపదార్థము లోకమందు లేదో యట్టివానికొఱకు, అమానినే = అహంకారములేనివానికొఱకు, అభిన్నసేతవే = మర్యాదల నతిక్రమింపనివానికి, అని వ్యాఖ్యానము చేయుచున్నారు. మఱియు నీశ్వరునిశ్మశానవాసాదికమంతయు విడంబనమాత్రమని మూలములో "ఉన్మత్తవత్ = వెఱ్ఱివానివలె" అని చెప్పుటచే దక్షుఁడు కూడ శ్మశాననివాసాదికము విడంబన మని తెలిసికొనియున్నట్లు స్పష్టమగుచున్నది. శ్లో॥ "శివాపదేశో హ్యశివో మత్తోమత్తజనప్రియః। పతిః ప్రమథభూతానాం తమోమాత్రాత్మకాత్మనామ్। తస్మా ఉన్మాదనాథాయ నష్టశౌచాయ దుర్హృదే। దత్తా బత మయా సాధ్వీ చోదితః పరమేష్ఠినా"॥ ఈశ్లోకములకును, బదములను వేఱువిధముగ విభజించిరి. అశివః=ఎవనికంటె మంగళప్రదుఁడు లోకముననుండఁడో వాఁడు, అమత్తః= మత్తుఁడుకాఁడు, అమత్తజనప్రియః- అమత్తజన=మత్తులుకానివారికి, ప్రియః=ప్రియుఁడైనవాఁడు, తమోమాత్రాత్మకాత్మనాం, ప్రమథాదిభూతానాంపతిః=అనఁగా నీశ్వరుఁడు భక్తవత్సలుఁడు కావునఁ బ్రమథులు తామసులయినవారిదోషమును దొలంగించి రక్షించువాఁడు, నష్టశౌచః - నష్ట=అపరిశుద్ధులకుఁగూడ, శౌచం = పరిశుభ్రిత్వమునిచ్చువాఁడు, దుర్హృదే = దుష్టులందుహృదయముగలవాఁడు - అనఁగా దుష్టులపైత మనుగ్రహింపఁదగినవారనెడి బుద్ధిగలవాఁడనుట. ఇట్టివానికి, మయా, సాధ్వీ, దత్తా=నాచే నాకుమారిక నొసంగఁబడినది. బత=ఎంతసంతోషదాయక

మఱియు వీఁడు శ్మశానభూములయందు సంచరించుచుండును. వీనిపరిచారకులు భూతములు పిశాచములు. వల్లకాటియందున్న భస్మమే వీనికి గంధతుల్యమై యొప్పుచుండును. పుఱ్ఱెలచాలే వీనికి హారములయియుండును. ఎముకలే యలంకారములు.

---

మగుకార్యము. అని యిట్లువ్యాఖ్యానము చేయుచున్నారు. కాని యీయర్థము దక్షునికభిప్రేతమయినదా? లేక యీభాగవతగ్రంథకారునకా, లేక యితరులకా? ఇట దక్షునభిప్రేతమని చెప్పరాదు. "సాధూనాం బ్రువతో వృత్తం నాజ్ఞానాన్న చమత్సరాత్" అని దక్షుఁడు వాస్తవార్థమునే చెప్పుచున్నానని యారంభించి "లోకపాలానాం యశోఘ్నో నిరపత్రపః" అనియు, "యేన స్తబ్ధేనదూషితః" అనియు, "ఏష మేశిష్యతాం ప్రాప్తః" అనియు నిందించుచున్న దక్షుని కీశ్వరుని ప్రశంసచేయ నిష్టముండునా? ప్రకరణమునుబట్టి యాలోచించినను రుద్రుని నిందింపవలెనన్న తలంపేకాని వేఱుతలంపుండదు. కావుననే "దక్షో గిరీశాయ విసృజ్యశాపం తస్మాద్వినిష్క్రమ్య వివృద్ధమన్యుః । జగామ" అని చెప్పఁబోవు గ్రంథముగూడ సంగతమగుచున్నది. ఈయర్థము పురాణకర్తకుఁగూడ నభిమతముకాదు. ఏమన, నీపురాణము వేదాంతార్థస్వరూపమే కావునను, "అనపహతపాప్మావా అహమస్మి" "నారాయణా ద్రుద్రో జాయత" ఇత్యాదులగు వేదాంతములందు రుద్రునకుఁ గర్మవశ్యత్వము కార్యత్వము నున్నట్లు వినఁబడుచున్నది కావునను, దద్విరుద్ధముగా నర్థమువచ్చునట్లు గ్రంథమునఁ గూర్చుటతగదు. కావుననే, "సద్యోజాయత తన్మన్యుః కుమారో నీలలోహితః। స వై రురోద దేవానాం పూర్వజో భగవానజః । నామానికురు మే ధాతః స్థానాని చ జగత్పతే" అని రుద్రుఁడు కర్మములకు వశుఁడైయుండుటయు, జన్మించి ప్రార్థించి చతుర్ముఖునిచేఁ జేయఁబడిన నామస్థానములను స్వీకరించుటయు, గ్రంథమందుఁ జెప్పఁబడినది. ఇతరుల కీయర్థ మభిమతమని చెప్పరాదు. పెఱవా రాగ్రహగ్రస్తులయి యీశ్వరుని కాధిక్యముచూపవలయునని యుందురు. కావున దానినంగీకరింపరాదు. మఱియు "శంకరుడు పరబ్రహ్మము కావునఁ గర్మవశ్యుఁడు

వీఁడు వ్రేలాడుచున్న కేశపాశముకలవాఁడై వల్లకాటియందు న్మత్తునివలె సంచరించుచుండును. వీఁడెల్లప్పుడు దిగంబరుండై భయంకరముగ ధ్వనులుచేయుచుఁ దిరుగుచుండును. దిగంబరుండై వర్తించుటకు మనంబునన్నైన సిగ్గుజనింపదు కాఁబోలును. వీఁడు మిగులగర్వించి క్రిందుమీఁదు నరయకయున్నాఁడు. వీనిని జనులందఱు శివుండని పిలుచుచుందురు కాని యానామము వీనికిఁ దెచ్చి పెట్టినట్టులున్నది. చక్కఁగ నాలోచించిచూడుఁడు. శివుఁడని పిలువఁదగినగుణ మొక్కటియైన కలదేమో? వీఁడు కేవలము తమస్స్వరూపుఁడు. సత్వగుణ మింతేనియు గానరాదు. తాను మదించినవాఁడు. కాన వీఁడు మదించి వర్తిల్లుజనులకుఁ బ్రియతముండు. ప్రమథులని పిలువఁబడు భూతములకురాజు. వీఁడాచారహీనుఁడు. దుష్టచిత్తుఁడు. ఇట్టి దురాత్మునకు ముద్దులు మూటగట్టు నోరెఱుఁగని పసిపిల్లను గట్టిపెట్టి పాప మూపిల్ల

---

కాఁడని చెప్పుటయు యుక్తముకాదు. రామకృష్ణాదులు పరబ్రహ్మస్వరూపులైనను గర్భశూన్యులైనట్టు చెప్పఁబడలేదు. పరబ్రహ్మస్వరూపుఁ డగువాఁడు క్రియాలోపము నొందియుండవచ్చు. అందు నిదోషహేతువుగాఁ దలంపరాదు. మూలమున "అమాని నే" "అభిన్న నేత వే" అని పదవిభాగము గ్రంథకర్తకభిమతముకాదు. లేక యట్లంగీకరించినచో "సద్భిరాచరితః పంథాయేన స్తబ్ధేనదూషితః" అని చెప్పిన గ్రంథమునకును దీనికిని విరోధము సంభవించుచున్నది. తామసులయినను బ్రమథులదోషములను దొలంగించి రక్షించువాఁడని చెప్పుటయుఁ దగదు. "తానహంద్విషతః క్రూరా న్సంసారేషు నరాధమాన్ | క్షిపామ్యజస్రమశుభా నాసురీష్వేవయోనిషు | ఆసురీంయోనిమాపన్నా మూఢాజన్మనిజన్మని | మామప్రాప్యైవకౌంతేయ తతోయాంత్యధమాంగతిం" తామసులు కోపపాత్రులగుచున్నట్లు గీతలలో చెప్పఁబడుచున్నది. కావున నిట్టియర్థమును స్వీకరింపరాదు.

గొంతుకను దెగియుఁదెగనికత్తితో ఖండించితి. అక్కటా! ఇప్పు
డెంతనిందించుకొన్నను లాభమేమి." అని యిట్లుపలికి యుదా
సీనుఁడై కూర్చుండియున్న శంకరునిశపింప సమకట్టి క్రుద్ధుం
డై జలంబుగొని యాచమనంబుచేసి మఱియు నిట్లనియె.
"ఓసభాసదులారా! దురాత్ముండైన యీశ్వరుం డిది మొదలు
కొని దేవతోద్దేశ్యముగా నర్పింపఁబడుచున్న హవిస్సులయం
దింద్రాదిదేవతలతోఁబాటుగ భాగంబు లేకుండుఁగాక. మఱి
యు వీఁడు దేవతాగణములలో నధముఁడు. అట్టివానికి హవిర్భా
గంబుగొన నెట్టు లర్హుండగును." అనిశపించి సభాసదులందఱిచేత
నిషేధింపఁబడినవాఁడగుటచే రెట్టించినకట్టలుక కలవాఁడయి
సభామధ్యమున నుండనొల్లక తననివాసంబునకరిగె. ఇట్లు దక్షుం
డు పలికిన గర్హితవాక్యంబులన్నియువినియు నీశ్వరుం డింతేనియు
నలుగక యూరకుండె. అనంతరము దక్షుండు శాపమిచ్చిపోవుట
నుపలక్షించి శంకరుని పరిచారకుఁడగు నందీశ్వరుండు తనప్ర
భువు శప్తుండగుటకుఁ గరమ్మలిగి, దక్షుఁ డిచ్చినశాపమున కానం
దించిన బ్రాహ్మణులకును, దక్షునకు నిట్లు శాపంబిచ్చె. "ఓసభాసదు
లారా? ఈదక్షుండు మానవశరీరమే శ్రేష్ఠంబని తలంచి నిరప
రాధుఁడును, లోకపూజ్యుఁడును భగవదంశావతారుండును నగు
నీశ్వరుని కపరాధంబు కావించె. కావున నీదురాత్ముండు ప్రకృ
తిపురుషేశ్వరవిషయమగు జ్ఞానములేనివాఁడయి చరించుఁగాక.
మఱియు వీఁడు మాయాగుణధర్మములతో నిండియున్న నివా
సంబుల వర్తించుచు, తుచ్ఛములయిన సాంసారికసుఖముల
నాసించుచు,నర్థవాదంబులయిన వేదంబులచే నష్టబుద్ధియై యల్ప
సుఖదములగు కర్మతంత్రంబుల విస్తృతముగాఁ జేయుచు, వర్తిం

చుఁగాక. మఱియు వీఁడు నశ్వరములయిన దేహాదులను నాత్మ
గా భావించుచు, జీవాత్మ పరమాత్మవిషయమైన జ్ఞానమును
నశింపఁజేసికొని పశుప్రాయుండై స్త్రీసంగమాభిలాష కలవాఁ
డయి జ్ఞానవిహీనమయిన పశువువలె వర్తించుచున్నాఁడు.
కాన నచిరకాలములోనే మేషముఖుఁడగుఁగాక. మఱియు మ
హాత్ముఁడయిన యీశ్వరునికి శాపమొసంగినదక్షునిపక్ష మవ
లంబించిన మూఢులందఱు జ్ఞానరహితులై సంసారకూపంబునఁ
దిరుగుచు, జననమరణాదిదుఃఖములపాలయి వర్తింతురుగాక.
అదియునుంగాక యర్థవాదములయిన వేదములయందు నిరూపిం
పఁబడు స్వర్గాదిసుఖముల నభిలషించి కర్మాసక్తు లగుదురుగాక.
మఱియు దారసుతాదులపోషణంబులకై విద్య లభ్యసించుచు,
ధనదేహేంద్రియములయందుఁ బ్రీతిగలిగి యాచకులయి వర్తిం
తురుగాక" అని యిట్లు నందికేశ్వరుండు బ్రాహ్మణజనంబుల శపిం
చుట నాలకించి సభామధ్యముననున్న భృగుమహాముని కోపోద్దీ
పితమానసుండై నందికేశ్వరునకుఁ బ్రతిశాప మీఁ దలంచి
యిట్లనియె. "సభాసదులారా! ఈనందికేశ్వరుండు నిష్కారణం
బుగా బ్రాహ్మణజనంబుల శపించినాఁడు. కావున నతండు శాపా
ర్హుండు. కావున నెవ్వరు కేవలము శంకరు ననుసరించి వర్తిం
తురో! వారిననుసరించి యెవ్వారలు వర్తింతురో! వారందఱు
వేదవిరుద్ధకర్మముల నాచరించుచుఁ బాషండులయి వర్తింతురు
గాక. మఱియు వారలు నష్టశౌచులై దురాచారులయి మూ
ఢబుద్ధులై జటాభస్మధారులయి వర్ణాశ్రమధర్మముల నతిక్రమిం
చి చరింతురుగాక. వేదమే సకలవర్ణాశ్రమములకును సుఖకరమ
యినమార్గము. అది యాద్యంతములు లేనిది. దానిని బూర్వ

లగు మునులును, మఱికొందఱును నాచరించిరి. జనార్దనుఁ డా వేదము ప్రమాణముగాఁగలవాఁడు. అది నిరతిశయమగు శ్రేయస్సాధనములఁ దెలిపెడిదగుటచే సర్వోత్కృష్టమయినది. అది యపౌరుషేయము. అది సజ్జనులు చేకొనుమార్గము. అట్టివేదమును నిందించియున్నారు. కావున దేనియందుఁ దామసులయిన మీకు రుద్రుఁడు దైవమో యట్టిపాషండధర్మముల నాచరించుచునుండుఁ"డని భృగువు పలుకఁగా విని యీశ్వరుండు విమనస్కుఁడై యనుచరబృందసమేతుఁడై యజ్ఞశాలనుండి బయలువెడలిపోయెను. పిమ్మట మరీచ్యాదులు లోకపూజ్యుండయిన హరిప్రీతికై వేయివత్సరంబులు సత్రమును నిర్వర్తించి గంగాయమునాసంగమస్థలంబున నవభృథం బాచరించి తమతమనివాసంబులకరిగిరి. ఇది రెండవయధ్యాయము.



ఓవిదురా! అంత జామాతయయిన యీశ్వరునకును, మామయయిన దక్షునకు విరోధము క్రమంబుగా వృద్ధిపొందుచుండఁగాఁ జిరకాలం బతిక్రాంతంబయ్యె. ఆకాలమందు బ్రహ్మ దక్షునకు సర్వప్రజాపతులప్రభుత్వం బొసంగె. అందువలన దక్షునకుఁ గలిగినగర్వంబునకు మేరలేదయ్యె. ఇట్లు దక్షుం డమితంబగు గర్వంబుతో వర్తిల్లుచు గర్వాతిశయముచేతను, శంకరునందున్న కోపముచేతను దానాచరించినయాగములందు హవిర్భాగంబులకై యీశ్వరుం డాహ్వానితుండు కాఁడయ్యె. ఇట్లు దక్షుండు శంకరునిఁబిలువక బ్రహ్మనిష్ఠులయిన మహాత్ములను దిరస్కరించి వాజపేయ మనెడియాగం బాచరించి పిమ్మట బృహస్పతిసవనమును జేయఁ బ్రారంభించెను. ఆయజ్ఞమును జూచుటకయి మహాత్ము

లయిన బ్రహ్మర్షులు, దేవర్షులు, దేవతలు సాలంకృతలగు వారి
వారిభార్యలతోఁ గూడికొని మహానందంబుతో వచ్చి యాగశా
ల నలంకరించిరి. అంతట నాకాశమందు మహానందంబుతో
సంచరించుచు దక్షుఁడు చేయుచున్న యజ్ఞమును నుతించుచుఁ
బోవుచుండ నీశ్వరునిభార్యయగు సతీదేవి యామాటల నాలకించి
యున్నిదిక్కులనుండియుఁ దనగృహముసమీపముగాఁ బోవుచున్న
దేవతాస్త్రీలనుజూచి, తనతండ్రి నెఱవేర్చుచున్న యాగోత్సవ
మును జూడ వేడుకపడుచు శంకరునిపాలికిఁబోయి నమస్కరించి

**సతీదేవి దక్షుని యాగమును జూడరమ్మని శంకరునిఁగోరుట.**

మృదుమధురభాషలతో నిట్లనియె. "ఓ హృదయవల్లభా ! నీ
మామయగు దక్షుండు మహానిష్ఠతో యాగము నాచరించుచు
న్నట్లు వినియున్నాను. అయ్యజ్ఞమును జూచుటకయి దేవతలంద
ఱుఁ దమతమభార్యలతోఁగూడి మహాసంతోషంబుతోఁ బోవు
చున్నారు. కావున మనముగూడ నాసవనంబు చూడఁబోవుద
ము రమ్ము. మఱియు నాతోఁబుట్టువులందఱు తమతమభర్తల
తోఁ దలిదండ్రులను, హితురాండ్రను, యాగమును, జూచుటక
యి తప్పక వచ్చియుందురు. మనముగూడ నచటికిఁబోయి వారి
నందఱఁ గన్నులారఁ గాంచి యాగ ముగునంతవఱకునుండి యా
గాంతమున మాతండ్రియొసంగు వస్త్రాభరణాదులయిన కానుక
లను బడయఁగోరుచున్నాను. ఓ ప్రాణవల్లభా ! భర్తృసమ్మ
తలై యున్న తోఁబుట్టువులను, మాతల్లితోఁబుట్టువులను న
న్నుఁజూడ వేడుకపడుచున్న తల్లిని, మహామునీంద్రులచే
నెత్తఁబడుచున్న యూపస్తంభమునుఁ జూడవలెనని కోర్కి
పుట్టి బాధించుచున్నది. ఓ దేవా ! పరమాత్మస్వరూపుఁ

డయిన నారాయణునిచే నాత్మమాయామూలకంబుగ నిర్మింపఁబడిన గుణత్రయాత్మకంబయిన ప్రపంచకం బాశ్చర్యకరం బగుటకు సందియంబు లేదు. అయినను దత్త్వవిదుండవయిన నీకు నుం తేనియు నాశ్చర్యంబు కలుగదు. కాని తత్త్వజ్ఞానము తెలియనిదాన నగుటచేతను, జంచలస్వభావముకలదాన నగుటచేతను నాశ్చర్యకరంబులగు పదార్థములఁ జూడ వేడుకపడుచున్నాను. మఱియు నాజన్మభూమినిజూచి పెద్దకాలంబు కావచ్చినది. కావున నొకమాఱు పోయి చూచివత్తము రమ్ము. అదియునుంగాక నా జనకునకు బంధువులు కానివారయినను, లోకములో స్త్రీలందఱు మందమందలుగాఁ దమప్రియులతోఁ గూడికొని కలహంసవలెఁ దెల్లనైన విమానములపయి నధివసించి యత్యంతసంతోషముతో గగనమార్గమునఁ బోవుచున్నారు. బాంధవులు కాని వారే యధికమగు వేడుకతోఁ బోవుచున్నప్పుడు నాపుట్టినింటికి వెళ్లుటకు నాకుఁగలిగెడివేడుక యెంతయుండునో యోజింపుము. మఱియుఁ దండ్రిగృహంబునఁ గాఁబోవునుత్సవంబును విని చూడఁ బోవకుండ నెవతె యూరకుండఁగలదు. ఒకవేళ నీవు "మీాజనకుండు మనలఁ బిలువలేదే యెట్లు పోగలుగుదు"మని ప్రశ్నింతువేని చెప్పెదవినుము. అట్లుసందియపడ నవసరము లేదు. పితృగృహంబునకును, మిత్రునిమందిరమునకును, గురునిలయంబునకును, భర్తృనివాసంబునకును బిలువఁబడకయేపోవచ్చునని పెద్దలందురు. ఓ దేవా! కారుణికాంతరంగుండవయిన నీవు నావాంఛిత మీాడేర్పఁదగుదువు. మఱియు నాయం దధికమయిన దయగలవాఁడ వనుటకు సందియము లేదు. నేనట్లు నీయపారకృపారసంబునకుఁ బాత్రురాలనుగానిచో భవదీయంబగు నర్ధశరీరము

నందు దాల్తువా? అట్టిదయాళుండవు. కావుననే నావరము నెఱ వేర్పవలయునని ప్రార్థించుచున్నాను. నాయందుఁ దొల్లింటి యను గ్రహముంచి పోదమురమ్ము." అని వేఁడుచున్న సతీదేవివాక్యం బుల నాలకించి పూర్వము తన్ను దక్షుఁడాడిన పరుసములను స్మరించికొని యామెకు శంకరుం డిట్లనియె. "ఓ ప్రియురాలా? నీచెప్పిన వాక్యంబులన్నియు సత్యములే. బంధుగృహంబుల క నావహూతులైనను బోవచ్చునన్నవాక్యము సర్వసమ్మతమైనదే. కాని యాబంధువులు పరస్పరము పరుషభాషణము లనుబాణ ములచే శరీరంబులు గాయంబులు గావించుకొన్నచో నీవన్నట్లు

## శంకరుఁడు సతీదేవిని దక్షునియాగవాటికకుఁ బోవలదని చెప్పుట.

బాధువులయిండ్ల కేఁగరు. మఱియు నింకొకటి చెప్పెద నాలింపు ము. విద్యాతపంబులు, విత్తము, వయస్సు, కులరూపంబులు న ను నీయాఱును సుజనులకు గుణంబులయియుండు ఆ చెప్పిన యాఱుగుణములు దుర్జనులయెడ దోషహేతువులయి కానవచ్చు చుండును. కాన మీతండ్రి విద్యాతపంబులు మొదలుగాఁగల గుణంబులుగలవాఁడైనను దుష్టమనస్కుఁడయిన కారణంబున నాగుణంబులు దోషంబులుగాఁ బరిణమించినవి. అందువలన గర్వాతిశయము కలవాఁడయి మహాత్ములను దిరస్కరించుచు న్నాఁడు. మఱియు గర్వాతిశయముచే మీతండ్రికిఁ దారతమ్య జ్ఞానము కొంచెమైనను లేదు. అందుచే నెవ్వరి నేరీతి నాదరింప వలెనో యతనికి సుంతేనియుఁ దెలియదు. తనకంటె నధికులను నయితము గడ్డిపోఁచవలెఁ జూచుచుండును. ఇట్లు దుర్గుణభూయి ష్ఠుఁడును, గర్వితుండునగు మీతండ్రిగృహంబునకు బంధుగృ

హాంబని తలంచి పోవుట యెంతయు నుచితంబుకాదు. ఒకచోఁ
బోయినచో వారు కుటిలబుద్ధులయి రూక్షవీక్షణంబులఁ జూచు
చుఁ గౌరవింపరు. వారు గౌరవింపక యవమానించిన సయిఁపవ
లయునని యందువేమో, యందులకు సమాధానముచెప్పెద
వినుము. ఎట్టికష్టములనైనను నోర్వవచ్చునుగాని, యవమాన
పురస్సరంబులగు బంధువులవచనముల నోర్చుట కష్టము. మఱి
యు యుద్ధమునందు శత్రువుల బాణఘాతంబులనుబొంది శరీర
ములను గాయంబులుఁ గావించుకొనినను, దనమందిరంబునకుఁ
బోయి చికిత్సచేసికొని రాత్రియందు సుఖనిద్ర చెందఁగలఁడు.
కాని బంధువుల దుర్వాక్యములచే నభిహతుండయినవాఁ డా
గాయంబుల మాన్చుకొనలేఁడు. మఱియు దానికి మందు లేనే
లేదు. మానవుం డట్టిగాయంబులబాధ నోర్వఁజాలక కృశించి
కృశించి మృతుండగును. మీతండ్రి నిందించి బ్రహ్మసభ
లోఁ దిరస్కరించినవాఁడయి నన్నుఁ బిలువకయె యాగంబు
లు చేసికొనుచుండ నెట్టులాతనియాగంబు చూడఁగడంగుదును.
కాన నేను వచ్చుట యుచితకృత్యంబుకాదు. పోనిమ్ము. మా
తండ్రి నిను నిందించెనుగాన నీవు రాకుండుటయు క్తమె. నన్నే
మియు నిందింపలేదే నేఁబోవుట కేమయిన యడ్డంకికలదా? య
ని యడిగెదవేని చెప్పెదను వినుము. ప్రాజాపత్యాధికారరూప
మయిన గర్వముగల దక్షునికి నీయం దధికమయిన ప్రేమముండి
న నుండవచ్చు. మఱియు లోకములో జననీజనకులకుఁ గడఁ
బుట్టువారియం దధికమయిన ప్రేమముండుట సహజముకాన ద
క్షునికిఁ దక్కినకుమారికలయందున్న ప్రేమకంటె నీయం దధిక
మగుప్రేమ యుండునని నిక్కంబుగా వక్కాణింపఁగలను. కాని

నీవు నీతండ్రికిఁ బరమవిరోధినైన నాకు భార్యవయి నన్నాశ్రయించియున్నావు. ఆ కారణముచే నిన్నునైన నాదరించి గౌరవించుటని నాకుఁ దోఁపదు. పోనిమ్ము. దక్షుఁడు పూజనీయుఁడు గదా? అట్టివానిని నీవేల తిరస్కరించితి? అందుచేతనే ని న్నాతఁడు తిరస్కరించుచున్నాఁడు. ఇంతకు వైరకారణము నీచేసిన తిరస్కారమేయని యందువేని చెప్పెద నాలింపుము. లోకములోఁ గొందఱుమూఢులు పుణ్యాతిశయముచేతను యశంబుచేతను మహాప్రసిద్ధిగల్గి వర్తించు మహాత్ముల యున్నతపదవి నొందవలెనని ప్రయత్నించుచు నందులకు సమర్థులుకాక దందహ్యమానమయిన హృదయముచే నాతురులయి దుఃఖించుచు మహాత్ములను ద్వేషించుచుందురు. మహాత్ములతో సామ్యమును బొందలేకపోవుటచే ద్వేషించుచుందురు. అట్లుకానిచో లోకాధీశుఁడయిన నారాయణునితో రాక్షసు లెందులకు ద్వేషించుచుందురు? ఆలోచింపుము. అందువలన దక్షునిదుష్ప్రవర్తనమే యిందులకుఁ గారణముకాని మఱియొకటికాదు. అట్లకాదు. నీకు దక్షుఁడు పూజనీయుండు. అట్టివానికి నీవు నమస్కారాదిగౌరవము చేయకుండుటయే కారణమందువేని చెప్పెదవినుము. సుందరీ! ప్రాజ్ఞులిరువురు కలసినప్పుడు మనోవాక్కాయములచేఁ బరస్పరము నమస్కారముచేయుట యుచితకృత్యము. అట్లుకాక ప్రాజ్ఞుఁడు నజ్ఞుఁడు నొకచోటఁ జేరినచో నజ్ఞునకు నమస్కరించుట తగవుకాదు. మఱియుఁ బ్రాజ్ఞుండు దేహాభిమాని యగువానికి నమస్కరింపక పరమపురుషున కాచరింపవలయును. కావున నేను దేహాభిమానియగు మీతండ్రికి వందనము లాచరింపక నిత్యుండును, నంతర్యామియునగు పరమపురుషునకు నమస్కరించితిని.

అంతర్యామికై నను గరణత్రయముచేతను నమస్కరించితి యెట్టిమనస్సుచే నమస్కారము చేయవలయునని యందు వేని చెప్పెద. రజస్తమోగుణములులేక కేవలము సత్వగుణముగలిగిన మనస్సు వసుదేవశబ్దముచేఁ జెప్పఁబడును. అట్టి చిత్తమందు వాసుదేవుఁడు ప్రతీయమానుఁ డగుచున్నాఁడు. భగవంతునికి వాసభూతమగుటవలన వసుదేవశబ్దముకలిగినది. అట్టిచిత్తమున భగవంతుఁ డింద్రియాంతరములకు గోచరుండు కాక కేవలచిత్తమునకే గ్రాహ్యుఁడగును. అందుచే నతఁడు చిత్తముచేతనే నమస్కృతుఁడాయెను. అట్లు నేనుజేసియుండుట దేహాభిమానియయిన దక్షుండుకానక నన్ను ద్వేషించెను. నాతో బద్ధవిరోధముగలదక్షుని నే నెట్లుచూడ నేఁగుదును ? నావచనంబు లతిక్రమించి పోదువేని నీకుఁ బరాభనంబు సంప్రాప్తముగుట నిక్కంబు. బంధుకృతావమానంబుకంటెఁ జావు మేలగుననుట నీవెఱుంగనిదికాదు. ఓలలనామణీ ! చెప్పవలసినదేదియో నీకుఁ జెప్పితిని. నీకుఁజూడఁ బోవలయునను కోర్కెయున్నయెడ నీవరుగవచ్చును. కాని నేనురానొల్ల. పిమ్మట నీయిష్టంబు" నిపలికి యూరకుండెను. ఇది మూడవయధ్యాయము.



అంత సతీదేవి తనమనంబున నిట్లుతలపోసె."అక్కటా! నేనచ్చటికరుగుట యాతనికి ష్టమున్నట్లుతోఁపదు. ఒకచో నేనచ్చటికిఁబోయినప్పుడు మాతండ్రి దుష్టబుద్ధికలవాఁడై నన్నవమానించినచో దుఃఖపరీతస్వాంతనై యిచ్చటికే రావలయును. నేను బతియాజ్ఞ మీఱిపోయి యచ్చటఁ దండ్రిచే నవమానితనై తిరిగి యిట వచ్చినప్పుడు భర్తయేమిచేయునో" అని తలపోయుచు నొక

వంక బంధుదర్శనకుతూహలతయు రెండవవంక భర్తవలనిభయ మును దుల్యబలంబులై చెఱియొకప్రక్కకు లాగుచుండ నేమి చేయుటకు సాహసింపఁ జాలకయుండె. ఇట్లుసతీదేవి కొంతవఱకు మిన్నకుండి తుదకు బంధుస్నేహము బలీయమయి యామెమ నంబును దనవంక కాకర్షించెను. అంతట బంధుదర్శననిరోధము గలిగినందులకు మిగులదుఃఖించుచుఁ గన్నీరుమున్నీరయి పాఱు చుండ నెలుఁగెత్తి కొంతసేపు వాపోయి సర్వసముఁడయి యొప్పు చున్న యాశంకరునిపై కోపమువహించి కోపాతిశయముచే నంగకములు కంపించుచుండఁ దీవ్రములయిన చూపులచే శంక రునిఁ జూచెను. ఇట్లు కొంతసేపుచూచి వేఁడినిట్టూర్పుపుచ్చి మూ ఢురాలయిన యాసతీదేవి శోకరోషములు మనంబునఁ బెనఁ గొనఁ బ్రేమాతిశయముచేఁ దనకు నర్ధశరీర మిచ్చినవాఁడును దనకు సర్వవిధముల నాధారుఁడును నగు శంకరుని విడిచి జనక గృహంబునకుఁ బయనంబయిపోయెను. ఇట్లుసతీదేవి యతిత్వరిత

―●●◆ సతీదేవి దక్షుఁడు చేయుచున్న యజ్ఞమును జూడఁబోవుట. ◆●●―

గమనము నవలంబించిపోవుచుండ రుద్రానుచరులు రుద్రుఁడు వెనలనందులకును, నసహాయురాలై తమరాణికాలినడక నరుగు చున్నందులకు డెందములఁ గొందలపాటుచెంది యామెకుఁ బ్రియ ములయిన కందుకములను, లీలాపద్మములను, చిలుకలు, గోరువం కలు మొదలగు క్రీడాపక్షులను, బూవులదండలును, ధవళాతపత్ర మును, కస్తూరి, పచ్చకర్పూరము మొదలగు పరిమళద్రవ్యంబులను బట్టికొని దుందుభులను శంఖములను వేణువులను వాయించుచు వడివడిగా నడచి యామెను సమీపించి భూషణములచే నామె న లంకరించి వృషభవాహనారూఢం జేసి దక్షుఁడుచేయుచున్న య

జ్ఞమునుజూడఁగోరి తదీయమార్గానుసారులయి పోవుచుండిరి. * ఇట్లు సతీదేవి వృషభవాహనారూఢయయి సంఖ్యాతీతులయిన రు

---

*ఓయీ! పరబ్రహ్మమగు విష్ణువు సర్వోత్తముఁడనియు, జగత్కారణుఁడనియు, నుపాసింపఁదగినవాఁడనియు, మోక్షప్రదుఁడనియుఁ జెప్పెడి వేదాంతార్థములఁ బ్రకటించునట్టి యీపురాణమునందు నచ్చటచ్చట రుద్రాదులు జీవవిశేషులనియుఁ, జననాదులు గలవారనియుఁ, గర్మవశ్యులనియుఁ జెప్పుచు, మగుడ, "సమస్తాత్మని ముక్తవైరకే" "బ్రహ్మాదయోయేమార్థభిర్దదతి తచ్చరణావసృష్టం" "నాహంనయజ్ఞోనచయూయమన్యే యేదేహభాజోమునయశ్చతత్త్వం। విదుఃప్రమాణంబలవీర్యయోర్వా" "త్వమేవభగవన్నేతచ్ఛివశక్త్యోస్స్వరూపయోః। విశ్వంసృజసిపాస్యత్సి క్రీడానూర్ణపదోయథా। అహంబ్రహ్మాచశర్వశ్చ జగతఃకారణంపరమ్। త్రయాణామేకభావానాం యోనపశ్యతివైవిదామ్" ఇత్యాదిస్థలములయందుఁ, బార్వతియు, బ్రహ్మయు, విష్ణువును జెప్పుచున్నవచనములందు రుద్రుఁడు సర్వోత్తముఁడనియు, జగత్కారణుఁడనియు, నుపాసింపఁదగినవాఁడనియు, విరుద్ధార్థములను జెప్పుచున్న వ్యాసుండెట్టులు విశ్వసింపఁదగినవాఁడు. అతనివాక్యమెట్లు ప్రమాణముగాఁ జేకొనవచ్చును. అనిశంకింపఁబనిలేదు ఈపురాణమునందుఁ బరస్పరవిరోధముగా నెచ్చటను బ్రతిపాదించియుండలేదు. ఒకవేళ నెచ్చటనైన రుద్రాదుల కాధిక్యము చెప్పినట్లు ప్రతీయమానమైనచో, నాయాస్థలములందు రుద్రాదిజీవులు శరీరముగాఁ గలపరమాత్మనుద్దేశించి చెప్పఁబడినదని గ్రహింపవలయును. లేక రుద్రాదులు భగవంతుని యావేశావతారములేకనుక భగవద్వ్యాప్తిచేఁ జెప్పినను జెప్పవచ్చును. లేక వ్యాసభగవానుఁడు పూర్వముజరిగిన వృత్తాంతములనే యీపురాణమునఁ జెప్పుటవలన నచ్చటచ్చటఁ గథలయందు భవాని మొదలగువారు చెప్పినవాక్యములనె కూర్చియుండును. అచ్చట భవాని మొదలగువారు తమభక్త్యతిశయముచే శివుడు పరబ్రహ్మయనియు ప్రశంసనీయుఁడనియుఁ జెప్పియుండుదురు. ఆవాక్యములనే యథాశ్రుతముగా నిందుఁజేర్చియుండవచ్చును. అందుచే నిదొక

ద్రానుచరులు తన్నుఁ గొల్చుచుండఁ బోయిపోయి సమస్తముని బృందముల చేతను, బృందారకుల చేతను, బూఁగితమయి, వేద ఘో

---

విరోధముగాఁ బరిగణింపరాదు. ఓయీ! "యద్వ్యక్షరంనామగిరేరితంనృణాంసకృత్ప్రసంగాదఘమాశుహంతి।పవిత్రకీర్తిం" "యేమూర్ధభిర్దధతితచ్చరణావసృష్టమ్" ఈమొదలగు వచనములచే రుద్రాదులు పరబ్రహ్మస్వరూపులౌటంబట్టి యుపాసింపఁదగినవారని ప్రతీయమాన మగుచున్నదని శంకింపరాదు. కొన్నికొన్ని సాత్వికతంత్రములలోఁ గూడ "నాన్యందేవంనమస్కుర్యాన్నాన్యందేవనిరీక్షయేత్ । నాన్యంప్రాసాదమారోహే న్నాన్యదాయతనంవిశేత్" మఱియొక దైవమును జూడరాదు ఇతర దేవునికి నమస్కారము చేయరాదు. ఇతర దేవాలయమును ప్రవేశింపరాదు. అని యితరదేవతానమస్కారాదికము నిషేధింపఁబడుచున్నది. ఇట్లె యచ్చటచ్చట నితర దేవతలును దద్భక్తులును నిందింపఁబడుచున్నారు. కావునఁ బురాణమునకు సాత్వికతంత్రమునకు విరోధము సంభవించుచున్నది. అ[illegible]హింపఁబనిలేదు. బ్రహ్మము నుపాసించుటకు సద్వారకమనియు, అద్వారకమనియు రెండువిధంబులుగలవు. సద్వారకమనఁగా రజోగుణాత్మకుఁడగు బ్రహ్మయు, తమోగుణాత్మకుఁడగు రుద్రుఁడు మొదలగుజీవులే శరీరముగాఁగలపరమాత్మను నుపాసించుటయే. అద్వారకమనఁగాఁ గేవలము శుద్ధసత్వము కలవాఁడై స్వేచ్ఛచేతనే దివ్యమంగళవిగ్రహములను స్వీకరించుచు, నిఖిలదోషములను నిరసించుచు, ననంతకల్యాణగుణములు కలవాఁడయి యున్న నారాయణుని నుపాసకులయిష్టముచొప్పున వాసుదేవసంకర్షణాదులని భేదముచే నుపాసించుట. సద్వారకమగు నుపాసన మాయాఫలములను గోరుచున్నవారిచేఁ జేయఁదగినది. అద్వారకమగు నుపాసనము మోక్షమునందుఁ గోర్కికలవారిచేతనే చేయఁదగినది. ఈవిషయము శ్లో॥ "యోయోయాంయాంతనుంభక్తశ్శ్రద్ధయార్చితు మిచ్ఛతి" అనువచనముచేతను, "అనన్యాశ్చింతయంతోమాం" అనువచనముచేతను స్పష్టముగాఁ జెప్పఁబడినది. ఈపురాణముననే ప్రథమస్కంధమున "రజస్తమప్రకృతయ స్సమశీలాన్భజం

షలచేనిండి, కుశాజినములచేతను, మృత్కాంచనమయములయి
న పాత్రవిశేషములచేతను,హోమద్రవ్యములచేతను దనరారుచు
న్న యజ్ఞశాలను బొడఁగాంచి యధికమయిన సంతసమువహిం
చి ప్రవేశించెను.అట్లు వచ్చుచున్న సతీదేవినిజూచి దక్షునివలని
భయముచే నెవ్వరు నామె నాదరించినవారలుకారు. దక్షుఁ డా
మెవైపు చూడనయినఁ జూడలేదు. కాని ప్రేమాశ్రువులుగురియు
సోదరులును దల్లియు వచ్చి యామెను సంతసముచే నాలింగన
ము చేసికొనిరి. తల్లియు నాలింగనము గావించుకొని మాతృవా
త్సల్యమును వెడలఁబోసెను. పిమ్మట సతీదేవిదండ్రియగు దక్షుం
డు తన్నాదరింపమికిఁ హృదయంబునఁ గలంగుచుఁ దల్లితోఁ
బుట్టువులచేతను, దనజననీసోదరులచేతను బ్రేమపురస్సరముగా
నర్పింపఁబడినదయినను బూజను స్వీకరించుటకు నిష్టపడలేదు.
మఱియు దక్షుండు లోకారాధ్యుఁడయిన తనభర్త నవమానించి
యజ్ఞము చేయుచుండుటయుఁ, దన్నుసుం గేనియు గౌరవింపకుం
డుటయు, మనంబున నాలోచించి సతీదేవి కోపావిష్టమానసయై

---

తివై । పితృభూతప్రజేశాదీన్ శ్రియైశ్వర్యప్రజేప్సవః" అని చెప్పఁబడినది.
అట్లే ద్వితీయస్కంధమున "అకామస్సర్వకామోవా మోక్షకామ ఉదా
రధీః। తీవ్రేణభక్తియోగేన యజేతపురుషంపరమ్" అని చెప్పఁబడెను. ఈయ
ర్థము ముందుముందుగూడఁ జెప్పఁబడును. కావున మోక్షేచ్ఛకలవారు పరదేవ
తలందు వ్యభిచరింపనియుపాసనమునే చేయవలసియుంటచే వారు తమభక్తి వ్య
భిచరింపకుండుటకై యుపాసించు దైవముకంటె నితరదైవములను జూడరాదని
యు నమస్కరింపఁగూడదనియు దేవతాంతరభజనము నిషేధింపఁబడినది
అంతియకాని సర్వదేవతలను బరబ్రహ్మముగా ననుసంధానముచేసి కొలిచియుం
డుట దేనికిని విరుద్ధముగానుండదు. కావున సాత్వతపురాణములకు విరోధము
లేదని తెలియఁదగినది.

కన్నులనుండి నిప్పుకలు కుప్పలుకుప్పలుగాఁ గురియ రోషారుణిత లోచనములచే లోకములను దహించునట్లు చూచుచు, రుద్ర విద్వేషియు, గర్వాంధుండునగు దక్షునివధింతుమను రుద్రానుచరులను బ్రయత్నింప వలదని వారించుచు, కోపాతిశయముచే సువ్యక్తములుకాని వాక్కులతోఁ దండ్రికిట్లనియె. "లోకముల లోఁ బరమాత్మను నిరతిశయప్రేమముతోఁజూచుచున్న శంకరుని

సతీదేవి దక్షుని నిందించుట.

కిఁ బ్రాణులలోఁ బ్రియులు కొందఱు,నప్రియులు కొందఱు లేరు. సర్వాంతరాత్మయగు పరమాత్మను నిరతిశయమగు ప్రీతిరూప మయిన భక్తిచే భజించునతనికి సమస్తము బ్రహ్మాత్మకముగానె చూచుటచే 'వీఁడుప్రియుడు వీఁడుకాఁడు' అను విభాగము లేదు. అమ్మహాత్మునికిఁ బ్రాణికోటియంతయు సమానమె. అట్టి సర్వస ముఁడయినరుద్రుని నీవుదక్కఁదిరస్కరించినవాఁ డుండఁడు.మఱి యు నీవంటిదురాత్ములు పరులసద్గుణములయందు దోషముల నా రోపింతురు. కొందఱుఁ జిన్నవాని బెద్దలుగాఁజేసి చెప్పెదరు. మ హాత్ములు పరులయందు గుణదోషములున్నను గుణములమాత్ర మే తీసికొని దోషంబులు విడిచిపెట్టుదురు. మఱికొందఱు పరుల దోషములనయినను గుణములగా భావింతురు. అట్టిమహాత్ముల లో నొకరుఁడగు నీశ్వరునికి నీ వపరాధము కావించితివి. అవును. శవప్రాయమగు శరీరము నే యాత్మగాభావించు నీవంటికుత్సితు ల సూయతో, మహాత్ముని నిందించుట యొక యాశ్చర్యము కాదు. లోకములో మహాత్ముల పాదధూళులచే నిరస్తప్రభావులయిన కుజనులు మహాత్ములయాధిక్యమును సహింపలేక మాత్సర్యగు ణోపేతులయి మహాత్ముల నిందించుట సహజము. అట్లే నీవును

జగదారాధ్యుఁడయిన శంకరుని మహామహిమచేఁ దిరస్కృత ప్రభావుండవయి చేయునది లేక కుజనవృత్తి నవలంబించి మహాత్ముఁడయిన శివుని సద్గుణంబులను, మహామహిమమును సహింపలేక నిందించితివి. అకటా! నీప్రవర్తనము చూచినచో నాకు మిగుల విచారము పొడముచున్నది. ఆమహాత్ముని "శివ" యను నామమును ప్రసంగవశమున నోటఁబలికినను మానవుల పాపజాలంబు పటాపంచలై తొలంగును. అతిక్రమింపరాని శాసనము గల మంగళనామకుఁడయిన యాశంకరునితో నమంగళుండవయిన నీవు ద్వేషించితివి. అక్కటా! ఎంతపనిచేసితివి. మఱియు బ్రహ్మానందరసమును మకరందమును గోరుమహాత్ములు తమచిత్తద్విరేఫంబులచే నీశ్వరుని పాదపద్మముల సేవించుచుందురు. అతని పాదపద్మయుగళమును స్మరించిన యాచకులకోర్కె లన్నియుఁ దత్కాలమందె సఫలములగును. అట్టి మహానుభావుఁడయి విశ్వబంధువయిన శంకరునియందు నీవపరాధంబు గావించితివి. ఇది నీబుద్ధిహీనతను లోకమునకు వెలువరింపక మానదు. మఱియు నీశ్వరుఁడు ప్రేతభూమియందు వసించి, నస్థిభూషణుఁడయి జటాభారము జీరాడఁజేసి, భస్మమును ధరించి పిశాచములతోఁ గూడఁ జరించుచున్నాఁడని నీవు నిందించితివికాని బ్రహ్మాదిసురలెంతమాత్రము నట్లు నిందింపక తత్పాదపద్మపరాగమును శిరంబుచే ధరించుచున్నారు. ధర్మపరిపాలకుఁడయిన యీశ్వరుని దురాత్ముఁడు నిరంకుశుఁడై నిందించుచుండినచో నానింద్యావాక్యములు విన్నట్టి సుజనుండు వెంటనే కత్తిదీసికొని యాదురాత్ముని జిహ్వను మొదలంటఁ గోయవలయును. అట్టి దుర్జనశిక్షయందు సమర్థుఁడుకానిచోఁ దాను వెంటనే ప్రాణంబులు విడువ

పలుకుదును. అందులకు సమర్థుండు కాఁడేని చెవులు చేతులతో మూసికొనుచు నా ప్రదేశమునుండి బయలు వెడలి పోవలయును. నీవు దురాత్ముఁడవయి శంకరు. నిందించితివి. అట్టిమహాత్ముని నిందించినట్టినీజిహ్వ మొదలంటఁ గోసితీయవలయును. కాని యందులకు నాకు సామర్థ్యము లేదు. మఱియు నీశ్వరధిక్కారము చేసిన నీతనువువలన నుత్పన్నమగు నీశరీరము ధరించి వర్తింపఁజాలను. కావున మూఢుఁ డజ్ఞానవశమున నింద్యమయిన యన్నంబు దిని పిమ్మటఁ దెలిసి వమించి తా భక్షించినయన్నమును గ్రక్కి పవిత్రుఁడయినచందమున నేనును నాపూర్వకర్మవశమున దురాత్ముండవయిన నీతనయనై జన్మించి తుచ్ఛమై నిందాపాత్రమై యున్న యీశరీరంబును విడిచి పవిత్రురాలనయ్యెద. మఱియు వేదోక్తములయిన కర్మముల నాచరింపనివాఁడును, శ్మశానవాటికయందుఁ జరించువాఁడునగు నమంగళవిగ్రహుండయిన రుద్రుని నిందించిన తప్పేమి? అని శంకింపఁబనిలేదు. దేవతల కాకాశగమనంబును, మానవులకు భూతలగమనంబును స్వాభావికంబులయి యొప్పుచందమునఁ బ్రవృత్తిలక్షణమయినకర్మము రాగకారణంబనియు, నివృత్తిలక్షణరూపమయిన కర్మము వైరాగ్యకారణంబనియు వేదములు నిర్వచించుచున్నయవి. ప్రవృత్తిలక్షణములయిన కర్మములు సంసారులకు విహితము లయినట్లు నివృత్తిలక్షణరూపములయినకర్మము లాత్మారాములయిన యోగిజనంబులకు విహితములు. కావున నట్టియోగిజనంబులు విధినిషేధరూపములయిన వేదములను, దద్విహితములయిన కర్మములను, ననుసరించిన ననుసరింపవచ్చు మానిన మానవచ్చు. అంతియకాని వానిని విడుచుటవలనఁ బ్రత్యవాయంబు గలుగదు.

వారలకు విహితములు నివృత్తిలక్షణరూపములయిన కర్మములే. ఇట్లుండఁ దనకు విహితములైన కృత్యములయందు నాదరంబు గలిగివర్తించు నీశ్వరునిఁ గ్రియాశూన్యుండని నిందించుట మహాపాతకంబు. మఱియు నివృత్తిలక్షణరూపములయిన కర్మములందు సక్తులమైన మావంటివారికి సంకల్పమాత్రంబున సంభవించుచున్న యణిమాద్యష్టసిద్ధులు ప్రవృత్తిలక్షణకర్మసక్తులయిన మీవంటివారికి లభింపనేరవు. ఒకవేళఁ బ్రవృత్తిరూపములగు కర్మములందాసక్తులయిన మావంటివారికి లభించునట్టి పదవులు నివృత్తికర్మాసక్తులకుమాత్రము లభించునా? యని ప్రశ్నింతువేని చెప్పెదవినుము. మీరు ప్రవృత్తికర్మాసక్తులయి సంపాదించినసిద్ధులు కుత్సితములయిన యాగాన్నములను భుజించువారలచేమాత్రమె నుతింపఁబడుచుండును. మఱియు నాసిద్ధులు సాధారణములయినవి కాని యుత్తమములు కావు. అట్టియుత్తమసిద్ధులు నివృత్తికర్మాసక్తులయిన మావంటివారలకుమాత్రమే లభించును. మాకుత్తమములయిన సిద్ధులే ప్రాప్తములగుచుండఁగా సాధారణసిద్ధులతో నేమిప్రయోజనము? ఏమియులేదు. కావున సాధారణసిద్ధులు గలనీవధికసంపన్నుండనని మనంబున గర్వింపకుము. అణిమాదులయిన యుత్తమసిద్ధులు గలయీశ్వరుని భస్మాసిధారణుండనియు నిరుపేదయనియుఁ దిరస్కరింపరాదు. మఱియునట్టి మహానుభావుఁ డయినయీశ్వరుని నిందించిన నీకుమారికనుపించుకొనుటకు మనంబున సిగ్గు వొడముచుండెను. మహాత్ములకపరాధము కావించినవారిదేహము కాల్పనా? మఱియు నీశ్వరుండు పరిహాసవాక్యము లాడునప్పుడు దక్షతనూభవవని పల్కినచో నాయవమానము నేనెట్లు సహింపఁగ

లుగుదును? అట్టియవమానమును సహించుటకంటెఁ జచ్చుట
యె మేలుకాదా? కావున శవప్రాయమగు నీశరీరము విసర్జిం
చుట మిగులయుక్తము." అనియిట్లు సతీదేవి దక్షుని నిందించి
యుత్తరదిక్కునుబొంది మనస్సును నిరోధించి, స్థండిలమందు

### సతీదేవి యోగాగ్ని కల్పించుకొని ప్రాణంబులు విడుచుట

విస్తృతములయిన కుశలయందుఁగూర్చుండి యాచమనము చేసి
పచ్చవస్త్రమును ధరించి, నేత్రములను నిమీలించి యోగమార్గ
ముచేఁ బ్రాణంబుల విడువ నిశ్చయించె. అట్లుచేసి నిర్దుష్టురా
లయి, శ్రమరహితయై, ప్రాణాపానవాయువుల నాయాస్థానం
బులనుండి కదలించి నాభిస్థానమందుండు సమానముతో సమ
కూర్చి పిమ్మట నుదానవాయువు నెగయించి యాయుదానవాయు
వును కంఠద్వారముగుండ లలాటమునొందించి శివుని పాదార
విందముల ధ్యానించుచుఁ, దనభర్తనుదక్క నన్యంబును
గాన నపేక్షింపక, మహాదేవునియంకస్థలంబున వసించి గౌర
వమునందు చున్న దేహమును దండ్రియందలి వైరముచే భస్మీ
కరింపఁదలంచి యంగములయం దనిలాగ్నిధారణను ధరించెను.
అందువలన యోగాగ్ని బయలువెడల, భర్తృపాదకమలధ్యాన
మున మత్తయై వర్తించుచున్న సతీదేవి పవిత్రమయినదేహ
మును భస్మము కావించెను. అంత సురశ్రేష్ఠుఁడయిన యీశ్వ
రునిభార్యయగు సతీదేవి దురాత్ముఁడయిన దక్షునిచే నవమానిం
పఁబడినదై యోగాగ్నిచే దేహము విడిచినదనెడి వాక్యములు
హాహాకారములు భూమ్యాకాశంబులఁ గప్పెను. మఱియు నెల్ల
వారలును గుములుగాఁగూడి "అకటా!" యీదక్షుని దౌర్జన్య మే
మని చెప్పఁగలవారము. ఈదక్షుఁడు చరాచరవిశ్వమునంతను

గడుప్రేమతో నాదరింపవలసినది. అట్లుండఁగాఁ గడుపునపుట్టిన పిల్లను బ్రేమింపక తిరస్కరించినాఁడు. ఆమె దుష్టురాలేమో, యందువలనఁ దిరస్కరించియుండునని సందేహింప నవసరము లేదు. ఆమహాత్మురాలిగుణములు, సత్ప్రవర్తనము, నుదారచిత్తము లోకమునం దెవరికేఁ గొనియాడఁదగినవికావు? అట్టియోగ్యురాలై తనతనూభవమైయున్న సతీదేవి నవమానించుటచేతను, భగవదాత్మకుఁడగు రుద్రుని ద్వేషించుటవలనను బ్రాహ్మణాధముఁడగు దక్షుఁడు దుష్కీర్తిని నరకమును దప్పక పొందును." అని మాటలాడుకొనుచున్న సమయమున, సతీదేవికి సహాయభూతులయివచ్చిన రుద్రపార్షదులు సతీదేవి మరణమునుగాంచి దుఃఖము చెంది యచ్చటనున్నవారినందఱిని జంప యత్నించి తమతమయాయుధంబులు హస్తములందుఁ దాల్చి యుద్ధమునకు సమకట్టిరి. ఆసమయమున వారలప్రయత్నముసుగాంచి భృగుమహాముని మహాకోపపూరితహృదయుండై, యింక నూరకుండుట యుచితంబు కాదనితలంచి యాగసంహారకులను జంపు నిమిత్తము, దక్షిణాగ్నియం దభిచారహోమము కావించెను. అంతటఁ దపంబున సోముని బొందిన ఋభునామకులగు దేవతలు వేలకొలఁది నుదయించి యజ్ఞశాలయందున్న కొఱవుల నాయుధములనుగాఁ గావించుకొని, యుద్ధసన్నద్ధులయియున్న రుద్రానుచరులను మర్దించి నలుదిక్కులకుఁ జెదరఁగొట్టిరి. ఇది నాల్గవయధ్యాయము.



అంతట నీశ్వరుండు నారదునివలనఁ దనభార్య యవమానితయయి యోగాగ్నిచే భస్మీభూతయగుటయుఁ, దనయనుచరులు

ఋభునామక దేవతలచేతఁ బరాజితులగుటయు విన నతనిమనం బున ననివార్యమగుకోపం బుదయించెను. అంతఁ గ్రమక్రమం బున క్రోధాగ్ని రవులొ్కని ప్రజ్వరిల్ల సహింపఁజాలక పెదవిగఱ చుకొని విద్యుల్లతలవలెఁ బ్రకాశించునట్టి తనజటాభారములో

శంకరుఁడు తనజటను నేలనుగొట్టి వీరభద్రునిఁ బుట్టించుట.

నున్న యొకజటను ద్రెంపి గంభీరమగు సింహనాదము కావించుచు భూమియందుఁగొట్టెను. అంత నజ్జటయందు సహస్రబాహుండు ను, కాలమేఘచ్ఛాయను నిరసించు దేహకాంతిగలవాఁడును, భయంకరములయిన కోఱపండ్లుకలవాఁడును, నాకాశమునంటు చున్న దేహముగలవాఁడును, సూర్యునివలెఁ బ్రకాశించుచున్న మూఁడు నేత్రములుకలవాఁడును, వహ్నిసదృశములయిన కేశము లుగలవాఁడును, కపాలమాలకలవాఁడునగు వీరభద్రుండు లోక భయంకరంబుగా నుదయించి యీశ్వరునిచెంతకేఁగి సాష్టాంగ దండప్రణామంబు కావించి వేయిచేతులను నొసట ఘటించి నా చేయవలసినకార్యమును దెలుపుమనవుడు నతనికి రుద్రుం డిట్లని యె. "ఓయీ! వీరభద్రా! నీవు నా ప్రమథగణంబులకెల్ల నాథుండ వై పోయి దక్షునియధ్వరంబును ధ్వంసముకావింపుము. బ్రాహ్మణ తేజ మజేయమనిసందియపడనవసరము లేదు. నాయంశమువలన సముద్భూతుండవయిన నీకెందు నెదురుండదు. పొమ్ము" అని యిట్లు కోపావిష్టుండయిన రుద్రునిచే నాజ్ఞాపింపఁబడి తండ్రికిఁ బ్రదక్షిణముచేసి నిరాటంకమగు వేగముచే బలిష్ఠుల తేజోబల ములను దాను దనయనుచరులును సహింపఁగలరని తలంచెను. అంత వీరభద్రుండు సింహనాదములు చేయుపార్షదులచేఁ బరి వేష్టింపఁబడి మిగుల భయంకరముగా ధ్వనిచేసి మృత్యువు నంత

ము నొందింపఁజాలు శూలమును ధరించి తన యలంకారము
లు ధ్వనిచేయఁగా సైన్యఘోషంబులచే దిక్కుల నింపుచు,
భూమిని గదలించుచు నధికమయిన యురవడితో దక్షాధ్వర
భూమి కభిముఖుఁడై పోవుచుండె. అంత నచ్చట సభాసదు

॥ మహేశ్వరుండు వీరభద్రునిచే దక్షాధ్వరధ్వంసము చేయించుట. ॥

లును, దక్షుఁడును, ఋత్విజులును, బ్రాహ్మణులును వారిభార్య
లును నుత్తరదిక్కునుండి వచ్చుచున్న ధూళిపుంజమును గాంచి
చీఁకట్లని మొదట భావించుకొని యవి చీఁకట్లుకావని నిశ్చయిం
చి ధూళీపటలంబుగా నెఱింగి, "యక్కటా! ఇట్టి ధూళిపటలం
బు బయలుదేఱుటకుఁ గారణంబేమి? ఇవి వాయువులవలన నెగ
యఁగొట్టఁబడిన ధూళులని భావించుటకు నిప్పుడు వాయువులు
వీవలేదు. కావున నిది సమీరోద్ధూతధూళులయి యుండవు.
కాని యీధూళులు చోరాదులవలనఁ గలిగినవేమో యన
ప్రాచీనబర్హి రాజ్యమేలుచుండఁగాఁ జోరబాధ లెట్లు సంభవిం
చును? గోగణధూళులేమో? యన నందుల కిది దగినసమయ
ము కాదు. కల్పావసానమగుటచే నిట్లు ధూళులుః బయలు వెడ
లినవేమో?" యని తలపోయఁజొచ్చిరి. అంతఁ బ్రసూతి మొదల
గు భూసురకాంతలు భయచిత్తలయి దక్షుఁడు తనకుమారికయ
యిన సతీదేవికి నపకారముచేసి పాప మార్జించియున్నాఁడు.
ఆపాపమే యిట్లు విపాకము చెందినది. పాపకర్మంబులు తత్ఫలం
బు కుడుపకుండఁబోవునా? మఱియు సతీదేవికి నపకృతి యొన
రించి యామెకుఁ బ్రియుండయిన రుద్రునకుఁ గోపము జనింపఁ
జేసెను. ఆరుద్రుఁడన సామాన్యుఁడా? ఆతని మహామహిమను
వర్ణింపనెవ్వరితరంబు? అతఁడు ప్రళయకాలమునందు నిశితమగు

న త్రిశూలాగ్రమునఁ జంపిన దిగ్గజములను గ్రుచ్చి యాయుధములతోఁ గూడిన చేతులను మీఁదికెత్తి ధ్వజములవలెఁ బ్రకాశింపఁజేయుచు, భయంకరమయిన మేఘగర్జనమువలె సింహనాదంబులొనర్చి దిక్కులనన్నింటిని భేదించుచు సంతసముచే నృత్యము చేయును. మఱియు మిక్కిలి భీకరమయిన దంష్ట్రాగ్రములచే నక్షత్రసమూహములనన్నింటిని నేల రాల్చుచు, సూర్యకాంతివలె దుర్నిరీక్ష్యములయిన ప్రభాపుంజంబుల నంతట వ్యాపింపఁజేయుచు, నఖిల చరాచర ప్రపంచమును సంహరించును. అట్లు సంహరింపఁ గారణభూతుఁడయినరుద్రుని మానసంబునఁ గ్రోధంబుపుట్టించిన బ్రహ్మకయినను మంగళంబులు గలుగునా? అట్లుండఁ దక్కినవారలసంగతి చెప్పవలయునా?" అని యిట్లు వారు ప్రసంగించుచుండఁగా, స్థిరచిత్తుఁడయినను దక్షునకు భయావహములయిన యనేకదుర్నిమిత్తంబులు భూమ్యాకాశంబులఁ గానవచ్చె. ఆసమయంబున రుద్రానుచరులు నానావిధములయిన యాయుధంబులనుధరించి నానావిధవికృతాకారులయి, యజ్ఞశా

వీరభద్రాదులు దక్షాధ్వరమును ధ్వంసము చేయుట.

ల సొత్తెంచి యందందుఁ బరువులిడుచు, గొందఱు ప్రాగ్వంశంబును భగ్నము కావించిరి. మఱికొందఱు పత్నీశాలను భగ్నము కావించిరి. మఱికొందఱు యజ్ఞశాలామండపంబును దునుమాడిరి. ఒకకొంద ఱాగ్నీధ్రశాలను దహించిరి. కొందఱు భోజనశాల నగ్నికి నాహుతి కావించిరి. కొందఱు యజ్ఞపాత్రములను జెక్కలు గావించిరి. కొందఱు హోమకుండములను జల్లార్చిరి. కొందఱు కుండములయందు మూత్రము కావించిరి. కొందఱు యజ్ఞవేదికలను జెఱిచిరి. కొందఱు మునులను బాధించిరి. కొందఱు

మునిపత్నులను భయపఱిచిరి. కొందఱు పలాయితులగుచున్న దేవతలను వెంటఁ దఱిమిరి. అందు మణిమంతుఁడు భృగుమహాముని బంధించెను. వీరభద్రుఁడు దక్షప్రజాపతిని, చండీశుఁడు పూష్ణుని, నందీశ్వరుఁడు భగాఖ్యుఁడయిన దేవుని బంధించిరి. రుద్రపార్షదులచేఁ బాషాణవ్రాతంబులచే నొప్పింపఁబడి ఋత్విజులును దేవతలును సహింపలేక నలుదిక్కులకుఁ బర్వెడఁజొచ్చిరి. ఆసమయంబున మణిమంతుఁడు భృగుమహామునిశ్మశ్రువులు చేతఁ బట్టుకొని పూర్వము శంకరునిఁ బరిహసించినందువలనఁ గలిగిన కోపాగ్ని చల్లారునట్లు లూడఁబెఱికెను. పిమ్మట వీరభద్రుఁడు కోపాతిశయముచే భగునిఁబట్టికొని పూర్వము దక్షుఁ డీశ్వరుని నిందించుచున్నప్పు డతఁడు కనుసన్న చేసినందున నాతనికన్నుల నూడఁదీసెను. మఱియుఁ బూర్వము పూష్ణుఁడు దక్షుఁ డీశ్వరుని నిందించుచున్నప్పుడు పండ్లు బయలుపడునట్లు నవ్వినందున నాతనిపం డ్లూడఁగొట్టెను. పిమ్మట వీరభద్రుండు దక్షుని క్రిందఁ బడఁద్రోచి వక్షంబుత్రొక్కి ఖడ్గంబుచే శిరంబు ఖండింప నెన్నివ్రేటులువేసినను ఛేదింపలేక శస్త్రాస్త్రములచే నెంతగొట్టినను జర్మమూడి రాకుండుటకు మిగుల నాశ్చర్యముచెందెను.ఇట్లు వీరభద్రుండు దక్షునిఁ జంప నుపాయంబులు వెదకుచుఁ దుద కతని యాగీయపశువువలెఁ జంప నిశ్చయించి ముందుగ గొంతుపిసికి ప్రాణంబులఁ బోఁగొట్టి శిరంబు ఛేదించెను. అట్లు లోకభీకరంబుగ విహరించి వీరభద్రుండు చేసినపని కెంతయు సంతసించి భూతంబులు నుతింపఁదొడంగె. అప్పుడు బ్రాహ్మణులందఱు పరిభూతులై శాపంబునీయఁదొడంగిరి. ఇట్లు వీరభద్రుండు దక్షుని యాగంబు ధ్వంసంబుకావించి దక్షునిశిరంబును దక్షిణాగ్ని

యందు హోమముచేసి తనకార్యము నెఱవేఱినందులకు సంత సించుచు సైన్యసమేతుండై కైలాసమునకుఁబోయెను. ఇది యైదవయధ్యాయము.



అంత దేవగణములు వీరభద్రాదులచే జయింపఁబడి భయపడి శూలాద్యాయుధంబులచే ఛిన్నగాత్రులై తమ కధిపతి యైన బ్రహ్మయొద్దకుఁ బోయి నమస్కరించి జరిగినవృత్తాంత మంతయు విన్నవించిరి. 'ఓవిదురా! దక్షాధ్వరము ధ్వంసమగున నియు, దేవతలు మునులు రుద్రానుచరులచేఁ దాడితులగుదురని యు నీవృత్తాంతమంతయు మునుమున్న తెలిసికొనియున్నవా రగుటచే నారాయణుండును, బ్రహ్మయు, దక్షాధ్వరంబు చూడ రారయిరి' అని యంతట దేవతలమొఱ నాలకించి బ్రహ్మ వారల కి ట్లనియె. "ఓయీ! మహామహిముఁడయిన యీశ్వరునికి శ్రేయ స్కాము లెవ్వరు నపరాధము చేయఁబూనుకొనరు. మఱియు నట్టివారితో విరోధము చేసినవారికిని క్షేమము గలుగదు. మీరం దఱు పాపాత్ములరని వచింపవలసి యున్నది. లేనిచో మహాదే వుఁడును, యాగభాగార్హుఁడు నగు నీశ్వరునికి యజ్ఞభాగంబు లేకుండఁ జేయుదురా? కావున మీరంద ఱిప్పుడయిన బుద్ధి తెచ్చుకొని యా యీశ్వరుని పాదకమలములపయిఁబడి యా తనియనుగ్రహమును సంపాదింపుఁడు. రుద్రుఁడన సామాన్య దేవునిఁగా భావింపకుఁడు. ఆమహామహుఁడు బొమముడి పెట్టినం తమాత్రముననే దిక్పాలసహితమయిన లోకమంతయు నశింప క మానదు. అతనికి మేముసయితమొక్కొక్కప్పుడు భయ పడుచుందుము. అట్టిమహానుభావుండగు శంకరుండు దక్షుఁ డా

డిన పరుషవాక్యములచే మిగులఁ గలంకు చెందియున్నాఁడు. ప్రస్తుతము భార్యావియోగముచే నుఱింత కలఁక చెందియున్నాఁడు. కావున నిప్పుడు మీరందఱుపోయి శంకరుని పాదములపైఁబడి మృదుమధురవాక్యములచే నాతనినిఁ బ్రసన్నునిగాఁ జేయుఁడు. మే మాతనిదరికిఁ బోవుటకు భయపడుచున్నాము. నీవే యెట్లయినఁబోయి ప్రసన్నునిఁ జేయు మందు రేని చెప్పెదవినుఁడు. అతనిఁ జూచినయందఱికి భయమే యుత్పన్నంబగుచుండు. ఆమహాత్ముని తత్వమును, బలవీర్యములు, నిట్టివనివచింప నేను దగను. ఇంద్రుండు వచింపలేఁడు; మీరెఱుఁగనే యెఱుఁగరు. మునీశ్వరులయిన నాతనితత్త్వము నెఱుంగఁజాలరు. తక్కినవార లెఱుఁగరని వేఱ చెప్పవలయునా? భగవంతుని యావేశావతారమైనట్టి రుద్రునిఁ బ్రసన్నునిగాఁ జేయ నెవ్వరితరంబు? కాన మా కెవ్వరికి వశముకాదు. మీరలే యాతనిపాదములకు నమస్కరించి యాతనియనుగ్రహము సంపాదింపవలసియున్నది. అయినను నేను గూడవచ్చెదరండు." అని బ్రహ్మ పలికి ప్రజాపతులతోను, సురానీకములతోను గలిసి యాశంకరునికి నివాసభూతమయిన కైలాసమున కేఁగిరి. ఇట్లు బ్రహ్మాదిసురలు పోయిపోయి కైలాసంబును గన్నులారఁ గాంచిరి. ఆకైలాసము సంతతము శివపంచాక్షర్యాదిమంత్రములను జపించి సిద్ధులయి దేవత్వమును బొందియున్న మహాత్ములచేతను, కిన్నరగంధర్వులచేతను, నచ్చరలచేతను సేవింపఁబడుచున్నది. గైరికాదిధాతువులచేఁ జిత్రితములై రత్నమయములయి, పలువిధములగు లతలచేతను, జొంపములచేతను, నలంకరింపఁబడి, నానావిధములగు మృగసమూహములచే సంయుతములై స్వచ్ఛమయిన నదీప్రవాహములచేతను

మనోహరములగు గుహలచేతను, సానువులచేతను సుందరముల గుదానిశిఖరములందు సిద్ధస్త్రీలు భర్తలతోఁగూడ విహరించు చుండిరి. ఆగిరియందు మయూరములు కేకాధ్వనులు చేయు చుండెను. మదించిన తుమ్మెదలు ఝుంకారములు చేయుచుండె ను. ఆగిరి మధురమగు కంఠధ్వని గలిగిన పికములయు, నితరపక్షులయు మధురధ్వనులచే కల్పవృక్షములశాఖలనెడి బాహువులచేఁ బక్షిజాలములను బిలుచుచున్నట్టు లుండెను. అది, నడగొండవలె నున్నగజంబులసంచారముచే సంచారము చేయుచున్నట్టు లుండెను. అది తనయందుఁ బ్రవహించుచున్న నదులధ్వనులచే మాటలాడుచున్నట్టు లుండెను. మఱియు నది మందారము మొదలగువృక్షములచేఁ బ్రకాశించు చుండెను; పారిజాతములచేతను, సరళవృక్షములచేతను విలసిల్లుచుండెను. అది తమాలవృక్షములచేతను, మద్దిచెట్లచేతను, దాడిచెట్లచేత ను, గోవిదారములచేతను, దెల్లమద్దిచెట్లచేతను, మావిచెట్లచే తను, గడిమిచెట్లచేతను, బున్నాగములచేతను, జంపకములచేత ను వెలయుచుండెను. అందుఁ బాటలవృక్షములు, నశోకములు ను, బొగడలును, గోరింటలును గలవు. ఆగిరిరాజమందు బంగా రపువన్నెగల పద్మములును, మల్లెలును, మాధవీలతలును, బన నలును, మేడిచెట్లును, రావి, జువ్వి, మఱ్ఱి, మొదలగుతరువులు ను, భుజపత్రవృక్షములు, పలువిధములగు నోషధులును, బోఁక లు, రాజపూగములు, నేరేళ్లు, ఖర్జూరములు, నంబాళవృక్ష ములు, దియ్యమావిళ్లును, వెదురుపొదలును, బొంగువెదుళ్లును నింక నితరములగు వృక్షజాతులును గలవు. మఱియు నటఁ దెల్ల గలువలు, నల్లఁగలువలు, నెఱ్ఱఁగలువలును, బద్మములును, దా

మర లతలందు మధురముగా ధ్వనిచేయు పక్షిబృందంబులును గలవు. మఱియు నటఁ, గోఁతులును, వరాహములును, సింగములును, నెలుగులును, నేదుఁబందులును, గవయములును, శరభములును, బులులును, లేళ్లును, గాఱుదున్నలును, గోకర్ణమృగములును, నూర్ణామృగములును, నేకపదములును, నశ్వముఖములు నగు మృగములును, గస్తూరీమృగములును గలవు. అది రంభావృక్షములచే నావృతములగు బద్ధాకరతీరములచేఁ బ్రకాశించుచుఁ, దానమాడినంతమాత్రముననే పుణ్యము గలిగించు జలములుగల గంగానదిచే విలసిల్లుచుండెను, ఇట్టి కైలాసమునుజూచి దేవతలు మిగుల నచ్చెరువొందిరి. మఱియు నచ్చట లోకాతిశాయియగు నలకాపురమును సౌగంధికవనమును బొడఁగాంచి మిగుల నానందము చెందిరి. ఆపురమునకు వెలుపట నంద, యలకనంద, యను రెండునదులు ప్రవహించుచుండును. ఆనదులు విష్ణుమూర్తి పాదాంభోజసంపర్కముచే మిగులఁ బవిత్రత చెందియున్నవి. దేవతలు విమానములపై నధిరోహించి విహరించి యలఁత చెందినప్పు డచ్చటికివచ్చి విహారశ్రమ పాయునట్లు భర్తలతోఁగూడ జలక్రీడ సలుపుచుందురు. అట్లు దేవతాస్త్రీలు జలక్రీడలు సలుపుటచే వారల శరీరములనంటుకొన్న హరిద్రకుంకుమాదులు కరఁగి యానదియందుఁ గలియుటచే నజ్జలము పీతవర్ణముకలదై యుండును. ఆయలకాపురము స్త్రీకదంబములతో వెలుఁగొందుచు, విద్యుల్లతలచేఁ బొలుపారు మేఘబృందమువలె నలరుచుండును. ఇట్టి యలకాపురమును, నదులను, సౌగంధికవనమును నతిక్రమించి, కొంతదూరముపోయి మనోహరములయిన తరుబృందంబులతో నిండి మధురముల

యిన పికశారికాదుల మధురరుతములచే ముఖరితమగుచు, మద గజములచే నున్మూలింపఁబడిన తరుబృందములచే నలంకృతమై, పుణ్యజనుల మనోహరములయిన విహారములుకలదై, నవరత్న నిర్మితములయిన సోపానపరంపరలచే నుల్లసితమై, యొప్పుచున్న యుద్యానవనమును గాంచి తదీయరామణీయకంబున కచ్చెరువ డుచు నచ్చటిసమీపముననున్న వటవృక్షమును గాంచిరి. ఆవట వృక్షము శతయోజనముల పొడవుకలదై, డెబ్బదియైదు యోజ నముల పొడవుగల శాఖలచే నలుదిక్కులకు వ్యాపించినదై, నానావిధములయిన పక్షుల కులాయములు లేక సాంద్రతమ చ్ఛాయాదాయకంబయి ప్రకాశించుచుండె. మహాయోగనిష్ఠు లగు పురుషుల కాధారంబయి, ముముక్షువులకు స్థానంబయి యున్న యా వటతరుమూలంబున నధివసించి శాంతవిగ్రహు లును మహాసిద్ధులునగు సునందాదులచే నుపాసితుండగుచు, నసూయ లేక, శాంతుండయి, సాపరాధులయినను దేవ తలయందు దయాళువై, గుహ్యకులకుఁ బతియును, తనస్నేహి తుఁడును నగుకుబేరునిచే సేవితుండై, జ్ఞానకర్మయోగంబులతో నలరుమార్గ మవలంబించి సమస్తలోకములకును మంగళంబులు గావింప మదినూహింపుచు, సంధ్యాకాలమేఘంబులఁ బురు డించు మైపూఁతకలవాఁడై, తాపసుల యభీష్టంబుల నెఱవేర్చు చు, చంద్రరేఖాధారియై, దండజటాజినంబులఁ దాలిచి దర్భాసనా సీనుండై, తన్నడుగుచున్న నారదుని ప్రశ్నములకు సాధువులు విని సంతసించునట్లు త్తరంబులిచ్చుచు, వామపాదమును గుడి తొడపై నిడికొని యెడమజానువునందు నెడమబాహువునుంచి, దక్షిణహస్తము ముంజేతియందు దక్షమాలనుధరించి, మహనీయ

మయిన *తర్కముద్ర నవలంబించి, బ్రహ్మానందరసాస్వాదుండై సమాధియోగము నవలంబించియున్న యోగిశ్రేష్ఠుండయిన

* తర్కముద్రయనఁగా శ్లో॥ తర్జన్యంగుష్ఠయోర్మధ్యే మిథస్సంయోజ్య చాంగుళీః । ప్రసార్య బోధనం ప్రాహు స్తర్కముద్రేతిమాంత్రికాః॥ అర్థము. చూపుడువ్రేలియొక్కయు నంగుష్ఠముయొక్కయు మధ్యభాగములను గలిపి తక్కినవ్రేళ్లను బ్రసారించుట తర్కముద్రయనఁబడును.

ఓయీ! రుద్రుఁడు జీవవిశేషుఁడుకాని భగవంతుఁడుకాఁడు. అట్లుండ నతఁడు సమస్తప్రపంచమునకు నాత్మయగుటయు, జగత్తునకు శరీరమగుటయు నెట్లు? అతికష్టముచే నదిసంభవించినను శరీరవాచకపదమునకు శరీరివాచకముతో సామానాధికరణ్య మంగీకరించుటయెట్లు? అని శంకింపఁబనిలేదు. ఇట జీవవిశేషుఁడయినరుద్రుఁ డాత్మయయి యుండుననియుఁ, బ్రపంచ మతనికి శరీరమనియుఁ జెప్పలేదు. బ్రహ్మవిదులు ప్రసంగించునప్పుడు "నేను" "నీవు" అనుశబ్దములును, "నేను" "నీవు" అనెడి బుద్ధులును, వారియంతరాత్మయైయున్న పరబ్రహ్మమునందుఁ బర్యవసన్నములగుచుండు. ఈయర్థమే. "తద్ధైతత్పశ్యన్నృషిర్వామదేవః ప్రతిపేదే, అహంమనురభవం సూర్యశ్చకక్షీవాన్ నృషిర్విప్రశ్చాస్మి । త్వంవా అహమస్మి భగవోదేవతే అహం దైత్వమసి భగవోదేవతే తద్యోఽహం యోసౌసోఽహం।అహం హరిస్సర్వమిదం జనార్దనః" ఇత్యాదులగు వేదవాక్యములందుఁ బ్రతీయమానమగుచున్నది. మఱియు నిక్కడ స్తోత్రముచేయుచున్న బ్రహ్మ బ్రహ్మవిదులలో శ్రేష్ఠుఁడు కావున నతనిచేఁ బ్రయోగింపఁబడిన "నేను" "నీవు" అనుశబ్దములును దదభిప్రాయములును బ్రహ్మయందుఁ బర్యవసించుచుండును. ఇటరుద్రుఁడు భగవంతునికి శరీరమగుచున్నాఁడు కాన శరీరవాచియగు రుద్రశబ్దమునకు నతనియం దంతరాత్మయై శరీరియైయున్న బ్రహ్మశబ్దమునకును సామానాధికరణ్యము చెప్పఁగొనవలెను. మఱియు నిట రుద్రశబ్దమున కర్థము రుద్రుఁడు శరీరముగాఁగల పరబ్రహ్మమని గ్రహించి రుద్రునికిఁ జేయుస్తోత్రములు తన్నిష్ఠమగు పరబ్రహ్మమునకే చెల్లునని గ్రహింపవలయును.

యీశ్వరునిగాంచి లోకపాలాది దేవతలు బద్ధాంజలులై యత నికభివందనములు చేసిరి. అంత నీశ్వరుండు వచ్చుచున్న బ్ర హ్మనుగాంచి యతండు హరివలెనే తనకు వందనీయుఁడు కావున సరభసంబున లేచి యెదురుసని నమస్కరించెను. అనంతరము శంకరునిం బరివేష్టించియున్న సిద్ధులందఱును బ్రహ్మకు నమస్క రించిరి. అప్పుడు బ్రహ్మ శంకరాదులచే గౌరవింపఁబడి యుచితా సనమునఁ గూర్చుండి శంకరున కిట్లనియె.

## బ్రహ్మాదులు దక్షిణామూర్తిరూపుఁడగు నీశ్వరుని నుతించుట.

ఓ శంకరా! నీవు చిద్రూపకము నచిద్రూపకమునగు ప్రపం చకమునకుఁ గారణబీజభూతములయి యున్న త్రిగుణాత్మిక యగు ప్రకృతికంటెను, జీవునికంటెను విలక్షణుఁడయి, సమస్త కల్యాణగుణస్వరూపుఁడగుటచే నేకరూపుఁడైన నారాయణుని యావేశావతారమ వని యెఱుంగుదును. అట్టి భగవంతుని యా వేశావతారమవుకనుక నే నీవు చిదచిదాత్మక ప్రపంచస్వరూ పుఁడవయి సాలెపురుగువలెఁ బ్రపంచమును సృజించుచున్నావు. రక్షించుచున్నావు. తిరిగి లయమును బొందించుచున్నావు. మ ఱియు నీవు ధర్మముల నన్నింటి నాయామర్యాదలయందు నిలు పుచున్నావు. బ్రాహ్మణాదులందఱు తత్తద్వర్ణాశ్రమములకు విహితములయిన కృత్యము లొనరించి వర్తించుట నీవలననే కదా? నీ వట్టియాజ్ఞ యీయనిచో వార లట్లాచరింపకయే యుందురు. మఱియు నీవు లోకమునందు మంగళకర్మము లాచరించువారికి మంగళముల నొసంగుచుందువు. అట్టివార లకు నీవు స్వర్గాదిసుఖములను మోక్షము నొసంగుచుందు వు అమంగళములయిన కర్మముల నాచరించినవారికి నీవె

ప్పు డెట్టిసుఖమును గలుగనీయక నరకముల సంభవింపఁజేయు దువు. ఓదేవా? నీ పాదారవిందములందుఁ దమచిత్తంబులం బొందుపఱిచి, సమస్తభూతములను బరమాత్మయందు వేఱు గాఁ దలంపక, వర్తించుమహాత్ములందు నీకు మూర్ఖులయందు వలెనే క్రోధంబు జనింపదు. నిరుపమానమయిన కరుణారసంబు గలవాఁడవు. కనుక నీవు భేదబుద్ధులై దుష్టమైనచిత్తములు కలవారలై దుర్భాషలనెడి బాణములచేఁ బరుల మర్మస్థానము లను భేదించుచు దైవమువలనఁ జావుకలిగియున్న వారియెడ లనుగూడఁ బ్రేమయుతుండవయి వర్తించుట యుక్తము. మఱి యు లోకములో సాధువు లెవ్వరో యసాధువు లెవ్వరో చక్కఁగ యోజించి వారలయందు దయారసము చిలుకఁదగిన వాఁడవు. కొందఱు లోకములో సాధువులైనను, నారాయణు నిమాయచే మోహితులై దుష్టచిత్తులై భేదబుద్ధి గలవారల యి యున్నచో నట్టి యపరాధులు నీకు దయనీయులు. వారలు మాయామోహితచిత్తులు కావున దుష్టకార్యంబు లాచరించి యుందురు. కానిచో వార లట్టికర్మంబు లాచరించియుండరు. కావున సాపరాధులైనను సాధుజనుల ననుగ్రహింప సమర్థుం డవు. ఓదేవా? యజ్ఞభాగార్హుండ వయిననీవు యజ్ఞభాగంబు నీయకుండుట యింతేనియు యుక్తముగాదు. లోక ప్రధానుఁడ వయిననీ కట్టి యపరాధము చేసియుండుటచేతనే దక్షునియజ్ఞ ము నెఱవేఱినదికాదు. కావున నీవు దక్షాదుల ననుగ్రహించి యాదక్షుని యాగంబును బునరుద్ధారణంబుగావించి యతని బ్రతికింపుము. మఱియు నీ యనుచరులచే భగుని నేత్రంబు లూడఁబెఱుకఁబడియె! వాని నిప్పింపుము. సూర్యునిదంతము లూ

పడఁగొట్టఁబడియె. వానిఁ దిరుగ వచ్చునట్లు చేయుము. భృగునిశ్మశ్రువు లాకర్షింపఁబడియె. వాని మరల మొలచునట్లు చేయుము. ఋత్విజులందఱు మర్దింపఁబడి భగ్నాంగులైరి. కావున వారల ననుగ్రహించి సంపూర్ణాంగులఁగాఁ గావింపుము. దేవఋత్విక్సమూహమునకు నారోగ్యంబు ప్రసాదింపుము. యాగపరిపూర్తికి హేతుభూతమయిన నీయాగభాగంబు నీకగుఁగాక' అనెను.

ఇది యాఱవయధ్యాయము.



అని యిట్లు చతురాననుఁడు సంస్తుతింప నీశ్వరుఁడు మందహాసము చేయుచు, బ్రహ్మకిట్లనియె. 'ఓ కమలాసనా! నీవన్నమాట సత్యమే. నేను హరిమాయచే మోహితులైన వారొనరించిన యపరాధములను నపరాధములనుగాఁ బరిగణింపను. మఱియు దుష్టులను ఖండించుటయు, సుజనులను రక్షించుటయు ధర్మము. కావున దుష్టాత్ములను దగునట్లు శిక్షించుచుందును. నీవాక్యము

**శివుండు దక్షాదుల ననుగ్రహించుట.**

ప్రకారమున నడుచుట నాకుఁ గర్తవ్యంబు. కావున దక్షాదుల ననుగ్రహించెద. దక్షునిశిరంబు దగ్ధమైయున్నది. అందువలన నతనికి మేషముఖం బగుఁగాక. భగుఁడు యజ్ఞసంబంధమయిన భాగమును మిత్రునినేత్రంబులచేఁ జూచుఁగాక. సూర్యునికి దంతములు మగుడ నుద్భవించుఁగాక. తక్కిన దేవతలందఱు నాకుఁ దిరిగి యజ్ఞభాగంబుల నర్పించిరి. కావున వారలు సర్వాంగులై వర్తింతురు. ఖండితాంగులైన ఋత్విజులందఱు సూర్యకిరణములచేతను, దేవవైద్యులగు నశ్విదేవతలచేతను నుత్పన్నావయవులై వర్తింతురు. భృగునిశ్మశ్రువు లున్మూలిం

పఁబడినవి. కాన నిఁకమీఁద నతఁడు మేషశ్మశ్రువులు కలవాఁడై తిరుగుఁగాక' అని యిట్లు శివుండు పలుక విని సభ్యస్థభూతంబులు ను మిగుల సంతసించి “ మేలుమేలు ” అన్నవాక్యంబు లంతటం బర్వెను. పిమ్మట నీశ్వరుండు దేవేంద్రాది సురలును, నారదాదిమహామునులును, జతురాననుండును దన్ను వెంబడించి వచ్చుచుండఁగాఁ దాను దక్షాధ్వరప్రదేశంబున కభిముఖుఁడై పోయె. అంత శంకరుని శాసనంబుచొప్పున దేవతలును, మును లు, ఋత్విజులు మొదలగువారందఱు సంపూర్ణాంగులై ప్రకాశించిరి. ఆసమయంబున దక్షుండు మేషముఖుండై నిద్రచెందిన వాఁడు లేచినవిధంబున లేచి కన్నెదుటఁ బ్రకాశించుచున్న శంకరునిం గాంచె. అట్లు కన్నంతమాత్రమునఁ గలుషవంతమై యున్న దక్షునిచిత్తము శరత్కాలమందలి సరస్సువలె నతినిర్మలమయి యొప్పె. అంత దక్షునికి నీశ్వరునియందున్న ద్వేషమంతయు నశించినందునఁ బూర్వ మీశ్వరధిక్కారము చేసినందులకు మిగుల విచారించి శంకరుని నుతింపఁదలంచి తా నొనర్చిన యవమానంబుచే నశించిన తనయనుంగుకూఁతుకై మిగుల విలపించి యామెయం దున్నయనురాగాతిశయముచేఁ గన్నులనుండి వెడలి వచ్చుచున్న బాష్పము నతికష్టముచే నిరోధించి దుఃఖము నాఁపి కొని, హృదయంబు పదిలపఱచుకొని ప్రేమాతిరేకవిహ్వలమయిన మానసము కలవాఁడయి శంకరు నిట్లు వినుతింపఁదొ

—— శంకరుని దక్షుఁడునుతించుట ——

డంగె. “ఓదేవా! నీ కపరాధము కావించినందులకు నీవుచేసిన దండనమునకు మిగుల సంతసించితి. ఆదండన నాపాలిట రక్షణయే కాని దండనకాదు. అందులకు నేను మిగుల సంతసించుచున్నా

ను. నీవును, నారాయణుండును బ్రహ్మఘాతులైన దుర్భాగులనై నను నుపేక్షింపక మంచిమార్గంబునకుఁ గొనివత్తురని చెప్ప నొప్పునప్పుడు చెడుమార్గము నవలంబించుచున్నవారిని మంచి మార్గమునందుఁ బ్రవేశపెట్టుదురని వేఱ చెప్పవలయునా? అం దువలన దురాత్ముండనై నీతో ద్వేషించి దుష్టపథంబు ద్రొక్కు చున్న నన్ను గ్రక్కున సన్మార్గప్రవిష్టుం గావించితివి. మఱియు మీ రిరువురును బ్రహ్మయు నాదియందు లోకోపకారము నిమిత్త ము వరవిద్యాతపోవ్రతములచే నొప్పునట్టి బ్రాహ్మణుల సృజించి వారలను దద్వర్ణోచిత ధర్మముల నాచరించునట్లు చేయుచు, వారల కాపదలు ప్రాప్తించునప్పుడు వానిని దొలంగించుచుఁ, బశుపాలకుఁడు సాపరాధములయిన గోవులను శిక్షించుచు, మర లవానిని ఘాసాదికముచే మన్నించుచుండునట్లు సాపరాధులయిన వారిని శిక్షించి మంచిమార్గమందుఁ బ్రవేశింపఁజేసి కాపాడు చుందురు. కావుననే నీవు నాఁడు బ్రహ్మసభయందుఁ దత్వజ్ఞా నము నెఱుంగనట్టి నేను నిన్నుఁ దృణీకరించి దుర్భాషలనెడి బా ణపరంపరచే నొప్పించి పూజ్యతముఁడ వయిన నిన్ను నిందించి తిని. తన్నిందాజనితపాపము నన్నధోలోకములకుఁ ద్రోయుచుం డ దయార్ద్రహృదయుండ వగునీవు నా చేసినయపరాధమును మ ఱచిపోయి రక్షించితివి. ఉత్తమచారిత్రుండవయిన నీకు వందనము లు గావించుచుందును. నన్నుఁ బరిపూర్ణదయారసంబుతోఁ గనుఁ గొనుము." అని యిట్లు దక్షుండు శంకరుని నుతించి యతని ద యారసంబునకుఁ గుదురై బ్రహ్మ యనుమతినిబడసి ఋత్విక్కు లతోను, నుపాధ్యాయులతోను గూడి తిరిగి యాగము నొన రింపఁ బ్రారంభించెను. అట్లు దక్షుండు వెండియుఁ గ్రతువు నా

రంభించి నిర్వర్తించుచుండఁ గొందఱు బ్రాహ్మణోత్తములా యాగము నిరంతరాయంబుగాఁ బరిసమాప్తి పొందుటకుఁగాను, విష్ణుదేవతాకమైన పురోడాశమును సిద్ధము కావించిరి. అంత దక్షుండు భక్తిసమేతచిత్తుండై యాపురోడాశమునుగొని యధ్వర్యుండయిన భృగుమహామునితోఁగూడి నారాయణమూర్తి నుద్దేశించి హోమము కావించెను. ఆసమయంబున నారాయణుండు తనకాంతిసంతానములచే దశదిశల నావరించుచుఁ, దేజశ్శాలియగు గరుత్మంతునిపై నధివసించి, భానుబింబసదృశమైన కిరీటము చేతను, సువర్ణమయమయిన సూత్రము చేతను, మధుకరంబుల నిరసించు నెఱికురులచేతను, మకరకుండలములచేతను,సుందరమగు వదనారవిందముతో, హస్తములయందు శంఖము చక్రము, పద్మము, బాణములు, చాపములు మొదలగు సాధనంబుల ధరించినవాఁడై, శ్రీవత్సవనమాలలచే వక్షస్థలంబు ప్రకాశింపఁ గొందఱు రాజహంసములవలె నొప్పారు వింజామరలఁ బట్టి వీచుచుండఁ, గొందఱు నిండుచందురునిచందంబున నందమైన యాతపత్రంబునుబట్టి వెంటవచ్చుచుండఁ గరుణావలోకనములచే లోకమునెల్ల సంతసింపఁ జేయుచు, దక్షుని యజ్ఞవాటిక నావిర్భవించెను.

—●●◆ నారాయణుండు దక్షాధ్వరంబునకు వచ్చుట. ◆●●—

అట్లు వచ్చిననారాయణమూర్తిని గాంచి సురబృందంబులును, మునిబృందంబులును జయ్యనలేచి యతనిపాదారవిందంబుల కభివందనము లాచరించిరి. పిమ్మట వారందఱును నారాయణుని కాంతిసంతానముచేఁ దిరస్కృతమయిన దేహకాంతి కలవారై నిటలఘటితకరతలులై నిలువంబడిరి. ఇట్లు కొంతవడి

నూరకుండి బ్రహ్మాదిదేవతలందఱును భగవంతుని ప్రసన్నవిగ్రహమును బొడఁగాంచి తమతమ మానసంబులకుఁ దోఁచినట్లు నుతింపఁదొడంగిరి. అందు దక్షుండు ముందుగాఁ బూజాద్రవ్యంబులఁగొని లోకనాయకుఁడును, యజ్ఞస్వరూపుఁడును, సునందనందాదులగు నిత్యసూరులచేఁ బరివృతుండును, నగు నారాయణున కర్పించి యిట్లు నుతింపఁదొడంగె. 'ఓ దేవా! నీవు స్వస్వరూపము నొందియున్నప్పుడు మాయను దిరస్కరించి రాగాదులయిన మనోవృత్తులను దొలఁగించికొని విముక్తుండవై, యద్వితీయుండవై, సంసారభయనివర్తకుండవై యుందువు. మఱియు నీవు మాయను బురస్కరించికొని లీలామానుషరూపంబుల నంగీకరించుచు, స్వతంత్రుండవయ్యును, మాయాపరతంత్రుండవైనట్టును, రాగాదులు లేనివాఁడవయ్యు, రాగాదియుక్తులైన రామకృష్ణాదులుగాఁ గానవచ్చుచుందువు. నీవు లోకంబులకెల్ల నీశ్వరుండవు. బ్రహ్మరుద్రాదులయిన సురలందఱును నీమాయావిభూతులగుటంబట్టి వారు లోకమునకుఁ బ్రభువులు కారు. మఱియు బ్రహ్మాదులందఱును జరాచరాదిజంతువులును భవద్రూపంబులే. జగంబున భవద్వ్యతిరిక్తంబయినవస్తు మఱియొక్కండుగానరాదు. అట్టినీకు వందనంబు లాచరించుచున్నాను. నన్నుఁ గరుణింపు' మని మ్రొక్కి దక్షుం డూరకుండె. అంత ఋత్విజులందఱు నావిష్ణువు నిట్లునుతించిరి. 'ఓ దేవోత్తమా! ఓపుణ్యపాపరహితా! మేము నందికేశ్వరశాపపీడితులమైన కారణంబునఁ గర్మములయందు దురాగ్రహచిత్తులమై వర్తించుచు నీయాథార్థ్యము నెఱుంగఁజాలము. త్రిగుణానుసారముగా వేదప్రతిపాదితములగు ధర్మములుగల యాగాదికర్మము లాచరించుచుండుము. ఆయ

జ్ఞాదికర్మములయం దింద్రాది దేవతారూపములం బొంది వర్తించు వాఁడవు నీవేయని, మామనంబుల ధ్యానించి నమస్కరించు చుందు' మని పల్కి నమస్కారంబులు కావించిరి. అంత సభాసదు లందఱు నారాయణుని యడుగుఁదమ్ములకు మ్రొక్కి యిట్లు నుతించిరి. "ఓభువనశరణ్యా! ఓక్షేమంకరా! మేము సంసారము నెడి మార్గంబునంబడి తిరుగుచున్నారము. ఈ సంసారమార్గ మందు విశ్రాంతి నొసంగునట్టి యొక్కవృక్షమైనను గానరాదు; భయంకరమయిన కష్టములనెడి దుర్గమస్థానంబులతో నొప్పు చుండును ఈసంసారమార్గమందు వర్తించువారిని మృత్యువను భయంకరసర్పం బొకటి దఱుముచుండును. మన్మథుఁడను తస్కరుండు చిరకాలమునుండి సంపాదించికొని తెచ్చికొనుచున్న జ్ఞానధనమును దొంగలించుచుండును. దుఃఖములనెడి దావాగ్నిజ్వాలలు శరీరమును దహించుచుండును. మఱియుఁ బూర్వార్జితపాపకర్మములనెడి శార్దూలములు పొదలచాటునఁ బొంచి యుండి మ్రింగుటకుఁ జూచుచున్నవి. ఆశలనెడి మృగతృష్ణలు మాకు భ్రాంతిని గలిగించి మామనంబులఁ దమవంక కాకర్షించు కొనుచుండును. దుర్జనులనెడి క్రూరమృగంబు లడుగడుగునకు బాధించుచుండును. అఖిలద్వంద్వంబులనెడిగర్తలు మిక్కుటంబుగా నున్నందున నడుచుట మిగుల దుస్సాధంబయియున్నది. ఇట్టి కష్టములతో నిండిన సంసారమార్గమున వర్తించుచున్న మాకుఁ గల్పవృక్షమూలమువలె విశ్రాంతిదాయకము లయిననీపాద పద్మముల నాశ్రయించుట మా కెప్పుడు లభించునో కదా! ఓ దేవా! మమ్ము ననుగ్రహించి యీబాధలనుండి తొలంగించి రక్షింపవేఁడుచున్నాము. నీపాదంబుల కిదె నమస్కారంబు కావిం

చుచున్నారము.' అనినుతించి యూరకుండిరి. అంత క్షేమంకరుం డయినశంకరుండు నారాయణునకు నమస్కరించి యిట్లునుతింపఁదొడంగె. "ఓ దేవా! నీపాదంబులకు వందనము లాచరించుచున్నాను. సమస్తయోగిబృందములచే వందనీయములయిన నీపాదారవిందములను డెందమున సంస్మరించుచుందును. ఓభగవంతా! సర్వదా నీచరణకమలధ్యానంబుతో నున్న నన్నుఁజూచి మూఢులు కొందఱు "వీఁడు దురాచారుఁడనియుఁ, గర్మశూన్యుఁడనియు, నమంగళుఁడనియు నిందించుచుందురు. అట్లు వారు నిందించినను నేమనంబున నుంతేనియుఁ గలఁతఁ జెందక సంతతంబు నిన్నే స్మరించుచుందును." అనిపలికి యూరకుండె. అంత భృగుమహాముని నారాయణునిపాదంబుల కభివందనంబులు కావించి యిట్లనియె. "ఓదేవా! బ్రహ్మాది జీవులందఱు నీమాయచేఁ దిరస్కృతులై యాత్మజ్ఞానము లేనివారలై, తమఃకార్యములయిన జన్మజరామరణాదులతో నిండియున్న సంసారమందుఁ బ్రవర్తించుచున్నారు. కాని యంతరాత్మవై జీవులయం దెల్లప్పుడు నివసించుచున్న నీస్వరూపమును దెలియఁజాలరు. అట్టి బ్రహ్మాదులే భవదీయమాయామోహితులయి నీస్వరూపమును దెలిసికోలేనప్పుడు మావంటియల్పులా తెలిసికొనఁగలరు? నీ కిదిగో నమస్కారములఁ గావించుచున్నాను. నీవు ప్రణతార్తిహరుఁడవు కావునఁ బ్రణతుఁడనైన నాబాధలను దొలంగింపుము. మావంటినదల నను గ్రహింపు" మని నుతించి యూరకుండె. అనంతరము కమలాసనుండు నారాయణున కిట్లనియె. "ఓభగవంతా! నీపాదంబులకు వందనము లాచరించుచున్నాను. ఓమహానుభావా! నీరూపము వాఙ్మానసగోచరమే యయిన నీజీవపదార్థభేద

మును గ్రహించుచున్న చక్షురాదీంద్రియములచేత సాక్షాత్కారము చేసికొనలేరు. అట్లు కనుఁగొనలేమికిఁ గారణమేమియో తెల్పెదను. అవధరింపుము. ఇంద్రియములకును, శబ్దాదివిషయములకునుఁ గారణభూతుండవును, సత్త్వాదిసద్గుణంబులకును నిలయభూతుండవు నగునీవు మాయాపరిణామరూపములయిన దేహాదులకంటెను, నా దేహాదిసంబంధము గలిగి వర్తించు జీవలోకముకంటెను మిక్కిలి విలక్షణుండవయి వర్తించుచున్నావు. ఆకారణంబునం జేసి నీస్వరూపంబు ప్రాకృతంబుకాదు అప్రాకృతమయిన నీస్వరూపము ను ప్రాకృతమైన చక్షురాదీంద్రియములు మెట్టుగా గ్రహింపఁగలవు? కావున నీస్వరూపంబు నెఱుంగఁజాలని మాయం దను గ్రహించి నీస్వస్వరూపంబును గనుపడునట్లు చేసి మమ్ముఁ గృతార్థులం గావింపుము''. అని కమలాసనుండు నుతించి యూరకుండ నింద్రుండు మెల్ల మెల్లన నారాయణునికడ కేఁగుదెంచి నమస్కరించి యిట్లనియె. “ఓసర్వేశ్వరా! ఈనీశరీరము లోకమునకెల్ల సుఖముఁ గలిగించుచున్నది. ఆనీస్వరూపమును జూచినంతమాత్రముననే నామనస్సు నేత్రములు నమితానందము నొందుచున్నవి. ఆయాయుగములం దవతరించి దుర్మార్గులయిన దానవసమూహమును సంహరించి ధర్మసంస్థాపనము చేయుచున్న నీకు గంధములవలె దీర్ఘములయియున్న యెనిమిదిబాహువులు కలిగియుండుట యెంతయుఁ దగియున్నది.'' అనియిట్లుపలికి మిన్నకుండ నంత మునిపత్నులందఱు నేతెంచి నారాయణునకు మ్రొక్కి యిట్లనిరి. “ఓదేవా! ఈయజ్ఞములు భవదారాధనరూపము లేకదా! ఇట్టియజ్ఞము పూర్వకాలమున బ్రహ్మచే సృజింపఁబడినది. అట్టియజ్ఞము దక్షుఁ

డుచేయుటకుఁ బ్రారంభించెఁగాని శంకరుం డాగ్రహంబున దాని ధ్వంసముకావించె. పవిత్రమయియుండుయాగశాల శవములచే నిండి శ్మశానమువలె నపవిత్రమయియున్నది. ఈయపవిత్రభూమిని బావనములయిన నీచూపులచేఁజూచి పవిత్రీకరింపుము." అని నుతించి యూరకుండఁగా నంత ఋషీశ్వరులరుదెంచి నమస్కరించి యిట్లనిరి. "ఓ దేవా! లోకమునఁ బండితులు తాఁజేసికొన్న పుణ్యపాపకర్మములను గా ననుభవింపవలయునని చెప్పుచుందురు. ఇట్లుండ నీవు పుణ్యపాపరూపములగు సజాతీయకర్మముల నాచరించుచున్నను, దత్ఫల మనుభవింపలేదు. ఇది మిగులఁ జిత్రముగాఁ గన్పడుచున్నది. మఱియు బ్రహ్మాది సురలందఱు నే లక్ష్మీదేవి యనుగ్రహమును బడయుటకై సంతత మారాధించియుఁ దదనుగ్రహము నొందలేకున్నారో యాలక్ష్మీదేవి నీయనుగ్రహమును సంపాదింప మిగులఁ బ్రయత్నించుచున్నదై నిన్ననవరత మనుసరించుచున్నదై యుండియు నీయనుగ్రహముం బడయఁజాలకయున్నది. దేవా! బ్రహ్మాదిసేవితయగులక్ష్మియే నీయనుగ్రహము సంపాదింప లేకున్నప్పుడు మావంటివారలసంగతి ప్రత్యేకముగా నుడువనేల? అట్టిసర్వసద్గుణపరిపూర్ణుఁడ వయిననీకు నమస్కారంబు లర్పించుచున్నా" మని విరమించిరి. అంత సిద్ధులరుదెంచి భగవంతుని యడుగుఁదమ్ములకు మ్రొక్కి యిట్లనిరి. "ఓదీనబంధూ! ఓకరుణాసింధూ! మాచిత్తములనెడు మదపుటేనుఁగులు సంసారమనెడి యరణ్యములయందు విహరించుచు నచ్చట నాధ్యాత్మికాది తాపత్రయమనెడి దావాగ్నిచే బాధింపఁబడి యాబాధ నోర్వలేక నీసత్కథయనెడి యమృతనదియందు నోలలాడుచు నాబాధలను దొలం

గించుకొనుచు నందుండి పైకి రాలేకున్నవి. నీకథామృతము నే
మని వర్ణింపఁగలుగుదుము? త్వత్కథాసక్తుఁడయినవాఁడు ము
క్తునివలె నపరిమితానందమును జెందును." అనిపలికి యూరకుం
డిరి. అనంతరము దక్షునిభార్యయగు ప్రసూతి చేతులుజోడించి
దేవునకి నమస్కరించి యిట్లనియె. "ఓదేవా! మాయాగసీమకు
నీవరుదెంచుట మాపూర్వపుణ్యంబును వెలువరింపక మానదు.
మేము నేఁడు కృతార్థులమయితిమి. శవములచేనిండి యపవిత్ర
మయిన మాయజ్ఞవాటిక నీరాకచేఁ బవిత్రమయినది. మాయం
దనుగ్రహముంచుటకు వేఁడుచున్నాము. ఓలోకాధీశా! నీవులేని
చో యజ్ఞము శిరోహీనమయిన శరీరమువలె సుంతేనియుఁ బ్ర
కాశింపదు. కావున నీవు లక్ష్మీసహితుండవయివచ్చి మమ్ము ర
క్షింపుము." అనిపలికి విరమించె. అంత లోకపాలురరుదెంచి కరు
ణాలవాలుండగు నాశ్రీలోలునకు నమస్కరించి యిట్లనిరి. "దేవా!
వాఙ్మానసగోచరుండవు కాకపోయినను నీవు మాలోచనములకు
గోచరమైయుండుదువు. కాని దేహాత్మాభిమానులే కారణమున
శరీరము నాత్మగాఁదలంచుచున్నారో యది మాయానామకమగు
నీవిచిత్రశక్తియే. అనాత్మయయిన దేహాదులం దాత్మభ్రమ క
లుగుటకుఁ గారణము భగవన్మాయయేకదా! మఱియు నీమాయ
తనకంటెను బురుషునికంటెను విలక్షణుఁడవయిన నిన్నును బం
చభూతోపలక్షితుఁడై యుండు జీవునిగాఁ జూపును. అట్లు
నీమాయ మాకు భ్రమకలిగించుచుండ నీస్వరూపము నెట్టుగాఁ
గనుఁగొందుము? అట్టిమాయ నతిక్రమించినఁగాని నీస్వరూపమర
యలేము. మాయందు దయయుంచి మమ్ము మాయాతీతుల
నుగాఁ జేసితివేని యప్పుడు నీదివ్యసుందరవిగ్రహముంగని సంత

సంబును, సౌఖ్యంబును బొందుదు"మని నుతించి యూరకుండిరి. అంతయోగీశ్వరు లరుదెంచి స్వామిపాదకమలముల కభివందనంబులు చేసియిట్లనిరి. "ఓమహనీయా! ఈచిదచిదాత్మకమయిన ప్రపంచమంతయు నీకు శరీరభూతముకదా? శరీరభూతమయిన ప్రపంచముకంటె నతిరిక్తుఁడయిననీయం దేపురుషుఁడు తన్నుఁ బృథగ్భూతునిగాఁ జూడక తాను బరమాత్మశరీరభూతుఁ డయినట్లును, దచ్ఛరీరమునకంటె వేఱుగా నుండనట్లును భావించుచుండునో, అట్టితత్త్వదర్శియగు పురుషునికంటె నీకుఁబ్రియతరుఁడు లోకమందు లేఁడు. వానినెంతయుఁ బ్రేమతో నాదరించుచు దువు. ఓవత్సలా! లోకమందుఁ గొందఱు బుద్ధిమంతులు తమ్ముఁ బృథగ్భూతులనుగాఁ జూచికొని భృత్యస్వామిభావము నవలంబించి యసామాన్యమయిన భక్తిని వెల్లడించుచు నిన్నుఁ జేరవచ్చుచుందురు. అట్టివారలను నీవు కరుణారసదృష్టితో నాదరింతువు. మఱియు ననుగ్రహింతువు. ఓదేవా! నీవు ప్రపంచకమునకు సృష్టిస్థితిలయములను గావించుకొఱకు దేవాదిరూపములచే బహువిధములుగాఁ బరిణమించిన మాయవలనఁ గల్పితములయిన జీవరాసులయం దంతరాత్ముండవై ప్రవేశించియున్న నీకు వందనములను గావింతుము" అని నుతించిరి. అంత వేదపురుషుం డిట్లనెను "ఓదేవాదిదేవా! నీవు ధర్మాదిపురుషార్థములకుఁ గారణభూతుండవు. హేయగుణరహితుండవు. అనంతములయిన కల్యాణగుణములు గలవాఁడవు. నీయందు విలసిల్లుచున్న కల్యాణగుణముల యవధిని నేనే యెఱుంగను తక్కినవారల సంగతి చెప్పనేల? అట్టి మహాత్ముండవయిన నీపాదారవిందముల కభివందనములను గావింతుము" అంత నగ్నిహోత్రుఁడు నారా

యజ్ఞుని సమీపించి నమస్కరించి యిట్లనియె. "ఓజగన్నాథా! నాయందున్న *తేజంబంతయు నీ వొసంగినదే కదా! నీయాజ్ఞను బుష్పదామంబు చందంబునం దలయం దిడికొని యాగకర్తలచే నింద్రాదులనుగూర్చి వ్రేల్చిన హోమద్రవ్యంబులఁ గొనిపోయి వారల కర్పించుచుందును. †పంచవిధములయిన మంత్రములచేఁ జక్కఁగఁ బూజింపఁబడువాఁడవును, ‡ పంచవిధాగ్నిరూపుఁడవయి వర్తించువాఁడవును, యజ్ఞస్వరూపుఁడవు నగునీకు వందనము లాచరించెదను" అని యగ్ని నుతించి మిన్నకుండె. అనంతరము బృందారకులమందానందముతో హరిని సమీపించి నమస్కరించి యిట్లనిరి. "ఓలక్ష్మీనాథా! కల్పాంతమందు సమస్తభువనములను నీయుదరమం దిమిడ్చికొని ప్రళయకాలపయోనిధియందుఁ బ్రకాశించు భుజగేంద్రతల్పముపై శయనించి యూర్ధ్వలోకవాసు లయినమహాత్ములచే నుతింపఁబడుచు యోగనిద్ర నవలంబించియుందువు. అట్టి పరబ్రహ్మమనగు నీ దివ్యసుందరవిగ్రహమును నేఁడు కన్నులారఁ గాంచఁగలిగితిమి. మేము కృతార్థుల మయితిమి." అని యూరకుండ గంధర్వు లగుణించి

---

* ఇట అగ్నికే కాక సూర్యాదులకుఁగూడ భగవంతుఁడే తాదృశకాంతి నిచ్చెనని యెఱుంగునది. అందులకుశ్రుతి. 'నతత్రభాతిసూర్యోనచంద్రతారకం నేమావిద్యుతోభాంతికుతోఽయమగ్నిః' 'తమేవభాంతమనుభాతిసర్వః తస్య భాసా సర్వమిదంప్రభాతి' అని యున్నది.

† పంచవిధమంత్రములు—ఆశ్రావయ, అస్తుశ్రౌషట్, యజ, యేయజామహే, వషట్, ఈమంత్రము నుచ్చరించుచు హోమముచేయుదురు.

‡ పంచవిధాగ్నులు—గార్హపత్యము, ఆవహనీయము, దక్షిణము, సభ్యావసథ్యములు.

నారాయణుని చరణకమలంబులకు నమస్కరించి యిట్లనిరి "ఓ జగదీశా! దేవతలు, మరీచ్యాదిమహామునులును, బ్రహ్మేంద్రాదులును, నీయంశంబులవలనను, నంశాంశంబులవలనను జనించుచున్నారు. ఈప్రపంచకము నీకుఁ గ్రీడాపరికరముల నుంచుకొను పెట్టెవంటిది. ప్రపంచకమనెడి క్రీడాకరండమునందున్న జంతువులనెడి యాటవస్తువులచేఁ గ్రీడించుచుందువు. అట్టి నిరుపమానశక్తివగు నీపాదములకభివందనములను గావించెదము." అని నుతించి మిన్నకుండిరి. పిమ్మట విద్యాధరులేతెంచి యిట్లనిరి. "ఓభగవంతా! నీమాయాబలముచే మానవదేహమును బొంది యహంకార మమకారములచే దేహాదులయం దభిమానము కలవాఁడై, సంసారబాధితుండైనను, వేదమర్యాదల నతిక్రమించి ప్రవర్తించునట్టి దారపుత్త్రాదులచేఁ దిరస్కృతుండైనను, ప్రకృతిపరిణామరూపములయిన శబ్దాదులం దాసక్తుండైనను, నీకథామృతమును గర్ణపుటములచేఁ ద్రావినచో, వాఁడహంకారాదులను విడిచి ముక్తుఁడయి తీఱును. మోహనివర్తనము గావించి ముక్తి గలిగించునది నీకథామృతము తక్క మఱియొకటిలేదు. ఇట్లు కథామృతముచే సంసారసాగరమును నివర్తింపఁజేసెడినీ కభివందనములను గావించుచున్నాము." అని నుతించి భగవద్రూపంబును ధ్యానించుచున్న యవసరంబున బ్రాహ్మణులేతెంచి యిట్లనిరి. "ఓదేవా! నీవు క్రతుస్వరూపుఁడవు. నీవే పురోడాశాదికమవు. నీవే హోమద్రవ్యముల భస్మముచేయుచున్న పావకుండవు. యాగసాధనము లనఁబడు పరికరమంతయు నీస్వరూపమే. సదస్సులు ఋత్విజులు నీస్వరూపులే. మఱియు దంపతీస్వరూపములనొంది వారొసంగుచున్న క్రతుభాగ

ములను నీవే యింద్రాదిదేవతారూపములనొంది స్వీకరించు చున్నాడవు. పూర్వకాలమునఁ బాతాళమునంటియున్న భూతలమును నీవు సూకరావతారము దాల్చి మదగజము తనతుండాగ్రముచేఁ దామరలతను జలమునుండి యుద్ధరించునట్లుగా నీదంష్ట్రాగ్రముచే భూదేవి నుద్ధరించితివి. నీ వట్లు చేయనిచో యాగార్హమయినస్థలమే లభింపక పోవును. ఓ వేదస్వరూపుఁడా! యాగమవు, హోతవు, కర్తవు, భోక్తవు, యాగపరికరమవు, నీవే. నీకంటె నన్యమైనది లేదు. ఓదేవా? భవదారాధనమయిన యాగకర్మమంతయుఁ బరిభ్రష్టమయినది. నీ నామము నొక్కమాఱు ధ్యానించి నంతమాత్రముననే యజ్ఞవిఘ్నములన్నియు నాశనముపొందునని వినియున్నాము. అట్లయినను నీవు స్వస్వరూపముతో వచ్చినచో నీరూపమును గన్నులారఁ గాంచి కృతార్థులము కావలెనని తలంచి నీయాగమమును గోరితిమి. యజ్ఞవిఘ్నములన్నియు నశించినవి. యాగాంతరాయముల నశింపఁజేయు నీపాదపద్మములకు నమస్కృతులను గావించుచున్నాము.'' అని యిట్లునుతించుచుండఁగాఁ గర్మకుశలుఁడైన దక్షుండు వెండియు యాగము నారంభించి రుద్రభాగపురస్సరముగాను నిర్వర్తించెను. ఇట్లు రుద్రభాగ పురస్సరముగాఁజేసిన యాగమును జూచి సర్వభాగ భోక్తయైనను దనభాగముచేతనే సంతసించి నారాయణుండు దక్షున కిట్లనియె. * ఓ బ్రాహ్మణశ్రేష్ఠా!

* ఇందులకు మూలము. శ్లో॥ "అహంబ్రహ్మాచ శర్వశ్చ జగతః కారణంపరం । ఆత్మేశ్వర ఉపద్రష్టా స్వయందృగవిశేషణః'' అనియున్నది. ఇట బ్రహ్మరుద్రులనుగూడ జగత్తునకుఁగారణభూతు లన్నంతమాత్రమున వారికి సర్వజ్ఞత్వాదులుగాని సర్వశక్తిత్వాదులుగాని కలవని భావింపరాదు. వారలు

సను స్తహేయములను నిరసించి యనంతకల్యాణగుణములు గలిగి

---

విష్ణువుచే సృజింపఁబడి యతఁ డొసంగినజ్ఞానముచేతనే సృష్టిప్రళయములను జేయుచున్నారు. ఈయర్థము "అహంబ్రహ్మాచ శర్వశ్చ జగతః కారణం పరం" అనుదానివలనఁ దెలియఁబడుచున్నది. ఈయర్థము శ్రు॥ "అనేనజీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" అనఁగా జీవాత్మరూపమునఁ బ్రవేశించి నామరూపములను జేయుచున్నాను. "యోబ్రహ్మాణం విదధాతిపూర్వం యోవై వేదాంశ్చ ప్రహిణోతితస్మై" అనఁగా నెవఁడు బ్రహ్మనుసృజించి వేదముల నతనికుపదేశించెనో, ఇత్యాదిశ్రుతులచేతను, స్మృతి "ఏతద్ద్వౌ విబుధశ్రేష్ఠౌ ప్రసాదక్రోధసంభవౌ। మదాదర్శిత పంథానౌ సృష్టిసంహారకారకౌ। సృష్టింతతః కరిష్యామి త్వామావిశ్యప్రజాపతే" ఇత్యాది స్మృతులచేతను గూడ స్పష్టమగుచున్నది. ఓయీ! పాలనరూపమగు నధికారమును బట్టి విష్ణువెట్లు జగంబునకుఁ గారణమగుచున్నాఁడో, యట్లె బ్రహ్మరుద్రులు గూడ సృష్టిలయాధికారములచే జగంబునకుఁ గారణములగుచుండ సమస్తప్రపంచమునకును కేవలము నారాయణుఁడొక్కఁడే కారణమనుటెట్లు? ఒక్కనారాయణునకేకాక దక్కినవారికిఁగూడఁ గారణత్వమున్నట్లు శ్రుతులవలనఁగూడ దెలియవచ్చుచున్నది. "బ్రాహ్మణో వై సర్వా దేవతాః" "నకిరింద్రత్వదుత్తరః" "అగ్నిస్సర్వాదేవతాః" "ఏకఏవరుద్రః" "సోమః పవతేజనితామతీనాం జనితాపృథివ్యాః జనితాగ్నేర్జనితా సూర్యస్య జనితేంద్రస్య జనితోతవిష్ణోః" "ఆపోవాఇదగ్ంసర్వం" ఇత్యాదిశ్రుతులచే బ్రాహ్మణులు, రుద్రుఁడును, నింద్రుఁడును, నగ్నియునుగూడ సమాభ్యధికరహితు లయినట్టు లక్కడక్కడఁ బ్రతీతిగలుగుచున్నది. ఇట్లుండ నారాయణుఁడే సర్వోత్తముఁడనియు జగత్కారణమనియు నుడువుటయెట్లు? అని శంకింపఁబనిలేదు. నీవుచెప్పిన ట్లచ్చటచ్చట బ్రాహ్మణాదులు ప్రత్యేకముగాఁ గారణులగుచున్నట్టును వారు తమతో సమానులుగాని తమకంటె నధికులుగాని లేరని ప్రతీతిగలుగుచున్నను జగత్కారణత్వాదు లంగీకరింపరాదు. బ్రాహ్మణాగ్నీంద్రాదులకంటెఁ బరుఁడగు

మీవంటివారిచే నుతింపఁబడుచు, నందఱికంటె నధికుండనై యు

---

పరమాత్మయందుమాత్రమే జగత్కారణత్వాదులున్నట్లు తెలియవచ్చుచున్నది. కావుననే వేదాంతభాగములందు సృష్టినిగూర్చికాని ప్రళయమునుగూర్చికాని చెప్పుచున్నప్పుడు స్వరూపముచేతను గుణములచేతను నేబ్రహ్మము సర్వముకంటె గొప్పదియో యాబ్రహ్మమే సృష్టిస్థితిలయములకు సముదాయకారణమని తలంచియే సూత్రకారుండు "జన్మాద్యస్యయతః" అనిచెప్పియున్నాఁడు. అనఁగా ప్రపంచముయొక్క సృష్టిస్థితిలయము లెవనివలనఁ గలుగుచున్నవియో యాబ్రహ్మమును దెలియవలయునని చెప్పెను. కావున నిట్టి కారణవాక్యములందొక్క నారాయణునికే కారణత్వాదు లంగీకరింపఁబడుచున్నవికాని తక్కినవారి కంగీకరింపలేదు. మఱియు సృష్టిప్రళయములను బ్రహ్మరుద్రులు చేయుచున్నట్టు కానవచ్చుచున్నను బ్రహ్మరుద్రశబ్దంబులును వారలు శరీరముగాఁ గల నారాయణునియందె పర్యవసానము లగుచున్నవి. ఇంతియకాక సృష్ట్యాదులకుఁ బ్రత్యేకముగా బ్రహ్మరుద్రుల నంగీకరింపక వారలు శరీరముగాఁగల నారాయణునే యంగీకరించినట్లు-శ్రు॥"యతోవాఇమానిభూతానిజాయంతే" "యేనజాతానివర్ధంతి యత్ప్రయంత్యభిసంవిశంతి తద్బ్రహ్మేతి" అని శ్రుతిచెప్పుచున్నది. ఎట్లనగా, ఎవనివలన నీభూతములు గలుగుచున్నవో, ఎవనివలనఁ బెరుఁగుచున్నవియో, ఎవనివలన నశించుచున్నవియో, ఎవనిఁ బ్రవేశించుచున్నవియో, యట్టిబ్రహ్మమును దెలిసికొమ్మని యర్థము చెప్పవలసియున్నది. ఇచ్చట నన్నివాక్యములందును గల యచ్ఛబ్దంబులకు నన్నింటికి నొక్కతచ్ఛబ్దముతో నే సంబంధముకాని ప్రత్యేకముగా (అనఁగా నెవనివలన నీభూతములుగలుగుచున్నవియో యాబ్రహ్మమును, ఎవనివలనఁ బెరుఁగుచున్నవియో యాబ్రహ్మమును, ఎవనివలన లయమును బొందుచున్నవియో యాబ్రహ్మమునునని) తచ్ఛబ్దంబులతో సంబంధము చెప్పియుండలేదు. కావున నారాయణునికే సముదాయకారణత్వము కలదుకాని బ్రహ్మరుద్రులకు లేదు. ఓయీ! 'అహంబ్రహ్మాచశర్వశ్చ జగతఃకారణంపరం' అని బ్రహ్మరుద్రులుగూడ జగత్కారణులని చెప్పఁబడు

న్న నేనును, నేను వారలందు నంతరాత్మగాఁ బ్రవేశించుటచేత

---

చుండ నారాయణుఁడే కారణమని యెట్లు చెప్పెదవు? అని శంకింపకుము. లోకములో నొకరాజు సేనానాయకుఁడు యుద్ధముచేసి జయముగొన్నచో నది రాజునకే చెల్లును. ఓడినచో నాయోటమియు రాజునకే చెల్లును. అట్లె బ్రహ్మరుద్రులు నారాయణునాజ్ఞను శిరసావహించి సృష్టిలయంబులఁ జేయుచున్న టచే సృష్టిలయకర్తృత్వము లాబ్రహ్మరుద్రుల కధీశుఁడగు నారాయణునకే చెల్లును. ఓయీ! "జన్మాద్యస్యయతః" అనుసూత్రములో సృష్టికర్తృత్వ కలవాఁడనియు, స్థితికర్తృత్వము కలవాఁడనియు, లయకర్తృత్వము కలవాడనియు బ్రత్యేకముగా లక్షణములుచెప్పుటచే నాలక్షణములకు లక్ష్యమయిన కారణవస్తువుకూడ నానావిధమై యేలకాదు? అని యనరాదు. జన్మాదిసూత్రములో "యతోవాఇమాని" అను శ్రుత్యర్థమును బురస్కరించుకొని సృష్టిస్థితిప్రళయకర్తృత్వము కలవాఁడు బ్రహ్మమని సముదాయమునకే లక్షమంగీకరింపవలయునుగాని యొక్కొక్కదానికి లక్షణత్వ మంగీకరింపరాదు. ఒక్కొక్కదానికే లక్షణత్వ మొప్పుకొనినచో నొక్కసృష్టికర్తృత్వమునలక్షణముగాఁజెప్పిన జాలుచుండఁగా దక్కిన స్థితిలయములనుగూడ "జన్మాది" యను సూత్రములో గ్రహించుటయే వ్యర్థముకావచ్చును. కావున సృష్టిస్థితిలయ సముదాయకారణత్వమే బ్రహ్మమునకు లక్షణమని యెఱుంగు.ది. ఓయీ! సముదాయమునకు లక్షణత్వ మేలచెప్పవలయును? కేవలము సృష్టికర్తృత్వము బ్రహ్మమునకు లక్షణమని చెప్పినను జాలును. మఱియు గంధముగల పదార్థమెల్లను భూమియని చెప్పినప్పు డాగంధగుణము జలాదులందుఁగూడఁ జూపట్టినచో జలాదులం దీలక్షణము లేకుండునిమిత్తము మఱియొకవిశేషణము వేసికొనవలసియుండును. అంతియకాని జలాదులందుగంధములేనప్పుడు వేఱొక విశేషణమును జేర్చుట వ్యర్థముకదా? అట్లె ప్రస్తుతము సృష్టికర్తృత్వము బ్రహ్మమునకు లక్షణమని చెప్పినప్పు డాసృష్టికర్తృత్వము మఱియొకరియందుఁగూడఁ జూపట్టినచో నాలక్షణ మట్టిస్థలంబులఁ బట్టకుండుటకై స్థితికర్తృత్వ

ను, నాచేత సృజింపఁబడిన వారగుటచేతను, సృష్టి ప్రళయము

ములతోఁగూడిన సృష్టికర్తృత్వము లక్షణమని చెప్పవలసియుండును. కానిజగదుత్పత్తికి నిమిత్తకారణము నుపాదానకారణమునగు వస్తువు వేఱొకటిలేదు. కావునసృష్టికర్తృత్వమని చెప్పుటచేత నేలక్షణము వ్యభిచరింపకుండనుండఁగా నితరవిశేషణముల చేర్చుట వ్యర్థమే కదా. అట్లయిన "జన్మాది" యనుసూత్రమువ సముదాయమునకు లక్షణముఁ జెప్పుటవ్యర్థము. కావునఁబ్రత్యేకముగా నే లక్షణములఁ జెప్పవలయును. అట్లు చేసినచో లక్షణము నానావిధమగును గాన లక్ష్యమగు కారణవస్తువుగూడ నానావిధము కావలసివచ్చును. అనియడిగెదవేని చెప్పెద వినుము. జన్మాదిసూత్రమున సృష్టికర్తృత్వము బ్రహ్మమునకు లక్షణమని చెప్పినను జాలును. అయినను "యతోవాఇమాని" అను శ్రుతి ననుసరించి సముదాయమునకే లక్షణమంగీకరింపఁబడినది. ఇంతియకాక యొకలక్షణముఁ జెప్పినప్పుడు దానికి లక్ష్యమగుపదార్థ మెట్టిదియోయెఱిఁగియుండవలెను. అట్టిపదార్థము మఱియొకటి గలదనుశంకగూడ లేకుండవలయును. "గంధము గలపదార్థమంతయుఁ బృథివికిఁ జేరినదే" యని చెప్పినప్పు డీలక్షణమునకు లక్ష్యమగుపృథివీపదార్థ మెట్టిదియో యెఱిఁగియుండవలెను. గంధముగలదిపృథివియే కాక జలాదులుగూడఁ గలవను శంక లేక యుండవలెను. ఇట్లులక్ష్యాకారపృథివీజ్ఞానమును లక్ష్యము కాని జలాదివిషయకజ్ఞానము నాఁబడు నీ రెండును లేనిచో లక్ష్యాకారనిశ్చయము గలుగ నేరదు. అట్లె జన్మాదిసూత్రములో సముదాయమునకు లక్షణము చెప్పక ప్రత్యేకముగాలక్షణము చెప్పినచో లక్ష్యాకారజ్ఞానమును గలుగదు. విపరీతజ్ఞానశంకయుఁ దొలఁగదు. ఎట్లన, సృష్టికర్తృత్వము బ్రహ్మమునకు లక్షణమన్నచో సృష్టికరణత్వము చెప్పఁబడినను, స్థిత్యాదికారణము చెప్పఁబడకపోవుటచే స్థిత్యాదులకుఁ దగినసర్వజ్ఞత్వము అనంతశక్తిత్వము మొదలగు గుణములు బ్రహ్మమునం దున్నట్లు దెలియరాదు అట్లు తెలియనిచో సృష్టికారణుఁడగు బ్రహ్మముకంటె స్థితిలయకారణమయిన మిక్కిలి గొప్పపదార్థము మఱియొకటి గలిగియుండునని సందేహముకలుగక

లఁ జేయుటకుఁదగినజ్ఞానమును నావలనఁ బొందుచున్న వారగు టచేతను, నాకుఁ బ్రయోజ్యులైన బ్రహ్మాద్యులును, నీ చరాచరవిశ్వమును రక్షింపను సృజియింపను హరింపను గారణము ము, మఱియు నేను నాయందు లీనులయి యున్న జీవులకెల్ల

---

మానదు. అట్టిసందేహము కలుగుచున్నచో నిరతిశయమగు గొప్పతనము కేవలము సృష్టికారణమగు బ్రహ్మమునం దెట్లు గలుగును? అట్టి నిరతిశయమగు గొప్పతనము సృష్టికాలమునందు లేనిచో నాకారణమెట్లు గానుపాసింపఁదగియుండును? కావున జన్మాదిసూత్రమున సృష్టిస్థితిలయకర్తృత్వము బ్రహ్మమునకు లక్షణమని యంగీకరింపవలెను. అట్లు చేసినచో బ్రహ్మమునందు సృష్ట్యాదులకుఁ దగిన సర్వజ్ఞత్వాదిగుణము గలిగియుండు. అట్లున్నచో బ్రహ్మమునకు నిరతిశయమగు గొప్పతనము కలదగును. కాన బ్రహ్మముకంటె నిరతిశయమగుగొప్పతనముగల పదార్థము వేఱొకటి గలదనెడి విపరీతజ్ఞానము నశించి బ్రహ్మమే నిరతిశయమగు గొప్పతనముగల పదార్థమను నిశ్చయజ్ఞానము గలుగును. కాన బ్రహ్మమే ముముక్షువునకు నుపాసింపఁదగినదని తెలియవచ్చుచున్నది. ఇంతియకాక ముక్తిలయములలోఁ జేరియుండును కాన ముక్తియన్నను, లయమన్నను నొక్కటేయన్న స్ఫురించుచున్నది. జన్మాదిసూత్రమున లయకర్తృత్వము బ్రహ్మమునకుఁ జెప్పినచో లయములోఁ జేరియున్న ముక్తినొసంగఁజాలనివాఁడగును. ఎవఁడు మోక్షము నిచ్చువాఁడో వానినే యుపాసించి పొందవలయును గాన సృష్టికారణమగు బ్రహ్మము మోక్షము నీయఁజాలనిదగుటచే నుపాసింపఁదగినది కాదని తెలియవచ్చుచున్నది. కావున జన్మాదిసూత్రమున సృష్టికారణత్వము మాత్రమె బ్రహ్మమునకు లక్షణము చెప్పినఁజాలియున్న నునిరతిశయమగు గొప్పతనము గలదని చెప్పుటకును మోక్షప్రదత్వము గలదని చెప్పుటకును. సముదాయమునకే కారణత్వమంగీకరింపవలసియున్నను ఇప్పుడు పదార్థమునకే లక్షణత్వ మంగీకరించుటచే నాలక్షణమునకు లక్ష్యముగూడ నేకవస్తువే యని తెలియవచ్చుచున్నది. కాన నిదే తగియున్నది.